# రైలుబడి





టెట్సుకో కురొయనాగి

# రైలుబడి

రచన

టెట్సుకో కురొయనాగి

తెలుగు

ఈశ్వరి

ఎన్. వేణుగోపాల్

 హైదరాబాద్ బుక్ ట్రస్ట్

వెల 25-00

First Published in Japanese, translated into English by Dorothy Britton and published as 'Totto-Chan', the little girl at the window'.

ట్రస్ట్ సంపాదకుడు : చేకూరి రామారావు

మొదటి ముద్రణ : నవంబర్, 1988

పున: ముద్రణ : జనవరి 1989

వివరాలకు : హైదరాబాద్ బుక్‌ట్రస్ట్
3-6-687, 10వ వీధి,
హిమాయత్‌నగర్,
హైదరాబాద్ -500 029.

ముద్రణ : హైదరాబాద్ ప్రింటర్స్, హబ్సిగూడ, హైదరాబాద్ - 7.

## ముందుమాట

టోమో అనే బడి గురించి, దాన్ని స్థాపించి, నడిపిన సొసాకు కొబయాషి అనే వ్యక్తి గురించి రాయడం నేను ఎన్నాళ్ళుగానో చేయదలచుకుంటున్న పనుల్లో ఒకటి.

ఇక్కడ రాసిన ఏ సంఘటననూ నేను కల్పించలేదు. అవన్నీ నిజంగా జరిగిన సంఘటనలు. అదృష్టవశాత్తు అక్కడ జరిగిన అనేక సంఘటనలలో కొన్నిటిని నేను గుర్తు తెచ్చుకోగలిగాను. వాటన్నిటినీ రాయడంతోపాటు ఒక విఫల వాగ్దానాన్ని నెరవేర్చాలని నేను ఆందోళన పడ్డాను. ఆ వాగ్దానాన్ని ఇక్కడ ఒక అధ్యాయంలో వివరించాను. అదేమంటే, పెద్ద పెరిగిన తర్వాత టోమోలో ఉపాధ్యాయురాలిగా పని చేస్తానని నేను కొబయాషికి హామీ ఇచ్చాను. ఆ హామీని నేను నెరవేర్చలేక పోయాను. దాని బదులు కొబయాషి ఎటువంటి వ్యక్తో, పిల్లల పట్ల ఆయనకెంత ప్రగాఢమైన ప్రేమ ఉండేదో, పిల్లలను విద్యావంతులను చేయడానికి ఆయన చేపట్టిన పద్ధతేమిటో వీలయినంత ఎక్కువ మందికి వివరించడానికి నేను ప్రయత్నించాను.

కొబయాషి 1963లో చనిపోయాడు. ఇవాళ్టికీ ఆయన సజీవంగా ఉంటే నాకింకా ఆయన చెప్పగలిగిన విషయాలు ఎన్నో ఉండేవి. ఇప్పుడవి రాస్తున్నప్పుడు కూడ నేను ఒక విషయం గుర్తించాను. ఇన్నాళ్ళూ కేవలం నా చిన్ననాటి ఆనందమయ జ్ఞాపకాలుగా నాస్మృతుల్లో ఉన్న సంఘటనలు నిజానికి కొన్ని ప్రత్యేక ఫలితాలను ఆశించి ఆయన జాగ్రత్తగా రూపొందించిన కార్యక్రమాలే. "అయితే, కొబయాషి మనసులో ఈ ఆలోచన ఉండి ఉంటుంది" అని నేనిప్పుడు గుర్తిస్తున్నాను. "ఆయన ఈ విషయం కూడ ఆలోచించడం భలే చిత్రం గదూ" అని నేను కనిపెట్టిన ప్రతి సంగతికీ నేను ఆశ్చర్యపోతున్నాను. హృదయం లోలోతుల నుంచి సంచలించిపోతున్నాను. ఆయనపట్ల కృతజ్ఞత పెరిగిపోతోంది.

నా విషయమే తీసుకుంటే, "నువు నిజంగా మంచి పిల్లవు తల్లీ నీకు తెలుసా?" అని ఎప్పటికప్పుడు చెపుతూ ఉండడం నా అభివృద్ధికి ఎలాకారణమైందో అంచనా కట్టడం అసాధ్యం. నేను టోమోలో చేరకపోయి ఉంటే, కొబయాషిని కలవకపోయి ఉంటే బహుశా నాకు "అల్లరి పిల్ల" అనే పేరొచ్చి ఉండేది. అందువల్ల నాలో ఎన్నో మానసిక క్లేశాలు, గందరగోళాలు తలెత్తి ఉండేవి.

1945లో టోక్యోపై బాంబుదాడుల్లో టోమో నాశనమైపోయింది. అప్పటికి కొబయాషి దాన్ని తన స్వంత డబ్బుతో నిర్మించాడు. అందువల్ల పునర్నిర్మాణానికి యెక్కువ వ్యవధి తీసుకుంది. యుద్ధం తర్వాత పాత స్థలంలోనే ఆయన ఒక కిండర్ గార్టెన్ ప్రారంభించాడు. ఇప్పుడు కునిటాచి సంగీత కళాశాలకు అనుబంధంగా పనిచేస్తున్న శిశు విద్యాశాఖను రూపొందించడంలో కూడ ఆయన ఆ సమయంలోనే తోడ్పడ్డాడు. ఆయన తన అరవై తొమ్మిదో ఏట మరణించాడు. తాను కలలు కన్న పాఠశాలను మళ్లీ ఓసారి స్థాపించక ముందే ఆయన చనిపోయాడు.

టోమో గాకుయెన్ టోక్యోలో నైరుతి దిశన ఉండేది. టోక్యో రైలు మార్గంపైన ఉన్న జియుగౌకా స్టేషన్ నుంచి ఆ బడికి మూడు నిమిషాల నడక. ఆ స్థలంలో ఇప్పుడు పీకాక్ సూపర్ మార్కెట్, వాహనాలు నిలిపే స్థలం ఉన్నాయి. ఆ బడీ, ఆ ఆవరణ ఏమీ మిగలలేదని తెలిసినప్పటికీ, కేవలం పాత జ్ఞాపకాల ఉద్వేగంతో నేను ఒక రోజు అక్కడికి వెళ్ళాను. ఆ వాహనాలు నిలిపే స్థలంలో నా కారు నెమ్మదిగా కదిలిపోయింది. అక్కడే రైలు పెట్టెల తరగతి

గదులుండేవి. ఆటల మైదానం ఉండేది. వాహనాలు నిలిపే స్థలంలోని వ్యక్తి నాకారు చూసి "రాకండి. రాకండి. ఇక్కడ ఖాళీ లేదు" కేకలు వేశాడు.

"నేనిక్కడ నా కారు ఆపదలచుకోలేదు. కేవలం నాస్మృతుల్ని మేల్కొలుపుకుంటున్నాను." అందామనిపించింది నాకు. కాని ఆ మాటలు ఆయనకు అర్థమై ఉండేవి కావు. అలా నా కారు సాగిపోయింది. కాని ఒక మహా విషాదం నన్ను ఆవరించింది. కారు కదలిపోతుంటే నా చెక్కిళ్ళ మీద కన్నీళ్లు వరద కట్టాయి.

ప్రపంచమంతటా గొప్ప విద్యావేత్తలు ఉన్నారు. వాళ్ళవి ఉన్నతాదర్శాలు. వాళ్ళకు పిల్లల పట్ల ప్రగాఢమైన ప్రేమ. వాళ్ళు ఆదర్శ పాఠశాలల్ని నెలకొల్పాలని అద్భుత స్వప్నాలు కన్నారు. కాని ఆ స్వప్నాన్ని వాస్తవంలోకి అనువదించడం ఎంత కష్టమో నాకు తెలుసు. 1937లో టోమో ప్రారంభించడానికి ముందు కొబయాషి ఏళ్ళ తరబడి అధ్యయనం చేయవలసి వచ్చింది. అంత పరిశ్రమలోనుంచి ఆవిర్భంచిన టోమో 1945లో తగలబడి కుప్పకూలిపోయింది. టోమో అస్తిత్వం అతి స్వలకాలమే.

నేను టోమోలో గడిపిన కాలం కొబయాషిలో ఉత్సాహం పొంగులెత్తుతున్న కాలం. ఆయన పథకాలు నిండుగా వికసిస్తున్న కాలం. మరి యుద్ధమే లేనట్టయితే ఆయన సంరక్షణలోకి ఎంతెంత మంది చిన్నారి బాలలు వచ్చి ఉండేవారో తలచుకుంటే, ఎంత కృషి వ్యర్థమైపోయిందో గుర్తింపుతో అంతులేని విచారం కలుగుతుంది.

నేనీ పుస్తకంలో కొబయాషి విద్యాబోధనా పద్ధతులను వర్ణించడానికి ప్రయత్నించాను. పిల్లలందరూ ఒక సహజాతమైన ఉత్తమ స్వభావంతో జన్మిస్తారని ఆయన నమ్మకం. ఈ మంచి తనమంతా వాళ్ళ వాతావరణం వల్లా, వాళ్ళ మీద పెద్దల తప్పుడు ప్రభావాల వల్లా అతి సులభంగా ధ్వంసమై పోతుందని ఆయన అభిప్రాయం. ఈ "మంచి స్వభావాన్ని" వెలికి తీసి, అభివృద్ధి చేయడమే ఆయన లక్ష్యం. తద్వారా పిల్లల్ని వ్యక్తిత్వం గల మనుషులుగా తీర్చిదిద్దడం ఆయన ఆశయం.

కొబయాషి సహజత్వానికి చాల విలువిచ్చేవాడు. పిల్లల స్వభావాలు వీలయినంత సహజంగా ఎదిగేలా చూడాలని ఆయన అనుకునేవాడు. ఆయన ప్రకృతి ఆరాధకుడు కూడా. ఆయన చిన్న కూతురు మియోచాన్‌ను చిన్న తనంలో షికార్లకు తీసుకెళ్ళేవాడు. అప్పుడాయన "కన్నా, షికారుకెళ్దాం. ప్రకృతిలో మోగే శ్రుతిలయల్ని విందాం పద" అనేవాడని మియోచాన్ చెప్పింది.

ఆయన మియోచాన్‌ను ఒక పెద్ద చెట్టు దగ్గరికి తీసుకు వెళ్ళేవాడట. ఆ గాలి తెరలలో ఆకులు, రెమ్మలు, కొమ్మలు ఎట్లా ఊగులాడుతున్నాయో చూపించేవాడట. ఆకులకు కొమ్మలకూ కాండానికి మధ్యన ఉన్న అవినాభావ సంబంధాన్ని వివరించేవాడట. ఆకుల నాట్యం ఎట్లా గాలి బలంగాఉన్నదా, బలహీనంగా ఉన్నదా అనే దాని మీద ఆధారపడి వేరువేరుగా ఉంటుందో చెప్పేవాడట. వాళ్ళిద్దరూ అలా నిశ్చలంగా నిలబడి ఇటువంటి సంగతులన్నీ గమనిస్తుండేవారట. ఆ సమయానికి అక్కడ అసలే గాలి ఆడుతుండకపోతే అట్లాగే తలలెత్తి ఓపిగ్గా చూస్తుండేవారట. ఒక చిన్న గాలి తెమ్మర అయినా రాక పోతుందా అని ఎదురు చూసేవారట. వాళ్ళు అట్లా గాలిని మాత్రమే కాదు, నదుల్ని పరిశీలిస్తుండేవారట. వాళ్ళు దగ్గర్లో ఉన్న టామా నది దగ్గరికి వెళ్ళి నీటి ప్రవాహాన్ని చూస్తుండేవారట. ఇటువంటి పనుల్లో వాళ్ళెప్పుడూ అలసట అనేదే యెరగరట. మియోచాన్ నాకివన్నీ చెప్పింది.



యుద్ధకాలంలోని జపాన్ అధికారులు ఇంత అసాధారణమైన ప్రాథమిక పాఠశాలను యెట్లా కొనసాగనిచ్చారని, ఇటువంటి స్వేచ్ఛాయుత వాతావరణంలో విద్యాబోధనను యెట్లా సాగనిచ్చారని పాఠకులకు సందేహం రావచ్చు. కొబయాషికి ప్రచారం అంటే గిట్టేది కాదు. యుద్ధానికి ముందు కూడ ఆయన పాఠశాల ఫొటోలు అచ్చువేయడానికి, దాని అసాధారణత్వాన్ని ప్రచారం చేయడానికి అనుమతించలేదు. యాభై మంది కంటె తక్కువ పిల్లలు ఉండిన ఈ పాఠశాల యెవరి దృష్టిలో పడకుండా కొనసాగడానికి అది ఒక కారణం కావచ్చు. మరో కారణమేమంటే కొబయాషిని శిశు విద్యాబోధకుడుగా విద్యామంత్రిత్వ శాఖవారు చాల గౌరవించేవారు.

నవంబర్ మూడున టోమోలో ఆటల దినం జరిగేది. ఆ అద్భుతమైన రోజు గురించి ఇష్టమైన జ్ఞాపకాలు ఇంకా ఉన్నాయి. అందుకే ఆ రోజున ఎప్పుడు చదివిన వాళ్ళయినా టోమో పిల్లలందరూ కుహోంబుట్సు ఆలయంలోని ఒక గదిలో కలుసుకుంటారు. అది ఆనందమయమైన పునర్మిలనం. మేమందమూ మా నలభైల్లో ఉన్నా మాలో చాల మంది యాభైలకు చేరవస్తున్నా, స్వయంగా మాకే పిల్లలున్నా నవంబర్ మూడున మాత్రం మేమందరం ఆ పాత రోజుల్లో లాగనే మామా ముద్దు పేర్లతో, చిలిపి పేర్లతో పిలుచుకుంటాం. కొబయాషి మాకు వదిలిపోయిన సంతోషకరమైన వార సత్వంలో ఈ పునర్మిలనాలు ఒక భాగం.

నన్ను నా మొట్టమొదటి ప్రాథమిక పాఠశాల నుంచి తొలగించారనేది నిజమే. ఆ బడి గురించి నా కంతగా గుర్తులేదు. వీధి బాజావాళ్ళ గురించి, బల్ల సొరుగు గురించీ అమ్మే నాకుచెప్పింది. నన్ను ఆ బడి నుంచి పంపించేశారంటే నమ్మడం కష్టంగా ఉంటుంది. నిజంగా నేనప్పుడు అంత అల్లరి పిల్లగా ఉన్నానా? ఐదేళ్ళ కింద నేను ఒక టెలివిజన్ ప్రదర్శనలో పాల్గొన్నాను. దాంట్లో నన్ను ఒకావిడకు పరిచయం చేశారు. తీరా చూస్తే ఆవిడకు నేనంతకు ముందే తెలుసునట. ఆ మొదటి బడిలో నా తరగతి పక్కనే ఉండే తరగతికి ఆమె క్లాస్ టీచరట. ఆమె చెప్పిన విషయాలు విని నేను అవాక్కయ్యాను.

"నువు నేనుండే గదికి పక్క గదిలో ఉండేదానివి. నేను టీచర్ల గదికి వెళ్ళే సమయంలో ఎప్పుడూ నువు వరండాలోనే నిలబడి ఉండేదానివి. అంటే ఏదో ఒక గొడవ చేస్తుండే దానివన్నమాట. నేను అలా వెళుతున్నప్పుడు నువు నన్ను ఆపి ఏ తప్పువల్ల అలా నిలబెట్టారో కనుక్కునే దానివి. "మీకు వీధి బాజా వాళ్ళంటే ఇష్టం లేదా?" అని ఒకసారి నన్ను అడిగావు. నీతో ఎలా వ్యవహరించాలో నాకు ఎప్పటికి అర్థం కాలేదు. కనుక చిట్టచివరికి నేను టీచర్ల గదిలోకి వెళ్ళవలసి వచ్చినప్పుడల్లా మొదట వరండాలోకి తొంగి చూసేదాన్ని. నువు గనుక వరండాలోనే ఉంటే అసలు వెళ్ళడం మానేసే దాన్ని. టీచర్ల గదిలో మీ క్లాస్ టీచర్ ఎప్పుడూ నీ గురించే చెపుతుండేది. "ఆ పిల్ల ఎందుకంత అల్లరి పిల్లయిందో తెలియకుండా ఉందమ్మా" అనేది. అందుకే, తర్వాత చాల రోజులకు నువు టెలివిజన్ తెరమీద కనబడడం మొదలు కాగానే నీ పేరు నేను వెంటనే గుర్తుపట్టాను. ఆ సంగతులన్నీ జరిగి ఏళ్ళూ పూళ్ళూ గడిచిపోయాయి గాని నువు ఒకటో తరగతిలో ఉన్నప్పుడు ఎలా ఉండేదానివో నాకు స్పష్టంగా గుర్తుంది" అందామె.

నన్ను శిక్షగా వరండాలో నిలబెట్టారా? నాకది గుర్తులేదు. ఆశ్చర్యపోయాను. ఆ టీచర్ ఇంకా ఉత్సాహంగానే కనబడుతోంది. ఆమె తల నెరిసిపోతోంది. ఆమె ముఖం మీద దయ వెలుగుతోంది. ఆమె ఉదయపు టెలివిజన్ ప్రదర్శన దగ్గరికి వచ్చి నన్ను నిజంగానే ఆ బడి నుండి తొలగించేశారని నాకు నిర్ధారణ అయ్యేలా చేసింది.

నా ఇరవయో పుట్టినరోజు వరకూ నాకీ విషయం చెప్పకుండా ఉన్నందుకు మా అమ్మ పట్ల నాకు ఎంత హృదయపూర్వకమైన కృతజ్ఞత కలిగిందో.

"నువు ఒక ప్రాథమిక పాఠశాల నుంచి మరో ప్రాథమిక పాఠశాలకు ఎందుకు మారావో తెలుసా కన్నా?" అని అడిగింది అమ్మ ఒక రోజున. నాకు తెలియదన్నాను. "ఎందుకంటే నిన్ను మొదటి బడి నుంచి తొలగించేశారు గనుక" అని నెమ్మదిగా నిర్లిప్తంగా అంది.

అందుకు బదులుగా ఆ మొదటి బడి నుండి పంపించేయగానే "ఏమై పోతావు నువ్వు? ఇప్పటికే ఒక బడి నుంచి నిన్ను పంపించేశారు. ఇంకో బళ్ళోంచి కూడ పంపించేస్తే ఇంకెక్కడికి పోతావు" అని తిట్టి ఉండవచ్చును.

అమ్మ గనుక నాతో అలా మాట్లాడి ఉంటే నేను టోమోగాకుయెన్‌లో అడుగుపెట్టిన మొదటి రోజున ఎంత భయపడుతూ, ఎంత వణికిపోతూ ఉండేదాన్నో! ఆ వేర్లు, చిగుళ్ళు ఉన్న గేటు, అక్కడి రైలు పెట్టెల తరగతులు నాకుఅంత ఆనందమయంగా కనబడి ఉండేవే కావు. మా అమ్మ వంటి అమ్మను పొందడం నిజంగా నా అదృష్టం.

యుద్ధం మొదలయ్యాక టోమోలో కొన్ని ఫొటోలు తీశారు. వాటిలో విద్యా సంవత్సరం చివరలో తీసిన ఫొటోలు చాల బాగా వచ్చాయి. ఎప్పుడూ టోమోలో నుంచి వెళ్ళిపోయే తరగతి వాళ్ళు అసెంబ్లీ హాలు ముందరి మెట్ల మీద ఫొటో తీయించుకునేవాళ్లు. కాని వాళ్ళు అలా మెట్లమీద నిలబడి "రా! రా! నువ్వు ఫొటోలోకి రా!" అని స్నేహితులను కేకలేసి పిలుస్తుడే వాళ్ళు. ఇక వేరే పిల్లలందరూ కూడ మెట్ల మీదికి పరుగెత్తేవాళ్ళు. కనుక ఏ తరగతి పిల్లలు ఆ సంవత్సరం బడి వదిలేస్తున్నారో చెప్పడం కష్టమయ్యేది. మా పునర్మిలనాలలో ఈ విషయం మీద ఉద్వేగ భరితమైన చర్చలు జరిగేవి. ఈ ఫొటోల తతంగం గురించి కొబయాషి ఏమీ అనేవాడు కాదు. బహుశా ఆయన ఉద్దేశ్యంలో లాంఛన ప్రాయమైన తరగతి చివరి ఫొటో కన్న బడిలోని ప్రతి ఒక్కరూ ఉండే, జీవం తొణికిసలాడే ఫొటో  ఉండటం ముఖ్య మనుకుంటాను. ఇప్పుడా ఫొటోలను చూస్తే, అవి టోమోకు నిజమైన ప్రతినిధులలా ఉంటాయి.

టోమో గురించి నేను ఇంకా ఎంతో రాయగలిగి ఉండేదాన్ని. కాని టొటొచాన్ లాంటి చిన్నారి పాప కూడ ఎలా సరైన పెద్దల ప్రభావం అందితే ఇతరులతో సవ్యంగా వ్యవహరించగలిగిన వ్యక్తి కాగలదో పాఠకులకు అర్థం చేయించగలిగితే నా పని సార్థక మయినట్టే.

టోమోలాంటి పాఠశాలలు గనుక ఇప్పుడున్నట్టయితే, [illegible] ఇంతగా వ్యాపించి ఉన్న హింసా ప్రవృత్తి తక్కువగా ఉండేదని, బడి వదిలేసే పిల్లల సంఖ్య ఇంత ఎక్కువ ఉండేది కాదని నేను బలంగా అనుకుంటాను. టోమోలో బడి అయిపోగానే ఇంటికి వెళ్ళిపోవాలని ఎవరికీ అనిపించేదికాదు. ఉదయంపూట కూడ ఎప్పుడెప్పుడు బడికి చేరుతామా మాకెంత ఆత్రంగా ఉండేదో! అటువంటి బడి అది.

ఇంత అద్భుతమైన పాఠశాలను నెలకొల్పే ప్రేరణా, దృక్పథమూ ఉన్న వ్యక్తి సొసాకు కొబయాషి టోక్యో వాయవ్య భాగంలోని పల్లె సీమల్లో 1893 జూన్ 18న జన్మించాడు. ప్రకృతి, సంగీతం ఆయనకు అతి ప్రియమైన విషయాలు. పిల్లవాడిగా ఆయన తన ఇంటి దగ్గర్లోనే ఉన్న నది ఒడ్డునే నిలబడి ఉండేవాడు. దూరం నుంచి హరునా పర్వతం కనబడుతుండేది. ఆ పర్వతం ప్రేక్షకురాలిగా, వడిగా ప్రవహిస్తున్నది సంగీత బృందంగా, తాను స్వరకర్తగా భావించుకుని ఆయన కండక్ట్ చేస్తూ ఉండేవాడు.

ఆయన కుటుంబం పేద రైతు కుటుంబమనే చెప్పాలి. ఆరుగురు పిల్లల్లో ఆయనే



ఆఖరివాడు. ప్రాథమిక విద్య అయిపోగానే ఆయన ఒక బడిలో సహాయ ఉపాధ్యాయుడుగా బాధ్యత తీసుకోవలసి వచ్చింది. ఆ ఉద్యోగానికి అవసరమైన ధృవీకరణ పత్రాలను అంత చిన్న వయసులో సంపాదించడం ఆయనకు చాల కష్టం అయింది. అయినా అది ఆయనకున్న అసాధారణ ప్రతిభకు చిహ్నం అయింది. త్వరలోనే ఆయనకు టోక్యోలోని ఒక ప్రాథమిక పాఠశాలలో ఉద్యోగం వచ్చింది. అక్కడ ఆయన విద్యా బోధనను, సంగీతాన్ని కలగలిపాడు. ఈ సమ్మేళనం వల్ల ఆయనకు ఇష్టమైన చిరకాల వాంఛ ఒకటి నేరవేరింది. జపాన్‌లోకెల్లా అత్యున్నత సంగీత కేంద్రంలోని సంగీత బోధనా శాఖలోకి ఆయనకు ప్రవేశం దొరికింది. ఇప్పుడు దాన్నే టోక్యో లలిత కళల, సంగీత విశ్వవిద్యాలయం అంటున్నారు. అక్కడ పట్టభద్రుడయిన తర్వాత ఆయన సీకి ప్రాథమిక పాఠశాలలో సంగీత బోధకుడయ్యాడు. ఈ పాఠశాలను హరుజి నకమురా స్థాపించాడు. నకమురా విద్యావేత్తగా అద్భుతమైన వ్యక్తి, శిశువుల ప్రాథమిక విద్యే అత్యంత ప్రధానమైనదని నకమురా విశ్వాసం. నకమురా వీలయినంత తక్కువ మందితో తరగతులు ఏర్పరిచేవాడు. శిశువుల వ్యక్తిత్వాన్ని వెలికి తెచ్చేందుకు, వారిలో ఆత్మగౌరవాన్ని పెంపొందించేందుకు తగిన స్వేచ్ఛాయుత పాఠ్యాంశాలు ఉండాలని బోధించాడు. అక్కడ ఉదయం పూట మాత్రమే తరగతులుండేవి. మధ్యాహ్నమంతా షికార్లు, మొక్కల సేకరణ, బొమ్మలు గీయడం, పాడడం, హెడ్ మాస్టర్ వివరించే విషయాల్ని వినడంలాంటి పనులే ఉండేవి. నకమురా పద్ధతులతో కొబయాషి చాల వరకు ప్రభావితమయ్యాడు. టోమోలో కూడ అటువంటి పాఠ్యాశాలనే రూపొందించాడు.

నకమురా పాఠశాలలో సంగీతం బోధిస్తున్నప్పుడే, విద్యార్థులతో ప్రదర్శింపజేసేందుకు కొబయాషి ఒక పిల్లల సంగీత నృత్యరూపకాన్ని రాశాడు. ఈ రూపకం బారన్ ఇవసాకి అనే పారిశ్రామిక వేత్తకు చాల నచ్చింది. ఈ ఇవసాకి కుటుంబమే ప్రపంచంలోకెల్లా పెద్ద పారిశ్రామిక సంస్థ అయిన మిట్సుబిషిని స్థాపించింది. బారన్ ఇవసాకి కళాపోషకుడు. ఆయన జపాన్‌లోని అత్యుత్తమ సంగీత విద్వాంసుడు కొసాక్ యమాడాకు సహాయం చేస్తుండేవాడు. పాఠశాలకు ఆర్థిక సహాయం అందజేసేవాడు. ఆయన కొబయాషిని విద్యాపద్ధతులు అధ్యయనం చేసి వచ్చేందుకు యూరప్ పంపిస్తానని ఆహ్వానం పంపాడు.

1922 నుంచి 1924 వరకు రెండు సంవత్సరాల పాటు కొబయాషి యూరప్‌లో గడిపాడు. పారిస్‌లో పాఠశాలను సందర్శిస్తూ, ఎమిలీ జాక్వెస్ - డాల్‌క్రోజ్ రూపొందించిన యురిథమిక్స్‌ను అధ్యయనం చేశాడు. విదేశాల నుంచి వచ్చాక మరొకరితో కలిసి సీజోకిండర్ గార్టెన్ స్థాపించాడు. శిశువులను ముందే తాము ఎంచుకున్న మూసలలోకి దించడానికి ప్రయత్నించొద్దనీ, అలా ఇరికించవద్దనీ కొబయాషి కిండర్ గార్టెన్ టీచర్లతో చెపుతుండేవాడు. "వాళ్ళను ప్రకృతికి వదిలేయండి. వాళ్ళ ఆకాంక్షలను కుదించేయకండి, వాళ్ళ కలలు మీ కలలకంటే విశాలమైనవి. అద్భుతమైనవి" అని ఆయన చెప్పేవాడు. అటువంటి కిండర్ గార్టెన్ జపాన్‌లో మరొకటి లేదు.

1930లో కొబయాషి మళ్ళీ యూరప్ వెళ్ళాడు. డాల్‌క్రోజ్ సాన్నిహిత్యంలో మరొక సంవత్సరం అధ్యయనం చేశాడు. అలా పర్యటిస్తూ ఆయన ఒక నిర్ణయం తీసుకున్నాడు. జపాన్ చేరగానే తానే స్వయంగా ఒక పాఠశాల నెలకొల్పాలని.

1937లో ఆయన టోమో గాకుయెన్‌ను స్థాపించాడు. దానితోపాటే ఆయన జపాన్ యురిథమిక్స్ అసోసియేషన్‌ను కూడ స్థాపించాడు. జపాన్‌లో యురిథమిక్స్ ప్రవేశపెట్టిన వ్యక్తిగా

ఆయనను చాల మంది గుర్తుంచుకుంటారు. అట్లాగే యుద్ధం తర్వాతి రోజుల్లో కునిటాచి సంగీత కళాశాలకు అనుబంధంగా సాగిన ఆయన కృషి కూడ చిరస్మరణీయమైనది. ఆయన బోధనా పద్ధతులతో ప్రత్యక్ష అనుభవం ఉన్న వాళ్ళం కొద్దిమందిమే మిగిలాం. టోమోవంటి మరొక పాఠశాలను నెలకొల్పక ముందే ఆయన మరణించడం ఒక విషాదం. టోమో తగలబడిపోతూ ఉండగా కూడ ఆయన మరొక మంచి పాఠశాలను దర్శిస్తూనే ఉన్నాడు. "బాబూ, మళ్ళీ ఎటువంటి బడి నిర్మిద్దాం నాన్నా?" అనడిగాడాయన. చుట్టూ చెలరేగుతున్న గందరగోళం మధ్య కూడ ఆయన దీక్ష సడలలేదు. ఆయన లొంగిపోలేదు.

ఈ పుస్తకం రాయడం మొదలుపెట్టాక నేను ఒక ఆశ్చర్యకరమైన విషయం కనిపెట్టాను. రోజు రోజూ టెలివిజన్‌లో వచ్చే నా ఇంటర్వ్యూ కార్యక్రమం "టెట్సుకో గది" నిర్మాత ఒక దశాబ్దంగా కొబయాషి గురించి పరిశోధన చేస్తున్నాడట. ఆ నిర్మాతతో నేను ఎన్నో సంవత్సరాలుగా కలసి పని చేస్తున్నాను. ఈ నిర్మాత కొబయాషిని ఎన్నడూ కలవలేదు. కాని ఒక మహిళవల్ల ఆయనకు కొబయాషి పట్ల ఆసక్తి కలిగింది. ఆమె చిన్నారి పిల్లల యురిథమిక్స్ పాఠాలకు పియానో వాయిస్తోందట. "పిల్లలు అట్లా అడుగులు వేయలేరండీ" అని కొబయాషి ఆమె వాయిస్తున్న లయను సవరించాడట. పిల్లల విషయం అంత సంపూర్ణంగా తెలిసిన మనిషాయన. వాళ్ళు ఎట్లా శ్వాసిస్తారో, వాళ్ళు ఎట్లా కదులుతారోఆయనకు తెలుసు. ఆమె మా నిర్మాత కజుహికో సానోకు కొబయాషి విషయం చెప్పి ఆసక్తి రేకెత్తించింది. కజుహికో సానో త్వరలోనే తన పుస్తకం పూర్తి చేస్తాడనీ, ఆ అత్యద్భుతమైన వ్యక్తి గురించి ప్రపంచానికి ఇంకా ఎక్కువ విషయాలు తెలియజేస్తాడనీ ఆశిస్తున్నాను.

ఇరవైఏళ్ళ కింద నేను ఒక స్త్రీల పత్రికలో టోమో గురించి ఒక వ్యాసం రాశాను. ఈ వ్యాసం ఉత్సాహవంతుడైన ఒక యువ కొడన్‌షా సంపాదకుడి దృష్టిలో పడింది. ఆయన నన్ను కలవడానికి వచ్చాడు. కాగితాల గుట్టలు పట్టుకొని వచ్చి, ఆ వ్యాస విషయాన్ని పుస్తకంగా అభివృద్ధి చేయమని కోరాడు. నేను బిడియంతోనే ఆ కాగితాల్ని మరెందుకో వాడాను. తన ఆలోచన కార్యరూపం ధరించక ముందే ఆ యువకుడు డైరెక్టర్ అయ్యాడు. ఆయన పేరు కట్సుహిసాకాటో. నాకీ పని చేసేందుకు ఆలోచన ఇచ్చిందీ, ధైర్యం ఇచ్చిందీ ఆయనే. అప్పటికి ఏమంత ఎక్కువ రాయని నాకు పుస్తకం రాయడం అంటే చాల కష్టమనిపించింది. చివరికి నన్ను ఎప్పటికప్పుడు ఒక అధ్యాయం రాసి ఇమ్మన్నారు. కొడన్‌షా వాళ్ళు ప్రచురించే 'యంగ్ వుమెన్' పత్రికలో ఆ అధ్యాయాలు వరుసగా వేస్తామన్నారు. అలా 1979 ఫిబ్రవరి నుంచి 1980 డిసెంబర్ వరకు నేనివి రాశాను.

ప్రతినెలా ఒక బొమ్మను ఎంచుకునేందుకు నేను షిమో-షకుజి, నెరిమా-కు, టోక్యోలలోని చిహిరో ఇవసాకి బొమ్మల పుస్తకాల ప్రదర్శనశాలకు వెళ్ళేదాన్ని. పిల్లల్ని చిత్రించడంలో చిహిరో ఇవసాకి అద్భుత ప్రజ్ఞావంతురాలు. పిల్లల్ని ఆమె చిత్రించినంత సజీవంగా చిత్రించగల చిత్రకారులు ప్రపంచంలో మరెక్కడయినా ఉన్నారా అనేది నాకు అనుమానమే. చిన్నారి శిశువులు ఎన్నెన్ని కోటానుకోట్ల మానసిక స్థితులలో, వైఖరులతో ఉంటారో అన్నిటినీ ఆమె అవగాహన చేసుకుంది. ఆరు నెలల శిశువుకు, తొమ్మిది నెలల శిశువుకు ఉండే తేడాను ఆమె పసికట్టగలిగేది. నా పుస్తకం కోసం ఆమె బొమ్మల్ని ఉపయోగించుకోగలగడం నాకెంత ఆనందాన్నిచ్చిందో చెప్పలేను. అవి నా కథనానికి ఎంత సరిగ్గా సరిపోతాయో చూస్తే అద్భుతమనిపిస్తుంది. ఆమె 1974లో చనిపోయింది. కాని ఆమె జీవించి ఉండగానే నా పుస్తకరచన ప్రారంభమైందా అని చాలమంది అడుగుతుంటారు. ఆమె చిత్రాలు జీవితాన్ని ఎంత వాస్తవికంగా పట్టుకున్నామో, శిశువులను చిత్రించడంలో ఆమె



ఎంత అసాధారణమైన వైవిధ్యాన్ని ప్రదర్శించిందో తెల్సుకోవడానికి ఇది సూచన.

చిహిరో ఇవసాకి దాదాపు ఏడువేల బొమ్మల్ని చిత్రించింది. ఆమె వేసిన చిత్రాల అసలు రూపాలను చాలవాటిని చూసే భాగ్యం నాకు కలిగింది. ప్రదర్శనశాలకు సహాయక పర్యవేక్షకుడుగా పనిచేస్తున్న ఆమె కొడుకు, ఆయన భార్య చూపించిన ఔదార్యంవల్ల అది సాధ్యపడింది. ఆమె బొమ్మల్ని ఇక్కడ పునర్ముద్రించడానికి అనుమతించినందుకు చిహిరో భర్తకు నా కృతజ్ఞతలు. ప్రదర్శనశాల పర్యవేక్షకుడు, నాటక రచయిత టాడాసు ఐజవాకు కూడ నేను కృతజ్ఞురాలినే, నేను అలస్యం చేస్తున్న కొద్దీ తొందరపెట్టి పుస్తకం రాయించింది ఆయనే. ఆ ప్రదర్శనశాలకు ఇప్పుడు నేను కూడ ట్రస్టీగా ఉన్నాను.

మియోచాన్, టోమోలోని ఇతర మిత్రులందరూ కూడ సహజంగానే నాకు అనన్య సాధ్యమైన సహాయం చేశారు. జపనీస్ కూర్పుకు సంపాదకుడిగా ఉండిన కీకో ఇవామోటోకు కూడ నా హృదయపూర్వక కృతజ్ఞతలు. "ఈ పుస్తకాన్ని మనం నిజంగా బ్రహ్మాండంగా తీసుకు రావాలి" అని ఆయన అంటుండేవాడు.

జపనీస్‌లో ఈ పుస్తకం పేరుకు నేను ఒక సుప్రసిద్ధ వ్యక్తీకరణ నుంచి ప్రేరణ పొందాను. "కిటికీ బైట" అనేది ఆ మాట. అంటే అంచులలోనో, కష్టాలలోనో ఉన్నవాళ్ళన్నమాట. ఆ మొదటి బడిలో నేను నా ఇష్టప్రకారమే వీధి బాజాల వాళ్ళను చూసేందుకు కిటికీ దగ్గర నిలబడ్డప్పటికీ, నిజంగా నేనప్పుడు "కిటికీ బైట" ఉన్నట్టే అనుకున్నాను. అందరితో విడిపోయి, బైటెక్కడో ఉన్నట్టుగానే. ఈ పేరుకు ఈ అర్థాలున్నాయి. అంతేకాదు మరొక అర్థం ఉంది. ఆ ఆనందపు కిటికీ నా కోసం చిట్టచివరికి టోమోలో తెరుచుకుంది.

టోమో ఇప్పుడు లేదు. కాని మీరు ఈ పుస్తకం చదువుతున్నప్పుడు కాసేపు అది మీ ఊహల్లో పునర్జీవిస్తుందనుకుంటే అంతకంటే నేను పొందగల మహత్తర ఆనందం మరేమీ లేదు.

టోక్యో, 1982

* * * *

టొటొచాన్ మొదటిసారి ప్రచురితమై మూడు సంవత్సరాలు మాత్రమే గడిచాయి. కాని ఈ కొద్దికాలంలోనే ఎన్నెన్ని సంగతులు జరిగిపోయాయో తలచుకుంటే నాకు నిజంగా చాల ఆశ్చర్యం కలుగుతుంది. అంతకు అంత ఆనందమూ కలుగుతుంది. నా ప్రియాతిప్రియమైన హెడ్‌మాస్టర్ గురించి, టోమోలో నేను గడిపిన మరిచిపోలేని కాలం గురించి రాసినప్పుడు ఈ పుస్తకం అత్యధికంగా అమ్మకమయ్యే పుస్తకం అవుతుందని నాకెంత మాత్రం అనిపించలేదు. మొదటి సంవత్సరం నలభై ఐదు లక్షల ప్రతులు అమ్ముడుపోయాయి. ఇప్పటికి ఈ సంఖ్య అరవై లక్షల ప్రతులకు చేరింది. "జపనీస్ ప్రచురణా రంగం చరిత్రలో ఇది రికార్డు" అని విన్నాను. కాని నాకదంత గొప్ప విషయం కాదు. జపాన్ అంతటి నుంచీ ప్రతిరోజూ అసంఖ్యాకమైన ఉత్తరాలు రావడం మొదలయినాకనే నిజంగానే నా పుస్తకాన్ని చాలమంది చదువుతున్నారని నాకు అర్థమైంది.

నేను అన్ని వయసుల వారి నుంచీ ఉత్తరాలందుకున్నాను. ఐదేళ్ళ చిన్నారి నుంచి 103 ఏళ్ళ వృద్ధుల వరకు నాకు ఉత్తరాలు రాశారు. ఆ ఉత్తరాలు ప్రతి ఒక్కటీ నన్నెంతగానో కదలించాయి. ప్రాథమిక పాఠశాలల విద్యార్థుల నుంచి ఎన్ని ఉత్తరాలు వచ్చాయో చూసి నేను ఆశ్చర్యపోయాను. ఎందుకంటే అంత చిన్నారి పిల్లలు ఈ పుస్తకాన్ని చదువుతారని నేను ఊహించలేదు. ఐనా కష్టమైన చైనీస్ అక్షరాల పక్కన సులభతరమైన వ్యాఖ్యలను చేర్చే జాగ్రత్త

తీసుకున్నాను. లిఖిత పదం క్రమక్రమంగా అదృశ్యమవుతున్న ఈ కాలంలో రెండో తరగతి పిల్లలు డిక్షనరీ సహాయంతో టొటొచాన్‌ను చదువుతున్నారంటే ఎంత అద్భుతమనిపిస్తోందో! అంగవైకల్యంగల శిశువు కనిపించినప్పుడల్లా "ఓహ్-అదిగో యాసువాకి చాన్", అనో "అతను టోమో నుంచే వచ్చి ఉంటాడు" అనో అనుకుంటున్నానని ఒక రెండో తరగతి అమ్మాయి రాసింది. ఆ పాప వాళ్ళదగ్గరికి పరుగెత్తుకెళ్ళి హలో అంటుందట, వాళ్ళు తిరిగి హలో అంటే పొంగిపోతుందట. టోమో తర్వాత నలభై ఏళ్ళు గడిచిపోయాక ! నిజంగా పిల్లలు భలేవాళ్ళు గదూ !

టోమో తగలబడి పోవడం గురించి చదివేటప్పుడు యుద్ధం ఎంత చెడ్డదో తాము గుర్తించామని, పుస్తకం అందుకోసమైనా రాయదగిందేనని చాలమంది పిల్లలు రాశారు. ఈ పుస్తకం రాస్తున్నప్పుడు నా మనస్సులో మెదిలిన ఆలోచన ఒకటే. పాఠశాలల ఉపాధ్యాయులు, తల్లులు కొబయాషి గురించి చదివి "అబ్బ-పిల్లలను నిజంగా ప్రేమించిన, వాళ్ళలో నమ్మకం ఉంచిన వ్యక్తి ఒకాయన ఉండేవాడు" అనుకుంటే ఎంత బావుంటుందని. ఐనా ఈ పోటీ సమాజంలో ఆయన భావాలు మరీ ఊహాజనితంగా ఉన్నాయని టీచర్లు కొట్టేస్తారేమోనని నేను భయపడ్డాను.

వాస్తవానికి, పుస్తకం వెలువడగానే, తమ విద్యార్థులకు రోజూ మధ్యాహ్న భోజన సమయంలో గంటసేపు బిగ్గరగా చదివి వినిపించడం ప్రారంభించామని ఎందరో ప్రాథమిక పాఠశాలల ఉపాధ్యాయులు రాశారు. ప్రాథమిక పాఠశాలల్లోని కొందరు చిత్రలేఖనం టీచర్లయితే, టొటొచాన్ లోంచి కొన్ని భాగాలు తమ పిల్లలకు చదివి వినిపించి విన్నదాని ఆధారంగా బొమ్మలు వేయమని అడిగామని రాశారు. విద్యారంగపు దుస్థితిని చూసి అసలు ఈ రంగాన్నే వదిలేద్దామని ఆలోచిస్తూ ఉండగా కొబయాషి భావాలు తమకు ప్రేరణనిచ్చాయని, మళ్ళీ ఈ రంగంలోనే కృషి చేద్దామనుకుంటున్నామని ఉన్నత పాఠశాలలోని యువ ఉపాధ్యాయులు కొందరు రాశారు. ఇటువంటి అర్థమైన ఉత్తరాలెన్నో నా కందాయి. ఇంతమంది ప్రజలు కొబయాషిలాగనే ఆలోచిస్తున్నారని గుర్తించిన ఆనందంతో నా కళ్ళు చెమ్మగిల్లాయి.

టీచర్లు నా పుస్తకాన్ని ఎన్నో రకాలుగా ఉపయోగించుకున్నారు. "వ్యవసాయం టీచర్" అనే అధ్యాయాన్ని గత సంవత్సరం మూడోతరగతి జపనీస్ భాష పాఠ్యపుస్తకంలో అధికారికంగా చేర్చారు. "పాతబడి వెలిసిపోయిన బడి" అధ్యాయాన్ని నాలుగో తరగతి నీతి శాస్త్రం పుస్తకంలో చేర్చారు. కొన్ని విచారకరమైన ఉత్తరాలు కూడ వచ్చాయి. బాలనేరస్తుల శిక్షాకేంద్రం నుంచి ఒక ఉన్నత పాఠశాల విద్యార్థిని "టొటొచాన్ వాళ్ళమ్మలాంటి అమ్మ నాకున్నట్టయితే, కొబయాషి లాంటి టీచర్ నాకున్నట్టయితే నేనిక్కడ ఉండేదాన్నే కాదు" అని రాసింది.

టొటొచాన్ ఇంత బహుళ జనాదరణను ఎందుకు పొందింది? ప్రచారసాధనాలు ఈ ప్రశ్నను తీసుకున్నాయి. ఇది పెద్ద చర్చనీయాంశమైంది. 'అసాహి' వార్తా పత్రిక "టొటొచాన్ నమూనా" అనే పేరుతో వరుసగా వ్యాసాలు అచ్చు వేసింది. ఆ వ్యాసాల్లో పుస్తకం ప్రభావం గురించి అనేక కోణాలలో చర్చించారు. ఆశ్చర్యకరంగాఈ విషయమై ఒక పూర్తి పుస్తకమే వచ్చింది. దాన్ని వేరే ప్రచురణకర్తలు ప్రచురించారు. దానిపేరు 'టొటొచాన్-ఎక్కువగా అమ్ముడయిన పుస్తకం కథ' ఎందుకీ పుస్తకం అత్యధిక ఆదరణను పొందిందో ప్రతికోణం నుంచీ చర్చించిన పుస్తకం అది. నా ఉద్దేశ్యంలో నా పుస్తకం విజయానికి ఒక కారణం ఏమంటే జపాన్‌లో విద్యావిధానం సమస్య ఒక క్లిష్టమైన పరిస్థితికి చేరుకుని, ప్రతి ఒక్కరూ ఏదో ఒకటి చేయాలని భావిస్తున్న తరుణంలో నా పుస్తకం వెలువడింది. కనుక చాలమంది దీన్ని ఒక విద్యావిధానం గురించి సిద్ధాంతంగా పరిగణించడంలో ఆశ్చర్యంలేదు. నిజానికి నేను అందుకోసం రాయలేదు.



అంతకన్న ముఖ్యంగా ఇది ప్రతి ఒక్కరి కోసమూ రాసిన పుస్తకం గనుక, వేరు వేరు వయసుల, వేరువేరు దృక్పథాల ప్రజలను ఆకట్టుకోగల పుస్తకం గనుక ఇంత ఆదరణ వచ్చి ఉంటుంది.

జపాన్‌లో అత్యధిక ఆదరణ పొందిన పుస్తకాలలో ఒక స్త్రీ రాసిన పుస్తకం ఇదే మొదటిది. మొట్టమొదట మగవాళ్ళ ప్రతిస్పందన ప్రతి కూలంగానే ఉండింది. నా పుస్తకాన్ని చర్చించడానికి తగినంత దయగల మగ సమీక్షకులు "ఈ పుస్తకానికి ఉన్న స్త్రీ సహజమైన అలంకారం పట్ల నేను ముచ్చట పడ్డాను," "ఎవరో ఒక జనాకర్షక వినోదం కోసం రాసిన పుస్తకంగా నేను దీన్ని కొట్టేస్తున్నాను." నేను దీన్ని చదవదలచుకోలేదు గాని నా కుటుంబ సభ్యులు చదవమని పట్టుబట్టారు...." లాటి మాటలతో ప్రారంభించారు. కాని పోగా పోగా మంచి సమీక్షలు వచ్చాయి. టొటొచాన్‌ను చదవమని అంతగా పట్టుబట్టిన ఆ కుటుంబ సభ్యులకు నా హృదయ పూర్వక కృతజ్ఞతలు.

పుస్తకం ప్రచురణ కాక ముందే పారితోషికం విషయంలో నేనొక నిర్ణయం చేసుకున్నాను. చెవిటి నటుల కోసం జపాన్‌లో మొట్టమొదటి సారిగా ఒక వృత్తిపరమైన నాటకరంగాన్ని నిర్మించడానికి ఆ ధనాన్ని వాడాలనుకున్నాను. దాన్ని ఒక సాంఘిక సంక్షేమ సంస్థగా రూపొందించేందుకు అనుమతించమని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాను. అలా అయితే నేను చనిపోయిన తర్వాత, పనిచేయలేనంత వృద్ధురాలినయిన తర్వాత కూడ ఈ సంస్థ కొనసాగే వీలుంటుంది. కాని ఇటువంటి అనుమతి దొరకడం కష్టమైంది. జపాన్‌లో అంతకుముందు అటువంటి ఉదాహరణలేదు. కాని ఇరవై ఐదేళ్ళకు పైగా నేను సాగించిన సంక్షేమ కార్యక్రమాలను దృష్టిలో ఉంచుకుని అధికారులు చివరికి తమ ఆమోదాన్ని తెలియజేశారు. ఈ విధంగా టొటొ ఫౌండేషన్‌గా ప్రసిద్ధమైన సాంఘిక సంక్షేమ సంస్థ ఆవిర్భవించింది. అది అనూహ్యమైన విజయాల్ని సాధించింది. దాని ద్వారా జపాన్ బధిరుల నాటక సంస్థ రూపొందింది. ప్రస్తుతం టొటొ ఫౌండేషన్ శిక్షణాకేంద్రంలో ఇరవై పైగా బధిరులయిన నటులు శిక్షణ పొందుతున్నారు. అక్కడ సైగల భాషా తరగతులు కూడ జరుగుతుంటాయి. గత జూలైలో మేం ఎన్నాళ్ళుగానో కంటున్న ఇష్టమైన కలను నిజం చేయగలిగాం. ఇటలీలోని పాలెర్మోలో అంతర్జాతీయ చెవిటి, మూగ కాంగ్రెస్ నాటకోత్సవాలలో మేం ఒక క్యోగెన్ నాటకాన్ని ప్రదర్శించాం. మా ప్రదర్శనను నలభై ఐదు దేశాలకు ప్రాతినిధ్యం వహించే ప్రేక్షకులు చూశారు. జపాన్‌కు చెందిన బధిరనటులు విదేశాలలో ప్రదర్శన ఇవ్వడం అదే మొదటిసారి. మీలో చాలమంది టొటొచాన్ చదివి ఉండడం వల్లనే ఈ ప్రదర్శన సాధ్యపడింది.

రెండేళ్ళకింద నన్ను చక్రవర్తి ప్రతిఏటా ఇస్తుండే వసంతోధ్యాన విందుకు ఆహ్వానించారు. టొటొచాన్ ఫౌండేషన్ కృషివల్ల, నా పుస్తకం అత్యధిక జనాదరణ పొందడం వల్ల ఈ ఆహ్వానం వచ్చింది. ఆ విందులో నోబెల్ బహుమతి గ్రహీత కెనిచిఫుకుయి వంటి మహామహులున్నారు. చక్రవర్తి స్వయంగా "మీ పుస్తకం అంత ఆదరణ పొందడం సంతోషకరమైన విషయం" అనడం నాకు ఊహించని ఆనందం.

1981ని అంతర్జాతీయ వికలాంగుల సంవత్సరంగా ప్రకటించారు. డిసెంబరు 9న ప్రధానమంత్రి సుజుకి నుంచి నేను ఒక బహుమతి నందుకున్నాను. డిసెంబర్ 9ని ఇప్పుడుజపాన్‌లో వికలాంగుల దినంగా పాటిస్తున్నారు. నేను మరెన్నో బహుమతుల్ని కూడ పొందాను. వాటిలో పిల్లల పుస్తకాల రచయిత యుజొ యమ మోటో స్మృతిలో ఏర్పాటు చేసిన "వేసైడ్ స్టోన్" సాహిత్య బహుమతి కూడ ఉంది.

టొటొచాన్‌ను సినిమాగానో, టెలివిజన్ నాటకంగానో, కార్టూన్ సినిమాగానో, నాటికగానో, సంగీత రూపకంగానో తయారు చేస్తామని కోరుతూ ఎంతోమంది అనుమతి కోసం నన్నడిగారు. కాని పాఠకుల ఊహల్లో ఇప్పటికే అల్లుకుపోయిన చిత్రాలకు పునాది అయిన చిహిరో ఇవసాకి బొమ్మలను అధిగమించడం కష్టమని నేననుకున్నాను. కనుక ఆ కోర్కెలన్నటినీ తిరస్కరించాను. కాని ఈ కథనాన్ని సంగీత గాథగా మలుస్తామన్న షిన్సీ నిహాన్ సింఫొని ఆర్కెస్ట్రా వాళ్ళ కోర్కెను నేను అంగీకరించాను. ఎందుకంటే సంగీతం అద్భుతాలు స్వేచ్ఛగా నర్తించే అవకాశాన్ని ఇస్తుంది. నా మాటల కన్న అకిహిరో కొమోరి స్వర సమ్మేళనం హృద్యంగా ఉంది. షిన్సీనిహాన్ సింఫొని దాన్ని జపాన్‌లో అనేక చోట్ల ప్రదర్శిస్తోంది. ఆ స్వర సమ్మేళనానికి నా కథను జోడిస్తున్నారు. ఈ సంగీత గాథ రికార్డు కూడ ఉంది.

1982లో అంటే టొటొచాన్ ప్రచురితమైన ఏడాది తర్వాత డొరొతీ బ్రిటన్ చేసిన ఇంగ్లీషు అనువాదం పూర్తయింది. డొరొతీ స్వయంగా స్వరకర్త, కవయిత్రి. ఆమె చేసిన అపురూప అనువాదం నా మూలంలోని లయను, ఉద్వేగాన్ని యథాతథంగా పట్టుకుంది. ఆమె ఎంతగా ఇది సాధించిందంటే ఆమె అనువాదాన్ని చదువుతుంటే నేను కదిలిపోయాను. ఇంగ్లీషు ప్రతి కూడ జపాన్‌లో అత్యధికంగా అమ్ముడయిన ఇంగ్లీషు పుస్తకంగా రికార్డును స్థాపించింది. అది నాలుగు లక్షల ప్రతులు అమ్ముడయింది.

ఇంగ్లీషు ప్రతి అమెరికాలో కూడ అదే సమయంలో వెలువడింది. ఆ సందర్భంగా నేను జానీ కార్సన్ తీసిన "టు నైట్" ప్రదర్శనలో పాల్గొన్నాను. ఆ తర్వాత ఉపన్యాసాలలోనూ, వార్తా ప్రదర్శనలలోను పాల్గొనమని నాకు ఎన్నో ఆహ్వానాలు వచ్చాయి. ప్రతిష్ఠాత్మకమైన అమెరికన్ వార్తా పత్రిక 'ది న్యూయార్క్ టైమ్స్' దాని ఆదివారపు పుస్తకాల విభాగంలో సుదీర్ఘ సమీక్షను ప్రచురించింది. పుస్తకాన్ని సమీక్షించడంతోపాటు జపనీస్ మహిళా టీవీ వ్యాఖ్యాతలో కనిపించిన నవ్యతను అమెరికన్ ప్రచార సాధనాలు వెంటనే గ్రహించాయి. టైమ్ పత్రిక జపాన్ మీద ప్రత్యేక సంచిక వేసి నాతో ఇంటర్వ్యూ కోసం పూర్తి పేజీ కేటాయించింది.

టొటొచాన్ అనువాదాలు ఇప్పటికే చైనాలోనూ, కొరియాలోనూ ప్రచురితమయ్యాయి. ఈ రెండు దేశాలకూ జపాన్‌తో కాపీరైట్ ఒప్పందాలు లేవు. అందువల్ల చైనా నుంచి ఒక దయగల పెద్ద మనిషి ఒక జపనీస్ పరిచయస్తుడి ద్వారా ఒక ప్రతి పంపే వరకూ నాకు చైనీస్ అనువాదం సంగతి తెలియదు. చూడగా చైనాలో రెండు, మూడు వేరువేరు అనువాదాలు అచ్చయినట్టున్నాయి. పోలెండ్, ఫిన్లాండ్‌లలో ప్రచురణ కర్తలు అనువాదాలు ప్రచురించడానికి ఏర్పాట్లు చేసుకున్నారు. పనులు చురుగ్గా సాగుతున్నాయి. చెకొస్లవేకియా ప్రచురణకర్తతో చర్చలు జరుగుతున్నాయి. ఇతర యూరపియన్ దేశాల నుంచి కూడ విచారణలు కొనసాగుతున్నాయి. టొటొచాన్ ద్వారా ఎందరెందరో ప్రజలు జపాన్ గురించి తెలుసుకోగలరంటే నాకు ఆనందంగా ఉంది. నాకిప్పటికే అమెరికా నుంచి ఉత్తరాలు రావడం మొదలయింది. "టొటొచాన్, నువు అందమైన అమ్మాయి వేనా? మా ఇంటికి ఒకసారి విందుకు రావు?" అని ఒక ప్రాథమిక పాఠశాల విద్యార్థి రాశాడు. తరగతిలో పుస్తకం చదివి వినిపించిన ఆ అబ్బాయి టీచర్ ఆ అబ్బాయి గురించి ఒక మాట రాసింది. అతను నల్లజాతికి చెందిన నిరుపేద విద్యార్థట.

"పుస్తకంలో ఇంత కరుణా, దయా ఉంటాయని మేం ఊహించలేదు" అని చాల మంది ఉన్నత పాఠశాలల విద్యార్థినులు రాయడాన్ని నేను ప్రముఖమైన విషయంగా గుర్తిస్తున్నాను.



అంతగా వాళ్ళను కదిలించిన దేమిటో వాళ్ళు ప్రత్యేకంగా రాయలేదు. బహుశా ఒక అమ్మాయికీ మరొక అమ్మాయికీ ఆ విషయంలో తేడాలుండవచ్చు. కాని యవ్వనంలోకి అడుగు పెడుతున్న మన పిల్లలు దయకు, మృదుత్వానికి ఇంతగా స్పందిస్తున్నారనేది ఒక వాస్తవం.

ఈ మధ్యనే నన్ను యునిసెఫ్‌కు గుడ్‌విల్ అంబాసడర్‌గా నియమించారు. ఈ ఐక్యరాజ్య సమితి శిశునిధి సంస్థ నోబెల్ శాంతి బహుమతిని గెలుచుకుంది. నాకీ పదవి రావడానికి కారణం ఈ పుస్తకమే. ఎందుకంటే యునిసెఫ్ న్యూయార్క్ కార్యాలయంలోని ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ టొటొచాన్‌ను చదివాడట. ఆయన ఆ సంస్థలో చాల ముఖ్యమైన వ్యక్తి. ఆయనకు ఆ పుస్తకాన్ని ఎవరో పంపారట. ఆయన పుస్తకం చదివి చాల కదిలిపోయి యునిసెఫ్ ఆలోచనలు, నా లోచనలు ఒకటేనని, నన్ను ఆసియా నుంచి గుడ్‌విల్ అంబాసడర్‌గా నియమించాలని అనుకున్నారట. గుడ్‌విల్ అంబాసడర్‌లుగా అమెరికన్ నటుడు డానీ కే, బ్రిటిష్ నటుడు పీటర్ ఉస్తినోవ్, నార్వేజియన్ నటి లివ్ ఉల్‌మన్ ఇది వరకే సుప్రసిద్ధులు. ఇప్పుడు నేను నాలుగోదాన్ని. అకలివల్ల, ఆకలికి సంబంధించిన వ్యాధులవల్ల ప్రపంచ వ్యాప్తంగా ప్రతిరోజూ నలభై వేల మంది శిశువులు, ఏటా కోటిన్నర మంది పిల్లలు మరణిస్తున్నారు. నా పనేమంటే వారి వాస్తవస్థితి గతులను స్వయంగా పరిశీలించి వాటిని మీ అందరికీ నివేదించడం. ఈ వేసవిలో నేను ఆఫ్రికా వెళ్ళబోతున్నాను. వీలయినంత త్వరలో ఆసియాలోని వివిధ దేశాలను సందర్శిస్తాను. కొబయాషి జీవించి ఉన్నట్టయితే ఆయన తప్పకుండా సంతోషించి ఉండేవాడు. "మీరందరూ ఒకటే, మీకు తెలుసా? మీరు ఏం చేస్తున్నా సరే, మీరందరూ ఈ ప్రపంచంలో కలిసే ఉన్నారు" అని కొబయాషి ఎల్లప్పుడూ అంటూ ఉండేవాడు.

1984 వసంతకాలం

**- టెట్సుకో కురొయనాగి**



## రైల్వే స్టేషన్

వాళ్ళిద్దరూ ఒయిమాచి వెళ్ళేరైలులోంచి జియుగౌకా స్టేషన్లో దిగారు. అమ్మ టొటొచాన్ చెయ్యిపట్టుకుని టికెట్లిచ్చేసే గేట్లోంచి బైటికి దారి తీసింది. టొటొచాన్ అంతకు ముందెప్పుడూ రైలెక్కలేదు. అందుకే ఆ రైలు టిక్కెట్టు చాల విలువయినదిగా కనిపిస్తోంది. దాన్ని గట్టిగా పట్టుకుంది. వదిలెయ్యాలంటే చాల కష్టంగా ఉందా అమ్మాయికి.

"నేనిది ఉంచేసుకోవచ్చాండీ?" అని అడిగింది టొటొచాన్ టికెట్ కలెక్టర్ను.

ఆ పాపచేతుల్లోంచి టికెట్ తీసేసుకుంటూ "కుదరదు నువ్వది ఉంచేసేకోవడానికి వీల్లేదు" అన్నాడాయన.

"అవన్నీ మీవేనా?" అనడిగిందా పాప, ఆయన పెట్టెనిండా ఉన్న టికెట్లను చూపెడుతూ.

"కాదు, అవన్నీ రైల్వే వాళ్ళవి" అంటూనే వెళ్ళేవాళ్ళ చేతుల్లోంచి టికెట్లు తీసుకుంటున్నాడాయన.

టొటొచాన్ ఆ పెట్టెవేపే దీక్షగా చూసింది. ముందుకు అడుగులువేస్తూ "ఒహ్-పెద్ద పెరిగాక నేను రైలుటికెట్లమ్మే పనిచేస్తాను" అంది.

టికెట్ కలెక్టర్ మొట్టమొదటిసారి ఆ అమ్మాయివైపు చూశాడు. "మా చిన్నబ్బాయి కూడా స్టేషన్లో ఉద్యోగం కావాలంటున్నాడమ్మా. ఎంచక్కా మీరిద్దరూ కలిసి పనిచేయొచ్చు" అన్నాడు.

టొటొచాన్ పక్కకు ఓ అడుగేసి టికెట్ కలెక్టర్ వైపు పరీక్షగా చూసింది. ఆయన లావుగా ఉన్నాడు. కళ్ళజోడు పెట్టుకున్నాడు దయ మూర్తీభవించినట్టుగా ఉన్నాడు.

"ఉఁ" అంటూ నడుం మీద చేతులానించి ఆయన మాటల్ని జాగ్రత్తగా మననం చేసుకుంది. "మీ అబ్బాయితో కలిసా? ఫర్వాలేదు. ఆలోచిస్తాను కాని మరే, ఇప్పుడు కొత్తబడికి వెళ్తున్నాగా. తీరికలేదు" అంది.

అప్పటికే ఎదురుచూస్తూ నిలబడ్డ అమ్మ దగ్గరికి పరుగెత్తుతూ "అమ్మా, అమ్మా - నేను టిక్కెట్లమ్మే ఉద్యోగం చేస్తానే" అని అరిచింది.

అమ్మ ఏమీ ఆశ్చర్యపోలేదు. "నువు గూఢచారివవుతావని అనుకుంటున్నానే ఇన్నాళ్ళూ" అని మామూలుగా అంది.

అమ్మ చెయ్యి పట్టుకుని పక్కన నడుస్తుండగా, అంతకు ముందురోజు వరకూ తాను గూఢచారి కావాలనే అనుకున్నానని టొటొచాన్‌కు గుర్తొచ్చింది. కాని పెట్టెనిండా టిక్కెట్లు తన దగ్గరే ఉండడం ఎంత సరదాగా, ఎంత బాగుంటుంది!

"ఆ! అట్లా చేయొచ్చుగా" అని ఒక బ్రహ్మాండమైన ఆలోచన తట్టిందామెకు.అమ్మవైపు చూసి, గొంతెత్తి "నిజంగానేమో గూఢచారి. పైకేమో టికెట్లమ్మే మనిషి. అట్లా ఉండొచ్చుగా" అని అడిగింది.

అమ్మ జవాబివ్వలేదు. చిన్న చిన్న పూలుకుట్టిన ఫెల్ట్‌టోపీ కింద అందమైన అమ్మ ముఖం గంభీరంగా కనబడింది. నిజానికి అమ్మ ఏదో ఆందోళనలో ఉంది. టొటొచాన్‌ను కొత్తబడిలో కూడ చేర్చుకోకపోతే ఎట్లా? తనలో తానే ఏదో గొణుక్కుంటూ రోడ్డు మీద గెంతులు వేస్తున్న టొటొచాన్ వైపు చూసిందామె. అమ్మ విచారంలో ఉందని టొటొచాన్‌కు తెలియదు. తన కళ్ళలో అమ్మకళ్ళు కలవగానే ఆనందంగా "నాకింకో ఆలోచనొచ్చిందే. కొత్త దుకాణాల గురించి చెప్తూ వీధుల్లో బాజాలు వాయిస్తూ తిరుగుతారే ఆ బాజాల వాళ్ళలో చేరుతానమ్మా!" అంది టొటొచాన్.

"పదపద ఆలస్యమైపోతోంది. హెడ్‌మాస్టర్ గారు మనకోసం ఎదురుచూసేలా చెయ్యొచ్చా? ఇంక కబుర్లాపెయ్యి. ఎక్కడికి పోతున్నామో జాగ్రత్తగా చూసి సరిగ్గా నడువు" అంటుంటే అమ్మ గొంతులో నిరాశ ధ్వనించింది.

వాళ్ళముందర కనుచూపుమేరలో ఒకచిన్న బడిగేటు కనబడడం మొదలయింది.

## కిటికీలో చిన్నారి పాప

అమ్మ విచారానికి కారణం ఉంది. టొటొచాన్ బడికి వెళ్ళడం మొదలయి ఎక్కువ రోజులు కానేలేదు. గాని, అప్పుడే ఒక బడిలోంచి ఆ పాపను పంపించేశారు. ఒకటో తరగతిలో ఉండగానే పంపించేయ్యడం విచిత్రం కదూ !

అది జరిగి ఓ వారం రోజులయింది. టొటొచాన్ వాళ్ళ క్లాస్ టీచర్ అమ్మను బడికి పిలిపించింది. అమ్మ ఆవిడ్ని కలవగానే ఆవిడ సూటిగా విషయం మొదలుపెట్టింది. "మీ అమ్మాయి మొత్తం తరగతినే చెడగొడుతోంది. ఆమెను ఇంకోబడికి తీసుకుపొమ్మని చెప్పక తప్పడంలేదు". "నిజంగా నా ప్రాణాలు కడతేరిపోయాయనుకోండి" అని నిట్టూర్చింది ఆ అందమైన యువటీచర్.

అమ్మ నిజంగా దిగ్భ్రాంతి పడింది. మొత్తం తరగతినే చెడగొట్టేంత పెద్దపని ఏం చేసి ఉంటుంది. టొటొచాన్? అని ఆశ్చర్యంలో పడింది.

ఆ టీచర్‌జుట్టు నౌకర్లజుట్టు లాగ కురచగా కత్తిరించి ఉంది. బెరుకుగా కళ్ళు ఆర్పుతూ, వెంట్రుకల్ని తడుముకుంటూ ఆవిడ వివరించడానికి పూనుకుంది. "మొట్టమొదలు ఏం చేస్తుందంటే, తన బల్లసొరుగును వందలసార్లు తెరుస్తూ మూస్తూ ఉంటుంది. లోపలినుంచి ఏదయినా తీసుకోవలసి ఉంటేనో, లోపల ఏదయినా పెట్టవలసి ఉంటేనో తప్ప బల్లసొరుగు తెరవగూడదని



నేను చెప్పాను. అందుకని మీ అమ్మాయి ఎప్పుడూ ఏదో ఒకటి బైటికి తీస్తూనే ఉంటుంది. ఏదో ఒకటి లోపల పెడుతూనే ఉంటుంది. నోట్‌బుక్, పెన్సిళ్ళడబ్బా, పుస్తకాలు, బల్లసొరుగులో ఉన్న ప్రతిదీ తీస్తూపెడుతూ ఉంటుంది. ఉదాహరణకు, అక్షరమాల రాయడం మొదలు పెడుతున్నామనుకోండి. మీ అమ్మాయి సొరుగు తెరుస్తుంది. నోట్‌బుక్ తీసి బైటపెట్టి, సొరుగుమూత ధఢాలుమని వేస్తుంది. అప్పుడు మళ్ళీ సొరుగు తెరుస్తుంది. తల లోపలికి దూర్చి ఓ పెన్సిల్ బైటికి తీస్తుంది. గబగబా మూత వేసేస్తుంది. 'ఎ' అని అక్షరం రాస్తుంది. అక్షరం సరిగ్గా రాయకపోయినా, ఏదన్నా తప్పుచేసినా సొరుగు మళ్ళీ తెరుస్తుంది. రబ్బర్ బైటికితీసి మూత వేసేస్తుంది. అక్షరం చెరిపేసి, ఆ రబ్బర్ లోపల పెట్టడానికి మళ్ళీ సొరుగు తెరిచి మూసేస్తుంది. ఇదంతా క్షణాల్లో జరిగిపోతుంది. మళ్ళీ 'ఎ' సరిగ్గా రాయగానే, ప్రతివస్తువూ ఒకటొకటిగా సొరుగులో పెట్టేస్తుంది. పెన్సిల్ లోపల పెట్టి మూసేసి మళ్ళీ నోట్‌బుక్ పెట్టడానికి తెరుస్తుంది. తర్వాత మరో అక్షరం రాయాలంటే మళ్ళీ ఈ తతంగమంతా సాగాల్సిందే - మొదలు నోట్‌బుక్, తర్వాత పెన్సిల్, తర్వాత రబ్బర్-ప్రతి ఒక్కదానికి సొరుగుతెరవడమూ మూయడమూ. నా తల తిరిగిపోతుందనుకోండి. ప్రతిసారీ ఏదో ఒక కారణం మీదనే సొరుగు తెరవడమో, మూయడమో చేస్తోంది గనుక నేనేమీ అనమూలేను".

ఆ దృశ్యమంతా ఆమె మనసులో మళ్ళీ కదలాడుతున్నట్టు ఆమె పొడవాటి రెప్పలు అల్లల్లాడాయి.

టొటొచాన్ తన సొరుగును అన్నిసార్లు ఎందుకు తెరుస్తూ మూస్తూ ఉండి ఉంటుందో అమ్మకు హఠాత్తుగా తట్టింది. బడిలోచేరిన మొదటిరోజు ఇంటికి రాగానే టొటొచాన్ ఎంత ఉత్సాహంగా ఉండిందో ఆమెకు గుర్తొచ్చింది. "అమ్మా - బళ్ళో చాల బాగుందే ! మనింట్లో బల్లకు సొరుగులు బయటికి లాగుతాం గదా, బళ్ళోనైతే మూతను పైకి లేపాలన్నమాట. అది ఓ పెట్టెలాగ ఉంది. దాంట్లో అన్నీ పెట్టుకోవచ్చు. అబ్బ ఎంత బావుందో!" అని చెప్పింది.

ఈ కొత్త సొరుగును టొటొచాన్ ఎంత ఆనందంగా తెరుస్తూ మూస్తూ ఉంటుందో ఆ దృశ్యాన్ని ఊహించుకుంది అమ్మ. అదేమంత గడుగ్గాయి వ్యవహారమని అమ్మకనిపించలేదు. ఏదేమైనా, దాంట్లో కొత్తదనం పోగానే టొటొచాన్ ఆ పని మానేస్తుందని అమ్మకు తెలుసు. ఐనా ఆమె "నేను పాపకు చెప్తాను" అని మాత్రమే టీచర్‌తో అంది.

టీచర్ ఇంకా చెప్తూపోతుండగా ఆమె స్వరం పెరిగింది. "అంత మాత్రమే అయితే నేను పట్టించుకునే దాన్ని కాదు".

టీచర్ కాస్తముందుకు వంగేసరికి అమ్మకొంచెం వెనక్కి వొరిగింది. "మీ అమ్మాయి సొరుగును టకటకలాడించకుండా ఉందంటే, పాఠం నడుస్తున్నంత సేపూ నిలబడే ఉంటుంది" అంది.

అమ్మ ఆశ్చర్యపోయింది. "నిలబడి ఉంటుందా? ఎక్కడ?" అని అడిగింది.

"కిటికీ దగ్గర" అని టీచర్ కటువుగా జవాబిచ్చింది.

అమ్మ ఇంకా ఆశ్చర్యం నుంచి తేరుకోలేదు. "కిటికీ దగ్గర ఎందుకు నిలబడుతుంది?" అని మళ్ళీ అడిగింది.

"వీధిలో వెళ్ళేబాజాల వాళ్ళను పిలిచేందుకు" దాదాపు అరుస్తున్నట్టు చెప్పిందా టీచర్.

టీచర్ చెప్పిన కథ సారాంశం ఏమంటే, బల్ల సొరుగుమూతను ఓ గంటసేపు ఎడతెరిపి లేకుండా తీయడం, వేయడం అయిపోయాక టొటొచాన్ ఇక బల్లదగ్గరి నుంచి లేస్తుంది. బైటికి

చూస్తూ కిటికీ దగ్గర నిలబడుతుంది. నిశ్శబ్దంగా అక్కడ ఎంతసేపు నిలబడ్డా ఫర్వాలేదని టీచర్ అనుకోబోతుండగానే, ఆ పాప వీధిలో బాజాలు వాయించుకుంటూ వెళ్ళేవాళ్ళని కేకేస్తుంది. వాళ్ళందరూ రంగురంగుల దుస్తులు వేసుకొని ఉంటారు. ఆ తరగతి గదేమో కింది అంతస్తులో వీధిలోకి కిటికీలతో ఉంది. టొటొచాన్‌కు అదే ఆనందం. టీచర్‌కు కష్టమూ అదే. ఆ గదికీ వీధికీ మధ్య ఉన్నది చిన్న కంచె మాత్రమే కాబట్టి గదిలోంచి ఎవరైనా సులభంగా బైటివాళ్ళను కేకేసేవీలుండేది. అందుకని టొటొచాన్ పిలవగానే ఆ బాజాలవాళ్ళు కిటికీ దగ్గరికి వచ్చేసేవాళ్ళు. అప్పుడిక టొటొచాన్ ఆ విషయాన్ని మొత్తం గదికి ప్రకటిస్తుందట. "వచ్చేశారోచ్" అని టొటొచాన్ కేకేస్తుందని పిల్లలందరూ కిటికీ దగ్గర గుమిగూడి బాజాల వాళ్ళతో మాటలు మొదలెడతారని ఆ టీచర్ చెప్పింది.

"ఏదన్నా వాయించరా" అని టొటొచాన్ అడుగుతుంది. మామూలుగా బడి పక్కనుంచి నిశ్శబ్దంగా వెళ్ళిపోయే ఆ బాజాలవాళ్ళు పిల్లలకోసం బ్రహ్మాండమైన ప్రదర్శన మొదలెడతారు. ఆ సొన్నాయిలూ, తప్పెట్లు, డోళ్ళు, డ్రమ్ములు మోగి పోతుంటే ఆ సందోహం ఆగిపోయే దాకా ఓపికగా వేచిచూడడం తప్ప ఆ టీచర్ చేయగలిగిందేమీలేదు.

చివరికి సంగీత కార్యక్రమం అయిపోయాక బాజాలవాళ్ళు వెళ్ళిపోతారు. పిల్లలు తమ తమచోట్లకి వెనక్కి మళ్ళుతారు. అందరూ వెనక్కి వచ్చేస్తారు గాని టొటొచాన్ మాత్రం రాదు. "ఇంకా కిటికీ దగ్గర ఎందుకున్నావు" అని టీచర్ అడిగితే టొటొచాన్ చాలగంభీరంగా "ఇంకో బాజాలవాళ్ళు వస్తారేమో, అయినా, ఇంకెవరయినా వస్తే, వాళ్ళను మనం చూడకపోతే ఏం బావుంటుందీ?" అని జవాబిస్తుందట.

"ఇదంతా పాఠాలకు ఎంత అడ్డంకో మీకు తెలియడం లేదూ" అని టీచర్ అమ్మను ఉద్వేగపూరితంగా అడిగింది. ఇంకా వణుకుతున్న గొంతుతో ఆ టీచర్ "ఇంకా చెప్పాలంటే..." అని మొదలుపెట్టేసరికి అమ్మకు ఆమెపట్ల సానుభూతి కలగడం మొదలయింది.

"ఇంకా ఏం చేసిందేమిటి?" అని అడిగింది అమ్మ, లోలోతులకి పడిపోతున్న భావంతో.

"ఇంకా ఏమిటా?" అని ఆశ్చర్యపోయి "మీ పాప చేసిన పనులన్నీ నేను కనీసం లెక్కపెట్టగలిగినా, తనను తీసుకెళ్ళిపొమ్మని మిమ్మల్ని అడిగి ఉండేదాన్ని కాదు" అంది టీచర్.

కాసేపటికి టీచర్ కాస్త కుదుటపడింది. అమ్మవైపు సూటిగా చూస్తూ "నిన్న ఎప్పటిలాగానే టొటొచాన్ కిటికీ దగ్గర నిలబడి ఉంది. బాజాల వాళ్ళకోసం చూస్తోంది. లెమ్మనుకుని నేను పాఠం చెపుతూపోయాను. హఠాత్తుగా వీధిలో ఎవరినో కేకేసింది. "ఏం చేస్తున్నావు" అని అడిగింది. నేను నిలబడ్డ చోటినుంచి చూస్తే ఎవరితో మాట్లాడుతుందో కనబడలేదు. ఏం జరుగుతోందా అని నేను ఆశ్చర్యపోయాను. "ఏం చేస్తున్నావూ?" అని మళ్ళీ కేకేసింది. ఆమె రోడ్డుమీద ఉన్న వాళ్ళెవరితోనూ మాట్లాడంలేదు. ఎక్కడో దూరాన ఉన్న వాళ్ళను సంబోధిస్తోంది. నాకు చాలా కుతుహలం కలిగింది. అవతలివాళ్ళు ఏమని జవాబిస్తున్నారో వినడానికి ప్రయత్నించాను. కాని అటువైపు నుంచేమీ వినబడలేదు. అయినా మీ కూతురు "ఏం చేస్తున్నావ్, ఏం చేస్తున్నావ్?" అని కేకలేస్తూనే ఉంది. ఇకనేను పాఠం చెప్పలేక కిటికీ దగ్గరికెళ్ళి పాప ఎవరితో మాట్లాడుతోందోనని చూశాను. నేను కిటికీలోంచి బైటికి తొంగి చూసేసరికి అక్కడ ఓ పిచ్చుకల జంట గోడలోని కంతలో గూడు కట్టుకుంటున్నాయి. మీ పాప పిచ్చుకలతో మాట్లాడుతోందన్నమాట! సరే, పిల్లల్ని నేను అర్థం చేసుకోగలను. పిచ్చుకలతో మాట్లాడడం పిచ్చిపని అని నేననడం లేదు. కాని నేననుకునేదేమిటంటే, తరగతి మధ్యలో లేచి, పిచ్చుకలు ఏం చేస్తున్నాయో కనుక్కోవడం శుద్ధ అనవసరమని"



అందావిడ.

క్షమించమని అడుగుదామని అమ్మ పెదవి విప్పబోయేంతలోనే టీచర్ ఇంకా చెప్పుకుపోయింది. "ఇక బొమ్మలు వేసే తరగతి కథ ఉంది. పిల్లలందరినీ మన జాతీయ జెండా గీయమని నేను చెప్పాను. మీ పాప తప్ప మిగిలిన వాళ్ళందరూ సరిగ్గానే గీశారు. కాని మీ పాప మాత్రం నావికాసైన్యం జెండా ఉంటుంది చూడండి, కిరణాలతో-అది వేయడం మొదలెట్టింది, సరేపోనీలే, తప్పేమీలేదని నేననుకున్నాను. కాని పాప హఠాత్తుగా జెండా చుట్టూ అంచులు గీయడం మొదలెట్టింది. అంచులు! యువజన బృందాల జెండాలకు ఉంటాయి. చూడండి అట్లాంటి అంచులన్నమాట ! బహుశా అటువంటి జెండా ఎక్కడో చూసి ఉంటుంది. ఇంతలోనే, తానేం చేస్తున్నదో నాకు అర్థమయ్యేలోపే కాగితం మీది నుంచి బల్లమీదికి కూడా ఆ పసుప్పచ్చ అంచును సాగదీసింది. కాగితంలో జెండా చాల భాగం ఆక్రమించింది గనుక, ఇంక అంచులకి దాని మీద చోటులేదన్నమాట. పసుప్పచ్చసుద్దముక్కతో జెండా చుట్టూ కాగితాన్ని దాటి బల్లనిండా టకాటకా అంచులు గీసేసింది. అప్పుడిక ఆ కాగితం తీసేసరికి బల్లమీద ఘోరంగా పసుప్పచ్చరంగు ముద్ద నిండిపోయింది. మేం ఎంత రుద్దినా ఆ రంగు పోనేలేదు. అదృష్టవశాత్తూ, ఆ గీతలు బల్లమీద మూడువైపుల మాత్రమే ఉన్నాయి."

ఆశ్చర్యంతో అమ్మ వెంటనే "మూడువైపుల మాత్రమే అంటే?" అని అడిగింది.

చెప్పి చెప్పి విసుగొస్తున్నట్టు కనబడినా టీచర్ వివరించడం మొదలెట్టింది. "ఎడమవైపున ఒక జెండా కఱ్ఱ గీసింది గదా, అందుకని జెండా అంచులు మూడు వైపుల మాత్రమే ఉన్నాయి" అంది.

అమ్మ కొంచెం తేరుకుంది. "అమ్మయ్య. అయితే మూడువైపులనేనన్నమాట!" అంది.



ఇక ఆ టీచర్ మెల్లగా ఒక్కొక్కమాటా వత్తి పలుకుతూ "కాని జెండాకఱ్ఱకూడా కాగితం దాటి వచ్చింది. అది కూడ బల్లమీద ఉంది" అంది.

తర్వాత టీచర్ లేచి నిలబడి పిడచ్కలు మాటల్లాగ కఠినంగా "ఈ ఇబ్బందులు పడుతున్నది నేనొక్కదాన్నే కాదు. పక్కగదిలోని టీచర్‌కు కూడ మీ పాపతో ఇబ్బందులున్నాయి" అంది.

ఈ విషయంలో అమ్మ ఏదో ఒకటి చెయ్యక తప్పదని తేలిపోయింది. మిగతా విద్యార్థులకు ఇది ఇబ్బందికరంగా ఉంది. అమ్మ ఇక ఇంకో బడి వెతకాలి. తన చిన్నారి పాపను అర్థం చేసుకొని, లోకంలో ఎట్లా మెలగాలో ఆ పాపకు నేర్పగల బడిని వెతకాలి.

ఈ వెతుకులాట ఎంతో జరిగిన తర్వాత అమ్మ కనిపెట్టిన బడికే ఇప్పుడు వాళ్ళు వెళ్తున్నారు.

టొటొచాన్‌ను పాత బడిలోంచి పంపేశారని అమ్మ చెప్పలేదు. తానేం తప్పు చేసిందో టొటొచాన్ అర్థం చేసుకోవడం కష్టమని అమ్మ గుర్తించింది. తన పాపకు మనసులో ఏ చికాకు

కలగగూడదని అమ్మకోరిక. అందుకే పాప పెద్దపెరిగే వరకు తనకీ సంగతి చెప్పొద్దని అమ్మ నిర్ణయించుకుంది. అమ్మ టొటొచాన్‌తో అన్నదల్లా ఒకటే మాట. "ఇంకో కొత్త బడికెళ్తావా తల్లీ? ఇంకో మంచి బడి ఉందట!" అని.

కాసేపు ఆలోచించి "సరే" అంది టొటొచాన్ "కాని...." అని మళ్ళీ ఆగిపోయింది.

ఇప్పుడేమంటుంది? కొంపదీసి తనను ఆ బడిలోంచి పంపేశారని కనిపెట్టేసిందా ఏమిటి? అని అమ్మ భయపడింది.

కాని ఒక క్షణం తర్వాత టొటొచాన్ కేరింతలుకొడుతూ "ఈ కొత్త బడికి బాజా భజంత్రీల వాళ్ళు వస్తారంటావా?" అని అడిగింది.

## కొత్తబడి

కొత్తబడి గేటు చూడగానే టొటొచాన్ ఆగిపోయింది. ఇదివరకు వెళ్ళేబడికయితే గేటు దగ్గర రెండువైపులా మంచి కాంక్రీటు స్తంభాలుండేవి. వాటి మీద పెద్ద పెద్ద అక్షరాలతో బడిపేరు రాసిన బోర్డుండేది. కాని ఈ కొత్త బడికేమో గేటుకు రెండువైపులా రెండు చిన్న గుంజలున్నాయి. వాటి మీద ఇంకా రెమ్మలూ, ఆకులూ కూడ ఉన్నాయి.

"అరె-ఈ గేటు పెరుగుతోంది. టెలిఫోన్ స్తంభాలకన్న ఎత్తు పెరిగేదాక అట్లా పెరుగుతూనే ఉంటుంది గదా" అంది టొటొచాన్.

ఆ రెండు 'గేటు గుంజలు' వేళ్ళు కూడ ఉన్న చెట్లకాండాలే, ఆ బడి పేరును చదవడానికి టొటొచాన్ తల ఓ పక్కకు ఒంచి చూడాల్సి వచ్చింది. గాలికి ఆ బోర్డు వంగిపోయి ఉంది.

"టో-మో-గా-కు-యెన్"

"టోమో" అంటే ఏమిటని టొటొచాన్ అమ్మను అడుగుదామని అనుకుంటూ ఉండగానే ఆ పాప దృష్టి మరో వైపు పడింది. తాను కలగనడం లేదు గదా అని ఆ పాప సందేహించింది. గొంతుక్కూచుని, కంచెపొదల మధ్య నుంచి లోపలికి తొంగి చూసింది. లోపలి దృశ్యాన్ని సరిగ్గా చూడడానికి ప్రయత్నించి ఆ పాప తనకళ్ళను తాను నమ్మలేకపోయింది.

"అమ్మా, అమ్మా-అది నిజంగా రైలేనా? చూడక్కడ. బడి ఉండే చోటచూడు!"

ఆ బడిలో తరగతి గదులకోసం, వాడకంలో లేని ఆరు రైలు పెట్టెల్ని ఉపయోగించుకున్నారు. టొటొచాన్‌కయితే అది ఒక గొప్పకలలోని దృశ్యం లాగుంది. రైల్లో బడి!

ఆ ఉషోదయ సూర్యకాంతిలో రైలుపెట్టెల కిటికీల అద్దాలు తళతళ మెరిసిపోయాయి. కాని పొదల మధ్యనుంచి ఆ పెట్టెల్ని చూస్తున్న చిన్నారిపాప గులాబిరంగు చెక్కిళ్ళపైన కళ్ళు ఇంకా ఎక్కువగా తళతళలాడాయి.

## "ఈ బడి నాకు నచ్చింది!"

ఓ క్షణం తర్వాత టొటొచాన్ ఆనందంతో కేరింతలు కొడుతూ ఆ 'రైలుబడి' వేపు పరుగెత్తడం మొదలెట్టింది. పరుగెత్తుతూనే భుజాల మీది నుంచి అమ్మవేపు చూస్తూ "అమ్మా - రా.రా. రైలు ఆగి ఉండగానే ఎక్కేద్దాం" అని కేకలు వేసింది.

దిగ్భ్రాంతితో అమ్మకూడ ఆ పాప వెనుక పరుగెత్తింది. అమ్మ ఒకప్పుడు బాస్కెట్‌బాల్



ఆడుతుండేది. కనుక టొటొచాన్ కన్న వేగంగా పరుగెత్తుకెళ్ళి పాప గౌను పట్టుకుని ఆపేసింది. సరిగ్గా అప్పటికి పాప ఆ రైలు పెట్టె తలుపు దగ్గరికి చేరింది.

పాపను పట్టి ఆపుతూ "నువ్విప్పుడే ఎక్కడానికి వీల్లేదు" అంది అమ్మ. "ఈ పెట్టెలన్నీ తరగతిగదులు. ఇంకా నిన్నిక్కడ చేర్చుకోలేదు గద. నువ్వు నిజంగా ఈ రైల్లోకి ఎ్కదలచుకుంటే నువు మంచి పాపవు కావాలి. హెడ్‌మాస్టర్‌గారితో మర్యాదగా ఉండాలి. ఇప్పుడు మనం ఆయన దగ్గరికి వెళ్తున్నాం. అన్నీ సవ్యంగా జరిగితే, నువు ఈ బడికి రాగలుగుతావు. అర్థమయిందా తల్లీ?"

ఆ క్షణాన్నే 'రైలు'లోకి ఎక్కలేక పోయినందుకు టొటొచాన్ చాల నిరాశ పడింది. కాని అమ్మ చెప్పినట్టుచేస్తే సరిపోతుంది గదా అని అలా చేయడానికి నిర్ణయించుకుంది.

"సరే" అని మళ్ళీ 'ఈ బడి నాకు చాలా బాగుందే అమ్మా" అని కలిపింది.

బడి టొటొచాన్‌కు నచ్చిందా లేదా అన్నది ముఖ్యం కాదని, టొటొచాన్ హెడ్‌మాస్టర్‌కు నచ్చడం ముఖ్యమని చెపుదామని అమ్మకు అనిపించింది. కాని టొటొచాన్ గౌనువదిలేసి, చెయ్యిపట్టుకుని హెడ్‌మాస్టర్ గదివేపు నడవడం మొదలెట్టింది.

రైలు పెట్టెలన్నీ నిశ్శబ్దంగా ఉన్నాయి. ఆనాటి మొదటి తరగతులు అప్పుడే మొదలయ్యాయి. ఆ బడి ఆవరణ అంత పెద్దదేమీ కాదు. దానిచుట్టూ గోడకూడ లేదు. చుట్టూ చెట్లున్నాయి. అక్కడక్కడా ఎర్రపూలు, పసుప్పచ్చ పూలు నిండిన పూల తివాచీలు నేలమీద పరుచుకుని ఉన్నాయి.

హెడ్‌మాస్టర్ గది రైలుపెట్టెలో లేదు. గేటుకు ఎదురుగా ఒంటి అంతస్తు మేడ మీద కుడివైపు ఉన్నదాగది. ఆ మేడకు అర్ధచంద్రకారంలో ఏడు రాతి మెట్లున్నాయి.

టొటొచాన్ అమ్మ చెయ్యి వదిలేసి ఆ మెట్లు గబగబా ఎక్కేసింది. అర్థాంతరంగా వెనక్కితిరిగి అమ్మను ఢీకొట్టింది.

"ఏమయింది?" అనడిగింది అమ్మ, బడి గురించి ఆ పాప మళ్ళీ ఆలోచన మార్చుకుందేమోనని భయపడుతూ.

పై మెట్టుమీద నిలబడి టొటొచాన్ అమ్మచెవిలో గంభీరంగా "మనం కలవబోయే ఆయన స్టేషన్ మాస్టర్ కావచ్చు గదా" అని అడిగింది.

అమ్మకు అనంతమైన ఓపికతో పాటే హాస్యధోరణి కూడ ఉంది. ఆమె పాప ముఖం దగ్గర ముఖం పెట్టి "ఎందుకలా అనుకున్నావు?" అని గుసగుసలాడింది.

టొటొచాన్ మళ్ళీ లోగొంతుతోనే "నువ్వేమో ఆయన హెడ్‌మాస్టరని అన్నావు గదా. కాని ఆయనకు ఇన్నిరైలు పెట్టెలున్నాయంటే ఆయన స్టేషన్ మాస్టర్ అయి ఉండడూ?" అంది.

ఒక బడికోసం పాత రైలుపెట్టెల్ని ఉపయోగించడం అసాధారణమైనదని అమ్మ గుర్తించవలసి వచ్చింది. కాని అప్పుడిక వివరించడానికి సమయం లేదు. అందుకే ఆమె మామూలుగా "ఆయనను నువ్వే అడగొచ్చుగా? అది సరే, మరి నాన్న సంగతేమిటి? ఆయన వయొలిన్ వాయిస్తాడు. ఆయన దగ్గర కొన్ని వయొలిన్లు ఉన్నాయి. కాని అందుకని మనిల్లు వయొలిన్ల దుకాణం అయిపోదుగా ఏం?" అని జవాబిచ్చింది.

"కాదు, కాదు" అని టొటొచాన్ ఒప్పుకుంది. మళ్ళీ అమ్మ చెయ్యి పట్టుకుంది.

## హెడ్‌మాస్టర్

అమ్మ, టొటొచాన్ ఇద్దరూ గదిలోకి వెళ్ళగానే అక్కడ కుర్చీలో కూచున్నాయన లేచి నిలబడ్డాడు.

ఆయనకు నెత్తిమీద వెంట్రుకలు పల్చగా ఉన్నాయి. కొన్ని పళ్ళుకూడ ఊడిపోయి బోసినోటితో ఉన్నాడు. కాని ఆయనముఖంలో మాత్రం ఆరోగ్యం తొణికిసలాడుతోంది. ఆయన ఏమంత పొడగరికాదు. భుజాలు, చేతులు బలంగా ఉన్నాయి. ఓ మాసిపోయిన సూట్‌వేసుకుని ఉన్నా శుభ్రంగా కనబడుతున్నాడు.

గబగబా ఒంగి అభివాదం చేసి, "మీరు.......స్కూలు మాస్టరా? స్టేషన్ మాస్టరా?" అని ఉత్సాహంగా అడిగింది టొటొచాన్.

అమ్మ కాస్త సిగ్గుపడింది. కాని ఆమె వివరించబోయేలోగానే ఆయన నవ్వేసి "నేను ఈ బడికి హెడ్‌మాస్టర్ని" అని జవాబిచ్చాడు.

టొటొచాన్‌లో సంతోషం వెల్లివిరిసింది. "అబ్బ-భలేగా ఉంది. ఎందుకంటే మరేమో, నేను మిమ్మల్ని ఓ సాయం అడుగుదామనుకున్నాను. నేను....మరి.....మీ బడికి వద్దామనుకుంటున్నానుగా" అంది.

హెడ్‌మాస్టర్ పాపను ఓ కుర్చీలో కూచోమని, అమ్మవైపు తిరిగాడు. "మీరిక ఇంటికెళ్ళిపోవచ్చు. నేను టొటొచాన్‌తో మాట్లాడాలి" అన్నాడు.

టొటొచాన్ ఒక్క క్షణం ఇబ్బంది పడింది. కాని ఆయన్ని చూస్తే ఆయనతో ఫర్వాలేదులే అనిపించింది.

"సరే, ఐతే నేను పాపను ఇక్కడే వదిలి వెళ్ళిపోతాను" అని అమ్మ నిశ్చితంగా అని, తలుపు వేసేస్తూ వెళ్ళిపోయింది.

హెడ్‌మాస్టర్ ఓ కుర్చీలాగి టొటొచాన్‌కు ఎదురుగా వేశాడు. ఇద్దరూ దగ్గరిగా కూచున్నాక ఆయన మొదలెట్టాడు. "ఆఁ ఇక చెప్పు. నీ గురించి అన్ని సంగతులూ, ఇంకా నువ్వు ఏం చెప్పదల్చుకుంటే అది చెప్పు" అన్నాడు.

"నా ఇష్టంవచ్చిన సంగతులన్నీనా?" అని టొటొచాన్ ఆశ్చర్యపోయింది. ఆయనేవో ప్రశ్నలడుగుతాడనీ, తాను వాటికి జవాబు చెప్పాలనీ ఆ పాప ఎదురు చూస్తోంది. తన ఇష్టం వచ్చిన సంగతులు మాట్లాడమని ఆయన అడిగేసరికి ఆ పాపకు ఎంత ఆనందం కలిగిందంటే ఇక వెంటనే మాట్లాడటం మొదలుపెట్టింది. అదంతా ఓ పెద్ద గందరగోళం. ఐనాసరే తనకు తోచిన విషయాలన్నీ అక్కడ కుప్పబోసింది. వాళ్ళు ఎక్కివచ్చిన రైలు ఎంతవేగంగా వచ్చిందో చెప్పింది. టికెటు ఉంచుకుంటానని తాను టికెట్ కలెక్టర్‌ను అడిగిన సంగతీ, ఆయన ఒప్పుకోని సంగతీ చెప్పింది. ఆ ఇంకోబళ్లో క్లాస్‌టీచర్ ఎంతబాగుండేదో చెప్పింది. పిచికగూడు సంగతీ చెప్పింది. వాళ్ళ గోధుమరంగు కుక్క పిల్ల రాకీ ఎన్నెన్ని గమ్మత్తులు చేస్తుందో చెప్పింది. కిండర్ గార్టెన్‌లో ఉన్నప్పుడు నోట్లో కత్తెర కటకటలాడించుకుంటుంటే ఎంత మజాగా ఉండేదో చెప్పింది. అట్లా చేస్తుంటే నాలిక తెగిపోతుందని టీచర్ చెప్పినా తాను ఎట్లా కత్తెర వదిలెయ్యలేదో చెప్పింది. ముక్కు చీమిడి కారుతుంటే అమ్మ కోప్పడుతుంది. గనుక తానెప్పుడూ ఎట్లా చీదుకుంటుందో చెప్పింది. నాన్న ఎంత బాగా ఈత కొడతాడో, ఇంకెంతబాగా నీళ్ళలోకి దూకుతాడో చెప్పింది. అట్లాచెపుతూచెపుతూ పోయింది. హెడ్‌మాస్టర్ నవ్వుతూ తలఊపి, "తర్వాత?" అని అడుగుతూ పోయాడు. దానితో టొటొచాన్ సంతోషం ఇనుమడించి కబుర్లు కొనసాగించింది. చిట్టచివరికి ఆ



పాప బుర్రలో సంగతులన్నీ అయిపోయాయి. మౌనంగా, ఇంకేంచెప్పాలా అని ఆలోచిస్తూ కూచుండిపోయింది.

"ఇంకేమీ లేవా చెప్పాల్సినవి?" అనడిగాడు హెడ్‌మాస్టర్.

'అబ్బ ఇప్పుడు ఆపెయ్యడం ఎంత నామోషి' అనుకుంది. టొటొచాన్. 'ఇదే బ్రహ్మాండమైన అవకాశం, ఇంక మాట్లాడడానికేమీలేవా?' మెదడంతా గాలిస్తూ ఆశ్చర్యపోయిందా పాప. అప్పుడొక ఆలోచన తట్టింది.

ఆ రోజు తాను వేసుకున్న బట్టల గురించి ఆయనకు చెప్పొచ్చుగదా. తన బట్టలన్నీ అమ్మే కుడుతుంది. ఇది ఒక్కటి మాత్రం దుకాణం నుంచి వచ్చింది. ప్రతి రోజూ సాయంత్రం బడి నుంచి ఇంటికొచ్చేసరికి టొటొచాన్ బట్టలు చిరిగిపోయి ఉండేవి. కొన్ని చిరుగులు మరీ పెద్దగా, పనికిరాకుండా చేసేలా ఉండేవి. అవి అట్లా ఎందుకు చిరుగుతున్నాయో అమ్మకు అర్థమయ్యేదికాదు. కొన్నిసార్లు పాప తొడుక్కున్న తెల్ల చేనేత చెడ్డీలు కూడా చిరిగిపోయి ఉండేవి. ఆ చెడ్డీలు ఎట్లా చిరిగిపోతుండేవో టొటొచాన్ హెడ్‌మాస్టర్‌కు వివరించింది. వేరే వాళ్ళ తోటల్లోకి వెళ్ళడానికి కంచెల కిందినుంచి పాకేటప్పుడు, ఆ ముళ్ళ తీగ తట్టుకుని అవి చిరిగిపోయాయి. ఇవాళ పొద్దున్న ఇక్కడికి వచ్చేటప్పుడు చూస్తే చిరుగులేని జత ఒకటి కూడ లేదు. అమ్మ కుట్టిన మంచి బట్టలన్నీ చిరుగులు పట్టాయి. అందుకని కొనుక్కొచ్చిన బట్టలు వేసుకోవాల్సి వచ్చింది. అవి జెర్సీ బట్టలు. వాటిమీద ఎరుపు, గోధుమరంగుల్లో చిన్న చిన్న గళ్ళున్నాయి. ఆ బట్టలు బాగానే ఉన్నాయిగానీ, కాలర్ మీద కుట్టిన ఎర్రపూలు బాగాలేవని అమ్మ అంది. "అమ్మకు ఈ కాలర్ నచ్చలేదు" అని హెడ్‌మాస్టర్ చూసేలా కాలర్ ఎత్తి పట్టుకుని చెప్పింది టొటొచాన్.

ఆ తర్వాత ఎంత గింజుకున్నా చెప్పదగిన సంగతులేమీ తట్టలేదు. అటువంటి పరిస్థితి వచ్చినందుకు ఆ పాప కొంచెం విచారపడింది. కాని అప్పుడే హెడ్‌మాస్టర్ లేచి నిలబడి తన వెడల్పయిన వెచ్చని చెయ్యితో ఆ పాప తలమీద నిమిరాడు. "సరే ఇక నుంచి నువ్వీ బడిలో విద్యార్థివి" అన్నాడు.

ఆయన నోట్లోంచి వెలువడ్డ మాటలు అంతే. తన జీవితంలో మొట్టమొదటి కలయికలోనే పూర్తిగా తనకు నచ్చిన మనిషిని కలుసుకున్నానని ఆ క్షణాన టొటొచాన్‌కు అనిపించింది. అప్పటివరకూ, ఆపాప మాటల్ని అంతసేపు విన్నవాళ్ళెవరూ లేరు తెలుసా? పైగా, అంతసేపట్లో ఆయన ఒక్కసారి కూడ ఆవులించలేదు. విసుగు చెందినట్టు కనబడలేదు. తాను చెపుతున్న విషయం పట్ల ఆ పాపకెంత శ్రద్ధఉందో ఆయనకూ అంత శ్రద్ధ ఉన్నట్టు కనబడింది.

టొటొచాన్‌కు అప్పటికి గడియారం చూడడం తెలియదు. కాని తాను ఆయనతో చాలసేపు మాట్లాడానని ఆ పాపకు అనిపించింది. ఆ పాపకప్పుడు గడియారం చూడడమే తెలిసి ఉంటే, ఆశ్చర్యపోయేది. హెడ్‌మాస్టర్ పట్ల ఇంకా ఎక్కువ కృతజ్ఞత కలిగి ఉండేది. ఎందుకంటే, అమ్మ టొటొచాన్ ఆ బడి దగ్గరికి ఉదయం ఎనిమిది గంటలకు వచ్చారు. పాపను బడిలో చేర్చుకుంటున్నానని హెడ్‌మాస్టర్ చెప్పి జేబులోంచి గడియారం తీసిచూసుకుని "ఆహాఁ భోజనం వేళయిందే" అన్నాడు. అంటే ఆయన ఆ పాప చెప్పిన కబుర్లు నిండా నాలుగు గంటలపాటు విన్నాడన్నమాట !

అంతకు ముందుగాని, ఆ తర్వాతగాని టొటొచాన్ మాట్లాడుతుండగా తనకన్న పెద్దవాళ్ళెవరూ అంతసేపు వినలేదు. అంతేగాక, ఆ ఏడేళ్ళ చిన్నారి పాపకు నాలుగు గంటలపాటు ఎడతెగకుండా మాట్లాడడానికి సరిపోయినన్ని విషయాలున్నాయని అమ్మకు, క్లాస్ టీచర్‌కు తెలిస్తే ఎంత ఆశ్చర్యపోయేవాళ్ళో !

తనను ఒక బడినుంచి పంపించేశారని, ఏం చెయ్యాలో తోచక అందరూ తలలు పట్టుకుని ఉన్నారని టొటొచాన్‌కప్పటికి తెలియదు. సహజంగా ఉండే చురుకుదనం, కాస్త ఏమరపాటు తనం కలిసి ఆ పాపకు అమాయకత్వం కలగజేశాయి. కాని లోలోతుల్లో తనను మిగతా పిల్లలనుంచి వేరుగా చూస్తున్నారని, తాను కాస్త వింతగా ఉన్నానని తనకు అనిపిస్తూ ఉండేది. కాని ఆ హెడ్‌మాస్టర్ మాత్రం ఆ పాప సురక్షితంగా, సాదరంగా, సంతోషంగా ఉండేలా చూశాడు. ఆ పాపకు ఆయనతో ఎప్పటికీ ఉండి పోవాలని అనిపించింది.

హెడ్‌మాస్టర్ సొసాకు కొబయాషి గురించి ఆ మొదటి రోజునే టొటొచాన్‌కు కలిగిన భావాలవి. అదృష్టవశాత్తూ హెడ్‌మాస్టర్ కూడ ఆ పాప గురించి అట్లాగే అనుకున్నాడు.

## మధ్యాహ్న భోజనం

పిల్లలందరూ మధ్యాహ్నం భోంచేసేదగ్గరికి టొటొచాన్‌ను హెడ్‌మాస్టర్ తీసుకెళ్ళాడు. "మనం భోంచేసేది రైల్లోకాదు అసెంబ్లీహాల్లో" అని ఆయన చెప్పాడు. టొటొచాన్ అంతకు ముందు ఎక్కివచ్చిన రాతిమెట్లపైన అసెంబ్లీ హాలుంది. వాళ్ళిద్దరూ అక్కడికి వెళ్ళేసరికి పిల్లలందరూ గోలగోలగా బల్లలు, కుర్చీలు లాగుతూ వాటిని ఒక వలయంగా తయారుచేస్తున్నారు. ఓమూల నిలబడి అదంతా చూస్తూ హెడ్‌మాస్టర్ చొక్కాపట్టుకుని లాగి "మిగిలిన పిల్లలేరీ?" అని అడిగింది టొటొచాన్.

"ఉన్న వాళ్ళందరూ వీళ్ళే" అన్నాడాయన.

"వీళ్ళేనా?" టొటొచాన్ నమ్మలేకపోయింది. ఆ ఇంకో బడిలో ఒక్క తరగతిలోనే ఇంతమంది ఉండేవాళ్ళు.

"అంటే మరి, మొత్తం బడిలో ఉన్నది యాభై మందేనా?"

"అంతే" అన్నాడు హెడ్‌మాస్టర్.

అరె, ఇక్కడంతా ఆ బడికన్న తేడాగా ఉందే అనుకుందా పాప.

అందరూ కూచున్న తర్వాత హెడ్‌మాస్టర్ పిల్లల్ని వాళ్ళందరూ కొండలనుంచి కాస్త, సముద్రం నుంచి కాస్త తినడానికి తెచ్చుకున్నారా లేదా అని అడిగాడు.

"తెచ్చుకున్నాం." అని అందరూ ఒకే కంఠంతో జవాబిచ్చారు. తమ భోజనాల డబ్బాలన్నీ విప్పుకున్నారు.

"ఏమేం తెచ్చుకున్నారో చూద్దాం" అంటూ హెడ్‌మాస్టర్ ఆ బల్లల వలయం మధ్య ఒక్కొక్క డబ్బాలోకీ చూడ్డం మొదలెట్టాడు. పిల్లలందరూ ఆనందంతో కేరితలు కొట్టారు.

"అరె, గమ్మత్తుగా ఉందే. 'సముద్రం నుంచి కాస్త, కొండల నుంచి కాస్త' అని ఆయనన్న దానికి అర్థమేమిటి" అని టొటొచాన్ ఆశ్చర్యపోయింది. ఈ బడి పూర్తిగా వేరే రకంగా ఉంది. ఇక్కడంతా సరదాగా ఉంది. బడిలో మధ్యాహ్న భోజనంలో కూడా ఇంతమజా ఉంటుందని టొటొచాన్ ఎప్పుడూ ఊహించలేదు. రేపు తను కూడ ఇట్లాగే ఒక బల్లముందు కూచుని హెడ్‌మాస్టర్ అడగగానే "సముద్రం నుంచి కాస్త, కొండల నుంచి కాస్త" చూపెడతాననుకునే సరికి టొటొచాన్ ఆనందం పట్టలేకపోయింది. ఎగిరిగంతులు వేయాలనుకుంది.

ఆ భోజనాలడబ్బాలు పరీక్షిస్తుంటే హెడ్‌మాస్టర్ భుజాలు మధ్యాహ్న సూర్యకాంతి మృదుత్వంలో స్నానమాడాయి.



## టొటొచాన్‌కు బడి మొదలైంది

"ఇక నుంచి నువ్వీబడిలో విద్యార్థివి" అని హెడ్‌మాస్టర్ అన్న తర్వాత మరుసటి రోజు దాకా గడపడం టొటొచాన్‌కు కష్టమైపోయింది. ఆ పాప ఇంతవరకూ ఏ రోజుకోసమూ ఇంతగా ఎదురు చూడలేదు. ప్రతిరోజూ ఉదయాన్నే తనను నిద్రలేపడం అమ్మకు పెద్దపని. కాని ఆరోజు మాత్రం పాప అందరికంటె ముందే మేల్కొంది. తయారయిపోయి, పుస్తకాల సంచివీపుకు తగిలించుకుని ఎదురు చూడడం మొదలెట్టింది.

ఆ ఇంట్లో అందరికంటె కచ్చితంగా కాలం పాటించేది రాకీ, జర్మన్ జాతి కుక్క. ఆ రోజు టొటొచాన్ అసాధారణంగా ప్రవర్తించడం చూసి ఏదో జరగబోతోందని సందేహించింది. ఒకసారి ఒళ్ళు విరుచుకొని టొటొచాన్ ప్రక్కన చేరింది.

అమ్మకు ఆరోజు పని పెరిగిపోయింది. టొటొచాన్‌కు ఉదయం ఫలహారం పెడుతూనే "సముద్రం నుంచి కాస్త, కొండల నుంచి కాస్త"తో మధ్యాహ్నానికి భోజనం తయారుచేసింది. అట్లాగే టొటొచాన్ రైలుపాసును ఒక ప్లాస్టిక్ సంచీలో పెట్టి దాన్ని ఓ దారంతో మెడలో వేలాడదీసింది.

చెదిరిపోయిన వెంట్రుకలతో ఉన్న నాన్నేమో "మా మంచి తల్లివి గదూ" అన్నాడు.

"ఊఁకాదేం మరి?" అంటు టొటొచాన్ జోళ్ళు తొడుక్కుని బైటికెళ్ళే తలుపు తెరిచింది. వెనక్కి తిరిగి, మర్యాదగా ఒంగి "సరే, వెళ్తానేం మరి" అంది.

టొటొచాన్ బైటికి వెళ్ళిపోతుంటే అమ్మ కళ్ళలో నీళ్ళు నిండుకున్నాయి. ఈ ఆడుతూ పాడుతూ ఉండే చిన్నారి పాపను, బుద్ధిగా సంతోషంగా బడికి వెళ్తున్న పసిపాపను అంతకుముందే ఒక బడి నుంచి పంపించేశారంటే అమ్మకు నమ్మ బుద్ధి కాలేదు. ఈ సారయినా అంతా సవ్యంగా జరిగిపోవాలని ఆమె మనస్ఫూర్తిగా ప్రార్థనలు చేసింది.

ఓ క్షణం తర్వాత చూస్తే టొటొచాన్ పాస్ తన మెడలోంచి తీసి రాకీ మెడలో వేయడం కనబడింది. అమ్మ కొంచెం ఆందోళన పడిందిగాని ఏమీ అనకుండా ఏం జరుగుతుందో చూద్దామని ఊరుకుంది.

టొటొచాన్ రాకీ మెడలో ఆ పాస్ గొలుసువేసి, రాకీముందు గొంతుక్కూచుని "చూశావా? నీ మెడకిది బాలేదుగా" అంది.

ఆ తాడు మరీ పొడుగైపోయి, కుక్కపిల్ల మెడలోంచి పాస్ నేలమీద జీరాడింది.

"తెలిసిందా? ఇది నా పాస్. నీదికాదు. అంటే నిన్నురైలు ఎక్కనివ్వరన్న మాట. అయినా ఫర్లేదులే, నేనూ మా హెడ్‌మాస్టర్‌ను అడుగుతాను. స్టేషన్‌లో ఆయనను కూడ అడుగుతాను. వాళ్ళు నిన్ను కూడ బడికి రానిస్తారేమో చూస్తాను ఏం!" అని నచ్చజెప్పింది టొటొచాన్.

రాకీ చెవులు నిక్కబెట్టి మొదలు శ్రద్ధగానే వింది. కాని కాసేపటికే పాస్‌ను ఒకటి రెండుసార్లు చప్పరించి ఆవులించింది. టొటొచాన్ ఇంకా చెపుతూనే పోయింది. "ఆ రైలుపెట్టె కదలనే కదలదు తెలుసా. కనుక అది ఎక్కడానికి నీకు టికెట్ అక్కర్లేదేమో. కాని ఇవాళ మాత్రం నువు ఇంట్లోనే ఉండాలి. ఉంటావా? నేనొచ్చేదాక చూడు. ఏం!" అని బతిమిలాడింది.

ఆ ఇంకో బడికి వెళ్ళేటప్పుడు రాకీ టొటొచాన్ వెంట ఆ బడి గేటుదాకా వెళ్ళేది. అక్కడ్నుంచి ఇంటికి తిరిగివచ్చేది. ఇవాళ కూడ అట్లాగే వెళ్దామని అది అనుకుంటోంది.

టొటొచాన్ రాకీ మెడలోంచి పాస్ గొలుసు తీసి జాగ్రత్తగా తన మెడలో వేసుకుంది. మళ్ళీ ఓసారి అమ్మవైపు, నాన్న వైపు చూసి "నేనెళ్తున్నా" అని కేకేసింది.

ఇంక మళ్ళీ వెనక్కి చూడకుండా పరుగందుకుంది. అలా తను పరుగెత్తుతుంటే వీపు మీద సంచీ చిత్రంగా ఎగిరిపడింది. రాకీ కూడ సంతోషంగా పాపవెంట పరుగందుకుంది.

పాతబడికి దారి, స్టేషన్ దారి ఒకటే. కనుక దారిలో టొటొచాన్‌కు పరిచయమున్న కుక్కలు, పిల్లులు ఎదురుపడ్డాయి. పాత తరగతిలోని తోటిపిల్లలు ఎదురుపడ్డారు.

వాళ్ళందరికీ ఈ పాస్ చూపెడితే మెచ్చుకుంటారేమో అని టొటొచాన్ ఆలోచించింది. కాని ఆలస్యమయిపోతుందేమోనని అనుకుంది. అందుకని ఆ రోజటికి వద్దులే అనుకుని మళ్ళీ ముందుకే వేగంగా సాగింది.

స్టేషన్‌కు వెళ్ళేచోట రోజూలాగ ఎడమవైపుకు కాక కుడివైపుకు టొటొచాన్ తిరగగానే రాకీ ఆగిపోయి, ఆందోళనతో చుట్టూ పరికించి చూసింది. టొటొచాన్ అప్పటికే గేటు దగ్గరికి చేరింది. కాని మళ్ళీ వెనక్కి తిరిగివచ్చి అయోమయంగా నిలబడ్డ రాకీతో "నేనింక పాతబడికి వెళ్ళట్లేదు. ఇప్పట్నుంచి కొత్తబడికి వెళ్తున్నానుగా" అంది.

టొటొచాన్ తన ముఖాన్ని రాకీ ముఖం దగ్గర చేర్చింది. రాకీ చెవులు ఎప్పట్లాగే వాసన వేస్తున్నాయి. టొటొచాన్‌కు చాల ఇష్టమయిన వాసనది.

"సరే వెళ్తానేం" అని, అక్కడున్న వ్యక్తికి తన పాస్ చూపింది. ఏటవాలుగా ఉన్న స్టేషన్‌మెట్లు ఎక్కడం మొదలుపెట్టింది. రాకీ మెత్తగా మూల్గి, టొటొచాన్ కనబడకుండా వెళ్ళే వరకూ చూస్తూ నిలబడింది.

## రైల్లో తరగతి గది

హెడ్‌మాస్టర్ తన తరగతిగది అని చెప్పిన రైలుపెట్టె దగ్గరికి టొటొచాన్ వెళ్ళేసరికి ఇంకా ఎవరూ రాలేదు. అది పాతరకం రైలుపెట్టె. దానికి తలుపుకి బైటి వైపు గొళ్ళెం ఉంది. ఆ గొళ్ళెన్ని రెండు చేతులా పట్టుకుని తలుపుని కుడి వైపుకి జరపవచ్చు. టొటొచాన్ గుండె వేగంగా కొట్టుకుంటుండగా లోపలికి తొంగి చూసింది.

"అబ్బ - ఓహ్"

ఇక్కడ చదువుకోవడమంటే ఎప్పుడూ ప్రయాణంలో ఉన్నట్టే. కిటికీలపైన ఇంకా సామాన్లు పెట్టుకునే బల్లలున్నాయి. తేడా అల్లా ఈ పెట్టెలో ఒకవైపు చివర బ్లాక్‌బోర్డ్ ఉంది. పొడుగ్గా ఉండిన సీట్లన్నిటినీ తీసేసి అన్నీ ఒకవైపే ఉంటేటట్టు కుర్చీలు, బల్లలువేసి ఉన్నాయి. నిలబడ్డప్పుడు పట్టుకునే తాళ్ళు కూడ తీసేసి ఉన్నాయి. కాని మిగిలిన పెట్టె అంతా ఎట్లా ఉండి ఉంటుందో అట్లాగే ఉంచారు. టొటొచాన్ లోపలికెళ్ళి ఏదో ఒక బల్లదగ్గర కూచుంది. ఆ చెక్క కుర్చీలు పాత బడిలో కుర్చీల్లాగనే ఉన్నాయి. కాని ఇవి రోజంతా హాయిగా కూచునేంత సుఖంగా ఉన్నాయి. టొటొచాన్ ముచ్చటపడింది. బడి తనకెంతగానో నచ్చింది. ప్రతిరోజూ కచ్చితంగా బడికి రావాలని, ఎగ్గొట్టొద్దని అప్పుడే గట్టిగా నిశ్చయించుకుంది.

టొటొచాన్ కిటికీలోంచి బైటికి చూసింది. ఆ రైలుపెట్టె కదలదని తనకు తెలుసు. కాని బడి ఆవరణలో పూలూ, మొక్కలూ గాలికి అటూ ఇటూ ఊగుతున్నాయి. గనుకనోఏమో, ఆపెట్టె కదిలినట్టనిపిస్తోంది.

"నాకెంత సంబరంగా ఉందో!" అని ఆ పాప చిట్టచివరికి పైకే పెద్దగా అనేసింది. కిటికీకి మొఖాన్ని అనించి బైటికి చూస్తూ ఓ పాట కట్టింది. తనకు సంతోషం కలిగినప్పుడల్లా చేసే పని అదే.



"నాకెంతో సంబరం"
సంబరం సంబరం
ఎందుకింత సంబరం
ఎందుకంటె....."

ఆ క్షణాన్నే ఎవరో లోపలికొచ్చారు. లోపలికొచ్చింది ఒక పాప. ఆ పాప తన సంచీలోంచి ఓ నోటుబుక్, ఓ పెన్సిళ్ళ డబ్బా తీసి బల్లమీద పెట్టింది. బొటనవేళ్ళ మీద నిక్కి సంచీని సామాన్ల అటకపైన పెట్టేసింది. ఆ పాప తన జోళ్ళసంచీని కూడ అక్కడే పెట్టేసింది. టొటొచాన్ పాడడం ఆపేసి, తనుకూడ అట్లాగే చేసింది. అప్పుడు ఒకబ్బాయి లోపలికొచ్చాడు. ఆ అబ్బాయి తలుపులో నిలబడి అక్కడ్నుంచే బాస్కెట్ బాల్ విసురుతున్నట్లు గురిచూసి పుస్తకాల సంచీని అటకమీదికీ విసిరేశాడు. అది అక్కడ తాకి తిరగబడి కిందపడిపోయింది. "గురి కుదర్లా" అంటూ ఆ అబ్బాయి మళ్ళీ సంచి తీసుకుని అట్లాగే విసిరాడు. ఈసారి అది అక్కడ సరిగ్గానే పడింది. "ఆహః కుదిరింది" అంటూ కేకేసి, ఆ వెంటనే "అయ్యయ్యో పోయిందే" అన్నాడు. బల్లమీది కెగిరి, సంచీ తెరిచి తన నోట్‌బుక్, పెన్సిళ్ళడబ్బా బైటికి తీశాడు. ఈ పని ముందే చెయ్యలేదు గనుక గురి తప్పిపోయిందన్నట్టున్నాడు.

చిట్టచివరికి ఆ పెట్టెలో మొత్తం తొమ్మిదిమంది చేరారు. వాళ్ళందరూ టోమోగాకుయెన్‌లో ఒకటోతరగతి విద్యార్థులు.

వాళ్ళందరూ ఒకే రైల్లో ప్రయాణిస్తుంటారు.

## టోమోలో పాఠాలు

రైలుబడికి వెళ్ళడంలోనే కొత్తదనం ఉన్నదనుకుంటే అక్కడ కూచునే పద్ధతి ఇంకా చిత్రంగా కనబడింది. ఇంకో బడిలో ఒక్కొక్క విద్యార్థికి కచ్చితంగా ఒక్కొక్క కుర్చీ, బల్ల ఉండేవి. కాని ఇక్కడ ఎప్పుడు ఎవరి కెక్కడ ఇష్టమయితే అక్కడే కూచోవచ్చు.

టొటొచాన్ చాలసేపు ఆలోచించి, చుట్టూ తేరిపారజూసి పొద్దున్నే తన తరువాత పెట్టెలోకి వచ్చిన అమ్మాయి పక్కన కూచోవడానికి నిర్ణయించుకుంది. ఆ అమ్మాయి బట్టలపైన ఓ పొడుగు చెవుల కుందేలు బొమ్మ ఉంది.

ఈ బడిలో అన్నిటికంటే చిత్రమైనవి ఇక్కడి పాఠాలే.

అన్ని బళ్ళలోనూ సాధారణంగా ఒక్కో పీరియడ్‌కు ఒక్కో విషయం అనే పద్ధతి ఉంటుంది. ఉదాహరణకు మొదటి పీరియడ్ జపనీస్ అంటే జపనీస్ మాత్రమే చదవాలి. రెండో పీరియడ్ లెక్కలు అంటే లెక్కలే చేయాలి. కాని ఈ బళ్ళో అంతా వేరేగా ఉంది. మొదటి పీరియడ్ మొదట్లోనే టీచర్ ఆ రోజు మొత్తం చదవాల్సిన విషయాలు, జవాబు చెప్పాల్సిన ప్రశ్నలు ఏమిటో చెపుతుంది. అప్పుడామె "ఊః ఇక వీట్లో మీ ఇష్టం వచ్చిన దానితో మొదలెట్టండి" అంటుంది.

అంటే మీరు జపనీస్‌తో మొదలెట్టినా, లెక్కలతో మొదలెట్టినా, మరింకో విషయం మొదలెట్టినా ఫర్వాలేదు. చూచిరాతంటే ఇష్టం ఉన్నవాళ్ళు అదే మొదలు పెడతారు. అప్పుడే భౌతిక శాస్త్రమంటే ఇష్టం ఉన్నవాళ్ళు మీ వెనుకనే సారాయిదీపం మీద కుప్పెలో ఏదో మరగబెడుతుంటారు. కనుక ఏ తరగతిగదిలోనైనా చిన్నపాటి పేలుడు జరిగే అవకాశమూ ఉంది.

ఈ పద్ధతివల్ల పిల్లలు ఎదుగుతూ పోతూ ఉంటే వాళ్ళకు ఏ విషయంమీద ఎక్కువ ఆసక్తి ఉందో, వాళ్ళ ఆలోచనా ధోరణి ఏమిటో, వాళ్ళ స్వభావం ఎటువంటిదో కనిపెట్టడానికి

టీచర్లకు మంచి వీలుండేది. తమ విద్యార్థుల గురించి ఆ టీచర్లు తెలుసుకోవడానికి ఇది మంచి మార్గం.

ఇక పిల్లల విషయానికొస్తే, తమ కిష్టమైనదానితో మొదలుపెట్టడం వాళ్ళకు పండగగా ఉండేది. వాళ్ళకు ఇష్టంలేని విషయాలు చదవడానికి రోజంతా ఉండడంతో ఏదో ఒకరకంగా అవి పూర్తి చేసేవాళ్ళు. కనుక అక్కడ చదువు చాల వరకు స్వతంత్రంగా ఉండేది. ఎప్పుడవసరమయితే అప్పుడు పిల్లలు వెళ్ళి టీచర్లను కలవడానికి సందేహాలు తీర్చుకోవడానికి వీలుండేది. వాళ్ళడిగితే టీచరే వాళ్ళ దగ్గరికి వచ్చి వాళ్ళకు సమస్య అర్థమయ్యే వరకూ వివరించేది. ఆ తర్వాత పిల్లలు స్వయంగా సాధించవలసిన సమస్యలు ఇచ్చేవాళ్ళు. అక్కడ చదువు నిజమైన అర్థంలో సాగేది. అంటే టీచర్ ఏదో చెపుతూ, వివరిస్తూ పోతుండగా నిరాసక్తంగా కూచునే పిల్లలు అక్కడ ఉండేవారు కారు.

అయితే మొదటి తరగతి పిల్లలు ఇంకా స్వతంత్రంగా చదువుకునే స్థాయికి రాలేదు గాని, వాళ్ళకు కూడ వాళ్ళ ఇష్టం వచ్చిన విషయంతో మొదలుపెట్టే వీలుండేది.

కొందరు అక్షరాలు దిద్దేవారు, కొందరు బొమ్మలు దించేవారు, కొందరు పుస్తకాలు చదివేవారు, కొందరు వ్యాయామం కూడా చేసేవారు. టొటొచాన్ పక్కనున్న అమ్మాయికి అప్పటికే అక్షరాలన్నీ వచ్చు. ఆ పాప తన నోట్‌బుక్‌లో అవి రాసుకోవడం మొదలెట్టింది. ఇదంతా కొత్తగా కనబడి టొటొచాన్ కొంచెం గాభరాపడింది. ఏం చేయాలా అని సంకోచించింది.

అప్పుడే టొటొచాన్ వెనుక కూచున్న అబ్బాయి లేచి నోట్‌బుక్ పట్టుకొని బ్లాక్‌బోర్డు వైపు నడిచాడు. టీచర్‌ను ఏదో అడగడానికి వెళ్ళినట్టున్నాడు. ఆమె బ్లాక్ బోర్డు పక్కన ఒక బల్లముందు కూచుని మరో విద్యార్థికి ఏదో వివరిస్తోంది. టొటొచాన్ ఇంక చుట్టూ చూడడం ఆపేసి గడ్డంకిందినుంచి రెండు చేతులలో ముఖం ఆనించుకుని టీచర్ దగ్గరికి వెళ్తున్న అబ్బాయి వీపువైపు చూడడం మొదలెట్టింది. ఆ అబ్బాయి కాలు ఈడుస్తూ నడిచాడు. మొత్తం శరీరం భయంగొలిపేటట్టు ఊగిపోతూకదిలింది. ఆ అబ్బాయి కావాలనే అట్లా చేస్తున్నా డేమోనని టొటొచాన్ ముందు అనుకుంది. కాని ఆ అబ్బాయి అంతకంటె మరోరకంగా నడవలేడని వెంటనే గుర్తించింది.

ఆ అబ్బాయి తన బల్లదగ్గరికి తిరిగి వస్తుండగా టొటొచాన్ మళ్ళీ శ్రద్ధగా చూస్తూనే ఉంది. అప్పుడు ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి. ఆ అబ్బాయి నవ్వాడు. టొటొచాన్ వెంటనే నవ్వుతూ జవాబిచ్చింది. ఆ అబ్బాయి వెళ్ళి టొటొచాన్ వెనుక బల్లముందు కూచున్నాడు. తనకు కూచోవడానికి మిగిలిన పిల్లలకంటె ఎక్కువసేపు పట్టింది. అప్పుడు టొటొచాన్ వెనక్కి తిరిగి "అట్లా ఎందుకు నడుస్తున్నావ్?" అని అడిగింది.

ఆ అబ్బాయి చాలా నెమ్మదిగా, మృదువైన స్వరంతో "నాకు పోలియో" అన్నాడు. ఆ గొంతులో తెలివి కనబడింది.

ఆ మాట అంతకుముందెప్పుడూ వినిఉండని టొటొచాన్ "పోలియోనా?" అని మళ్ళీ అడిగింది.

"ఔను, పోలియో. ఒక్క కాలుకే కాదు, చేతికికూడ" అని గుసగుసలాడి చెయ్యి చూపెట్టాడు. టొటొచాన్ ఆ అబ్బాయి ఎడమచెయ్యి చూసింది. ఆ పొడవాటి వేళ్ళు వంగిపోయి ముడుచుకుపోయినట్టున్నాయి.

"దాన్ని బాగుచెయ్యడం కుదరదా?" అని ఆందోళనగా అడిగింది టొటొచాన్. ఆ అబ్బాయి జవాబివ్వలేదు. అడక్కపోతే బాగుండేదేమోనని టొటొచాన్ సిగ్గుపడింది. కాని ఇంతలోనే



ఆ అబ్బాయి ముఖం వెలిగిపోతుండగా, "నా పేరు యాసువాకి యామామోటో. నీ పేరేంటి?" అని అడిగాడు.

ఆ అబ్బాయి గొంతులో ధ్వనించిన ఆనందం విని మురిసిపోయిన టొటొచాన్ పెద్దగా "నా పేరు టొటొచాన్" అని చెప్పింది.

అట్లా యాసువాకి యామామోటో, టొటొచాన్ స్నేహితులయ్యారు.

సూర్యుడు పైకొచ్చిన కొద్దీ రైలు పెట్టెలో వేడి పెరిగిపోయింది. ఎవరో ఒక కిటికీ తెరిచారు. వసంతకాలపు తాజాగాలి లోపలికి రయ్యిమని వీచింది. అది నిర్లక్ష్యంగా పిల్లలవెంట్రుకల్ని చెరిపేసింది.

టొమోలో టొటొచాన్ మొదటిరోజు ఈ రకంగా మొదలయింది.

## సముద్రపు తిండి, భూమి మీది తిండి

ఇక "సముద్రం నుంచి కాస్త, కొండల నుంచి కాస్త" బైటికి తీసే వేళయింది. టొటొచాన్ ఈ మధ్యాహ్న భోజనం కోసం ఎంతో ఆసక్తితో ఎదురుచూస్తోంది.

సరైన పాళ్ళలో ఆహారం ఉండాలని చెప్పడం కోసం హెడ్‌మాస్టర్ ఈ మాట కనిపెట్టాడు. అన్నంతో పాటు ఈ ఆహారం తెచ్చుకోవడం మంచిదని హెడ్‌మాస్టర్ అనుకునే వాడు. "మీ పిల్లలు అన్నిరకాల ఆహారం తినేలా శిక్షణ ఇవ్వండి," "మీ పిల్లలు మధ్యాహ్న భోజనంగా సరైన పాళ్ళలో పోషకాహారాన్ని తెచ్చుకునేలా చూడండి" లాంటి మామూలు సూచనల బదులు ఈ హెడ్‌మాస్టర్ పిల్లల మధ్యాహ్న భోజనం డబ్బాల్లో సముద్రం నుంచి కాస్త, కొండల నుంచి కాస్త పెట్టమని తల్లిదండ్రులను కోరాడు.

"సముద్రం నుంచి కాస్త" అంటే సముద్రం నుంచి దొరికే ఆహార పదార్థాలు. చేపలు, సోయా పులుసులోనో, తియ్యని బియ్యం సారాయిలోనో ఉడికించిన చిన్న పీతలు వగైరాలను హెడ్‌మాస్టర్ ఇలా పిలిచేవాడు. "కొండల నుంచి కాస్త" అంటే భూమి మీద దొరికే ఆహార పదార్థాలు. కూరగాయలు, కోడి, పంది, ఎద్దుమాంసం దీనికిందికి వచ్చేవన్నమాట.

అమ్మ ఈ సంగతి విని చాల ముచ్చట పడింది. ఇంత ముఖ్యమైన విషయాన్ని ఇంత మామూలుగా చెప్పగల శక్తి చాల తక్కువ మంది హెడ్‌మాస్టర్లకుంటుందని అమ్మ అనుకుంది. మొత్తం మీద రెండు రకాల ఆహారాల నుంచే ఎంచుకోవలసి ఉండడంవల్ల మధ్యాహ్న భోజనం తయారు చేయడం చాల సులభమైన పని అయింది. అంతేగాక ఇవి రెండూ ఉండాలని చూసేందుకు ఎవరూ కష్టపడనవసరం లేదని, ఆడంబరంగా ఉండనవసరం లేదని హెడ్‌మాస్టర్ చెప్పాడు. భూమి మీది ఆహారం అంటే మసాలా కాయగూర గాని, కోడిగుడ్డు అట్టుగాని అయినా పర్వలేదని, సముద్రపు ఆహారం అంటే ఎండబెట్టిన బొనిటోముక్కలు అయినా చాలని ఆయన చెప్పాడు. లేదా ఇంకా సాదాగా ఉండాలంటే నోరి, ఊరబెట్టిన అల్చకారా 'కొండల'కు పనికివస్తుంది. (నోరి అంటే మామూలుగా లభించే శాకం).........హెడ్‌మాస్టర్ వచ్చి వాటన్నింటినీ చూశాడు.

ఆయన ప్రతి ఒక్కరి డబ్బా పరీక్షిస్తూ "నీకు సముద్రం నుంచి కాస్త, కొండల నుంచి కాస్త ఉందా?" అని అడుగుతూ వెళ్ళాడు. ఒక్కొక్కరూ సముద్రం నుంచి, కొండల నుంచి ఏమేం తెచ్చుకున్నారో తెలుసుకోవడం ఎంతో ఉత్సాహంగా ఉండేది.

కొన్నిసార్లు వాళ్ళ తల్లులు తీరిక లేకుండా ఉంటే కొందరు పిల్లలు ఏదో ఒక దాన్నే, సముద్రపు ఆహారాన్నో, కొండల ఆహారాన్నో మాత్రమే తెచ్చుకునేవారు. ఐనా ఏమీ ఇబ్బంది ఉండేది కాదు. హెడ్‌మాస్టర్ పరీక్షిస్తూ వెళ్తూ ఉండగా ఆయన వెనుక ఆయన భార్య వంట



మనిషిలాగ పై గుడ్డవేసుకుని రెండు చేతుల్లో రెండు పాత్రలు పట్టుకొని నడుస్తుండేది. హెడ్‌మాస్టర్ ఏ విద్యార్థి ముందయినా ఆగి "సముద్రం" అనగానే ఆవిడ "సముద్రం" పాత్రలోంచి రెండు మూడు వేయించిన చేపముక్కలు ఆ విద్యార్థి డబ్బాలో వేసేది. లేదా, ఆయన "కొండలు" అనగానే "కొండలు" పాత్రలోంచి సోయానూనెలో ఉడికించిన బంగాళాదుంపల కూర అక్కడ పడేది.

"నాకు చేపముక్కలు సయించవు" అని ఎవరూ అనేవాళ్ళు కారు. ఫలానా విద్యార్థి ఎంత మంచి తిండి తెచ్చుకున్నాడో, మరొక విద్యార్థి ఎంత ఘోరమైన తిండి తెచ్చుకుంటాడో కూడ ఆలోచించే వాళ్ళుకారు. వాళ్ళు జాగ్రత్తపడేదల్లా రెండురకాల ఆహారమూ-సముద్రం నుంచీ కొండల నుంచీ కూడ-తెచ్చుకుంటున్నామా లేదా అనేదే. అలా తెచ్చుకోగలిగితే వాళ్ళకు కొండెక్కినంత ఆనందం కలిగేది. అందరూ మంచి ఉత్సాహంగా ఉండేవాళ్ళు.

"సముద్రం నుంచి కాస్త, కొండలనుంచి కాస్త" అంటే ఏమిటో అర్థం చేసుకోవడం మొదలుపెట్టిన టొటొచాన్ ఆరోజు అమ్మ అంత తొందరగా తయారు చేసిన భోజనంలో ఇవి రెండూ ఉన్నాయా అని అనుమానించింది. కాని డబ్బా విప్పిచూసే సరికి ఆ పాప లోపల అద్భుతమైన తిండి ఉండడం గమనించింది. "అబ్బ - ఎంత బాగుంది. మజామజా" అని కేకలు పెట్టకుండా ఉండడానికి టొటొచాన్ చాల ప్రయత్నించాల్సి వచ్చింది.

టొటొచాన్ డబ్బాలో లేత పసుపురంగులో కోడిగుడ్ల కూర కనబడింది. పచ్చి బఠానీల కూర, మట్టిరంగులో ఉన్న డెన్‌బు, గులాబి రంగులో గండుమీను గుడ్లు. అదంతా ఒక పూలతోటలాగ రంగులు రంగులుగా ఉంది.

"ఎంత బావుందీ" అన్నాడు హెడ్‌మాస్టర్.

టొటొచాన్‌కు సంతోషం కలిగింది. "మా అమ్మ చాలబాగా వండుతుంది" అని జవాబిచ్చింది.

"ఔనా, అట్లాగా?" అని అంటూ డెన్‌బు వైపు చూపెడుతూ "సరే, ఇదేమిటి? ఇది సముద్రం నుంచి వచ్చిందా, కొండల నుంచొచ్చిందా? చెప్పు చూద్దాం" అని అడిగాడు.

టొటొచాన్ దానివైపు చూసింది. ఏ జవాబు సరైనదా అని ఆలోచించింది. అది మట్టిరంగులో ఉంది గనుక కొండలనుంచి వచ్చిందే అయి ఉండాలి కాని కచ్చితంగా ఔనో కాదో తెలియదు.

"నాకు తెలీదు" అనేసింది.

అప్పుడు హెడ్‌మాస్టర్ పిల్లలందరి వైపూ తిరిగి "డెన్‌బు ఎక్కడ్నించొస్తుంది? సముద్రంలోంచా కొండలలోంచా?" అని అడిగాడు.

కాసేపు ఆలోచించి కొందరు పిల్లలు "కొండల్లోంచి" అని కేకలు వేయగా, మరి కొందరు "సముద్రంలోంచి" అని కేకలు వేశారు. కాని చూడగా ఎవరికీ స్పష్టంగా తెలిసినట్టులేదు.

"సరే, నేనే చెప్తాను" అంటూ "డెన్‌బు సముద్రంలోంచి వస్తుంది" అన్నాడు హెడ్‌మాస్టర్.

"ఎందుకు?" అని అడిగాడు బొద్దుగా ఉన్న ఒక అబ్బాయి.



ఆ బల్లల వలయంలో మధ్యలో నిలబడి హెడ్‌మాస్టర్ వివరించడం మొదలుపెట్టాడు. "చేపల పులుసు వండాక వాటి ముళ్ళు మినహా మిగిలిన మాంసాన్నంతా గీకి దాన్ని కాసేపు వేపుతారు. ఆ వేపుడును చిన్న చిన్న ముక్కలుగా కోసి ఎండబెట్టి వాసన పట్టిస్తారు. డెన్‌బు అట్లా తయారవుతుంది." అన్నాడు.

"అట్లాగా" అన్నారు పిల్లలు, చాల నచ్చిందీ విషయం వాళ్ళకు, అప్పుడు ఎవరో ఒకరు తాము టొటొచాన్ డెన్‌బును చూడొచ్చా అని అడిగారు.

"తప్పకుండా" అన్నాడు హెడ్‌మాస్టర్. ఇక మొత్తం బడి టొటొచాన్ డెన్‌బును చూడడానికి తరలి వచ్చింది. డెన్‌బు అంటే ఏమిటో తెలిసిన వాళ్ళు కచ్చితంగా అక్కడ ఉండే ఉంటారు. కాని అక్కడ కుతూహలం రేకెత్తిన పిల్లలూ, తమ తమ ఇళ్ళలో తయారయ్యే డెన్‌బు కంటె టొటొచాన్ డెన్‌బు వేరే రకంగా ఉంటుందేమో చూద్దామని వచ్చిన పిల్లలంతా చుట్టూ మూగారు. టొటొచాన్ డెన్‌బును అంతమంది పిల్లలు వాసన చూద్దామని ఎగబీల్చారంటే దాంట్లోంచి పిసర్లు ఎగిరిపోతాయేమోనని టొటొచాన్ భయపడింది.

ఆ మొదటిరోజు మధ్యాహ్నం భోజనాల దగ్గర టొటొచాన్ కొంచెం బెరుకును అనుభవించింది గాని అందులోనే సరదా కూడ ఉంది. సముద్ర ఆహారం ఏమిటి, భూమి మీది ఆహారం ఏమిటి అని ఆలోచించడం చాల ఉత్సాహంగా ఉండేది. డెన్‌బును చేపలనుంచి తయారు చేస్తారనికూడ టొటొచాన్‌కు అప్పుడే తెలిసింది. అమ్మయ్య, అమ్మ కూడ సముద్రం నుంచ కాస్త, కొండల నుంచి కాస్త పెట్టాలని జాగ్రత్త తీసుకుందన్నమాట. అంటే మొత్తం మీద అంతా సరిపోయింది అని టొటొచాన్ సంతృప్తిపడింది.

టొటొచాన్‌కు ఆ తర్వాత విషయం మరింత సంతోషం కలిగించింది. అమ్మ తయారు చేసిన ఆ తిండి తినడం మొదలుపెట్టే సరికి అది చాల రుచికరంగా ఉందని టొటొచాన్ గుర్తించింది.

### "బాగా నమలండి!"

మామూలుగా ఎవరైనా భోజనం మొదలెట్టేటప్పుడు "ఇటాడాకిమాసు" (కృతజ్ఞతాపూర్వకంగా నేనిది తీసుకుంటున్నాను) అంటారు. కాని టోమో గాకుయెన్‌లో పద్ధతి వేరేగా ఉండేది. మొట్టమొదట అందరూ ఓ పాట పాడేవాళ్ళు. హెడ్‌మాస్టర్ సంగీతకారుడు కూడ. ఆయన ప్రత్యేకంగా "మధ్యాహ్న భోజనానికి ముందు పాడేపాట" అని ఒకటి తయారు చేశాడు. నిజానికి ఆయన "రో, రో, రో యువర్‌బోట్" అనే అందరికీ తెలిసిన పాట బాణీలోనే కొత్తపదాలు కూర్చాడు. ఆయన తయారు చేసిన పాట ఎట్లా ఉండేదంటే

నములు, నములు, నములు, బాగా<br>
తిన్నదంతా నములు<br>
నములు నములు నములు<br>
అన్నం నములు చేపలు నములు<br>
మాంసం నములు నములు నములు !

ఈ పాట పాడింతర్వాతనే పిల్లలందరూ "ఇటాడాకి మాసు" అనేవాళ్ళు.

ఈ పాటలో పదాలు రో, రో, రో యువర్‌బోట్ బాణీలో ఎంతచక్కగా అమిరాయంటే అక్కడ చదివిన విద్యార్థులెందరో ఎన్నోఏళ్ళ తర్వాత కూడ భోజనానికి ముందు ఎప్పుడూ ఆ పాట పాడుతూ ఉన్నామని అనుకునే వాళ్ళు.

హెడ్‌మాస్టర్‌కు పళ్ళూడిపోయాయి గనుక ఈ పాట తయారు చేశాడేమోగాని పిల్లలతో మాత్రం అయనెప్పుడూ నెమ్మదిగా తినమని, తినేటప్పుడు వీలయినంత ఎక్కువ సమయం తీసుకొమ్మనీ, సంతోషంగా మాట్లాడుకుంటూ తినమనీ చెప్పేవాడు. ఇవన్నీ గుర్తు చెయ్యడానికే అయన ఆ పాటను కూడ తయారు చేసి ఉంటాడు.

పిల్లలందరూ గొంతెత్తి ఆ పాట పాడేవాళ్ళు. తర్వాత "ఇటాడాకిమాసు" అనేసి "సముద్రం నుంచి కాస్త, కొండల నుంచి కాస్త" తినడానికి కూచునే వాళ్ళు.

ఒక్కక్షణం ఆ అసెంబ్లీ హాలు నిశ్శబ్దంగా ఉండేది.

## బడిలో షికార్లు

మధ్యాహ్నం భోజనం అయిపోయాక టొటొచాన్ బడి ఆవరణలో వేరే పిల్లలతో కలిసి ఆడుకుంది. ఆటలయిపోయి తరగతి గదికి వచ్చేసరికి వాళ్ళ టీచర్ అక్కడ ఎదురుచూస్తూ ఉంది.

"మీరందరూ పొద్దున చాలకష్టపడి చదువుకున్నారుగా. మరి పగలు ఏం చేద్దామనుకుంటున్నారు" అని టీచర్ అడిగింది.

ఏం చేద్దామా అని టొటొచాన్ ఆలోచించడం మొదలుపెట్టేలోగానే ఎన్నో గొంతుల్లోంచి ఒక కేక ఆ గదిలో ఎగసివచ్చింది.

"షికారెళదాం!" అని.

"సరే" అంది టీచర్. పిల్లలందరూ తలుపువైపు పరుగెత్తి బైటికి గంతులువేశారు. నాన్నతో, రాకీతో కలిసి ఇట్లా నడుస్తూ షికారుకెళ్ళడం టొటొచాన్‌కు అలవాటే. కాని బడిలో షికారులుంటాయని టొటొచాన్ ఎప్పుడూ వినలేదు. అందుకే చాల ఆశ్చర్యపోయింది. కాని టొటొచాన్‌కు షికారంటే చాల సరదాగనుక ఎక్కువ సేపు ఉండలేక పరుగెత్తింది.

తర్వాత రోజుల్లో టొటొచాన్‌కు అసలు సంగతి తెలిసిపోయింది. ఉదయం టీచర్ బోర్డుమీద రాసినదంతా పొద్దుటి పూటే కష్టపడి చేసేస్తే పగటిపూట పిల్లలందరినీ షికారుకు వెళ్ళనిచ్చేవాళ్ళన్నమాట. మొదటి తరగతి పిల్లలకయినా, ఆరో తరగతి పిల్లలకయినా ఇది సమానమే.

ఆ మొదటి తరగతి పిల్లలు తొమ్మిదిమందీ, మధ్యలో వాళ్ళ టీచర్ నడుస్తుండగా గేట్లోంచి బైటికి వెళ్ళి, ఒక సెలయేరు ఒడ్డున విహారం సాగించారు. ఆ సెలయేటి రెండు గట్లమీదా పెద్ద పెద్ద చెర్రీ చెట్లున్నాయి. ఆ చెట్లు మొన్నీ మధ్య వరకు నిండా పూలతో ఉండేవి. చూపులు పరుచుకున్నంత దూరం పసుప్పచ్చ పూలతో ఆవాల పొలాలు వ్యాపించి ఉన్నాయి. సెలయేట్లో నీటి ప్రవాహం ఎప్పుడో ఆగిపోయి సెలయేరు అదృశ్యమయింది. ఇప్పుడక్కడంతా పెద్ద పెద్ద భవనాలూ, దుకాణాలూ నిండిపోయాయి. కాని ఆ రోజుల్లో జియుగౌకా చుట్టూ పొలాలు పరుచుకొని ఉండేవి.

గౌను మీద కుందేలు బొమ్మ ఉన్నపాప "మనం కుహోంబుట్సు గుడి దగ్గరి దాకా వెళ్దామేం" అని అడిగింది. ఆ పాప పేరు సాకోచాన్.

"మేం ఇదివరకెళ్ళినప్పుడు అక్కడ కొలను పక్కన ఓ పాము కనబడింది. తెలుసా? ఆ గుడి ఆవరణలో ఓ పాత బావి ఉంది. దాంట్లోనంట, మరేమో, ఓ సారి ఓ చుక్క తెగి పడిపోయిందంట అని చెప్పింది సాకోచాన్.

అలా నడుస్తూ సాగిపోతున్నప్పుడు పిల్లలు తమకిష్టం వచ్చినదల్లా, ఎన్నెన్నో విషయాలు



మాట్లాడారు. పైన నీలాకాశం గాలిలో సీతాకోకచిలుకలు ఎగురుతున్న చప్పుడు నిండిపోయింది.

అట్లా పది నిమిషాలు నడిచాక టీచర్ ఆగిపోయింది. ఆమె ఏవో పసుప్పచ్చ పూలను చూపెట్టి "ఈ ఆవాల పూలను చూడండి. పూలెందుకు పూస్తాయో మీకు తెలుసా?" అని అడిగింది.

పిల్లలందరూ రోడ్డుమీద నుంచి వంగిపూలను పరీక్షిస్తుండగా టీచర్ కాడనూ, పువ్వు మధ్యలో దిమ్మనూ వివరించింది. పూలు కాయలు కావడంలో సీతాకోక చిలుకలు ఎట్లా తోడ్పడతాయో వివరించింది. నిజంగానే, ఆ పనిలో ఉన్నట్టు సీతాకోక చిలుకలు అటూ ఇటూ రివ్వు రివ్వున సాగిపోయాయి.

టీచర్ మళ్ళీ నడక మొదలుపెట్టే సరికి పిల్లలందరూ పూలను పరిశోధించడం ఆపేసి లేచి నిలబడ్డారు. ఇంగ్లీషులో పువ్వు మధ్యలోని దిమ్మను పిస్టిల్ అంటారని తెలిసిందిగనుకనేమో, ఎవరో "అవి పిస్తోళ్ళ లాగ లేవుగదూ? ఉన్నాయా?" అని అడిగారు.

టొటొచాన్‌కు కూడ అవి అట్లా ఉన్నాయనిపించలేదు. కాని మిగతా పిల్లలందరి లాగనే టొటొచాన్ కూడ పూలలో అవి చాల ముఖ్యమైన భాగాలని తెలుసుకుంది.

వాళ్ళు అట్లాగే ఇంకో పదినిమిషాలు నడిచాక చిక్కగా చెట్లునిండి ఉన్న తోట కనబడింది. అదే కుహోంబుట్సు గుడి చుట్టూరా ఉన్నతోట. ఆ గుడి ఆవరణలోకి వెళ్ళగానే పిల్లలందరూ చెల్లా చెదురుగా వేరువేరు దిక్కులకు పరుగెత్తారు.

"చుక్క తెగి పడిపోయిన బావి చూస్తావా?" అని అడిగింది సాకోచాన్. టొటొచాన్ సహజంగానే సిద్ధంగా ఉంది గనుక సాకోచాన్‌తో పాటు అటు పరుగెత్తింది.

ఆ బావి రాతితో కట్టినట్టు కనబడుతోంది. ఆ బావి చుట్టూఉన్న పిట్టగోడ వాళ్ళ గుండెలదాకా వచ్చింది. ఆ బావి మీద కర్రతో చేసిన కప్పు ఒకటి ఉంది. వాళ్ళు ఆ కప్పు ఎత్తి లోపలికి తొంగి చూశారు. లోపల కటికచీకటి. లోపల టొటొచాన్‌కు కాంక్రీట్ ముద్దో రాయో కనబడిందిగాని ఊహించినట్టు తళతళ మెరిసే చుక్కేదీ లేదు. లోపల చాలసేపు తేరిపార చూసి "నువ్వాచుక్కను చూశావా?" అని టొటొచాన్ సాకోచాన్‌ను అడిగింది.

సాకోచాన్ తల అడ్డంగా ఊపుతూ "నేనా? నేనూ ఎప్పుడూ చూడలా!" అంది.

మరి ఆ చుక్క ఎందుకు వెలిగిపోవడం లేదో టొటొచాన్‌కు అర్థం కాలేదు. కాసేపు ఆలోచించి "బహుశా నిద్దరోయిందేమో కదూ!" అంది.

సాకోచాన్‌వి అసలే గుండ్రని పెద్దకళ్ళు. ఆశ్చర్యంతో అవి మరింత విప్పారాయి. "ఏంటి? చుక్కలు నిద్రోతాయా?" అని సాకోచాన్ అడిగింది.

టొటొచాన్‌కూ కచ్చితంగా తెలియదు. అందుకే గబగబా జవాబిచ్చేసింది. "అవి పొద్దంతా పడుకుని నిద్రపోయి రాత్రిపూట మేలుకొని వెలుగుతూ ఉండాలనుకుంటాను" అని.

ఆ తర్వాత పిల్లలందరూ కలిసి గుడి ఆవరణంతా కలయతిరిగారు. గుడిని రక్షిస్తూ, సింహద్వారానికి రెండువైపులా నిలబడ్డ దేవరాజుల విగ్రహాల బానల్లాంటి పొట్టల్ని చూసి పిల్లలు పడీపడీ నవ్వారు. ప్రధాన ఆలయంలోని మసక చీకటిలో బుద్ధుడి విగ్రహం వేపు భక్తిగా చూశారు. టెంగు అనే పొడుగాటి ముక్కుగల దయ్యం అక్కడ రాతిమీద పాదముద్ర వేసిందంటారు. ఆ పెద్ద పాదముద్రలో పిల్లలందరూ తమ చిన్నారి పాదాలు పెట్టి కొలుచుకున్నారు. కొలనులో తెడ్ల పడవల్లో షికార్లు చేస్తున్న వాళ్ళవైపు చేతులూపి పలకరిస్తూ కొలను ఒడ్డుమీద పచార్లు చేశారు. అక్కడ సమాధుల చుట్టూ మెరిసే నల్లని గులకరాళ్ళతో హృదయ పూర్తిగా గంతులువేస్తూ ఆడుకున్నారు. టొటొచాన్‌కు ఇదంతా కొత్తగా ఉంది. ఎదురైన ప్రతికొత్త అనుభవాన్నీ టొటొచాన్ ఉత్సాహంగా కేరింతలతో ఆహ్వానించింది.

"ఇంక వెళ్ళిపోవాలి" అని చెప్పేసింది టీచర్. అప్పుడే సూర్యుడు అస్తమించబోతున్నాడు. పిల్లలందరూ ఆవాల పూలకూ, చెర్రీ చెట్లకూ మధ్యనున్న దారిపై బడి వైపు నడవడం మొదలెట్టారు.

ఈ షికార్లు పిల్లల దృష్టిలో స్వేచ్ఛకూ, ఆటలకు నిలయాలుగా ఉండేవి. కాని నిజానికివి విజ్ఞానశాస్త్రంలో, చరిత్రలో, జీవశాస్త్రంలో విలువయిన పాఠాలని ఆ పిల్లలప్పుడు గుర్తించలేదు.

అప్పటికి పిల్లలందరూ టొటొచాన్‌కు స్నేహితులయిపోయారు. వాళ్ళతో తనకు ఎప్పటినుంచో పరిచయమున్నట్టులు టొటొచాన్‌కు అనిపించింది.

"రేపు కూడ షికారెళ్దామేం" అని వాళ్ళందరితోనూ చెప్పింది టొటొచాన్ తిరిగొస్తుండగా.

"ఓ, తప్పకుండా" అని అందరూ కేకలేశారు. వాళ్ళు ఆనందంతో గంతులేస్తున్నారు, ఎగురుతున్నారు.

సీతాకోకచిలుకలు ఇంకా తమ పనిలో తీరిక లేకుండా ఎగురుతూనే ఉన్నాయి. పక్షుల పాటలు గాలిల్లో నిండిపోయాయి. టొటొచాన్ హృదయంలో ఆనందం పొంగిపొరలుతోంది.

**బడి పాట**

టొటొచాన్‌కు టోమోగాకుయెన్‌లో ప్రతిదినమూ ఎన్నెన్నో ఆశ్చర్యాలతో నిండి ఉండేది. టొటొచాన్‌కు బడికి వెళ్ళాలనే తహ తహ ఎంత ఉండేదంటే ఏ ఒక్క రోజూ కోరుకున్నంత తొందరగా ఉదయించలేదు. అట్లాగే ఇంటికి తిరిగి వచ్చాక కూడ టొటొచాన్ బడికబుర్లు చెప్పడం ఒక్క క్షణం కూడ ఆపేసేది కాదు. ఆ రోజు బడిలో తానేం చేసిందో, అదిఎంత సరదాగా ఉండిందో, ఇంకా ఎన్నెన్ని ఆశ్చర్యకరమైన సంగతులు జరిగాయో అవన్నీ రాకీకి, అమ్మకు నానకు అలా చెప్పతూనే ఉండేది. "ఇంక చాలు కన్నా, ఇంక చెప్పడం మానేసి ఏమన్నా తిను" అని అమ్మ చివరికి అనే దాకా ఆ కబుర్లలా సాగుతూనే ఉండేవి.

కొత్తబడి టొటొచాన్‌కు బాగా అలవాటయ్యాక కూడ, ప్రతిరోజూ చెప్పవలసిన కబుర్లు గుట్టలు గుట్టలుగా ఉంటూనే ఉండేవి. టొటొచాన్‌కు బడి ఇంత ఆసక్తికరంగా ఉండటం అమ్మకు చాల నచ్చింది.

ఒక రోజు రైల్లో బడికి వెళుతుండగా టొటొచాన్‌కు హఠాత్తుగా ఓ సందేహం కలిగింది. టోమోకు బడిపాట అనేదేదయినా ఉందా అని. ఈ సంగతి ఎంత తొందరగా వీలయితే అంత తొందరగా తెల్సుకోవాలనే తపనతో టొటొచాన్ రైలక్కడికి చేరే దాకా ఆగలేక పోయింది. ఇంకా రెండు స్టేషన్లుండగానే లేచివెళ్ళి తలుపు దగ్గర నిలబడింది. రైలు జియుగౌకా స్టేషన్లో ప్రవేశించగానే ప్లాట్‌ఫారం మీదికి దూకేసి పరుగెత్తాలనుకుంది. ముందు స్టేషన్‌లో ఎక్కిన ఒకావిడ టొటొచాన్‌ను చూసి సహజంగానే ఈ పాప దిగిపోతోందేమోననుకుంది. కాని ఆపాప అట్లాగే నిశ్చలంగా, పరుగుపందేలలో సిద్ధంగా అడుగు ముందుకేసి ఉన్న వాళ్ళలా దూకడానికి సిద్ధంగా ఉండేసరికి "ఏమొచ్చిందో ఈ పాపకి" అనుకుంది.

రైలు స్టేషన్లోకి చేరగానే టొటొచాన్ మెరుపులాగ దూకేసింది. రైల్లో కండక్టర్ "జియుగౌకా! జియుగౌకావాళ్ళు దిగండి!" అని, రైలు సరిగ్గా ఆగాక ప్లాట్‌ఫారం మీదికి దిగి అరిచే సరికి టొటొచాన్ స్టేషన్‌లోంచే బైటికి పరుగెత్తింది.

రైలు పెట్టె తరగతి గదిలోకి ఒక్క ఉదుటున దూసుకొచ్చి, అప్పటికే అక్కడున్న తాయిజీ యమనోచిని "తాయిచాన్, మన బడికి పాట ఉందా?" అని అడిగేసింది టొటొచాన్.

తాయిచాన్ కాసేపు ఆలోచించి "లేదనుకుంటాను" అని జవాబిచ్చాడు. తాయిచాన్‌కు భౌతికశాస్త్రమంటే మక్కువ.



"అయ్యయ్యో!" అంది విచారంగా టొటొచాన్. "సరే, తప్పకుండా మన బడికోపాట ఉండాలి. నేను వెళ్ళిన ఆ పాత బడిలో ఓ మంచి పాట ఉండేది" అంది.

ఇక టొటొచాన్ గొంతెత్తి ఆ పాట పాడడం మొదలెట్టింది.

సెంజోకు సరసులో నీటిలోతు తక్కువే.

మా చదువుకు దరులేమో ఎంతెంతో లోతుగదా........

టొటొచాన్ ఆ బడికి వెళ్ళిందీ తక్కువ రోజులే. పైగా పాటలో ఎన్నో కఠినమైన పదాలున్నాయి. అయినా తనకు పాట గుర్తుంచుకోవడం కష్టం కాలేదు. ముఖ్యంగా ఈ భాగం.

తాయిచాన్‌కు కూడ పు పాట నచ్చింది. ఆ సమయానికి మిగిలిన విద్యార్థులు కూడ వచ్చేశారు. టొటొచాన్ పాడుతున్న పాటలో పెద్ద పెద్ద పదాలు వాళ్ళకు కూడ నచ్చినట్టే కనబడ్డాయి.

"మన బడికి కూడ ఓ పాట తయారుచెయ్యమని హెడ్‌మాస్టర్‌ను అడుగుదాం" అంది టొటొచాన్.

"సరే, పద" అంటూ మిగిలిన వాళ్ళూ ఒప్పుకున్నారు. అందరూ గుంపుగా హెడ్‌మాస్టర్ గది వేపు కదిలారు.

ఆ ఇంకో బడిపాట టొటొచాన్ పాడగా విని, పిల్లలందరూ కోరడంచూసి "సరే, రేపు ఉదయానికల్లా మీ కోసం ఓ బడిపాట తయారు చేస్తాను" అన్నాడు హెడ్‌మాస్టర్.

"తప్పకుండా చెయ్యాలి" అని పిల్లలందరూ ఏక కంఠంతో అడిగారు. తర్వాత వరుసగా అందరూ వాళ్ళ తరగతుల్లోకి తిరిగొచ్చేశారు.

మర్నాడు ఉదయం ప్రతి తరగతిలోనూ ఒక గమనిక పెట్టి ఉంది. అందరూ బడి ఆవరణలోకి రావాలి. మిగిలిన వాళ్ళతో కలిసి టొటొచాన్ కూడ ఆవరణలోకి నడిచింది. అందరూ కుతూహలంగా ఉన్నారు. ఆవరణ మధ్యలోకి ఒక బ్లాక్‌బోర్డ్ తెచ్చి పెట్టారు. "ఇదిగో, చూడండి. ఇక్కడ టోమోకు ఓ పాట ఉంది. మీ బడికి కూడ ఓ పాట ఉంది" అన్నాడు హెడ్‌మాస్టర్. ఆయన ఆ బోర్డుమీద సమాంతరంగా ఐదు సరళరేఖలు గీశాడు. ఆ గీతల మీద సంగీత చిహ్నాలు రాశాడు.

ఆ తర్వాత సంగీత దర్శకుడి లాగ చేతులు రెండూ ఎత్తి "ఇక మనం దాన్ని పాడడానికి ప్రయత్నిద్దాం. అందరూ గొంతు విప్పండి!" అన్నాడు.

హెడ్‌మాస్టర్ సమయం సూచిస్తూపాట నడుపుతుండగా బడి పిల్లలందరూ, మొత్తం యాభైమందీ, గొంతు కలిపారు.

"టో - మో-, టో-మో-, టో-మో-!"

కొంచెంసేపు ఆగి "ఉన్నదంతా అంతేనా?" అనడిగింది టొటొచాన్.

"ఆఁ అంతే" అన్నాడు హెడ్‌మాస్టర్ గొప్పగా.

టొటొచాన్‌కు తీవ్రంగా విచారం కలిగింది. అది ధ్వనిస్తున్న గొంతుతో "మంచి మంచి పదాలతో ఉండి ఉంటే బాగుండేదిగా.... సెంజోకు సరసులో నీటిలోతు తక్కువేలాగ...." అంది.

"మనదేం బాగులేదా? కాస్త బాగానే ఉందనుకున్నానే" అన్నాడు హెడ్‌మాస్టర్. ఆయన ముఖం కాస్త ఎర్రబడింది గాని ముఖంలో చిరునవ్వు వెలుగుతూనే ఉంది.

అది ఎవరికీ నచ్చలేదు. అది మరీ సాదాగా ఉంది. అంత మామూలు పాట ఉండేకంటె, ఏమీ లేకపోయినా ఫర్వాలేదులే అనివాళ్ళనుకుంటున్నట్టు కనబడింది.

హెడ్‌మాస్టర్ కూడ కొంచెం విచారించాడు. అంతేగాని ఆయనకు కోపం రాలేదు. బోర్డు

మీది నుంచి దాన్ని చెరిపెయ్యడం మొదలెట్టాడు. ఆయనతో తాము మొరటుగా ప్రవర్తించామేమోనని టొటొచాన్‌కు అనిపించింది. కాని మనసులో ఆమెకు నచ్చినది ఇంకొకటి ఉంది.

అసలు వాస్తవమేమంటే ఆ పిల్లలపట్ల, ఆ బడిపట్ల హెడ్‌మాస్టర్‌కు గల ప్రేమను చెప్పడానికి అంతకంటె మంచి మార్గం లేదు. కాని అది గుర్తించేంత వయసు ఆ పిల్లలకు రాలేదు వాళ్ళు త్వరలోనే తమకు ఒక బడిపాట కావాలనే విషయం కూడ మరిచిపోయారు. అసలు అలాంటిది అవసరమనే హెడ్‌మాస్టర్ బహుశా ఎన్నడూ అనుకున్నట్టులేదు. కనుక ఆ బోర్డు మీది నుంచి బాణీని చెరిపెయ్యగానే ఆ సంగతి ముగిసిపోయింది. టోమోగాకుయెన్‌కు ఎన్నడూ బడిపాట లేదు.

## "అదంతా సరిచెయ్యి!"

టొటొచాన్ తన జీవితంలో ఎన్నడూ అంతగా కష్టపడి పనిచేయలేదు. తనకు చాల ఇష్టమైన ఆ పర్స్ దొడ్లో పడిపోయిన ఆ రోజు ఎటువంటిరోజు ! ఆ పర్స్‌లో డబ్బేమీ లేదుగాని, ఆ పర్సంటే టొటొచాన్‌కు ఎంత ఇష్టమంటే, దొడ్లోకి వెళ్ళేటప్పుడు కూడ దాన్ని పట్టుకునే వెళ్ళేది. అది నిజంగా చాల అందమైన పర్స్. అది సన్నని సిల్కుతో తయారయింది. దాని మీద ఎరుపు, పసుపుపచ్చ, ఆకుపచ్చరంగుల గళ్ళుండేవి. అది చదరంగా, మట్టంగా ఉండేది. త్రిభుజాకారంలో ఉన్న దాని మూతపైన చొక్కామీద పెట్టుకునే అలంకారపు గుండీలాంటి వెండి గుండీ ఒకటి ఉండేది.

టొటొచాన్‌కు ఒక విచిత్రమైన అలవాటుండేది. చిన్నప్పటి నుంచీ కూడ దొడ్డికి కూచున్నప్పుడల్లా అయిపోగానే అక్కడి రంధ్రం లోపలికి తొంగి చూస్తుండేది. అందువల్ల అసలు బడికి వెళ్ళడం మొదలయ్యేసరికి టొటొచాన్ ఎన్నో టోపీలు పోగొట్టుకుంది. గడ్డి టోపీ ఒకటీ, తెల్లటి అంచున్న టోపీ ఒకటీ కూడ అట్లాగేపోయాయి. ఆ రోజుల్లో దొడ్లకు ఇప్పటిలా నీళ్ళధారతో శుభ్రమయిపోయే పద్ధతి ఉండేది కాదు. ఆ రంధ్రం కింద ఓ పెద్ద మురిగ్గుంట ఉండేదంతే. కనుక ఆ గుంటలో టోపీలు తేలుతూ కనబడుతూ ఉండేవి. అట్లా రంధ్రంలోంచి లోపలికి తొంగి చూడొద్దని అమ్మ టొటొచాన్‌కు పదేపదే చెపుతుండేది.

ఆరోజు బడి ఇంకా మొదలవకముందే టొటొచాన్ దొడ్డికెళ్ళింది. అమ్మమాట మరచిపోయి, తానేం చేస్తున్నానో గుర్తించేలోపే రంధ్రంలోంచి లోపలికి చూడడం మొదలెట్టింది. ఆ క్షణంలో పర్సు పట్టుకున్న చెయ్యిపట్టు సడలిందో ఏమో అది చేతిలోంచి జారిపోయి ఆ రంధ్రంలోంచి లోపలి గుంటలో పడిపోయింది. కింద చీకటిలోకి అది అదృశ్యమైపోతుండగా టొటొచాన్ కంగారుగా కేకేసింది.

కాని టొటొచాన్ ఏడవదలచుకోలేదు. ఆ పర్సు పోయిందని ఊరుకోదలచుకోలేదు. అక్కడినుంచి పాకలోకి వెళ్ళి ఓ వెడల్పాటి కర్రతెడ్డు పట్టుకొచ్చింది. పొడవాటి ఆ తెడ్డును తోటలో చెట్లకు నీరు కట్టడానికి ఉపయోగిస్తారు. ఆ తెడ్డు టొటొచాన్‌కు రెండింతలు పొడుగుంది కాని టొటొచాన్ తన పనిలో ఏమీ వెనక్కి తగ్గలేదు. అది పట్టుకుని బడి వెనుకవైపుకు నడిచి ఆ మురిగ్గుంటను ఖాళీ చేసేప్పుడు తీసే మూత ఎక్కడ ఉందోనని వెతికింది. దొడ్డిగోడకవతల ఆ మూత ఉంటుందని టొటొచాన్ అనుకుంది. అక్కడ వెదికితే అది దొరకలేదు. కాని ఓ గజం అవతల ఒక గుండ్రని కాంక్రీటు, మూత చిట్టచివరికి కనబడింది. అతికష్టం మీద అది ఎత్తి చూస్తే అది తాను వెతుకుతున్న మార్గమే అయి ఉండాలని అనిపించింది. టొటొచాన్ లోపలికి తల పెట్టి చూసింది.



"అరె ఇది కుహోంబుట్సు కొలను అంత పెద్దగా ఉందే" అని టొటొచాన్ ఆశ్చర్యపోయింది.

ఇంక తన పని మొదలుపెట్టింది టొటొచాన్. ఆ మురిగ్గుంటలో ఉన్నదాన్నంతా తన తెడ్డుతో తోడి బైట పోయడం మొదలెట్టింది. మొట్టమొదట తన పర్స్ ఎక్కడపడిపోయిందో అక్కడే తోడడానికి ప్రయత్నించింది. కాని ఆ గుంట మూడు దొడ్లకు కలిసి ఒకటే కనుక అది చాలా లోతుగా, చీకటిగా, విశాలంగా ఉంది. అంతే గాక లోపలికి తలను ఎక్కువగా దూరిస్తే తానేపడిపోతానేమోనని టొటొచాన్ భయపడింది. కనుక ఇట్లా తోడిపోస్తూనే ఉండి పర్స్ దొరుకుతుందేమో చూడాలని అనుకుని, ఆ రంధ్రం చుట్టూ మురిగ్గుంటలోనిదంతా తోడిపోయడం కొనసాగించింది.

అయితే ప్రతిసారి తెడ్డుబైటికి తీసినప్పుడు దాంట్లో పర్సుందేమోనని జాగ్రత్తగా చూస్తూనే ఉంది. దొరకడానికి ఎక్కువసేపు పట్టదులే అని టొటొచాన్ అనుకుంది గాని జాడ మాత్రం లేదు. ఎక్కై పోయి ఉంటుంది? బడి మొదలయ్యే గంట కూడ అయింది.

ఇప్పుడేం చేయాలా అని టొటొచాన్‌కు సందేహం పట్టుకుంది. కాని ఇంతదూరం వచ్చాక ఇంకా ముందుకు పని సాగించడమే మంచిదని నిర్ణయించుకుంది. ఇంకా ఇనుమడించిన శక్తితో తోడిపోసే పని కొనసాగించింది.

హెడ్‌మాస్టర్ ఏదో పనిమీద అటువెళ్ళే సమయానికి అక్కడ పెద్ద మురికికుప్ప తయారయింది.

"ఏం చేస్తున్నావు?" అని ఆయన టొటొచాన్‌ను అడిగాడు.

ఒక్క క్షణం కూడా వృధా చేయడం తనకిష్టంలేనట్టు, తోడిపోస్తూనే "నా పర్సు పారేసుకున్నాను" అని జవాబిచ్చింది.

"ఆహాఁ" అని ఆయన వెళ్ళిపోయాడు. నడిచేటప్పుడు వెనక్కి చేతులు కలిపి పట్టుకోవడం ఆయన అలవాటు. అప్పుడు కూడ ఆయనట్లా చేతులు వెనక్కి కట్టుకునే ఉన్నాడు.

అట్లా ఎంతోసేపు గడిచిపోయింది గాని పర్సయితే దొరకలేదు. మురుగుకంపు కొడుతున్న ఆ గుట్ట ఇంకా ఇంకా పెరిగిపోయింది.

హెడ్‌మాస్టర్ మళ్ళీవచ్చి "దొరికిందా?" అని అడిగాడు.

"ఊహుఁ" అని జవాబిచ్చింది టొటొచాన్. ఆ మురిక్కుప్ప మధ్యలో చెమటలు కారిపోతూ నిలబడ్డ టొటొచాన్ బుగ్గలు ఎర్రబడిపోయాయి.

హెడ్‌మాస్టర్ దగ్గరిగా వచ్చి అనునయంగా "నీ పని అయిపోయాక ఈ కుప్పంతా మళ్ళీలోపలికి తోసేస్తావుగదూ?" అని అడిగాడు. ఆ ప్రశ్న అడగగానే చాల మామూలుగా అక్కడ్నించి వెళ్లిపోయాడు.

తన పని కొనసాగిస్తూనే "సరే" అని సంతోషంగా జవాబిచ్చింది టొటొచాన్. హఠాత్తుగా టొటొచాన్‌కు ఓ సందేహం కలిగింది. కుప్ప వైపు చూసింది. నా పని అయిపోయాక ఈ కుప్పలో ఘన పదార్థాన్నంత లోపల వేసేయొచ్చు. కాని దీంట్లో నీటిని లోపలికి ఎట్లా పంపేది?"

ఆ కుప్పలోని తడిఅంతా వేగంగా అక్కడి మట్టిలో ఇంకిపోతోంది. టొటొచాన్ పని చెయ్యడం మానేసి ఆ భాగాన్ని మళ్ళీ గోతిలోకి చేర్చడమెట్లా అని ఆలోచనలో పడింది. మరి అదంతా లోపల పెట్టేస్తానని హెడ్‌మాస్టర్‌కు చెప్పింది గదా. చివరికి తడిపిన మట్టిని కూడ కొంచెం లోపల వేసేస్తే సరిపోతుందని టొటొచాన్ నిర్ణయించుకుంది.

అప్పటికి ఆ కుప్ప నిజంగా గుట్టలాగయిపోయింది. గొయ్యి దాదాపు ఖాళీ

అయిపోయింది. ఐనా పర్సు జాడ మాత్రం కనబడలేదు. అది ఆ గోతి అంచుల్లో పడి ఆగిపోయిందో, అట్టడుక్కే కూరుకుపోయిందో. ఇంక టొటొచాన్ పట్టించుకోదలచుకోలేదు. తాను చేయగలిగిందంతా చేశానని టొటొచాన్ కనిపించింది. హెడ్‌మాస్టర్ తనను కోప్పడకుండా, తన పనిని నమ్మడం ద్వారా కలిగించిన ఆత్మగౌరవంవల్ల టొటొచాన్‌కు ఎంతో సంతృప్తి కలిగింది. కాని ఈ విషయమంతా గుర్తించడం టొటొచాన్‌కు అప్పటికి చాలా కష్టం.

టొటొచాన్‌ను అటువంటి పరిస్థితిలో చూసిన పెద్దవాళ్ళెవరయినా వెంటనే ఆశ్చర్యపోయి "ఏం చేస్తున్నావు నువ్వు?" అనో, "ఛ.ఛ. ఆపెయ్యి, అది చాల ప్రమాదం" అనో లేదా తాము సాయపడతామనో అని ఉండేవాళ్లు.

"నీ పని అయిపోయాక ఈ కుప్పంతా లోపలికి తోసేస్తావుగదూ" అనడాన్ని ఊహించుకో. ఆయనెంత అద్భుతమైన హెడ్‌మాస్టర్ అనుకుంది అమ్మ టొటొచాన్ నుండి జరిగినదంతా విన్నాక.

ఈ సంఘటన తర్వాత దొడ్డికెళ్ళినప్పుడెప్పుడూ రంధ్రంలోంచి కిందికి చూడలేదు టొటొచాన్. హెడ్‌మాస్టర్‌ను తాను పూర్తిగా నమ్మవచ్చునని టొటొచాన్ కనిపించింది. ఆయనను ఇదివరకంటే ఎక్కువగా ఇష్టపడడం మొదలెట్టింది.

టొటొచాన్ తన మాట ప్రకారం ఆ కుప్పనంతా మళ్ళీగోతిలోకి తోసేసింది. దాన్నంతా బైటికి తీయడం చాల కష్టమయింది గాని, లోపలికి తోసేయడం తొందరగానే అయిపోయింది. కొంచెం తడిమట్టిని కూడా లోపలికి తోసింది. అప్పుడు అక్కడ నేలను చదును చేసి, రంధ్రం మీద మూతను సరిగ్గా పెట్టేసింది. తెడ్డును మళ్ళీ మాలి పాకలో పెట్టేసింది.

తాను ఆ చీకట్లో పారేసుకున్న అందమైన పర్సు గురించి టొటొచాన్ ఆ రాత్రి పడుకోబోయేముందు ఆలోచించింది. అది పోయిందంటే తనకు విచారం కలిగింది. కాని ఆ రోజు పడిన శ్రమతో ఎంత అలసిపోయిఉందంటే ఎక్కువసేపు కాకుండానే నిద్రలోకి జారిపోయింది.

అప్పుడే ఆ పాప శ్రమపడిన చోట చెమ్మగిలిన నేల వెన్నెల్లో ఏదో అందమైన వస్తువులాగా మెరిసిపోయింది.

మరెక్కడో పర్స్ ప్రశాంతంగా ఉండిపోయింది.

## టొటొచాన్ పేరు

టొటొచాన్ అసలు పేరు టెట్సుకో. టొటొచాన్ పుట్టక ముందు అమ్మ స్నేహితులు, నాన్న స్నేహితులు అందరు కూడా పుట్టబోయేది మగ పిల్లవాడేనన్నారు. మొదటి సంతానం గనుక వాళ్ళూ అట్లాగే ఆశించారు. కనుక బాబుకు టోరు అని పేరు పెట్టాలని కూడ వాళ్ళనుకున్నారు. కాని పాప పుట్టేసరికి వాళ్ళు కాస్త నిరాశపడ్డారు. ఐతే వాళ్ళిద్దరికీ కూడా టోరు పేరుకున్న చైనీస్ అక్షరం ఎంతోనచ్చింది. కనుక వాళ్ళు దాన్నే కొంచెం మార్చి, చైనీస్ ఉచ్చారణలో లాగ టెట్సు అని అమ్మాయి పేరు చేశారు. అమ్మాయిల పేర్లకు చివర మామూలుగా ఉండేకో కూడ దానికి కలిపి 'టెట్సుకో' అని పేరు తయారయింది. ఇంతకు టోరు అంటే చొచ్చుకుపోవడం, సాగదీయడం, స్వరంలాగ స్పష్టంగా, ధ్వనిపూర్వకంగా ఉండడం అని అర్థం.

జపాన్‌లో ఏ మనిషినైనా పేరుతో సాన్ లేదా చాన్ అని కలిపి పిలవడం అలవాటు గనుక ఆ పాప పూర్తిపేరు టెట్సుకో - చాన్ అయింది. కాని ఎవరు తనను పిలుస్తున్నప్పుడైనా టెట్సుకో - చాన్ అని అక్షరాలు స్పష్టంగా వినిపించేవి కావు. అందుకే తనపేరు ఎవరడిగినా "టొటొ



చాన్" అనే చెపుతుండేది. అసలు ఆ చాన్ కూడ తన పేరులో భాగమేనని టొటొచాన్ అనుకుంటుండేది.

నాన్నయితే అప్పుడప్పుడు తనను అబ్బాయిలను పిలిచినట్టు టొట్స్కీ అని పిలిచేవాడు. "టొట్స్కీ! ఇలా రారా. ఈ గులాబిపూలకు పురుగులు పట్టాయి. దులిపేద్దాం" అనేవాడు. కాని నాన్న, రాకీ తప్ప మిగతా వాళ్ళందరూ తనను టొటొచాన్ అనే పిలిచేవాళ్ళు. బడిలో పుస్తకాల మీద తనపేరు టెట్సుకో అని రాసుకుంటూ కూడ తనపేరు టొటొచాన్ అనే అనుకుంటుండేది.

## రేడియో హాస్యనటులు

నిన్న టొటొచాన్ చాల నిరాశపడింది. "నువ్వింక రేడియోలో హాస్యనటుల సంభాషణ వినొద్దు" అని అమ్మ చెప్పింది.

టొటొచాన్ పసిపాపగా ఉన్నప్పుడు రేడియోలు చెక్కతో తయారయినవీ, పెద్దవీ ఉండేవి. అవి చూడడానికి చాల బ్రహ్మాండంగా ఉండేవి. అవి దీర్ఘ చతురస్రంలా ఉండి పైన మాత్రం గుండ్రగా ఉండేవి. వాటి ముందర ఉన్న పెద్ద స్పీకర్ మీద గులాబిరంగు సిల్కుతెర, చెక్కడాలతో ఉన్న అలంకారాలు ఉండేవి. ఆ రేడియోను పనిచేయించడానికి రెండు మీటలుండేవి.

బడికి వెళ్ళడం మొదలు పెట్టక ముందునుంచే టొటొచాన్ గులాబిరంగు సిల్కు తెరకు చెవులప్పగించి 'రకుగో' హాస్యనటుల మాటలు వింటుండేది. వాళ్ళ వేళాకోళాలు చాలా సరదాగా ఉన్నాయని టొటొచాన్ అనుకునేది. నిన్నటి వరకూ అమ్మ కూడ ఎప్పుడూ అవి వినొద్దని అనలేదు.

నిన్న రాత్రి సంగీత బృందంలోని నాన్న స్నేహితులు ఇంటికొచ్చారు. గదిలో వాళ్ళు తంత్రి వాయిద్యాల మీద సాధన మొదలెట్టారు.

"సెల్లో వాయించే సునెసాద టొచిబానా నీకోసం అరటి పళ్ళు తెచ్చారు" అని టొటొచాన్‌తో అమ్మ చెప్పింది.

టొటొచాన్‌కు చాల సంతోషమయింది. టొచిబానాకు కృతజ్ఞతగా వందనం చేసి అమ్మవేపు తిరిగి "ఓయ్-అమ్మా, ఇలా పళ్ళు తేవడం చచ్చేంత బావుంది గదూ!" అని కేకేసింది.

ఆ తర్వాత నుంచి అమ్మ, నాన్న బైటికెళ్ళినప్పుడు రహస్యంగా హాస్య సంభాషణలు వింటుండేది టొటొచాన్. ఆ సంభాషణలు చాలా బాగున్నప్పుడు టొటొచాన్ పడీపడీ నవ్వుతుండేది. అక్కడ పెద్ద వాళ్లెవరయినా ఉండి చూస్తే, ఇంత చిన్నారి పాప అంత కష్టమైన పరిహాసాల్ని ఎలా అర్థం చేసుకుంటోందా అని ఆశ్చర్యపోతారు. కాని చిన్నారి పిల్లల్లోకూడా ఒక సహజాతమైన హాస్యదృష్టి ఉంటుందనడంలో సందేహం లేదు. వాళ్ళెంత పసిపాపలయినా, నిజంగా సరదా పుట్టించే విషయాన్ని వాళ్ళు గుర్తించగలరు.

## ఇంకో రైలుపెట్టె వచ్చింది

"ఇవాళ రాత్రికి ఇంకో రైలుపెట్టె వస్తోంది, తెలుసా?" అంది మియోచాన్ ఆ రోజు మధ్యాహ్నం భోజనాల దగ్గర. మియోచాన్ హెడ్‌మాస్టర్ మూడో కూతురు. టొటొచాన్, తను ఒకే తరగతి.

అక్కడ అప్పటికే తరగతి గదులుగా వరుసగా ఆరు రైలు పెట్టెలున్నాయి. ఇంకా ఒకటి వస్తోందట. దాన్ని గ్రంథాలయంగా చేస్తారని మియోచాన్ చెప్పింది. పిల్లలందరికీ ఉత్సాహం పెరిగిపోయింది.

"బడికి అది ఏ పట్టాల మీదొస్తుందీ? భలే గమ్మత్తు కదూ?" అన్నారెవరో.

అది చాల కష్టతరమైన విషయం. అందుకే అక్కడ ఒక క్షణం పాటు మౌనం రాజ్యమేలింది.

"బహుశా అది ఒయిమాచిలైన్ పట్టాల మీద ఆ లెవెల్ క్రాసింగ్ దాకావచ్చి అక్కడ్నించి విడిపోయి ఇటొస్తుందేమో" అని ఒకరు సూచించారు.

"అట్లయితే అది పట్టాల మీంచి దిగిపోవాలిగా!" అని మరొకరు అన్నారు.

"బహుశా వాళ్ళు దాన్ని బండిమీద పెట్టి తీసుకొస్తారేమో" అని ఇంకొకరన్నారు.

"ఆ రైలుపెట్టెల్ని ఎక్కించేంత పెద్ద బళ్లుండవుగా" అని వెంటనే మరొకరు ఖండించారు.

"నేనేమనుకుంటానంటే....."

అలా ఆలోచనలన్నీ అయిపోయాయి. రైలు పెట్టెను కచ్చితంగా ఓ బండిమీదికో, ఓ ట్రక్కు మీదికో ఎక్కించడం సాధ్యం కాదని పిల్లలందరూ గుర్తించారు.

చాలాసేపు ఆలోచించి "పట్టాలు" అని కేకేసింది టొటొచాన్ "ఏం చేస్తారో తెలుసా? బహుశా వాళ్ళు ఈ బడి దాకా పట్టాలు వేస్తారనుకుంటాను" అంది.

"ఎక్కడ్నించి?" అని ఎవరో అడిగారు.

"ఎక్కడ్నించేంటి? ఇప్పుడు రైలు ఎక్కడుందో అక్కడినుంచి" అన్నది టొటొచాన్. అయినా తన ఆలోచన కూడ అంతమంచి ఆలోచన కాదేమోనని అనిపించసాగింది. ఆ పెట్టె ఎక్కడి నుంచి వస్తోందో టొటొచాన్‌కు తెలియదు. ఐనా బడికి సరాసరిగా పట్టాలు వేసేటందుకు ఎవరూ ఇళ్ళూ, వగైరా కూలగొట్టరుగదా.

అలా చేసేందుకు ఏ వీలుందా అని ఒక పద్ధతి తర్వాత ఇంకో పద్ధతి ఆలోచిస్తూ చాలసేపు నిష్ఫలమైన చర్చచేసిన తర్వాత పిల్లలందరూ ఆ మధ్యాహ్నం ఇంటికి వెళ్ళి పోవద్దనీ, రైలుపెట్టె వచ్చేవరకూ చూడాల్సిందేననీ నిర్ణయించుకున్నారు. ఆ రాత్రి వరకూ తామంతా బడిలోనే ఉండొచ్చా అని హెడ్‌మాస్టర్‌ను అడిగేందుకు ఆయన కూతురు మియోచాన్‌నే వెళ్ళాల్సిందిగా ఎన్నుకున్నారు. ఆ అమ్మాయి తిరగి రావడం కాస్త ఆలస్యమయింది.

"ఆ పెట్టె ఇవాళరాత్రి చాల పొద్దుపోయిక వస్తుందట. ఆ పట్టాల మీద మిగతా రైళ్ళన్నీ వెళ్ళిపోయాక వస్తుందట. నిజంగా రైలుపెట్టెరావడం చూడదలచుకున్న వాళ్ళు మొదలు ఇంటికెళ్ళి ఇంట్లో అడిగి రావాలన్నారు. రాత్రి భోజనమయ్యాక పైజామాల్లోనయినా సరే రావచ్చునన్నారు. ఓ దుప్పటి తెచ్చుకోమన్నారు" అని చెప్పింది మియోచాన్.

"వారెవ్వా" అని పిల్లలు ఎప్పటికంటె ఎక్కువ ఉత్సాహపడ్డారు.

"అరె, పైజామాల్లోనయినా రావచ్చన్నారా?"

"మరే, దుప్పట్లుకూడ.....?"

ఆ మధ్యాహ్నం ఎవరూ శ్రద్ధగా పాఠాలు వినలేకపోయారు. బడి అయిపోగానే టొటొచాన్ తరగతి పిల్లలందరూ తిన్నగా ఇళ్ళకు వెళ్ళిపోయారు. ఆ రాత్రి పైజామాలతో, బ్లాంకెట్లతో ఒకళ్ళనొకళ్ళు కల్సుకోగలమనే ఆశతో వెళ్ళిపోయారు.

ఇంటికి చేరి చేరగానే అమ్మతో టొటొచాన్ "ఓ రైలొస్తోంది. అది అక్కడికి ఎలా చేరుతుందో మాకు తెలియదు. పైజామా, ఒక దుప్పటీ తీసుకెళ్ళనా?" అని అడిగింది.

ఈ మాటలతో అమ్మకు పరిస్థితి ఏం అర్థమవుతుంది? టొటొచాన్ ఏం చెప్పుతోందో





అమ్మకేమీ అర్థం కాలేదు. కాని కూతురి ముఖంమీద కనబడుతున్న తీవ్రమైన ఆసక్తిని బట్టి ఏదో అసాధారణమైన సంగతి జరగనున్నదని అమ్మకు అర్థమైంది.

అమ్మ టొటొచాన్‌ను ఎన్నో ప్రశ్నలు అడిగింది చిట్టచివరికి అసలు సంగతేమిటో, కచ్చితంగా జరుగనున్నదేమిటో అమ్మ తెలుసుకోగలిగింది. టొటొచాన్ అటువంటి అవకాశాలు ఎక్కువ రావుగనుక టొటొచాన్ ఇవాళది చూడవలసిందేనని అమ్మ అనుకుంది. ఆ పెట్టెను తీసుకురావడం తాను కూడచూడగలిగితే బావుండునని అమ్మ కూడ స్వయంగా అనుకుంది.

అమ్మ టొటొచాన్ పైజామా, ఓ దుప్పటీ తీసింది. రాత్రి భోజనమయ్యాక టొటొచాన్‌ను అమ్మే బడికి తీసికెళ్ళింది. ఓ పదిమంది దాకా పిల్లలు అక్కడున్నారు. వాళ్ళలో, ఈ సంగతి గురించి విన్న పెద్ద విద్యార్థులు కూడ కొందరున్నారు. కొందరు తల్లులుకూడ తమ పిల్లలతోపాటు కలిసి వచ్చారు. వాళ్ళందరూ ఉండి పోదలచుకున్నట్టే కనబడ్డారు. కాని తమ పిల్లల్ని హెడ్‌మాస్టర్‌కు అప్పగించాక వాళ్ళందరూ ఇళ్లకు వెళ్ళిపోయారు.

అసెంబ్లీ హాలులో తమతమ దుప్పట్లు చుట్టుకుని నడుంవాల్చిన పిల్లలతో "రైలు పెట్టె రాగానే నేను మిమ్మల్ని లేపుతాను" అని హెడ్‌మాస్టర్ హామీ ఇచ్చాడు.

తమకు నిద్ర పడుతుందని పిల్లలకనిపించలేదు. రైలు అక్కడికి ఎలా వస్తుందన్న ఆలోచనే వాళ్ల మనసుల్లో నిండిపోయింది. కాని ఎంతో సేపటినుండి ఉత్సాహంగా ఉండడంతో వాళ్ళుబాగా అలసిపోయారు. తొందరగానే వాళ్ళకళ్ళమీదికి నిద్రతోసుకొచ్చి జోగడం మొదలెట్టారు. "తప్పకుండా నువ్వు నన్ను లేపుతావు గదూ"అని ఒకరికి ఒకరు చెప్పుకోక ముందే వాళ్ళలో చాలమంది గాఢనిద్రలోకి వెళ్ళిపోయారు.

"వచ్చేసింది! వచ్చేసింది!"

గందరగోళపు కేకలతో మేలుకొన్న టొటొచాన్ ఒక్క దూకుదూకి బడి ఆవరణలోంచి గేటు దగ్గరికి పరుగుతీసింది. ఆ ముసిముసి వేకువలో పెద్ద రైలుపెట్టె ఒకటి కళ్ళముందర కనబడింది. అది ఒక కలలా ఉంది. ఒక రైలు ఏ చప్పుడూ లేకుండా, పట్టాలు లేకుండా రోడ్డుమీద రావడమంటే కల గాక మరేమిటి? ఒయిమాచి లైన్ డిపో దగ్గరినుంచి ఒక ట్రాక్టర్ లాగుతుండగా ఒక భారీ ట్రెయిలర్ మీద ఆ రైలుపెట్టె వచ్చింది. టొటొచాన్, మిగతా పిల్లలు అంతవరకూ వాళ్ళకు తెలియని కొత్తవిషయం ఒకటి తెలుసుకున్నారు. అదేమిటంటే ట్రాక్టర్ అనేదొకటి ట్రెయిలర్లను లాగుతుందని, ట్రెయిలర్ అంటే బండికంటె పెద్దదని, వాళ్ళు ఈ కొత్త విషయంతో చాల మోజు పడ్డారు.

ఆ రైలు పెట్టె ట్రెయిలర్ మీద ఉయదం వేళ జనసంచారంలేని రోడ్డు మీద మెల్లగా కదిలి వచ్చింది.

కొద్దిసేపట్లోనే అక్కడ పెద్ద సందడి మొదలయింది. ఆ రోజుల్లో పెద్ద క్రేన్‌లుండేవి

కావు. కనుక రైలు పెట్టెను ఆ ట్రెయిలర్ మీదినుంచి దించి, బడి ఆవరణలో దాని గమ్యస్థానానికి చేర్చడం ఒక బ్రహ్మాండమైన పని. ఆ పెట్టెను తీసుకొచ్చిన మనుషులు దాని కింద పెద్ద పెద్ద కలప దుంగలు వేసి ఆ పెట్టెను ట్రెయిలర్ మీది నుంచి బడి ఆవరణలోకి తీసుకొచ్చారు.

"జాగ్రత్తగా చూడండి. వాటిని రోలర్లని అంటారు. ఆ పెద్దపెట్టెను కదల్చడానికి రోల్లర్లశక్తిని వాడుకుంటున్నామన్నమాట" అన్నాడు హెడ్‌మాస్టర్.

పిల్లలు శ్రద్ధగా చూశారు.

"హై లేసో...హై లేసా" అని ఆ బరువునుతోస్తూ పనివాళ్ళు లయబద్ధంగా అరిచారు. వాళ్ళ లయబద్ధమైన ధ్వనులకు సూర్యుడుకూడ లేచివస్తున్నట్టు అనిపించింది.

బడిలో ఇదివరకున్న ఆరుపెట్టెలలాగానే, ఎందరినో మోసిన ఈ పెట్టెకూడ చక్రాలు పోగొట్టుకుంది. దాని ప్రయాణ జీవితం ముగిసిపోయింది. ఇక నుంచి అది చిన్నారి పిల్లల కేరింతల శబ్దాల్ని మోసుకుపోతుంది.

ఆ ఉదయ సూర్యకాంతిలో ఆ మగపిల్లలు, ఆడపిల్లలు పైజామాల్లో నిలబడి అదృశ్యంచూస్తూ ఎంతగా ఆనందంతో తలమునకలయ్యారంటే వాళ్ళు తమ సంతోషాన్ని పట్టలేకపోయారు. పైకీ కిందికీ ఎగిరి గంతులువేశారు హెడ్‌మాస్టర్ మెడచుట్టూ చేతులేసి వేళ్ళాడారు. ఆయన చేతులు పట్టుకుని ఊగారు.

ఈ దాడికి గురి అవుతూ హెడ్‌మాస్టర్ సంతోషంగా చిరునవ్వులు నవ్వాడు ఆయన సంతోషం చూసి పిల్లలు కూడ ముసిముసి నవ్వులు నవ్వారు.

వాళ్ళలో ఏ ఒక్కరూ తామారోజు ఎంత ఆనందాన్ని అనుభవించారో మరచిపోలేదు.

## ఈత కొలను

టొటొచాన్‌కు అది ఒక చరిత్రాత్మకమైన రోజు. తాను ఒక ఈతకొలనులో ఈదడం అదే మొదటిసారి. పైగా అదీ ఒంటిమీద నూలుపోగు లేకుండా!

అది ఒక ఉదయం జరిగింది. హెడ్‌మాస్టర్ పిల్లలందరితో "బాగా ఉక్కపోస్తోంది గదూ. కొలనులో నీళ్ళు నింపుదామనుకుంటున్నాను" అన్నాడు.

"వారెవ్వా" అని ప్రతిఒక్కరూ అరిచి ఎగిరిగంతులేశారు. టొటొచాన్, ఒకటో తరగతి పిల్లలందరూ కూడ పెద్దపిల్లల కంటె ఎక్కువ ఉత్సాహంగా కేకలేసి గంతులేశారు. టోమోలో ఈతకొలను మిగిలిన చోట్లలాగ దీర్ఘచతురస్రంగా ఉండేది కాదు. ఒక చివర సన్నగా, మరోచివర విశాలంగా ఒక పడవ లాగుండేది. అక్కడ భూమిని బట్టి ఆ కొలను అట్లా తయారుచేసి ఉంటారు. ఏదేమైనా అది మాత్రం విశాలంగా బ్రహ్మాండంగా ఉండేది. తరగతి గదులకు, అసెంబ్లీహాలుకు మధ్యన ఉండేది.

పాఠాలు జరుగుతున్నంత సేపూ టొటొచాన్, మిగతా పిల్లలు కిటికీల్లోంచి కొలను వేపు తొంగి తొంగి చూశారు. ఖాళీగా ఉన్నప్పుడు ఆ కొలనుకూడ బడి ఆవరణ లాగనే ఎండుటాకులతో నిండిపోయి ఉండేది. కాని ఇప్పుడది శుభ్రంగా ఉంది. క్రమక్రమంగా నిండుతోంది. ఇప్పుడది అచ్చంగా ఈతకొలనులాగ కనబడడం మొదలయింది.

చిట్టచివరికి మధ్యాహ్న భోజనాల సమయం వచ్చింది. పిల్లలందరూ కొలను చుట్టూ గుమిగూడాక "ముందు మనం కొంచెం వ్యాయామం చేశాక ఈతకు దిగుదాం" అన్నాడు హెడ్‌మాస్టర్.



"ఈదాలంటే ఈత సూట్ ఉండొద్దా?" అని ఆలోచించింది టొటొచాన్. ఓసారి టొటొచాన్ అమ్మానాన్నలతో కలిసి కామాకూరాకు వెళ్ళినప్పుడు ఈదేటప్పుడు వేసుకునే బట్టలు, ఒక రబ్బర్ రింగు, అటువంటి వస్తువులేవేవో తీసుకెళ్ళింది. ఈత సూట్లు తెచ్చుకొమ్మని టీచర్ చెప్పిందేమో గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నించింది టొటొచాన్.

అప్పుడే సరిగ్గా టొటొచాన్ ఆలోచనలను చదివినట్టే "ఈతసూట్ల గురించి ఆలోచించకండి. వెళ్ళి అసెంబ్లీ హాల్లో చూడండి" అన్నాడు హెడ్‌మాస్టర్.

టొటొచాన్, మిగతా మొదటి తరగతి పిల్లలు అసెంబ్లీ హాల్లోకి వెళ్ళేసరికి అక్కడ పెద్ద పిల్లలందరూ బట్టలన్నీ విడిచేస్తున్నారు. స్నానం చెయ్యబోతున్నామన్న ఆనందంతో కేరింతలు కొడుతున్నారు. వాల్ళు ఒకళ్ళ వెనుక ఒకళ్ళు ఒంటిమీద ఒక్క నూలుపోగయినా లేకుండా బడి ఆవరణలోకి పరుగులు తీశారు. టొటొచాన్, మిగతా పిల్లలు వాళ్ళ వెనుకనే గబగబా పరుగెత్తారు. ఆ వేడిగాలిలో ఒంటిమీద బట్టలు లేకపోవడం హాయిగా, అద్భుతంగా ఉంది. అసెంబ్లీహాలు బైటివైపు మెట్లపైకి ఎక్కి చూసేసరికి మిగిలిన వాళ్ళప్పుడే వ్యాయామం మొదలెట్టారు. టొటొచాన్, మిగతా మొదటి తరగతి పిల్లలు వట్టి కాళ్ళతో ఆ మెట్ల మీదినుంచి కిందికి పరుగెత్తారు.

ఈత శిక్షకుడు మియోచాన్ వాళ్ళన్నయ్య. అంటే హెడ్‌మాస్టర్ కొడుకు. ఆయన వ్యాయామవిద్యలో నిపుణుడు. ఆయన టోమోలో ఉపాధ్యాయులు కాదుగాని, ఒక విశ్వవిద్యాలయ ఈతబృందంలో ఉన్నాడు. ఆయన పేరు కూడా బడిపేరే - టోమో, టోమోసాన్ ఈతదుస్తులు వేసుకుని ఉన్నాడు.

వ్యాయామం అయిపోగానే పిల్లల మీద చల్లనీళ్ళు గుమ్మరిస్తుంటే వాళ్ళు కేకలు వేశారు. ఆ తర్వాత పిల్లలందరూ కొలనులో దూకారు. టొటొచాన్ వాళ్ళలో కొందరిని చూసి వాళ్ళు నిలబడగలిగారని సంతృప్తి పడేదాకా నీళ్ళలోకి దిగదలచుకోలేదు. అది స్నానాలగదిలాగ వేడిగా లేదు. ఆ కొలను అందంగా, విశాలంగా ఉంది. అక్కడ చేతులు ఎంతదూరం చాపినా నీళ్ళే నీళ్ళు.

బక్కపల్చటి పిల్లలు, బొద్దయిన పిల్లలు, మగపిల్లలు, ఆడపిల్లలు అందరూ కూడ పుట్టినప్పుడెట్లా ఉన్నారో అట్లా నవ్వుతూ, అరుస్తూ, నీళ్ళు చిమ్ముకుంటూ ఉన్నారు.

'ఎంత సరదాగా ఉంది, ఎంత గమ్మత్తుగా అనిపిస్తోంది' అనుకుంది టొటొచాన్. రాకీ బడికి రాలేకపోయింది గదా అని టొటొచాన్ విచారించింది. ఈతదుస్తులు లేకుండానే కొలనులోకి దిగొచ్చునంటే రాకీ కూడ తప్పకుండా దిగేదే కదూ.

పిల్లలు నగ్నంగా ఈదడానికి హెడ్‌మాస్టర్ ఎందుకు అనుమతించాడని మీకు ఆశ్చర్యం కలగవచ్చు. దాని గురించి నియమాలేమీ లేవు. మీరు ఈతదుస్తులు తెచ్చుకుని, వాటిని వేసుకోదలచుకుంటే దానికేమీ అభ్యంతరం లేదు. మరోవైపు ఇవాల్టిలాగ, మీరు హఠాత్తుగా ఈదాలనుకుంటే, ఈతదుస్తులు లేకపోతే అదయినా ఫర్వాలేదు. మరి వాళ్ళను దిగంబరంగా ఎందుకు ఈదనిచ్చాడు? ఎందుకంటే, ఆయన ఉద్దేశ్యం ప్రకారం, మగ పిల్లలు, ఆడపిల్లలు తమ శరీరాలలోని భేదాల గురించి అనారోగ్యకరమైన ఆసక్తి పెంచుకోవడం మంచిదికాదు. తమ శరీరాలను దాచుకునేందుకు అంత ఇబ్బందులు పడడం అసహజమని ఆయన అనుకునేవాడు.

అన్ని శరీరాలూ అందమైనవే అని ఆయన పిల్లలకి బోధించదలచుకున్నాడు. టోమో విద్యార్థులలో యాసువాకి చాన్‌లాగ పోలియోఉన్న వాళ్ళున్నారు. చాల పొట్టిగా ఉన్న వాళ్ళున్నారు. మరేదో రకమైన అంగవైకల్యం ఉన్నవాళ్ళున్నారు. వాళ్ళందరూ దిగంబరంగా కలిసి ఆడుకోవడం వల్ల వాళ్ళకు వాళ్ళ బలహీనతల గురించి ఉండే సిగ్గు వంటి భావాలు పోతాయని,

ఆత్మన్యూనతాధోరణి తలెత్తకుండా ఉంటుందని ఆయన అనుకునేవాడు. నిజంగానే అంగ వికలురయిన పిల్లలు మొదట సిగ్గుపడినా, తొందరగానే వాళ్ళు ఆనందంగా ఉండడం మొదలయింది. చిట్టచివరికి వాళ్ళు తమ బిడియాన్ని పూర్తిగా వదలుకున్నారు.

కొందరు తల్లిదండ్రులు ఈ ఆలోచన చూసి చింతించారు. తమ పిల్లలకు ఈత దుస్తులిచ్చి తప్పనిసరిగా వేసుకోవాలని నొక్కి చెప్పారు. కాని ఆ దుస్తులు ఎంతగా ఉపయోగంలోకి రాకుండా ఉండేనో వారికి తెలియదు. టొటొచాన్ మొదటి నుంచీ కూడ బరిబాతల ఈదడమే మంచిదని అనుకుంది. టొటొచాన్ లాంటి వాళ్ళను చూసి, తమ దుస్తులు తెచ్చుకోవడం మరిచిపోయామని అంటూనే నీళ్ళలోకి దిగేపిల్లలను చూసే వాళ్ళలో చాలమంది మిగిలిన వాళ్ళలాగ దిసమొలతో ఈదడమే మంచిదనే నిర్ణయానికొచ్చారు. కనుక వాళ్ళు ఇంటికెళ్ళేటప్పుడు మాత్రం ఈతదుస్తులను తడిపి తీసుకెల్ళడం మరిచి పోయేవాళ్ళు కాదు! అందువల్ల టోమోలో పిల్లలందరికీ దాదాపు ఒకేరకంగా నిండా నీరు కావిరంగు పట్టింది. ఈతదుస్తులు వేసుకుంటే పడే తెల్లమచ్చలు ఎవరికీ లేవు.

## రిపోర్టు కార్డు

వీపు మీద పుస్తకాల సంచీ ఎగిరెగిరి పడుతుండగా వెనుకా ముందూ చూడకుండా టొటొచాన్ స్టేషన్ నుంచి ఇంటిదాకా పరుగెత్తుకొచ్చింది. తనను చూసిన ఎవరయినా ఏదో ప్రమాదం జరిగిపోయిందనుకుని ఉంటారు. బడిగేటు దాటిన క్షణం నుంచీ తను అట్లా పరుగెడుతూనే ఉంది.

ఇంటికి చేరగానే తలుపు తెరచీ తెరవడంతోనే "వచ్చేశానోచ్" అని కేకేస్తూ రాకీని వెతికింది. రాకీ ఏమో వాకిట్లో కడుపును పూర్తిగా నేలకు కరిచిపెట్టి సేదదీరుతోంది. టొటొచాన్ పెదవివిప్పి మాట్లాడలేదు. రాకీ ముందర కూచుని వీపు మీది నుంచి సంచీ తీసింది. దాంట్లోంచి ఒక రిపోర్టు కార్డును బైటికి తీసింది. అది టొటొచాన్‌కు మొదటి రిపోర్టు కార్డు. రాకీకి స్పష్టంగా మార్కులు కనబడేటందుకు ఆ రిపోర్టును పూర్తిగా తెరిచి పట్టుకుంది.

"చూడు" అని గొప్పగా చెప్పింది. అక్కడ ఎలు, బిలు, ఇంకా ఏవేవో అక్షరాలున్నాయి. సహజంగానే బి కంటే ఎ మంచిదో, ఎ కంటే బి మంచిదో టొటొచాన్‌కు అప్పటికి తెలియదు. ఇంక రాకీకి ఆ విషయం అర్థం కావడం ఇంకా కష్టం. కాని తన మొట్టమొదటి రిపోర్టు కార్డును అందరికంటె ముందు రాకీకి చూపెట్టాలని టొటొచాన్ అనుకుంది. రాకీకి అది సంతోషంగా ఉంటుందని టొటొచాన్ భావించింది.

తన ముఖం ముందర ఏదో కాగితం కదలాడటం చూసి రాకీ దాన్ని వాసన చూసింది. టొటొచాన్ వేపు తేరిపార చూసింది.

"నీకు నచ్చింది గదూ, నచ్చలేదా? కాని దాంట్లో చాల కష్టమైన మాటలున్నాయిలే, అవన్నీ నువు చదవలేవేమో" అంది టొటొచాన్.

ఆ కార్డును మళ్ళీ ఓసారి పరీక్షగా చూస్తున్నట్టు రాకీ తలను కాస్త పక్కకు వంచింది. ఆ తర్వాత టొటొచాన్ చేతిని నాకింది.

"సరే. ఇప్పుడింక అమ్మకు చూపెడతానేం" అని సంతృప్తిగా లేచింది టొటొచాన్.

టొటొచాన్ వెళ్ళిపోయాక రాకీ అక్కడ్నించి లేచి మరింత చల్లని స్థలం చూసుకుంది. అక్కడది మళ్ళీ నేలకు మెల్లగా కరుచుకుని పడుకుని కళ్ళు మూసుకుంది. అది కళ్ళు మూసుకుని



పడుకున్న తీరుచూస్తే ఒక్క టొటొచాన్ కాక ఎవరైనా సరే అది రిపోర్టు గురించే ఆలోచిస్తున్నదని అనేవాళ్ళు.

## వేసవి సెలవులు మొదలయ్యాయి

"రేపు మనం షికారుకెళ్ళబోతున్నాం. బడికి సాయంత్రం పైజామా, దుప్పట్లతో రండి" అని హెడ్‌మాస్టర్ రాసిన కాగితాన్ని టొటొచాన్ తీసుకొచ్చి అమ్మకు చూపెట్టింది. ఆ మర్నాటి నుంచి వేసవి సెలవులు మొదలవుతున్నాయి.

"ఈ షికారంటే ఏమిటమ్మా" అనడిగింది టొటొచాన్.

అమ్మ కూడ ఇదేమిటా అని ఆలోచిస్తోంది. కాని "బహుశా మీరందరూ ఎటన్నా బైటకి వెళ్ళి అక్కడ డేరాలు వేసుకుని ఓ రాత్రి గడుపుతారేమో! కాదూ? డేరాలో పడుకుంటే చందమామ, చుక్కలు అన్నీ కనబడుతుంటాయి. కాని డేరాలు ఎక్కడ వేస్తారో నాకు అర్థం కావడం లేదు. దీంట్లో ఖర్చులగురించేమీ రాయలేదు గనుక బడికి దగ్గర్లోనే షికారుకెళ్తారేమో" అని జవాబిచ్చింది.

ఆ రాత్రి పక్కెక్కినాక ఎన్నో యుగాల వరకు టొటొచాన్‌కు కన్నంటు కోలేదు. బైటెక్కడికో షికారుకెళ్ళడం అనే ఆలోచనే ఎంతో గొప్పగా కనబడింది. అది ఒక అద్భుత సాహసం. టొటొచాన్ గుండె అతివేగంగా కొట్టుకుంది.

మర్నాడుదయం లేచినప్పటినుంచి సర్దుకోవడం మొదలెట్టింది. కాని ఆ సాయంత్రానికి, పైజామాలు పెట్టుకున్న సంచీ మీద దుప్పటి పెట్టుకుని అందరికీ వీడ్కోలు చెప్పి బయలుదేరుతుంటే టొటొచాన్ చిన్న బోయినట్టనిపించింది. కొంచెం భయం కూడ కలిగింది.

పిల్లలందరూ బడిలో చేరాక "సరే, ఇంక అందరూ అసెంబ్లీ హాలుకి రండి" అన్నాడు హెడ్‌మాస్టర్. అందరూ అక్కడికి చేరుకున్నాక ఏదో గట్టిగా, ఆతుకులుగా ఉన్నదాన్ని పట్టుకుని అక్కడి చిన్న గద్దెమీదికి ఎక్కాడు. అది ఒక ఆకుపచ్చని డేరా.

"డేరా వేసుకోవడం ఎట్లాగో నేను మీకు చూపిస్తాను. జాగ్రత్తగా చూడండి" అంటూ ఆయన దాన్ని తెరిచాడు.

ఒక్కడే ఊదుతూ, గాలితో నింపుతూ, ఇటువైపు తాళ్ళు లాగుతూ, అటువైపు స్తంభాలు పాతుతూ కన్నుమూసి కన్నుతెరిచే లోపల అక్కడ ఓ అందమైన డేరాను తయారు చేశాడాయన.

"ఇక మొదలెట్టండి, మీరిక అసెంబ్లీ హాలునిండా డేరాలు వేసుకోండి. ఇక్కడే మీ షికారన్నమాట" అన్నాడు.

ఎవరయినా అనుకున్నట్టే అమ్మకూడ వాళ్లెక్కడికో బైటికి వెళ్తారని, అక్కడ డేరాలు వేసుకుంటారని అనుకుంది. కాని హెడ్‌మాస్టర్‌కు వేరే ఆలోచనలున్నాయి. రాత్రిపూట వర్షం పడినా, కాస్త చలి పెరిగినా అసెంబ్లీ హాలులో పిల్లలకు సౌకర్యంగా ఉంటుంది.

"ఇదే షికారు, ఇదే షికారు" అని ఆనందంగా సందడి చేస్తూ పిల్లలు బృందాలుగా విడిపోయారు. టీచర్ల సాయంతో చిట్టచివరికి కావలసినన్ని డేరాలు తయారుచేసుకున్నారు. ఒక్కొక్క డేరాలో ముగ్గురు పిల్లలు పడుకోవచ్చు. టొటొచాన్ గబగబా పైజామా, చొక్కా వేసేసుకుంది. కొద్ది సేపట్లోనే పిల్లలందరూ ఈ డేరాలోంచి ఆ డేరాలోకి, ఆ డేరాలోంచి ఈ డేరాలోకి సంతోషంగా పాకడం మొదలెట్టారు ప్రతి డేరాను చూసిపోయేవాళ్ళు చాల మందయిపోయారు.

అందరూ పైజామాల్లోకి మారాక, హెడ్‌మాస్టర్ అందరికీ సరిగ్గా మధ్యలో, అందరికీ కనబడేట్టుగా కూచుకున్నాడు. ఆయన చేసిన విదేశ ప్రయాణాల గురించి చెప్పడం మొదలెట్టాడు.

కొందరు పిల్లలేమో తమ డేరాల్లో పడుకుని తలలు మాత్రం బైటికి నిక్క బెట్టారు. మరి కొందరు సరిగ్గా కూచున్నారు. మరి కొందరేమో వేరే పెద్ద పిల్లల తొడల మీద తలలు వాల్చిపడుకున్నారు. అందరికందరూ తామెన్నడూ చూసి ఉండని, కనీసం వినయినా ఉండని సుదూరదేశాల గాథల్ని ఆసక్తితో వినడం మొదలెట్టారు. హెడ్‌మాస్టర్ చెప్పే కథలు భలే బాగుండేవి. కొన్ని సార్లయితే ఆయన వర్ణించే ఆ సముద్రాలవతలి పిల్లలు బాగా తెలిసిన స్నేహితులే అనిపించేవారు.

అలా అసెంబ్లీహాలులో డేరాల్లో పడుకోవడమనే ఈ మామూలు సంఘటన ఆ పిల్లలకు ఎన్నటికీ మరిచిపోలేని ఒక సంతోషకరమైన, విలువైన అనుభవమైంది. పిల్లలకు ఆనందం కలిగించడం ఎట్లాగో హెడ్‌మాస్టర్‌కు బాగా తెలుసు.

హెడ్‌మాస్టర్ చెప్పడం మానేసి, అసెంబ్లీ హాలులో దీపాలు ఆర్పేశాక పిల్లలందరూ వాళ్ళ వాళ్ళ డేరాల్లోకి వెళ్ళారు. కొందరు పెద్దగా నవ్వుకోవడం వినిపించింది. కొందరు గుసగుసలాడుకోవడం వినిపించింది. అటు చివరెక్కడో ఒక డేరాలోంచి ఘర్షణ పడుతున్నట్టు వినిపించింది. క్రమక్రమంగా అక్కడంతా నిశ్శబ్దం వ్యాపించింది.

అది చందమామా, చుక్కలూ లేని షికారే. కాని దానితో పిల్లలు మనస్ఫూర్తిగా సంబరపడ్డారు. వాళ్ళకు ఆ చిన్న అసెంబ్లీ హాలు షికారు కెళ్ళే మైదానంలా కనిపించింది. జ్ఞాపకం ఆ రాత్రిని ఎల్లకాలానికీ చంద్రకిరాణాలతో, చుక్కల కాంతితో అలంకరించింది.

## గొప్ప సాహసం

అసెంబ్లీహాలులో షికారు అయిపోయాక రెండు రోజులకి టొటొచాన్ గొప్ప సాహసం చేయవలసిన రోజొచ్చింది. ఆ రోజు టొటొచాన్ యాసువాకి చాన్‌ను కలుస్తానని చెప్పింది! అది రహస్యం. అమ్మకూ నాన్నకూ తెలియదు. యాసువాకి చాన్ వాళ్ళ అమ్మకూ నాన్నకూ కూడా తెలియదు. టొటొచాన్ ఆ రోజు యాసువాకి చాన్‌ను తన చెట్టుమీదికి ఆహ్వానించింది.

టోమోలో పిల్లలు తమ బడి ఆవరణలోని చెట్లను ఒక్కొక్కటి ఒక్కొక్కళ్ళు ఎక్కే స్వంత చెట్లుగా చూసుకునే వాళ్ళు. టొటొచాన్ చెట్టు ఆవరణలో మూలకి కంచె పక్కన ఉండేది. ఆ కంచెకవతల కుహోంబుట్సు దేవాలయానికి వెళ్ళే బాట ఉండేది. అది చాలా పెద్ద చెట్టు. ఎక్కుతుంటే జారిపోయేది కూడ. కాని జాగ్రత్తగా ఎక్కగలిగితే నేల నుంచి ఆరడుగుల ఎత్తున విశాలమైన పంగ ఉండేది. ఆ పంగ ఒక ఊయలంత సౌకర్యంగా ఉండేది. టొటొచాన్ విరామ సమయాల్లో బడి అయిపోయినాక అక్కడికి ఎక్కికూచుని దూరతీరాలకో, ఆకాశంలోకో, కింద తిరుగాడే మనుషులవైపో చూడడం అలవాటు చేసుకుంది.

పిల్లలు "తమ చెట్టు" తమ స్వంత ఆస్తి అన్నట్టు భావించే వాళ్ళు. కనుక ఒకళ్ళు ఇంకొకళ్ళ చెట్టు ఎక్కాలనుకుంటే చాల మర్యాదగా వాళ్ళ అనుమతి అడగాల్సి ఉండేది. "ఏమబ్బా, నేను నీ చెట్టుమీదికి రావచ్చా?" అని అడిగేవాళ్ళు.

యసువాకి చాన్‌కు పోలియో ఉన్నందువల్ల ఆ అబ్బాయి ఎప్పుడూ ఏ చెట్టూ ఎక్కలేదు. కనుక తనకు తనదని చెప్పుకునే చెట్టేదీ లేదు. అందుకే టొటొచాన్ యాసువాకి చాన్‌ను తన





చెట్టుమీదికి పిలవాలని అనుకుంది. అందరికీ తెలిస్తే పెద్ద రభస చేస్తారనుకుని ఈ సంగతి ఎవరికీ చెప్పొద్దంటే చెప్పొద్దనుకున్నారు.

ఇంట్లోంచి బైటికెళ్ళేప్పుడు డెనెన్‌చోపులో ఉన్న యాసువాకి చాన్ వాళ్ళ ఇంటి కెళ్తున్నానని అమ్మతో చెప్పి బయల్దేరింది టొటొచాన్. చెపుతున్నది అబద్ధం గనుక టొటొచాన్ అమ్మ ముఖంలోకి చూడలేక పోయింది. బూట్లలేసులవైపు చూస్తూ చెప్పేసింది. కాని రాకీ తనతోపాటు స్టేషన్‌దాకా వెళ్ళింది. అక్కడింక విడిపోయేటప్పుడు రాకీతో మాత్రం అసలు సంగతి చెప్పేసింది.

"మరే, నేనూ యాసువాకి చాన్‌ను ఇవాళ నా చెట్టు ఎక్కడానికి పిలిచాను" అని.

మెడలో రైలుపాసు రెపరెపలాడుతూండగా టొటొచాన్ బడి దగ్గరికి చేరేసరికి ఆవరణలో పూలమొక్కల పక్కన యాసువాకి చాన్ ఎదురు చూస్తూ కూచున్నాడు. అవి వేసవి సెలవులు గనుక ఆవరణంతా నిర్మానుష్యంగా ఉంది. యాసువాకి చాన్ టొటొచాన్ కన్న ఒక సంవత్సరం మాత్రమే పెద్ద. కాని మాట్లాడుతున్నప్పుడు ఇంకా పెద్దవాడిలా అనిపించేవాడు.

చూడగానే టొటొచాన్ వైపు గబగబా కాలు ఈడుస్తూ తనను తాను నిలదొక్కుకోవడానికి చేతులు చాపి పట్టుకుంటూ వచ్చాడు యాసువాకి చాన్. తామిద్దరూ కలిసి ఏదో రహస్యమైన పనిచేయబోతున్నామనే ఉద్వేగంతో టొటొచాన్ ఊగిపోయింది. యాసువాకిచాన్ వైపు చూసి టొటొచాన్ పలకరింపుగా నవ్వింది యాసువాకి చాన్ కూడ ముఖం నిండా నవ్వు నింపుకుని బదులిచ్చాడు.

టొటొచాన్ యాసువాకి చాన్‌ను తన చెట్టు దగ్గరికి తీసుకుపోయింది. ముందు రాత్రి ఆలోచించి పెట్టుకున్నట్లుగానే కాపలాదారు గదికి పరుగెత్తి ఒక నిచ్చెన తీసుకొచ్చింది. నిచ్చెనను చెట్టుదగ్గరికి లాగి కాండానికి ఆనించి పంగ దగ్గరికి అందేలా వేసింది. గబగబా తాను పైకెక్కేసి, నిచ్చెనపైన పట్టుకుని "సరే ఇంక మెల్లగా పైకెక్కు" అని కిందికి కేకేసింది.

యాసువాకి చాన్ చేతులు, కాళ్ళు కూడా ఎంత బలహీనంగా ఉన్నాయంటే సహాయం లేకుండా మొదటిమెట్టు ఎక్కడం కూడ కష్టమైపోయింది. కనుక టొటొచాన్ నిచ్చెన దిగి కిందికి వచ్చేసి, యాసువాకి చాన్‌ను కింది నుంచి పైకినెట్టడం మొదలెట్టింది. కాని టొటొచాన్ కూడ ఎంత చిన్నగా, ఎంత సుకుమారంగా ఉన్నదంటే, నిచ్చెనను కదలకుండా నిలబెట్టడం అలా ఉంచి, చేయగలిగిందల్లా యాసువాకి చాన్‌కు అంటిపెట్టుకుని ఉండడమే. యాసువాకి చాన్ మొదటి మెట్టుమీది నుంచి దిగిపోయి, తల వంచుకొని నిచ్చెన పక్కన నిలబడ్డాడు. ఈ పని తాను అనుకున్న దానికంటె కష్టమైంది కావచ్చునని టొటొచాన్‌కు మొదటిసారి తట్టింది. ఇప్పుడింక ఏం చెయాలి?

ఏమైనాసరే యాసువాకి చాన్‌ను చెట్టు ఎక్కించాల్సిందేనని టొటొచాన్‌కు బలంగా అనిపించింది. యాసువాకి చాన్‌కూ ఆ కోరిక గాఢంగానే ఉంది. ఇక టొటొచాన్ వెళ్ళి సూటిగా యాసువాకి చాన్ ముందు నిలబడింది. ఆ అబ్బాయి చాల నిరుత్సాహపడి ఉన్నాడు. తనలో సంతోషం కలిగించేందుకు టొటొచాన్ బుగ్గలు పొంగించి నవ్వొచ్చేలా ముఖం పెట్టింది.

"ఆగాగు! నాకో ఆలోచన వచ్చింది" అంటూ టొటొచాన్ మళ్ళీ కాపలాదారు గదికి పరుగుతీసింది. అక్కడ తనకు పనికొచ్చే పరికరం ఏదన్నా దొరుకుతుందేమోనని ఒక్కొక్కటీ తీసి చూసింది. చిట్టచివరికి దానంతటదే నిలబడే నిచ్చెన ఒకటి దొరికింది. అది నిలబడే ఉంటుంది. గనుక తాను దాన్ని పట్టుకోనక్కరలేదు.

తన బలానికి తానే ఆశ్చర్యపోతూ టొటొచాన్ ఆ నిచ్చెనను లాక్కు వెళ్ళింది. నిచ్చెనచెట్టు పంగల ఎత్తుదాకా రావడం చూసి టొటొచాన్ ఆనందంతో తలమునకలయింది.

ఒక పెద్దక్క హామీ ఇస్తున్నట్లుగా "అఁ ఇంక భయం లేదులే. ఇది అటూ ఇటూ ఊగిసలాడదు" అంది.

యాసువాకి చాన్ ఈ నిలబడే నిచ్చెనవైపు కూడా అపనమ్మకంగా చూశాడు. ఆ తర్వాత టొటొచాన్‌వైపు తేరిపార చూశాడు. టొటొచాన్ చెమటలో తడిసి ముద్దయి ఉంది. యాసువాకిచాన్‌కు కూడ విపరీతంగా చెమటలు పోస్తున్నాయి. చెట్టువైపు చూపులు సారించి ఇక ఏదో నిశ్చయంతో మొదటిమెట్టు మీద పాదం మోపాడు.

యాసువాకి చాన్‌కు ఆ నిచ్చెన పైకి చేరటానికి ఎంతసేపు పట్టిందో గుర్తించే స్పృహ ఇద్దరికీ లేదు. ఎండాకాలపు సూర్యుడు తీక్షణంగా మండిపోతుండగా యాసువాకి చాన్‌ను నిచ్చెనపైకి చేర్చాలనే ఒకే ఒక్క ఆలోచన తప్ప మరే సంగతీ వాళ్ళు పట్టించుకోలేదు. టొటొచాన్ యాసువాకి చాన్ కిందికిచేరి కాళ్ళను చేతులతో పైకినెడుతూ, శరీరం మొత్తాన్ని తలతో పైన నిలబెడుతూ పైకితోసింది. యాసువాకి చాన్ కూడ తన శక్తినంతా ఉపయోగించి పైకి సాగి చిట్టచివరికి నిచ్చెన పైకి చేరాడు.

ఇద్దరూ "వారెవ్వా" అని కేకలేశారు.

కానిమళ్ళీ అక్కడ నిరాశే ఎదురయింది. అక్కడి నుంచి పంగల మీదికి టొటొచాన్ దూకేసింది. కాని ఎంత ప్రయత్నించినా యాసువాకిచాన్‌ను నిచ్చెనపై నుంచి చెట్టు పంగల మీదికి తీసుకురావడం అసాధ్యమైపోయింది. నిచ్చెనను గట్టిగా పట్టుకుని యాసువాకి చాన్ టొటొచాన్ వైపు చూశాడు. టొటొచాన్‌కు బాగా ఏడుపొచ్చింది. యాసువాకి చాన్‌ను తన చెట్టు మీదికి పిలవాలని, అక్కడ ఎన్నెన్నో వస్తువులు చూపాలని టొటొచాన్ ఎంతగా అనుకుందో !

కాని టొటొచాన్ఏడవలేదు తానుగనుక ఏడిస్తే, యాసువాకిచాన్ కూడ ఏడుస్తాడని టొటొచావ్ ఏడుపు దిగమింగుకుంది.

పోలియో వల్లనిశ్చలంగా కట్టగట్టుకున్నట్టు తయారయిన యాసువాకి చేతివేళ్ళని టొటొచాన్ తన చేతుల్లోకి తీసుకుంది. యాసువాకి చాన్ చెయ్యి టొటొచాన్ చెయ్యికన్న పెద్దది. ఆ వేళ్ళు టొటొచాన్ వేళ్ళ కన్నపొడుగ్గా ఉన్నాయి. టొటొచాన్ ఆ అబ్బాయి చెయ్యి చాలాసేపు పట్టుకుని "పడుకోనేను నిన్ను ఈ పంగల మీదికి లాగడానికి ప్రయత్నిస్తాను." అంది.

యాసువాకిచాన్ తన నిచ్చెన మీద బోర్లాపడుకున్నాడు.టొటొచాన్ చెట్టు పంగల మీద నిలబడి ఆ అబ్బాయిని చెట్టుపైకి లాగడానికి ప్రయత్నించడం మొదలెట్టింది. ఆ దృశ్యాన్ని ఎవరైనా పెద్దవాళ్ళు చూసినట్లయితే గందరగోళం చేసి ఉండే వాళ్ళే. అది చాలా ఘోరమైన ప్రమాదంతో కూడిన పనిగా కనబడేదే.

కాని యాసువాకి చాన్‌కుటొటొచాన్‌లో పూర్తి విశ్వాసం ఉంది. టొటొచాన్ ఆ అబ్బాయి కోసం తన ప్రాణాన్నే పణంగా పెడుతోంది. తన చిన్నారి చేతులతో యాసువాకి చాన్ చేతుల్ని గట్టిగా



పట్టుకుని తన శక్తినంతా ఉపయోగించి లాగడం మొదలెట్టింది. మండుటెండను కురిపిస్తున్న సూర్యుణ్ణించి వాళ్ళను రక్షించడానికి అప్పుడప్పుడూ ఓపెద్ద మబ్బుముక్క తొంగిచూసింది.

ఎంతోసేపు ప్రయత్నించాక, చివరికి ఇద్దరూ చెట్టుమీద ఒకరికెదురుగా ఒకరు నిలబడ్డారు. తడి వెంట్రుకల్ని వెనక్కి తోసుకుంటూ టొటొచాన్ మర్యాదగా వంగి "నా చెట్టుమీదికి స్వాగతం" అంది.

యాసువాకి చాన్ కాస్త సిగ్గుగా చిరునవ్వు నవ్వుతూ కాండానికి చేరగిలబడి "నేను లోపలికి రావచ్చా?" అని అడిగాడు.

యాసువాకి చాన్ అంతవరకు ఎన్నడూ చూసి ఉండని దృశ్యాలెన్నిటినో అక్కడ్నించి చూడగలిగాడు. "అమ్మయ్య. చెట్టెక్కడం అంటే ఇలా ఉంటుందన్న మాట" అన్నాడు యాసువాకి చాన్ సంబరంగా.

వాళ్ళు ఆ చెట్టుమీదనే చాల సేపున్నారు. బోల్డన్నిసంగతులు మాట్లాడుకున్నారు.

మరే -అమెరికాలో మా అక్కయ్య ఉంది. వాళ్ళకంట, టెలివిజన్ అనేదొకటి, ఉందంట. అది మన జపాన్‌కువస్తే, మనం ఇంట్లో కూచునికూడ సుమో ముష్టియుద్ధం చూడొచ్చట. అది ఒక పెట్టెలాగుంటుందట" అని యాసువాకి చాన్ ఉత్సాహంగా చెప్పాడు.

బైటికి ఎటూ వెళ్ళలేని యాసువాకి చాన్‌కు, అన్ని సంగతులూ ఇంట్లోనే చూడగలిగే ఆ పెట్టె ఎంత విలువయినదవుతుందో టొటొచాన్‌కు అప్పటికి అర్థం కాలేదు.

టొటొచాన్ ఆశ్చర్యపోయిందల్లా, మనింట్లోని చిన్న పెట్టెలోకి సుమో పహిల్వాన్లు ఎట్లా వెళ్ళగలుగుతారనే. సుమో పహిల్వాన్లు ఎంత పెద్దగా ఉంటారో! ఐనా ఇదేదో భలే బాగుంది. ఆ రోజుల్లో టెలివిజన్ గురించి ఎవరికీ తెలియదు. టొటొచాన్‌కు దాని గురించి చెప్పిన మొదటి వ్యక్తి యాసువాకి చానే.

కీచురాళ్ళు రొద పెడుతుండగా, ఇద్దరు చిన్నారి పిల్లలు ఆనందంలో తేలియాడారు. యాసువాకి చాన్‌కైతే చెట్టు ఎక్కడం అదే మొదటిసారి, అదే చివరిసారి కూడ.

## ధైర్యంలో పోటీ

"భయపెట్టేదీ, పాడుకంపు గొట్టేదీ, మంచిరుచి ఉండేదీ ఏమిటి?"

ఈ పొడుపు కథంటే వాళ్ళందరికీ ఎంతో ఇష్టం. వాళ్ళకు జవాబు తెలిసిందే అయినా టొటొచాన్, మిగతా పిల్లలు కూడ ఒకళ్ళతో ఒకళ్ళు "భయపెట్టేదీ, పాడు కంపు గొట్టేదీ ఏమిటనే పొడుపు కథ అడగవా" అని అడుక్కునే వాళ్ళు.

దానికి జవాబేమిటంటే "చిక్కుడు గింజల పచ్చడితో చేసిన రొట్టెను దొడ్లోతినే దయ్యం" అని.

టోమోలో ధైర్యపు పోటీ ఎట్లా ముగిసిందనేది కూడ ఒక మంచి పొడుపుకథే అవుతుంది. "భయపట్టేదీ, దురదపుట్టించేదీ, నవ్వించేదీ ఏమిటి?"

వాళ్ళు అసెంబ్లీ హాలులో గుడారాలు వేసుకుని గడుపుతున్నప్పుడు హెడ్ మాస్టర్ "మనం ఓ రోజు రాత్రి కుహోంబుట్సు గుడి దగ్గర ధైర్యపు పోటీ పెడదాం. దయ్యంగా ఉండదలచుకున్న వాళ్లెవరో చెయ్యి ఎత్తండి" అన్నాడు.

దాదాపు ఏడుగురు మగపిల్లలు ఆ అవకాశంకోసం పోటీపడ్డారు. అనుకున్న రోజు

సాయంత్రం పిల్లలందరూ బడి ఆవరణలో గుమిగూడారు. దయ్యాల వేషాలు వెయ్యదలచుకున్న మొగపిల్లలు దుస్తులు తయారుచేసి తెచ్చుకున్నారు. గుడి ఆవరణలో దాక్కునేందుకు వెళ్ళిపోయారు.

"చూస్కోండి. మిమ్మల్ని చచ్చేంత భయపెడతాం" అంటూ వాళ్ళు వెళ్ళిపోయారు.

మిగిలిన ముప్పైమంది పిల్లలూ ఐదుగురు ఐదుగురు గుంపులుగా, గుంపుకీ గుంపుకీ మధ్య వ్యవధి ఇస్తూ గుడివైపు కదిలారు. వాళ్ళు తిన్నగా గుడి దగ్గరికి వెళ్ళి అవరణచుట్టూ తిరిగి, స్మశానంలోకి వెళ్ళి అప్పుడు బడికి తిరిగిరావాలి.

ఎవరెవరికి ఎంత ధైర్యం ఉన్నదో పరీక్షించడానికే ఈ పోటీ అని హెడ్‌మాస్టర్ చెప్పారు. ఐనా సరే, ఎవరయినా ప్రదక్షిణ పూర్తి కాకుండానే వెనక్కి వచ్చేసినా ఫర్వా లేదని కూడ చెప్పారు.

టొటొచాన్ అమ్మను అడిగి ఒక ఫ్లాష్‌లైట్ పట్టుకొచ్చింది.

"పోగొట్టకు" అని జాగ్రత్త చెపుతూనే అమ్మ ఆ లైటు ఇచ్చింది.

మగ పిల్లల్లో కొందరు తాము దయ్యాల్ని పట్టుకోబోతున్నామన్నారు. సీతాకోక చిలుకల్ని పట్టే వలలు పట్టుకొచ్చారు. మరి కొందరయితే తాళ్ళు పట్టుకొచ్చి, తాము దయ్యాల్ని కట్టెయ్యబోతున్నామన్నారు.

వాళ్ళు ఏం చేయవలసి ఉంటుందో హెడ్‌మాస్టర్ వివరించే వరకే చీకటిపడిపోయింది. "రాయి, కాగితం, కత్తెర" అంటూ ఆడుతూ పిల్లలు బృందాలుగా విడిపోయారు. మొట్టమొదటి బృందం ఉద్వేగంతో కేరింతలు కొడుతూ బడిగేటువైపు కదిలిపోయింది. చిట్టచివరికి టొటొచాన్ బృందం కూడ కదిలే సమయం వచ్చింది.

కుహోంబుట్సు గుడికి చేరేవరకూ వాళ్ళకు దయ్యాలు ఎదురు పడవని హెడ్‌మాస్టర్ అన్నారు గాని పిల్లలకు అంత నమ్మకం కలగలేదు. గుడి సింహద్వారం దగ్గరికి చేరేవరకు పిల్లలు భయం భయంగానే నడిచారు. అక్కడి నుంచి వాళ్ళు రక్షక దేవరాజుల విగ్రహాల్ని చూడగలిగారు. చంద్రుడు ఉన్నా గుడి ఆవరణ అంతా కటిక చీకటి ఉన్నట్టే అనిపించింది. పగటిపూటయితే అక్కడ హాయిగా, విశాలంగా ఉంటుంది. కాని ఇప్పుడో? ఏ క్షణాన దయ్యాలు ఎదురు పడతాయోనని పిల్లలు ఎంత భయపడ్డారంటే ఆ ఆవరణలో వుండలేకపోయారు. గాలికి చెట్టుకొమ్మ ఊగితే, గలగలలాడితే "బాబోయ్" అని ఒకరు అరిచేవారు. ఒకరి కాలు మరొకరికి తగలగానే "దయ్యం వచ్చేసిందోయ్" అని మరొకరు అరిచేవారు. చిట్టచివరికి అప్పటిదాకా చేతిలో చెయ్యి కలిపి ఉన్న మిత్రుడే దయ్యం కావచ్చుననుకునేంత దాకా వెళ్ళింది. స్మశానం దాకా వెళ్ళగూడదని టొటొచాన్ నిర్ణయించుకుంది. దయ్యాలు ఎదురు చూస్తూ ఉండేది. అక్కడే గదా. ఐనా ధైర్యం పోటీలంటే ఏమిటో తెలిసిపోయింది గనుక ఇంక వెనక్కి వెళ్ళిపోయినా ఫర్వాలేదు గదా అనుకుంది టొటొచాన్. ఆమెతోపాటు ఉన్న వాళ్ళలో అందరూ కూడ అదే సమయానికి, అదే నిర్ణయం తీసుకున్నారు. నిర్ణయం తీసుకున్నది తానొక్కతే కాదని గుర్తించడం సంతృప్తి నిచ్చింది టొటొచాన్‌కు. ఇక వాళ్ళందరూ ఎంత వేగంగా కాళ్ళు పరుగెత్త గలిగితే అంతవేగంగా పరుగెత్తారు.

బడికి చేరి చూసేసరికల్లా, తమకంటే ముందు బయల్దేరిన గుంపులన్నీ కూడ అక్కడే ఉన్నాయి. అంటే స్మశానం దాకా వెళ్ళడానికి దాదాపు ప్రతి ఒక్కరూ భయపడ్డారన్నమాట.

సరిగ్గా అప్పుడే తలకు తెల్లగుడ్డ చుట్టుకున్న ఒక పిల్లవాడు ఏడుస్తూ గేట్లోంచి వచ్చాడు. ఆ పిల్లవాడి వెంట ఒక టీచర్ కూడా ఉన్నాడు. ఆ పిల్లవాడు దయ్యం వేషం వేసుకోదలచుకున్న పిల్లల్లో ఒకడట. అంతసేపూ స్మశానంలో ఎవరయినా వస్తారేమోనని ఎదురుచూస్తూ దాగి ఉండి, ఎవరూ రాకపోయే సరికి భయపడిపోయాడట. కాసేపటికి బయటికివచ్చి ఏడుస్తూ నిలబడ్డాడట.



అప్పుడక్కడ తిరుగుతున్న టీచర్ ఆ పిల్లవాణ్ని చూసి తీసుకొచ్చాడట. ఆ పిల్లవాణ్ణి కుదుటపరిచి, సంతోష పెట్టడానికి అందరూ ప్రయత్నిస్తుండగానే రెండో దయ్యం కూడా ఏడుస్తూ, మరోకుర్రాడితో కలిసి తిరిగి వచ్చింది. ఆ కుర్రాడుకూడా ఏడుస్తూనే ఉన్నాడు. దయ్యం వేషం వేసిన కుర్రాడేమో స్మశానంలో దాక్కుని ఉండగా, తనవైపు ఎవరో పరుగెత్తుకొస్తున్నట్లు వినబడిందట. బైటికి ఒక్కదూకుదూకి భయపెడదామని ప్రయత్నించేసరికి ఇద్దరూ ఒకరినొకరు ఢీ కొట్టారట. గాయపడి, చచ్చేంతభయంతో ఇద్దరూ వెనక్కి పరుగెత్తుకొచ్చారు. అదంతా తమాషాగా అనిపించింది. అంతగా భయపడిన తర్వాత పిల్లలలందరూ ఎంతో తేరుకుని మనస్ఫూర్తిగా నవ్వేశారు. దయ్యాలు ఏడుస్తూనే నవ్వాయి. మరికాసేపటికే టొటొచాన్ తరగతిలోని మరో పిల్లవాడు కూడ వచ్చేశాడు. ఆ అబ్బాయి ఇంటిపేరు మిగిటా. మిగిటా వార్త పత్రికతో చేసిన ముసుగు తొడుక్కుని దయ్యం వేషం వేసుకున్నాడు. స్మశానంలోకి ఎవరూ రాలేదని కోపం తెచ్చుకున్నాడు.

"ఇంతసేపూ నేను అక్కడ ఎదురు చూస్తూనే ఉన్నా" అని చేతుల మీద, కాళ్ళ మీద దోమకాట్ల దగ్గర గోక్కుంటూ ఫిర్యాదు చేశాడు మిగిటా.

"అరెరె-దయ్యానికి దోమలు కుట్టినట్లున్నాయే" అని ఎవరో అన్నారు. మళ్ళీ అందరూ నవ్వుల్లో మునిగిపోయారు.

"సరే, ఇక నేనే అక్కడికి వెళ్ళి మిగిలిన దయ్యాల్ని తీసుకురావడం మంచిదేమో" అంటూ బయల్దేరాడు ఐదోతరగతి టీచర్ మరుయామా. వీధిదీపాల కింద భయంతో నిలబడిపోయిన దయ్యాలను, భయపడి ఇళ్ళకు వెళ్ళిపోయిన దయ్యాలను అందరినీ పోగుచేసుకుని బడికి తీసుకొచ్చాడాయన.

ఆ రాత్రి తర్వాత టోమో విద్యార్థులు ఎప్పుడూ దయ్యాలకు భయపడలేదు. ఎందుకంటే,దయ్యాలు కూడ భయపడతాయని తెలిసిపోలేదూ?

## రిహార్సల్ హాలు

టొటొచాన్ నిశ్శబ్దంగా నడిచింది. అప్పుడప్పుడూ టొటొచాన్ వైపు చూస్తూ రాకీ కూడా నిశ్శబ్దంగా నడిచింది. ఈ నిశ్శబ్దానికి అర్థం ఒక్కటే. వాళ్ళిద్దరూ నాన్న రిహార్సల్ హాలులోకి తొంగి చూడబోతున్నారన్నమాట. మామూలుగా అయితే టొటొచాన్ గంతులువేస్తూ వీలయినంత వేగంగా పరుగెత్తుతుంది. ఏదో పారేసుకుని వెతుకుతున్నట్టు అటూ ఇటూ చూస్తూ నడుస్తుంది. వేరేవాళ్ళ పెరటితోటలకు అడ్డంపడి ఒక దాని తర్వాత ఒకటిగా కంచెల కింది నుంచి దూరిపోతూంటుంది.

నాన్న వాళ్ళ రిహార్సల్ హాలుకు వెళ్ళాలంటే ఇంటి నుంచి ఐదు నిమిషాల నడక. ఆయన ఒక సంగీత బృందానికి స్వరకర్త. ఐతే అక్కడ స్వరకర్త అంటే ఆయన పని వయొలిన్ వాయించడమే. ఒకసారి సంగీత సభకు టొటొచాన్‌ను కూడ తీసుకువెళ్లారు. అక్కడ ఒక విషయం టొటొచాన్‌కు విచిత్రంగా కనబడింది. అక్కడికి వచ్చిన వాళ్లందరూ చప్పట్లుకొట్టడం ముగించగానే సంగీత వాయిద్యాల ముందున్న కండక్టర్ చెమటలు కక్కుతూ ప్రేక్షకుల వైపు తిరిగాడు. వేదికమీది నుంచి దిగివచ్చి, వయొలిన్ వాయిస్తున్న నాన్నతో కరచాలనం చేశాడు. అప్పుడు నాన్న లేచి నిలబడ్డాడు సంగీతం వాయించిన వాళ్లందరూ లేచి నిలబడ్డారు.

"వాళ్ళు అట్లా చేతులు ఎందుకు ఊపుకుంటున్నారు?" అని గుసగుసలాడింది టొటొచాన్.

"చాల బాగా వాయించారని కండక్టర్ సంగీత బృందానికి కృతజ్ఞతలు చెప్పదలచుకున్నాడు. సంగీత బృందానికి నాన్నే పెద్దగనుక నాన్నతో చేతులు కలిపి తన కృతజ్ఞత తెలపాడు" అని వివరించింది అమ్మ.

రిహార్సల్ హాలుకు వెళ్ళడమంటే టొటొచాన్‌కు చాల ఇష్టం. ఎందుకంటే బడిలోనైతే అందరూ చిన్న పిల్లలే ఉంటారుగద. ఇక్కడైతే అందరూ పెద్దవాళ్ళుంటారు. వాళ్ళేమో అన్ని రకాల వాయిద్యాలూ వాయిస్తారు. అంతేగాక కండక్టర్ రోసెన్‌స్టాక్ జపనీస్ భాషను విచిత్రంగా మాట్లాడేవాడు.

జోసెఫ్ రోసెన్‌స్టాక్ యూరప్‌లో పెద్దపేరున్న సంగీతకారుడట. నాన్న టొటొచాన్‌కు చెప్పాడు. కాని అక్కడేమో హిట్లర్ అని ఒకాయన ఏవేవో చెడ్డపనులు చేస్తున్నాడట. అందుకని రోసెన్‌స్టాక్ అక్కడినుంచి తప్పించుకుని ఇంతదూరం, జపాన్‌కు సంగీతం కోసమే వచ్చాడట. రోసెన్‌స్టాక్ అంటే నాన్నకు చాల గౌరవం. టొటొచాన్‌కు ఆ ప్రపంచ పరిస్థితి ఏమిటో అర్థమయ్యేది కాదు. కాని సరిగ్గా ఆ సమయానికే హిట్లర్ యూదులను వేటాడడం మొదలెట్టాడు. అది జరగకపోయిఉంటే రోసెన్‌స్టాక్ జపాన్‌కు వచ్చి ఉండేవాడేకాదు. స్వరకర్త కొస్కాక్ యమూడా రూపొందించిన ఈ సంగీతబృందం, అంతర్జాతీయ స్థాయిగల ఈ కండక్టర్ రాక పోయి ఉంటే, ఇప్పుడు సాధించిన అభివృద్ధి, ఇంత తక్కువ కాలంలో సాధించి ఉండగలిగేదే కాదు. యూరప్‌లో మొదటిశ్రేణి సంగీతబృందం నుంచి ఏ ప్రమాణాలను



ఆశిస్తాడో, ఆ ప్రమాణాలనే రోసెన్‌స్టాక్ ఈ సంగీత బృందంలో కూడ కోరుకున్నాడు. అందుకే ప్రతిసారీ రిహార్సల్స్ అయిపోగానే రోసెన్‌స్టాక్ కళ్ళు చెమ్మగిల్లేవి, ఏడ్చేసేవాడు.

"నేను ఇంత కష్టపడతున్నాను. మీలో కనీసం చలనం ఉండదేం?" అనేశాడు.

రోసెన్‌స్టాక్ విశ్రాంతి తీసుకునేటప్పుడు కండక్టర్‌గా పనిచేసే హిడిమో సైటో మంచి జర్మన్ మాట్లాడేవాడు. అందరితరఫునా జవాబిస్తూ "మేం చెయ్యగల ప్రయత్నాలన్నీ చేస్తున్నాం. మాకింకా తగినంత ఉత్తమమైన పద్ధతి అలవాటు కాలేదు. కాని మేం కావాలని చెడగొట్టడం మాత్రం లేదని మీకు హామీ ఇస్తున్నాను" అనేవాడు.

ఈ పరిస్థితి, గందరగోళం టొటొచాన్‌కు అర్థమయ్యేవికావు. కాని అప్పుడప్పుడు ఆయన ముఖం ఎంత ఎర్రబడి పోయేదంటే, ఆయన తలలోంచి పొగలు వస్తున్నాయోమోననిపించేది. ఆయన జర్మన్‌లో అరవడం మొదలుపెట్టేవాడు. అటువంటి సందర్భాలలో తనకిష్టమైన కిటికీలో గడ్డంకింద చెయ్యిపెట్టుకుని చూస్తూ ఉండే టొటొచాన్ వెంటనే దిగిపోయేది. రాకీతోపాటు కింద దాక్కొని కూచునేది. ఊపిరికూడ బిగపట్టుకుని మళ్ళీ సంగీతం మొదలయేదాకా ఎదురు చూస్తుండేది.

కాని మామూలు సమయాల్లో రోసెన్‌స్టాక్ చాలప్రేమగా ఉండేవాడు. ఆయన జపనీస్ మాట్లాడుతుంటే ముచ్చటగా ఉండేది.

వాళ్ళు చాలా బాగా వాయించినప్పుడల్లా తమాషా అయిన యాసతో "చాల బావుంది కురొయనాగి సాన్" అనో "అద్భుతం" అనో అంటూ ఉండేవాడు.



టొటొచాన్ రిహార్సల్ హాలు లోపలికి ఎప్పుడూ వెళ్ళలేదు. ఎప్పుడైనా కిటికీ లోంచి తొంగి చూడడమేతనకు ఇష్టంగా ఉండేది. అక్కడ్నించే సంగీతం వింటుండేది. కనుక వాళ్ళు ఎప్పుడు విరామం కోసం సంగీతం ఆపి, సిగరెట్ల కోసం బైటికి వచ్చినా నాన్నకు టొటొచాన్ అక్కడ కనబడుతుండేది.

"ఓహో, టొట్స్కే, నువు ఇక్కడున్నావా" అని నాన్న పలకరించేవాడు.

రోసెన్‌స్టాక్ గనుక టొటొచాన్‌ను చూసినట్టయితే వెంటనే తనవింత యాసతో "శుభోదయం" అనో "బావున్నారా" అనో పలకరించేవాడు. చిన్నప్పుడు ఎట్లా ఎత్తుకునే వాడో, ఇప్పుడు పెద్దపెరిగిన తర్వాత కూడ అట్లాగే ఎత్తుకునే వాడు. టొటొచాన్ చెక్కిలికి తన చెక్కిలి చేర్చేవాడు. ఆయనట్లా చేస్తే టొటొచాన్‌కు ఇబ్బందిగా ఉండేదిగాని, రోసెన్‌స్టాక్ అంటే చాల ఇష్టంగా ఉండేది గనుక ఏమీ అనేది కాదు. ఆయన కళ్ళజోడు పెట్టుకునేవాడు. ఆ జోడుకు సన్నని వెండి అంచు ఉండేది. ఆయనకు వెడల్పాటి ముక్కు ఉండేది. ఏమంత పొడగరి కాడు. ఆయన ముఖం ఎంత ఆకర్షణీయంగా ఉండేదంటే చూడగానే వెంటనే ఆయన కళాకారుడని గుర్తించగలిగేట్టు ఉండేది.

టొటొచాన్‌కు రిహార్సల్ హాలంటే చాల ఇష్టంగా ఉండేది. అది కొంతవరకు పాశ్చాత్య పద్ధతిలో ఉండేది. అక్కడక్కడ శిథిలమై కూడ ఉండేది.

సెన్‌జోకు సరసుమీదినుంచి సాగివచ్చేగాలి వల్ల రిహార్సల్ హాలులోని సంగీతం దూరతీరాలకు కూడ వినబడుతుండేది. కొన్నిసార్లు బంగారుతీగల చేపలు అమ్ముకునే వాళ్ళకేకలు, సంగీతం కలిసి వినబడుతుండేవి.

## వేడి నీటి ఊట దగ్గరికి ప్రయాణం

వేసవి సెలవులు అయిపోవచ్చాయి. వేడినీటి ఊటదగ్గరికి విహారం వెళ్ళేరోజు చిట్టచివరికి రానే వచ్చింది. విద్యార్థులందరూ టోమోలో ముఖ్యమైన సంఘటన ఈ విహారదినమే అనుకునే వాళ్ళు. అమ్మకు ఇదివరకు ఏమంత ఎక్కువ సంగతులు ఆశ్చర్యం కలిగించలేదు గాని, ఓ రోజు టొటొచాన్ బడినుంచి వచ్చి "అమ్మా - మరే నేను మా బడిలో వాళ్ళందరితో కలిసి వేడినీటి ఊట దగ్గరికి వెళ్తానేం" అని అడిగేసరికి అమ్మ ఆశ్చర్యపోయింది. వేడినీటి ఊటదగ్గరికి ముసలివాళ్ళు గుంపులుగా వెళ్తారని అమ్మ ఇదివరకు విన్నది గాని మొదటి తరగతి పిల్లలు వెళ్తారని ఆమెకు తెలియదు. కాని హెడ్‌మాస్టర్ రాసిన ఉత్తరం జాగ్రత్తగా చదివేసరికి ఇది అద్భుతమైన ఆలోచన అనిఅమ్మకు అర్థమయింది. ఇక ఆ పథకంపట్ల ఆమెలో ఎంతో కూతూహలం, ఆరాధన నిండిపోయాయి. ఈ విహారాన్ని "సముద్రపుటొడ్డున బడి" అని పిలిచారు. దానికి ఎంచుకున్న స్థలం షిజువోకాలోని ఇజో ద్వీపకల్పంలో టొయి అనే ప్రాంతం. అక్కడ సముద్రంలోనే వేడినీటి ఊట ఉంది. అక్కడ పిల్లలు ఈతకొట్టవచ్చు. వేడినీట్లో స్నానం చెయ్యవచ్చు. మొత్తం మూడు పగళ్ళు, రెండురాత్రులు ఉండాలని నిర్ణయించారు. టోమో విద్యార్థులలో ఒకరి తండ్రికి అక్కడ ఒక విశ్రాంతి గృహం ఉంది. ఒకటో తరగతి నుంచి ఆరోతరగతి వరకు ఉన్న టోమో విద్యార్థులు యాభై మంది కూడ ఆ విశ్రాంతి గృహంలో ఉండవచ్చును. మొత్తానికి అమ్మ ఈ ప్రయాణానికి ఒప్పుకుంది.

అనుకున్న రోజున బయల్దేరే సమయానికి ముందే టోమో విద్యార్థులందరూ బడి దగ్గర కలుసుకున్నారు.

వాళ్ళందరూ చేరగానే హెడ్‌మాస్టారు "ఆఁ ఇక ఇప్పుడు మనం రైల్లో కొంత దూరం, ఓడమీద కొంతదూరం వెళ్తాం. ఈ ప్రయాణంలో ఎవరూ తప్పిపోవద్దు. అర్థమైందా? సరే, ఇంక వెళ్దామా?" అన్నారు.

ఆయన ఇచ్చిన ఆదేశం అది ఒక్కటే. అయినా జియుగౌకాలో టోక్యోరైలు ఎక్కాక పిల్లలు ఆశ్చర్యపోయేంత చక్కగా వ్యవహరించారు. ఎవరూ పెట్టెల్లో అటూ ఇటూ పరుగెత్తలేదు. మాట్లాడుకోవడం కూడ పక్కన ఉన్నవాళ్ళతోనే, అదీ నెమ్మదిగా, అందరూ వరుసల్లో నడవాలని, సరిగా నడవాలని రైల్లో నిశ్శబ్దంగా ఉండాలని, తిండి తినేటప్పుడు నేలమీద, కింద చెత్తపడనీయవద్దని టోమో పిల్లలకు ఎవరూ ఎప్పుడూ చెప్పలేదు. వాళ్ళ రోజువారీ బడిజీవితమే వాళ్ళలో చాల విషయాలను సంతరించింది. తమ కంటె చిన్న వాళ్ళను, బలహీనులను తోయకుండా ఉండాలి. దుడుకుగా ప్రవర్తించడం అంటే సిగ్గుపడాల్సిన ప్రవర్తన; కింద ఎక్కడైనా చెత్త కనబడ్డదంటే వెంటనే అది అక్కడ్నించి తీసేయాలి; వేరేవాళ్ళకు భయంగొలిపేపనులు, చికాకుపరిచేపనులు చేయకుండా ఉండడానికి ప్రయత్నించాలి. ఇటువంటి భావాలన్నీ వాళ్ళ మనుసుల్లో నిండిపోయాయి. వీటన్నిట్లో విచిత్రమేమిటంటే కొన్ని  నెలల కింద తరగతి మధ్యలోంచి లేచి వీధిలో వాద్య బృంధంతో మాట్లాడడానికి కిటికీ దగ్గరికి వెళ్ళి బడిమొత్తాన్ని అల్లకల్లోలం చేసిన టొటొచాన్ టోమోలో చేరిన మొదటి రోజు నుంచి తన బల్ల దగ్గర కూచుని శ్రద్ధగా చదువుకోవడం మొదలు పెట్టింది. ఆ ఇంకో బడిలోని ఉపాధ్యాయులెవరయినా ఇప్పుడు టొటొచాన్‌ను చూస్తే, రైల్లో మిగిలిన వారితో కలిసి అంత బుద్ధిగా కూచుందని గమనిస్తే, కచ్చితంగా "ఈ పాప ఇంకెవరో" అని అనేసేవాళ్ళే.

నుమాజులో వాళ్ళందరూ ఓడలోకి ఎక్కారు. ఆ ఓడ సరిగ్గా వాళ్ళు ఇన్నాళ్ళూ కలలు కన్నదాని లాగనే ఉంది. అది పెద్ద ఓడేమీకాదు. కాని పిల్లలు మాత్రం దాన్ని చూసి చాల ఉత్సాహపడ్డారు. డెక్‌మీద మూల మూలను వాళ్ళు పరికించి చూశారు. అక్కడున్న అన్నిటినీ ముట్టుకునో, వాటి నుంచో వేలాడుతూనో ఓడ మొత్తాన్నీ తమలోకి తీసుకున్నారు. చిట్టచివరికి ఓడ కదిలాక, ఒడ్డున ఉన్న పట్టణ ప్రజలవైపు పిల్లలందరూ ఆనందంగా చేతులు ఊపారు. వాళ్ళు సముద్రంలో ఏమంతదూరం వెళ్ళకముందే వర్షం కురవడం మొదలయింది. అందుకని ఇంక వాళ్ల లోపలికి వెళ్లక తప్పలేదు. కొద్ది సేపట్లోనే సముద్రం భీకరంగా తయారయింది. టొటొచాన్ ఒంట్లో బాగులేనట్టు అనిపించింది. మరికొందరికి కూడ అలాగే అనిపించింది. అప్పుడే పెద్ద పిల్లల్లోంచి ఒక పిల్లవాడు లేచి మధ్యలో నిలబడ్డాడు. ఓడ అటూ ఇటూ కదలకుండా తాను స్థితిమితపరుస్తున్నట్టు నటించడం మొదలెట్టాడు. ఓడ ఒకవైపు ఒరిగిపోగానే, ఆ పిల్లవాడు ఒక వైపు పరుగెత్తి "ఊప్స్" అని అంటూ దాన్ని ఎత్తుతున్నట్టు చేసేవాడు. మళ్ళీ ఇంకోసారి "ఊప్స్" అంటూ ఇంకో వైపు పరుగెత్తేవాడు. అదంతా ఎంత సరదాగా ఉండిదంటే సముద్ర ప్రయాణం వల్ల జ్వరం వచ్చినట్టు అనిపించిన పిల్లలుకూడా నవ్వకుండా ఉండలేకపోయారు. ఓడ టొయికి చేరే వరకూ పిల్లలు నవ్వుతూనే ఉన్నారు. విచిత్రమైన విషయమేమంటే, ఓడలోంచి దిగిన తర్వాత "ఊప్స్" పిల్లవాడికి సముద్ర జ్వరం పట్టుకుంది. అప్పటికి మిగతా పిల్లలందరూ తేరుకుని, హాయిగా ఉన్నారు !

టొయిస్సా నిశ్శబ్ధమైన, అందమైన పల్లెల్లో ఉంటుంది. సముద్ర తీరాన ఉన్న ఆ పల్లె పచ్చని కొండల మధ్య ఉంటుంది. అక్కడికి చేరాక కొదిసేపు విశ్రాంతి తీసుకోగానే ఉపాధ్యాయులు విద్యార్థులను సముద్రం దగ్గరికి తీసుకువెళ్ళారు. ఇది బడిలో ఉన్న ఈతకొలను లాగలేదు. అందుకని వాళ్ళందరూ ఈత దుస్తులు తొడుక్కున్నారు.



సముద్రంలో వేడినీటి ఊట ఎక్కడోగాని ఉండదు. దాని చుట్టూ ఏమీ కట్టడం కట్టలేదు. గనుక వేడినీటి ఊటకు, మిగిలిన సముద్రానికి మధ్య విభజన రేఖ ఏదీ ఉండేది కాదు. వేడినీటి ఊట ఉన్నదని చెప్పిన చోట గొంతుక్కూచుంటే మెడవరకూ వేడినీళ్ళు వచ్చేవి. ఒక వేడినీటి తొట్టెలో కూచున్నట్టు హాయిగా ఉండేది. ఆ వేడి నీట్లోంచి సముద్రంలోకి వెళ్ళదలచుకుంటే ఎటువైపయినా పదిహేను అడుగులు వేస్తేచాలు, నీళ్ళు క్రమక్రమంగా చల్లగా ఉంటుండేవి. ఇంకా ముందుకు వెళ్తే నీళ్ళు పూర్తిగా చల్లగా ఉండేవి. అది సముద్రమన్నమాట. అంటే, సముద్రంలో ఈదులాడుతూ అది చల్లగా ఉన్నదనిపిస్తే వేడినీటి వైపు నడిచి మెడవరకూ మునిగి వేడినీటి స్నానం చేయవచ్చునన్నమాట. అదంతా ఇంట్లో ఉన్నట్టే ఉండేది. పైగా చాల సరదాగా కూడ ఉండింది. ఈత దుస్తులు తొడుక్కున్న పిల్లలు మామూలుగా సముద్రంలో ఈదుతుంటే, వేడినీటి ఊట ఉన్నచోట స్నానం చేస్తున్న పిల్లలు తీరిగ్గా గుండ్రంగా నిలబడి కబుర్లు మొదలెట్టారు. స్నానాలగదిలో ఉన్నటే అనుకున్నారు. వాళ్ళను చూసిన ఎవరైనా "అరె, వేడినీటి ఊటలో స్నానానికి దిగితే చిన్న పిల్లలు కూడ సరిగ్గా ముసలి వాళ్ళలాగనే ఉండగలరే" అని అనుకునేవాళ్ళే.

ఆ రోజుల్లో సముద్రతీరాలు ఎంత నిర్జనంగా ఉండేవంటే అది పూర్తిగా స్వంత బీచ్‌లో ఉన్నట్టే ఉండింది. పిల్లలు ఈ అసాధారణమైన వేడినీటి సముద్ర స్నానాన్ని నిండా ఆనందంతో స్వీకరించారు. నీటిలో ఎంతోసేపు ఉండి సాయంత్రానికి ఇంటికి తిరిగి వచ్చేసరికి వారి వేళ్ళనిండా ముడతలే ముడతలు కమ్ముకున్నాయి.

ప్రతిరాత్రీ పరుపుల్లోకి గూరి పడుకున్నాక పిల్లలు వంతులవారీగా దయ్యాల కథలు చెప్పుకునేవాళ్ళు. టొటొచాన్, మొదటి తరగతిలోని వేరే పిల్లలు ఎంత భయపడి పోయేవాళ్ళంటేఏడవడం మొదలేట్టేవాళ్ళు. కాని కళ్ళల్లో నీళ్ళతోనే, మళ్ళీవాళ్ళే, కుతూహలంగా "మరి తర్వాతేం జరిగింది?" అని అడిగేవాళ్ళు.

బడిలోపలి షికారులాగానో, ధైర్యం పరీక్షలాగానో కాక టొయిస్సాలో మూడు రోజుల విహారం నిజంగా నిజజీవిత అనుభవం. ఉదాహరణకు రాత్రి వంటకు కూరగాయలు, చేపలు కొనుక్కొచ్చేందుకు వంతులవారీగా పిల్లల్నే పంపేవారు. దారిలో కొత్త వారు ఏ ప్రశ్నలు వేసినా ఏ బడినుంచి వచ్చారనో, ఎక్కడినుంచి వచ్చారనో అడిగినా మర్యాదగా జవాబు చెప్పాల్సి ఉండేది. కొందరు పిల్లలయితే అక్కడి చెట్లమధ్య దాదాపు దారితప్పిపోయారు. మరికొందరు ఈదుతూ ఎంతదూరం వెళ్ళిపోయారంటే వెనక్కి రాలేకపోయారు. వాళ్ళకోసం మిగతావారు ఆందోళన పడ్డారు. మరికొందరు బీచ్ మీద పగిలిన సీసాలమీద కాళ్ళు వేసి గాయాలు చేసుకున్నారు. ప్రతిసారి మిగిలిన వాళ్లు ఆ ఒకరికో, కొందరికో తాము చేయగల సాయమంతా చేసేవారు.

కాని ఎక్కువగా అదంతా సరదాగానే గడిచిపోయింది. అక్కడ నిండా కీచురాళ్ళ సంగీతం వినిపించే అడవి ఉంది. పాప్ సైకిల్స్ అమ్మే దుకాణం ఒకటుంది. అక్కడ బీచ్ మీదనే వాళ్లు ఒకాయనను చూశారు. ఆయన ఒక్కడే ఓ పెద్ద చెక్కపడవని తయారు చేస్తున్నాడు. అప్పటికే పడవరూపం వచ్చేసింది. పిల్లలందరూ ప్రతి రోజూ ఉదయాన్నే ఆయన ఇంకా యెంతపని కొత్తగా చేశాడో చూడడానికి పరుగెత్తే వారు. ఆయన టొటొచాన్‌కు ఒక పొడవాటి, రింగులు రింగులుగా ఉన్న చెక్కపేడు ఇచ్చాడు.

"జ్ఞాపకంగా మనం ఫొటో దిగితే యెలా ఉంటుంది?" అని అడిగారు హెడ్‌మాస్టర్ అక్కడినుంచి బయల్దేరే రోజున. వాళ్ళందరూ కలిసి యెప్పుడూ ఫొటో దిగలేదు కనుక ఈ ఆలోచన వాళ్ళందరిలో ఉత్సాహం రేకెత్తించింది. కాని ఒక టీచర్ కెమెరాతో సిద్ధపడ్డారో లేదో, పిల్లల్లో ఒకరు

బైటికి వెళ్ళిపోయారు. మరొకరు కుడికాలి జోడు యెడమకాలికీ, యెడమకాలి జోడు కుడికాలికీ తొడుక్కున్నారు గనుక మార్చుకోవడం మొదలెట్టారు. చిట్టచివరికి "అందరూ సిద్ధంగా ఉన్నారా?" అని టీచర్ అడిగేసరికి ఒకరిద్దరు పిల్లలు నేలమీద పడుకుని ఉండిపోయారు. అంతసేపు ఒకే భంగిమలో నిలబడి వాళ్ళు అలసిపోయారు. ఫొటోదిగే తతంగం అలా యెంతో సేపు గడిచిపోయింది.

కాని ఆ ఫొటో పిల్లలందరికీ కూడ విలువైన ఆస్తిగా మారిపోయింది. వెనుక నుంచి సముద్రం కనబడుతోంది. ప్రతి విద్యార్థీ వాళ్ళ ఇష్టం వచ్చిన ముఖకవళికలు పెట్టి ఉన్నారు. ఒక్కసారి ఆ ఫొటో వంక చూస్తే జ్ఞాపకాల వెల్లువ పొంగివస్తుంది. ఓడలో ప్రయాణం, వేడినీటి ఊటలో స్నానం, దయ్యాల కథలు, "ఊప్స్" అనే పిల్లవాడు అన్నీ గుర్తొస్తాయి. మొట్టమొదటి సారి ఆనందమయంగా గడిచిన ఆ వేసవి సెలవులను టొటొచాన్ ఎప్పుడూ మరచిపోలేదు.

ఆ రోజుల్లో టోక్యోలో వాళ్ళ ఇంటి దగ్గరి సరసులో కూడ గాజురొయ్యలు దొరుకుతుండేవి. ఆ రోజుల్లో చెత్త మోసుకుపోయే బండిని ఒక పెద్ద ఎద్దు లాగుతుండేది.

## ఆటా పాటా

వేసవిసెలవులు అయిపోగానే రెండో సెమిస్టర్ మొదలయింది. ఏమంటే జపాన్‌లో పాఠశాలలు ఏప్రిల్‌లో మొదలవుతాయి. విద్యాసంవత్సరం మధ్యలో వేసవి సెలవులు వస్తాయి. తన తరగతి పిల్లలతో మాత్రమే కాక ఇంకా పెద్ద పిల్లలతో కూడా టొటొచాన్‌కుస్నేహం కలిసింది. వేసవి సెలవుల్లో ఎన్నోసార్లు వాళ్ళను కలిసి స్నేహం కుదుర్చుకుంది. టోమోగాకుయోన్ అంటే టొటొచాన్‌కు ఇంకా ఎక్కువ మక్కువ కలిగింది.

మిగతా మామూలు పాఠశాలలకన్న టోమోలో పాఠాలు వేరుగా ఉండడం మాత్రమే కాదు, అక్కడ సంగీతానికి యెక్కువ సమయం కేటాయించేవారు. అన్ని రకాల సంగీతం పాఠాలు ఉండేవి. యూరిథమిక్స్ అనే ఆటపాటల పీరియడ్ ప్రతిరోజూ ఉండేవి. అది ఒక ప్రత్యేక రకమైన లయబద్ధమైన విద్య. దాన్ని స్విట్జర్లాండ్‌కు చెందిన సంగీత ఉపాధ్యాయుడు, స్వరకర్త ఎమిల్‌జాక్స్‌డాల్ క్రోజ్ రూపొందించాడు. ఆయన అధ్యయనాలు 1904లో మొదటి సారి అందరికీ తెలిశాయి. ఆయన పద్ధతిని యూరప్‌లోనూ,అమెరికాలోను వెంటనే అమలులో పెట్టారు. ఎక్కడ పడితే అక్కడ శిక్షణా, పరిశోధనా సంస్థలు పుట్టుకొచ్చాయి. టోమోలో డాల్‌క్రోజ్ రూపొందించిన యురిథమిక్స్‌ను అనుసరించడానికి ఒక కథ ఉంది.

టోమోగాకుయెన్‌ను తెరవడానికి ముందు విదేశాలలో చిన్నారిపిల్లల విద్యాబోధన ఎట్లా జరుగుతోందో పరిశీలించడానికి హెడ్‌మాస్టర్ సొసాకు కొబయాషి యూరప్ వెళ్ళాడు. ఆయన అక్కడ ఎన్నెన్నో పాఠశాలలను చూశాడు. అక్కడి విద్యాబోధకులతో మాట్లాడాడు. పారిస్‌లో ఆయన డాల్‌క్రోజ్‌ను కలుసుకున్నాడు. డాల్‌క్రోజ్ అప్పటికి మంచి స్వరకర్తగాను, విద్యా బోధకుడిగాను పేరు పొందాడు.

చిన్నారి పిల్లలకు సంగీతాన్ని కేవలం చెవులతో వినేదిగా కాకుండా మనసుతో వినేదిగా, అనుభూతిచెందేదిగా ఎలా అర్థం చేయించాలా అని డాల్‌క్రోజ్ చాలాకాలం ఆలోచించాడు. సంగీతం అంటే ఒక నిస్సారమైన, నిర్జీవమైన విషయం కాదని, అది ఒక చలనశీలమైన సజీవ వాస్తవమని వాళ్ళ అనుభూతిలోకి తేవడం ఎలా? చిన్నారి పిల్లల హృదయస్పందనల మృదుత్వాన్ని మేల్కొల్పడం ఎలా?



చిట్టచివరికి, పిల్లలు ఎలా దూకుతూ, గంతులు వేస్తూ, గోల గోలగా ఆడుకుంటూ ఉంటారో చూశాక ఆయనకు ఒక ఆలోచన తట్టింది. లయబద్ధమైన వ్యాయమాన్ని, తయారు చేస్తే ఎలా ఉంటుంది అని. దానికి ఆయన యురిథమిక్స్ అని పేరు పెట్టాడు. ఆటాపాటా కలిసినదది.

కొబయాషి పారిస్‌లోని డాల్‌క్రోజ్ పాఠశాలలో ఏడాదిపాటు ఉన్నాడు. ఆ పద్ధతిని క్షుణ్ణంగా నేర్చుకున్నాడు. డాల్‌క్రోజ్ నుంచి ప్రేరణ పొందిన జపాన్ ప్రముఖులు చాలామంది ఉన్నారు. సంగీతకారుడు కొసాక్ యమాడా, జపాన్‌లో ఆధునిక నృత్యానికి ఆద్యుడు బాకు ఇషీ, కబుకి నటుడు ఇచికావా సాడాన్‌జి II, ఆధునిక నాటకరంగానికి ఆద్యుడు కౌరు ఒసాన్నాయి; నృత్యకారుడు మిచిమో ఇటో - అందరూ కూడా డాల్‌క్రోజ్ నుంచి ప్రేరణ పొందిన వాళ్ళే. డాల్‌క్రోజ్ బోధనలు చాలా కళలకూ మూలాధారాలని వీళ్ళందరూ భావిస్తారు. కాని సొసాకు కొబయాషి మాత్రం జపాన్‌లో ఆ పద్ధతిని ప్రాథమిక విద్యలో ప్రవేశపెట్టిన మొట్టమొదటి వ్యక్తి.

యురిథమిక్స్ అంటే ఏమిటని ఆయనను అడిగితే ఆయన చెప్పే జవాబేమంటే "అది శరీర నిర్మాణాన్ని శుభ్రపరిచే ఒక ఆట. శరీరాన్ని ఎట్లా వాడుకోవాలో, ఎట్లా అదుపులో పెట్టుకోవాలో మనసుకు నేర్పే ఆట. శరీరానికీ, మనసుకూ కూడ లయను ఎట్లా అర్థం చేసుకోవాలో తెలియజెప్పే ఆట యురిథమిక్స్. లయబద్ధమైన వ్యక్తిత్వం అందంగా ఉంటుంది. దృఢంగా ఉంటుంది. ప్రకృతి సూత్రాలతో సమన్వయంలో, వాటిని అనుసరిస్తూ ఉంటుంది" అని.

శరీరానికి లయను అర్థం చేసుకోవడం నేర్పే శిక్షణతో టొటొచాన్‌కు తరగతులు మొదలయ్యాయి. అసెంబ్లీహాలులోని చిన్న వేదిక మీద హెడ్‌మాస్టర్ పియానో వాయిస్తూ ఉంటాడు. పిల్లలు ఎక్కడ నిలబడి ఉన్నాసరే, సంగీతానికి లయబద్ధంగా అటూఇటూ అడుగులు వేస్తుంటారు. వాళ్ళెటువైపయినా నడవగలిగే వీలుంటుంది. ఒకరినొకరు గుద్దుకోకూడదనేది ఒక్కటే నియమం. కనుక వాళ్ళందరూ కూడా ఒకే రకంగా వలయాకారంగా నడుస్తుండేవారు. సంగీతంలో రెండు శృతులు వినబడాయంటే వాళ్లు కండక్టర్‌ల లాగ రెండు చేతులూ పైకీ కిందికీ ఊపేవాళ్ళు. ఇక పాదాల విషయానికొస్తే వాళ్ళు వాటిని ఎడాపెడా బాదకూడదని నియమం. ఐతే అట్లని బ్యాలేల్లో లాగ బొటనవేళ్ళ మీద కూడ నడవగూడదు. పూర్తిగా హాయిగా, నింపాదిగా, బొటనవేళ్ళను ఈడుస్తున్నట్టుగా నడవాలి. సహజంగా ఉండాలనేది చాల ముఖ్యమైన విషయం. అంతే, ఇక ఆ తర్వాత తమకెట్లా బాగుందనుకుంటే అట్లానడవచ్చు. లయ మూడోస్థాయికి చేరిందంటే అందుకు తగినట్టుగా చేతులు ఊపుతూ, ఆ తూగుకు సరిపోయే విధంగా అడుగులు కలుపుకోవలసి ఉండేది. వేగంగా అవసరమైతే వేగంగా, మెల్లగా అవసరమైతే మెల్లగా నడవాల్సి ఉండేది. అట్లా ఆరోస్థాయి వరకూ లయకు అనుగుణంగా చేతులుపైకి లేపడమూ, వాల్చడమూ వాళ్ళు నేర్చుకోవలసి ఉండేది. నాలుగోస్థాయి లయకొంచెం సులభమైనది.

"కిందికి, చుట్టూ, పక్కలకు, పైకి" అనేది అది.

కాని ఐదో స్థాయికి వచ్చేసరికి

"కిందికి, చుట్టూ, ముందుకు, పక్కలకు, పైకి" చాపవలసి వచ్చేది.

ఇక ఆరో స్థాయికయితే చేతులు "కిందికి, చుట్టూ, ముందుకి, మళ్ళీచుట్టూ, పక్కలకు, పైకి" వెళ్ళవలసి ఉండేది.

కనుక ఆ లయస్థాయి మారుతున్నప్పుడు మాత్రం కొంచెం కష్టంగా ఉండేది.

ఇంతకంటే కష్టమైనది హెడ్‌మాస్టర్ చెప్పేమాట.

"నేను నా ధ్వని తూగు మార్చినా సరే, నేను చెప్పేదాకా మీరు మార్చగూడదు" అని ఆయన అనేవాడు.

వాళ్ళు రెండోస్థాయి లయలో వ్యాయామం చేస్తున్నప్పుడు సంగీతం మూడో స్థాయికి వెళ్ళిపోయిందనుకోండి. పిల్లలు మాత్రం ఇంకా రెండో స్థాయిలో లాగనే కాళ్ళు చేతులు కదిలించాల్సి వచ్చేది. ఒక వైపు మూడోస్థాయిని వింటూ రెండో స్థాయిలో శరీరాన్ని కదిలించాల్సి వచ్చేది. అది చాల కష్టంగా ఉండేది. కాని పిల్లల కేంద్రీకరణ శక్తిని అభివృద్ధి చేసేందుకు ఇది అవసరమని హెడ్‌మాస్టర్ అనేవాడు.

చిట్టచివరికి ఆయన "ఇక మార్చండి" అని కేకేసేవాడు.

తేరుకున్నట్టుగా పిల్లలు వెంటనే మూడోస్థాయి లయకు మారిపోయేవారు. కాని అప్పుడు వాళ్ళు చాల జాగ్రత్తగా ఉండవలసివచ్చేది. మానసికంగా రెండోస్థాయి లయను వదిలేసి, మూడో స్థాయికి చేరమని కండరాలకు సందేశం పంపించేలోగానే సంగీతం హఠాత్తుగా ఐదో స్థాయి లయకయినా చేరిపోతుండేది! మొట్టమొదటి వాళ్ళ కాళ్లు, చేతులు ఎక్కడెక్కడో ఉండేవి. అందుకని "అబ్బ, ఆగండాగండి" అని బాధగా అరిచేవాళ్లు. కాని అలవాటు మీద ఆ కదలికలన్నీ ఆనందంతో కదల్చడం నేర్చుకున్నారు. చివరికి పిల్లలు తమంతటతామే మార్పుల గురించి ఆలోచించారు. సంతోషంగా పాల్గొన్నారు.

సాధారణంగా పిల్లలు ఒంటరిగానే ఆడేవారు. కొన్నిసార్లు మాత్రం ఇద్దరు కలిసి ఒక జంటగా నాట్యం చేసేవారు. లయ రెండో స్థాయిలో ఉన్నప్పుడొకరి చేతులు ఒకరు పట్టుకునో, కళ్ళుమూసుకుని అడుగులు వేయడానికి ప్రయత్నిస్తూనో ఉండేవాళ్ళు. అక్కడ చేయగూడని పని ఒకే ఒక్కటి మాట్లాడగూడదు.

కొన్ని సందర్భాలలో తల్లిదండ్రుల, ఉపాధ్యాయుల సంఘం సమావేశం జరిగేటప్పుడు పిల్లల తల్లులందరూ కిటికీల్లోనుంచి లోపలికి తొంగి చూసేవారు. ఆ దృశ్యం ఎంతో చూడచక్కనిదిగా ఉండేది. ప్రతి శిశువూ సంగీతలయానుగుణంగా క్రమబద్ధంగా, సులభంగా కాళ్ళు, చేతులు కదుపుతూ, ఆనందంగా ఎగిరి గంతులేస్తూ ఉంటే ఎంత బావుంటుంది !

అంటే యురిథమిక్స్ మొట్టమొదటి లక్ష్యం ఏమిటంటే మనసుకూ, శరీరానికి కూడ లయజ్ఞానంలో శిక్షణ ఇవ్వడం. తద్వారా మనసుకూ, దేహానికీ మధ్య సమన్వయం సాధించడం. చిట్టచివరికి ఊహాశక్తిని ప్రేరేపించి సృజనాత్మకతను పెంపొందించడం.

ఆ బడికి మొదటిసారి వచ్చిన రోజున టొటొచాన్ గేటుమీది పేరు చూసి అమ్మతో "టోమో అంటే ఏమిటి?" అని అడిగింది.

టోమో కామా ఆకారంలో ఉండే ప్రాచీన చిహ్నం. తన పాఠశాలకు రెండు టోమోలు కలిసి ఉండే సాంప్రదాయక చిహ్నాన్ని హెడ్‌మాస్టర్ ఎంచుకున్నాడు. అవి ఒకటి నల్లటోమో, మరొకటి తెల్ల టోమో, రెండూ కలిసి నిండైన వృత్తాన్ని తయారు చేసేవి. పిల్లల విషయంలో ఆయన లక్ష్యాన్ని ఈ చిహ్నం సరిగ్గా తెలియజేసేది. శరీరమూ, బుద్ధీ సమానంగా అభివృద్ధి చెంది సంపూర్ణ సమన్వయాన్ని సాధించాలనేదే ఆ లక్ష్యం.

యురిథమిక్స్‌ను పాఠశాలలో పాఠ్యప్రణాళికలో చేరిస్తే అది మంచి ఫలితాలనిస్తుందని, పిల్లల వ్యక్తిత్వాలు సహజంగా ఎదగడానికి అది తోడ్పడుతుందని వారి వ్యక్తిత్వాలు పెద్దల జోక్యాలకు ఎక్కువగా గురికాకుండా ఉంచుతుందని అనుకుని హెడ్‌మాస్టర్ యురిథమిక్స్‌ను చేర్చాడు.



హెడ్‌మాస్టర్‌కు మిగతా బళ్ళలో చెప్పే చదువంటే ఇష్టం ఉండేది కాదు. దానికి రాత అక్షరం మీదనే ఎక్కువ శ్రద్ధ ఉండేది. ప్రకృతి పట్ల శిశువులో ఉండే సున్నితమైన, ఇంద్రియానుభూతమైన గ్రహింపును ఆ చదువు శిలలా కరడుగట్టించేది. ప్రేరణ అనే (అప్పటికింకా) సన్ననిదైన దివ్య స్వరం పట్ల సహజాతమైన ఆకర్షణను మొద్దుబార్చేది.



వినండి ! ఒక కప్ప
ప్రాచీన సరసులో
నిశ్శబ్దంలోకి గెంతుతోంది
అని కవి బాషో రాశాడు.

సరసులోకి కప్ప దూకే దృశ్యాన్ని మరెందరో చూసే ఉంటారు. మరుగుతున్న కెటిల్ లోంచి ఆవిరి రావడం. ఆపిల్‌పండు నేల మీద రాలడం వంటి వాటిని యుగయుగాలుగా, యావత్ప్రపంచంలో వాట్, న్యూటన్‌లు ఒక్కరు మాత్రమే చూసి ఉండరు.

కళ్ళు ఉంటాయి, కాని అందాన్ని చూడలేకపోతాం; చెవులుంటాయి, కాని సంగీతాన్ని వినలేకపోతాం; మనసులుంటాయి. కాని సత్యాన్ని గ్రహించలేకపోతాం; హృదయాలుంటాయి. కాని అవి ఎన్నటికీ స్పందించవు. కనుక నిప్పంటుకున్నట్టు జ్వలించవు. భయపడవలసిన విషయాలివి అని హెడ్‌మాస్టర్ చెప్పేవాడు.

బరికాళ్ళతో ఎగిరి దూకుతూ, పరుగెడుతూ ఉన్నప్పుడు టొటొచాన్ ఇసడోరా డంకన్ లాగుండేది. అప్పుడు తనకు విపరీతమైన ఆనందం కలిగేది. ఇది బడికి పోవడంలో భాగమేనంటే ఒక పట్టాన నమ్మకం కుదిరేది కాదు.

## "నాకు కావాల్సిన ఒకే ఒక్కటి!"

గుడిలో జరిగే ఉత్సవానికి వెళ్ళడం టొటొచాన్‌కు అదే మొదటిసారి. వాళ్ళ పాతబడి దగ్గర సెంజోకు సరస్సు మధ్యలో ఒక చిన్న ద్వీపం ఉంది. సంగీత దేవతా, సౌందర్య దేవతా అయిన బెంటెన్‌కు అక్కడ ఒక దేవాలయం ఉంది. వార్షికోత్సవం జరిగేరోజు రాత్రి టొటొచాన్ మసక వెల్తురు దారి మీద అమ్మ, నాన్నలతో కలిసి వెళుతుండగా హఠాత్తుగా రాత్రి పట్టపగలయినట్టు వెలిగిపోయింది. చూస్తే వాళ్లు ఆ ఉత్సవం జరిగే చోటికి చేరారు. అక్కడున్న ప్రతి దుకాణంలోకీ తలదూర్చి తొంగిచూసింది టొటొచాన్. అక్కడ ఎటుచూసినా విచిత్రమైన ధ్వనులు వినవచ్చాయి.

చక్కటి సువాసనలు కూడ వచ్చాయి. అక్కడ ప్రతిదీ కొత్తగానూ, విచిత్రంగానూ ఉంది.

అక్కడ బొమ్మ పైపులున్నాయి. వాటిని పొగతాగినట్టు నోట్లో పెట్టుకుని పీలిస్తే పిప్పరమెంటు నోట్లో కొస్తుందన్నమాట. వాటికి పిల్లల బొమ్మలతో, కుక్కల బొమ్మలతో, బెట్టీబూప్ బొమ్మలతో అలంకారాలున్నాయి. అక్కడ లాలిపాప్‌లు, బూరుమిఠాయిలు కూడ అమ్ముతున్నారు. వెదురుబొంగు తుపాకులు కూడ ఉన్నాయి. ఏదో చెట్టుపుల్లల్ని ఆ తుపాకుల్లోంచి తోస్తే పెద్ద చప్పుడుతో అవి దూసుకుపోతున్నాయి.

దారి పక్కన ఒకాయన కత్తులు మింగేస్తున్నాడు. సీసాల ముక్కలు తినేస్తున్నాడు. మరొకాయనేమో ఏదో గమ్మత్తు పొడి అమ్ముతున్నాడు. ఆ పొడిని ఏ పాత్ర అంచుకయినా రాస్తేఅది

ప్రతిధ్వనిస్తోంది. మరోచోట మాంత్రిక బంగారు గాజులున్నాయి. అవి డబ్బును మాయం చేస్తున్నాయి. మరోచోట ఎండలో పెడితే అచ్చయ్యే ఫొటోలున్నాయి. నీళ్ళగ్లాసులో పడేస్తే వికసించే కాగితపు పూలున్నాయి. అలా కళ్ళు మిటకరించి అటూ ఇటూ నడుస్తున్న టొటొచాన్ హఠాత్తుగా ఆగిపోయింది.

"అబ్బ-భలే భలే, చూడు!" అని అరిచింది. అక్కడ ఒక డబ్బానిండుగా పసుప్పచ్చనిచిన్నారి కోడిపిల్లలు కిచకిచలాడుతున్నాయి.

అమ్మనూ నాన్ననూ పట్టిలాగుతూ "నాకోటి కావాలి! అబ్బా - ఒక్కటి కొనివ్వరా..." అని అడిగింది టొటొచాన్.

కోడి పిల్లలన్నీ టొటొచాన్ వైపు తిరిగి, తనను చూడడానికి తమ చిన్న చిన్న తలలు నిక్కబెట్టాయి. సన్నటి కాళ్ళు వణికిపోతుండగా, బిగ్గరగా కిచకిచలాడాయి.

"భలే ముద్దుగా ఉన్నాయి కదూ?" టొటొచాన్‌కు తన జీవితంలో అంతవరకూ అంత ముచ్చటయినదేదీ చూడలేదని అనిపించింది. వాటి ప్రక్కన కూచుండిపోయింది టొటొచాన్.

అమ్మవైపు, నాన్నవైపు చూస్తూ "అబ్బా, కొనరా?" అని బతిమిలాడింది. కాని టొటొచాన్‌ను ఆశ్చర్యపరుస్తూ, అమ్మా నాన్న గబగబా పాపను అక్కడినుంచి తీసుకుపోవడానికి ప్రయత్నించారు.

"కాని నాకేదన్నా కొనిపెడతానని చెప్పారుగా. నాకు కావాల్సింది ఇదొక్కటే!"

"కాదు, కన్నా విను. ఈ చిన్నారి కోడిపిల్లలు కాసేపట్లోనే చచ్చిపోతాయి" అంది అమ్మ మృదువుగా

టొటొచాన్‌కు అప్పటికే ఏడుపు వచ్చేస్తోంది. "ఎందుకు?" అని అడిగింది.

అమ్మే ఆయన వినకుండా ఉండేందుకు నాన్న టొటొచాన్‌ను పక్కకు తీసుకొచ్చి వివరించాడు. "టొట్స్కీ. అవి ఇప్పుడు ముద్దొచ్చేట్టే ఉన్నాయిరా. కాని అవి ఎంత బలహీనంగా ఉన్నాయో తెలుసా, ఎక్కువ రోజులు బతకవురా అవి. అవి చచ్చిపోయాక నీకెంత ఏడుపొస్తుందో చెప్పు. అందుకే నీకవి కొనిపెట్టడం లేదురా."

కాని, ఏమయినా సరే, ఒక కోడిపిల్లను సంపాదించాలనే కోరికతో టొటొచాన్ హృదయం నిండిపోయింది. ఎవరేం చెప్పినా ఇక వినదలచుకోలేదు.

"నేను దాన్ని చావనివ్వనుగా! జాగ్రత్తగా కాపాడుకుంటానేం?" అని అడిగింది.

అమ్మ, నాన్న టొటొచాన్‌ను ఆ డబ్బా దగ్గరినుంచి పక్కకు తీసుకుపోవడానికి ప్రయత్నించారు. కాని టొటొచాన్ మాత్రం ఆ కోడిపిల్లల వేపే అపేక్షగా చూస్తుండిపోయింది. ఆ కోడిపిల్లలు కూడా ఇంకా బిగ్గరగా కిచకిచలాడుతూ కాంక్షతో టొటొచాన్ వేపు చూశాయి. తనకు కావలసింది కోడిపిల్ల ఒక్కటేనని టొటొచాన్ మనసులో గట్టిగా అనుకుంది. ఇక అమ్మ, నాన్నల వెంటబడి బతిమిలాడడం మొదలుపెట్టింది. "అబ్బా, అబ్బా, ఒక్కటి కొనివ్వండి ఒక్కటి!".

అమ్మ, నాన్న పట్టుదల మీద ఉన్నారు.

"మేం నీకది కొనిపెట్టం. ఎందుకంటే? అది చివరికి నిన్ను ఏడిపిస్తుంది."

టొటొచాన్‌కు ఇంక దు:ఖం ఆగలేదు. ఇంటికి తిరిగి వెళ్తుంటే టొటొచాన్ బుగ్గల మీద కన్నీళ్ళు ధారలుగా ప్రవహించాయి. వాళ్ళు మళ్ళీ ఆ చీకటిదారి మీదికి రాగానే వెక్కుతూనే టొటొచాన్ గుండెలోతుల్లోంచి బతిమిలాడింది. "ఇన్ని రోజులూ నేను ఇంతగా దేన్నీ ఇష్టపడలేదు. మళ్ళీ మళ్ళీ కూడా నాకోసం ఏదీ కొనిపెట్టమని అడగను. ఈసారి మాత్రం ఒక్క కోడిపిల్ల కొనిపెట్టండి" అంది.



అప్పుడు వర్షం వెలిసి ఎండపొడ వచ్చినట్టనిపించింది. టొటొచాన్ ముఖంలో చిరునవ్వులు వెలిగిపోతున్నాయి. ఇప్పుడు టొటొచాన్ చేతిలో రెండు కోడిపిల్లలున్న చిన్న పెట్టె ఉంది.

మర్నాడు అమ్మ ఒక వడ్రంగిని పిలిచి ఒక ప్రత్యేకమైన కటకటాల పెట్టె తయారు చేయించింది. కోడిపిల్లలకు వెచ్చగా ఉండాలని లోపల ఒక కరెంటు బల్బు ఏర్పాటు చేయించింది. టొటొచాన్ ఆ రోజంతా ఆ కోడిపిల్లల్ని చూస్తూనే కూచుంది. ఆ పసుప్పచ్చని చిన్నారి కోడిపిల్లలు ముద్దొచ్చేలా ఉన్నాయి. కాని, నాలుగో రోజు వాటిలో ఒకటి కదలడం ఆగిపోయింది. ఐదో రోజు ఇంకో కోడిపిల్ల కూడా చనిపోయింది. టొటొచాన్ వాటిని కదిల్చి చూసింది. వాటిని పిలిచింది. కాని ఒక్కసారి కూడా అవి "కిచకిచ"మని జవాబివ్వలేదు. టొటొచాన్ అలా చూస్తూ చూస్తూ ఉండి పోయింది. గాని అవి మళ్ళీ కళ్ళు తెరవనేలేదు. అమ్మా నాన్నా చెప్పినట్లే జరిగిందన్న మాట. టొటొచాన్ ఏడుస్తూనే తోటలో ఓ గొయ్యి త్రవ్వి ఆ రెండు చిన్నారి పక్షుల్ని మట్టిలో కప్పెట్టేసింది. ఆ స్థలం పైన చిన్నారి పువ్వొకటి పెట్టింది. ఇన్నాళ్ళూ కోడి పిల్లలున్న ఆ పెట్టె ఇప్పుడు ఎంతో పెద్దదిగా, భయంగొలిపేంత ఖాళీగా కనిపించింది. ఆ పెట్టెలో ఒక మూలన పసుప్పచ్చరంగులో చిన్న ఈక కనిపించింది. ఆ రోజు ఉత్సవం దగ్గర తనను చూసి కోడిపిల్లలు ఎట్లా కిచకిచమన్నాయో గుర్తుచేసుకుంది టొటొచాన్. నిశ్శబ్దంగా ఏడుస్తూ పళ్ళు బిగపట్టుకుంది.

టొటొచాన్ తన జీవితంలో అంత గాఢంగా దేన్నీ కోరుకోలేదు. కోరుకున్న దొక్కటీ ఇప్పుడు పోయింది. కోల్పోవడం, ఎడబాటు కలగడంలో టొటొచాన్‌కు మొట్టమొదటి అనుభవం అది.

## బాగోలేని దుస్తులు

టోమోలో బడికి పిల్లల్ని పంపేటప్పుడు వారికి ఉన్న చింపిరి గుడ్డలతోనే పంపమని హెడ్‌మాస్టర్ తల్లిదండ్రులకు చెప్పేవాడు. అవి మురికిగొట్టుకున్నా, చిరిగిపోయినా ఫరవాలేదు గనుక పిల్లల్ని ఉన్న వాట్లోకెల్లా బాగులేని దుస్తులే వేసుకురమ్మనేవాడు. బట్టలు మురికి గొట్టుకుపోయాయని ఇంట్లో తిడతారేమోనని భయపడడం పిల్లలకు సిగ్గుచేటయిన విషయమని ఆయన అనుకునేవాడు. బట్టలు చిరిగిపోతాయేమోననే భయానికి ఆటాలాడడానికి సందేహించడం కూడ అటువంటిదే అనుకునే వాడాయన. టోమో దగ్గర్లో కొన్ని ప్రాథమిక పాఠశాలలుండేవి. అక్కడ ఆడపిల్లలకు నావికుల సూటు యూనిఫారంగా ఉండేది. మగపిల్లలు ఎత్తయిన కాలర్ ఉన్న జాకెట్టు, నిక్కర్లు వేసుకోవలసి ఉండేది. టోమో విద్యార్థులు మాత్రం తమ మామూలు బట్టల్లోనే బడికి వచ్చేవాళ్లు. ఉపాధ్యాయుల అనుమతితో మనసారా ఆటలాడుకునేవాళ్ళు. బట్టలు ఏమవుతాయోనని ఒక్క క్షణం కూడా ఆలోచించవలసిన అవసరం లేకుండేది. ఇప్పటి జీన్స్ లాగ అప్పుడు ఎక్కువ కాలం మన్నే ప్యాంటు గుడ్డలుండేవి కావు. కనుక మగపిల్లలందరికీ ప్యాంట్లమీద అతుకులుండేవి. ఆడపిల్లలేమో వీలయినంత దళసరి గుడ్డతో కుట్టిన గౌన్లు, దుస్తులు వేసుకునే వాళ్ళు.

టొటొచాన్‌కు ఇష్టమైన అలవాటు ఒకటుండేది. వేరేవాళ్ళ తోట కంచెలకింది నుంచీ, ఖాళీ స్థలాల కంచెల కిందినుంచీ పాకి పోతుండేది. కనుక టొటొచాన్ ఎప్పుడూ తన బట్టలు ఏమయిపోతున్నాయో ఆలోచించలేదు. ఆ రోజుల్లో కంచెలన్నీ కూడ ముళ్ళతీగల కంచెలే వాటిలో కొన్నిటి ముళ్లతీగెలు కిందిదాకా నేలకు తాకేట్టుగా కూడ ఉండేవి. అటువంటి వాటి కింది నుంచి పోవాలంటే కుక్కల్లాగ నేలకు కరచుకుని పాకవలసి వచ్చేది. ఎంత జాగ్రత్తగా ఉన్నా సరే, ఏదో

ఒక రకంగా టొటొచాన్ బట్టలు ఆ ముళ్ల తీగలకు చిక్కుకోవడం, చిరిగిపోవడం జరిగేవి. ఒకసారేమయిందంటే, టొటొచాన్‌కు పాత సిల్కు దుస్తులుండేవి. అవి అప్పటికే ఎంత పాతబడిపోయాయంటే దారాలు దారాలుగా విడిపోతున్నాయి. ఇక ఇలా కంచెలకిందినుంచి పాకేసిరికి పైనుంచి కిందిదాకా ఆ బట్టలు మొత్తం పీలికలయిపోయాయి. ఆ బట్టలు పాతవేగాని అమ్మకు వాటిమీద చాల మోజుండేది. అందుకని అమ్మకు ఏమని చెప్పాలా అని టొటొచాన్ బుర్ర బద్దలు కొట్టుకుంది. ముళ్ళతీగలకు చిక్కుకుని చిరిగిపోయాయని చెప్పడానికి టొటొచాన్‌కు ధైర్యం చాలలేదు. తన తప్పేమీ లేదని బట్టలు వాటంతటవే చిరిగిపోయాయని చెప్పడానికి ఏ అబద్ధం చెపుదామా అని ఆలోచించింది. చిట్టచివరికి టొటొచాన్ ఒక కథ అల్లగలిగింది.

ఇంటికిరాగానే అబద్ధం చెప్పడానికి సిద్ధపడి "అమ్మా-అమ్మా-మరే-నేనేమో రోడ్డుమీద నడుస్తోంటే చాలమంది పిల్లలు వచ్చారమ్మా. వాళ్లు నా మీదికి వెనుకనుంచి కత్తులు విసిరారు తెలుసా? దాంతో గౌను ఇట్లా చిరిగిపోయింది" అని చెప్పింది. కాని మాట్లాడుతుండగానే టొటొచాన్‌కు ఒక సందేహం వచ్చింది. అమ్మ ఇంకా ఏమన్నా ప్రశ్నలడిగితే జవాబివ్వడం ఎట్లా?

అదృష్టం కొద్దీ అమ్మ ఒకే ఒకమాటంది. "అబ్బ, ఎంత భయమేసిందో నా బంగారు కొండకి" అని.

టొటొచాన్ తేరుకున్నట్టు నిట్టూర్పు విడిచింది. అమ్మకు చాల ఇష్టమైన ఆ బట్టలు చిరిగిపోకుండా ఉండడం ఆ పరిస్థితుల్లో అసాధ్యమని అమ్మ నమ్మినట్టే ఉందనుకుంది టొటొచాన్.

కాని సహజంగానే అమ్మ ఈ కత్తుల కథను నమ్మలేదు. వీపుమీదికి కత్తులు విసిరితే అవి టొటొచాన్ బట్టల్ని పీలికలు చెయ్యడంతోపాటు, గాయపరిచి ఉండేవే. కాని మరి టొటొచాన్ ఏ మాత్రం భయపడినట్టులేదు. ఇది కట్టుకథ అని అమ్మకు వెంటనే అర్థమైపోయింది. అయితే టొటొచాన్‌కు ఎప్పుడూ ఇంత శ్రమపడి కట్టుకథ అల్లవలసిన అవసరం రాలేదు. అంటే బట్టలు చిరిగిపోయాయని టొటొచాన్ చాల బాధపడిందన్నమాట. అమ్మకు ఆ సంగతే నచ్చింది. కాని టొటొచాన్ గురించి చాల రోజుల నుంచి అమ్మ తెలుసుకోవాలనుకుంటున్న విషయం ఒకటుంది. అది తెలుసుకోవడానికి ఇదే మంచి అవకాశం అనుకుంది అమ్మ.

"కత్తులూ అటువంటి వాటితో నీ బట్టలు యెట్లా చిరిగిపోతాయో నాకు అర్థమైంది కన్నా. కాని రోజు రోజూ నీ చెడ్డీలు కూడ యెందుకు చిరిగిపోతాయిరా?" అని అడిగింది అమ్మ.

టొటొచాన్ చెడ్డీలకు లేసుల అంచులుంటాయి. ఎప్పుడూ పిర్రలమీద అవి చిరిగిపోయే ఉంటాయి. అవి యెందుకలా చిరిగిపోతున్నాయో అమ్మకు అర్థమయ్యేది కాదు. జారుడుబల్లమీద జారితేనో, నేలమీద చతికిలబడితేనో చెడ్డీలు మురికికావడం, పలచబడడం అమ్మకు తెలుసు. కాని అవి పీలికలుగా యెలా చిరిగిపోతాయి?

అమ్మ ఆ ప్రశ్న అడగగానే టొటొచాన్ ఒక్కక్షణం ఆలోచించింది. "కాదమ్మా, కంచెల కిందినుంచి పాకేటప్పుడు గౌను ముళ్లతీగకు పట్టుకోకుండా ఉండడం కష్టం. కంచె దాటేటప్పుడేమో చెడ్డీలను ముళ్లతీగ పట్టుకుంటుంది. "ఏమండీ, నేను లోపలికి రావచ్చాండీ?" అంటూ కంచె కిందికి పాకి "సరే, వెళ్ళొస్తానండీ" అని అవతలివైపు అంటూ అలా కంచెలు దాటుతూ ఉంటే చెడ్డీలు, గౌన్లు చిరిగిపోతాయి గదమ్మా" అంది.

అమ్మకు అసలు విషయమేమిటో అర్థం కాలేదు. కాని అది వింతయిన సంగతని మాత్రం అర్థం అయింది.



"సరదాగా ఉంటుందా అంది?" అని అడిగింది అమ్మ.

అమ్మ ప్రశ్న విని టొటొచాన్ ఆశ్చర్యపోయింది. "అమ్మా అమ్మా - నువుకూడ అట్లా చేసి చూడరాదూ. ఎంత సరదాగా ఉంటుందో తెలుసా? నీకయినా చెడ్డీలు చిరిగిపోతాయి తెలుసా?" అంది.

టొటొచాన్‌కు ఇంత ఇష్టమైందీ, తనలో అంతగా ఉద్వేగాన్ని నింపేదీ అయిన ఆ ఆట ఎలా ఉండేదో తెలుసుకోవాలి.

మొట్టమొదట ఒక పెద్ద ఖాళీ స్థలాన్ని చూడాలి. ఆ స్థలం చుట్టూరా ముళ్ళ కంచె ఉండాలి. "ఏమండీ, లోపలికి రావచ్చాండీ?" అంటూనే కింద ఉన్న ముళ్ళ తీగను పైకి ఎత్తి పట్టుకుని కింద కాస్తంత గొయ్యి తవ్వాలి. అప్పుడు దాని కింద నుంచి పాకాలి. తీగకిందికి చేరిన తర్వాత అవతలివైపు ముళ్ళతీగను కూడ పైకెత్తి మళ్ళీ అట్లాగే గొయ్యితవ్వి "సరేనండీ, వెళ్ళొస్తాను" అనాలి. ముళ్ళ తీగలకు చిక్కుకున్న చెడ్డీని విడిపించుకు రావడంలో టొటొచాన్ గౌను ఎట్లా పీలికలయి పోయి ఉంటుందో అమ్మకు స్పష్టంగా అర్థమైపోయింది. ఐతే ఈ క్రమమంతా అక్కడితో ఆగేది కాదు. మళ్ళీ మళ్ళీ అదే జరిగేది. "ఏమండీ లోపలికి రావచ్చాండీ?' ' అంటూ ముళ్ళ తీగ కిందికి పాకడం, మరో కొత్త గొయ్యి తవ్వి "సరే, వెళ్ళొస్తానండీ" అంటూ బైటపడడం,ఈ క్రమంలో గౌను, చెడ్డీ చిరగగొట్టుకోవడం. ముళ్ళ తీగకంచె కింద నుంచి ఒక చివరి నుంచి మరోచివరి వరకూ టొటొచాన్ ముందుకీ, వెనక్కీ సంతోషంగా పాకుతూనే ఉండేది. తన చెడ్డీలు ముక్కలు ముక్కలయిపోవడంలో ఏమీ ఆశ్చర్యం లేదు.

పెద్దవాళ్ళకయితే అలసట కలిగించేదిగా, ఏ మాత్రం సరదా లేనిదిగా కనిపించే ఈ ఆట ఒక చిన్నారికి గొప్ప వినోద కారణం అవుతుందని ఊహించడం భలేగా ఉంది. తలనిండా, గోళ్ళనిండా, చివరకు చెవుల్లో కూడ దుమ్ముకొట్టుకుని ఉండే టొటొచాన్‌ను చూస్తుంటే అమ్మకు నిజంగానే కాస్త ఈర్ష్య కలిగింది. అమ్మకు హెడ్‌మాస్టర్‌పట్ల మరోసారి గౌరవం కలిగింది. పిల్లలు ఇష్టం వచ్చినంత మురికి చేసుకున్నా ఫరవాలేదనుకునే బట్టలువేసి పంపించాలని ఆయన సూచించాడంటే ఆయన పిల్లల్ని ఎంత బాగా అర్థం చేసుకున్నాడో తెలిసిపోతోందని అమ్మ అనుకంది.

## టాకాహాషి

ఒకరోజు వాళ్ళందరూ బడి ఆవరణలో పరుగులు పెడుతుండగా హెడ్‌మాస్టర్ ఒక అబ్బాయిని తీసుకొచ్చాడు. "ఇదిగో మీకో కొత్తనేస్తం వచ్చాడు. పేరు టాకాహాషి. తను ఒకటో తరగతి రైలు పెట్టెలోకి ఎక్కుతాడు" అన్నాడు.

టొటొచాన్‌తోసహా పిల్లలందరూ టాకాహాషి వేపు చూశారు. టాకాహాషి టోపీ తీసి పట్టుకుని తలవంచి సిగ్గుపడుతూ అందరికీ అభివాదం చేశాడు.

టొటొచాన్, మిగిలిన ఒకటో తరగతి పిల్లలు అప్పటికింకా చాల చిన్నపిల్లలే. టాకాహాషి మగపిల్లవాడయినా వాళ్ళకంటే కూడ చిన్నగా ఉన్నాడు. బుల్లిబుల్లి చేతులతో, బుల్లి బుల్లి కాళ్ళతో ఉన్నాడు. టాకాహాషి తల కూడ ఎంత చిన్నగా ఉందో. దానిమీద ఓ టోపీ కూడ ఉంది. కాని టాకాహాషి భుజాలు మాత్రం వెడల్పుగా ఉన్నాయి. ఏదో పోగొట్టుకున్నట్టుగా శూన్యంగా చూస్తూ టాకాహాషి అక్కడ నిలబడిపోయాడు.

"మనం ఆ అబ్బాయితో మాట్లాడదాం" అంది టొటొచాన్ మియోచాన్, సాకోచాన్‌లతో

వాళ్ళు టాకాహాషి దగ్గరికి నడిచారు. వాళ్ళు తన దగ్గరికి చేరగానే టాకాహాషి స్నేహంగా నవ్వాడు. వాళ్ళు కూడ చిరునవ్వుతో జవాబిచ్చారు. టాకాహాషి కళ్ళు యెంత పెద్దవో.... ఆ కళ్ళలోకి చూస్తే ఏదో చెప్పబోతున్నాడేమోననిపిస్తుంది.

"రైల్లో మన తరగతి గది చూస్తావా?" అని అడిగింది. టొటొచాన్.

"ఊఁ" అన్నాడు టాకాహాషి, టోపీని మళ్ళీ తల మీద పెట్టుకుంటూ.

టాకాహాషికి తరగతి గది చూపించాలని టొటొచాన్ తొందరపడింది. గబగబా రైలులోకి యెక్కేసి తలుపు దగ్గర నిలబడి "రా,రా. తొందరగా రా" అని పిలిచింది.

టాకాహాషి వేగంగానే నడుస్తున్నట్టు కనిపించాడు గాని ఇంకా చాలదూరం ఉన్నాడు.

"వస్తున్నా" అన్నాడు టాకాహాషి. పరుగెత్తడానికి ప్రయత్నిస్తున్నాడు గాని తప్పటడుగులు వేస్తూ వస్తున్నాడు.

యాసువాకి చాన్‌లాగ టాకాహాషి కాలును ఈడుస్తూ నడవడంలేదుగాని తనకు కూడ నడవడం ఆలస్యమే అవుతోందని టొటొచాన్ గుర్తించింది. ఇక నిశ్శబ్దంగా టాకాహాషి కోసం చూస్తూ నిలబడింది. టాకాహాషి నడవగలిగినంత వేగంగా నడుస్తూనే ఉన్నాడు. "రా, రా. తొందరగా రా" అనవలసిన అవసరం లేదు. తొందరగానే వస్తున్నాడు. టాకాహాషి కాళ్ళు మరీ కురచగా ఉన్నాయి. తనవి వంకర కాళ్ళు కూడ. టాకాహాషిలో ఎదుగుదల ఆగిపోయిందనే సంగతి ఉపాధ్యాయులకు, పెద్దలకు తెలుసు. టొటొచాన్ తనకోసమే ఎదురుచూస్తూ నిలబడిందని చూడగానే చేతులు ఊపుతూ ఇంకా త్వరగా ముందుకు కదలడానికి ప్రయత్నించాడు టాకాహాసి. తలుపు దగ్గరికి చేరగానే "నువు వేగంగా పరుగెడతావు గదూ" అన్నాడు టొటొచాన్‌తో. తనను పరిచయం చేసుకుంటున్నట్టుగా "మాది ఒసాకా" అన్నాడు.

"ఒసాకానా?" అని టొటొచాన్ ఉత్సాహంగా అడిగింది. టొటొచాన్ ఒక సాకాకు ఎప్పుడూ వెళ్ళలేదు. కాని తన కలలనగరం ఒసాకా. అక్కడ టొటొచాన్ వాళ్ళ మామయ్య - అమ్మ తమ్ముడు - యూనివర్శిటీలో చదువుకుంటున్నాడు. ఆయన ఇక్కడికి ఎప్పుడు వచ్చినా టొటొచాన్ తలను రెండు చేతుల్లో పట్టుకుని తను ఎత్త గలిగినంత ఎత్తుకు ఎత్తుతూ "ఒసాకా చూపెడతాన్రా నీకు. కనబడిందా కన్నా?" అని అడిగేవాడు.

పెద్దవాళ్ళు ఎవరైనా పిల్లలతో ఆడే ఆట అది. కాని టొటొచాన్ ఆయనను నమ్మేది. మామయ్య అట్లా చేస్తుంటే ముఖం మీద చర్మం సాగి మంటపుట్టేది. కళ్ళు లాగినట్టు అయ్యేవి. చెవులు నలిగిపోయేవి. ఐనా టొటొచాన్ మాత్రం ఇవేవీ లెక్క చెయ్యకుండా ఒసాకా నగరాన్ని చూడటానికి ప్రయత్నిస్తూ దూర తీరాలకు చూపులు సారించేది. కాని ఎంత ప్రయత్నించినా ఒసాకా కనబడేది కాదు. ఏదో ఒక రోజున తాను అట్లా ఒసాకాను చూడగలనని టొటొచాన్ నమ్మేది. కనుకనే మామయ్య వచ్చి నప్పుడల్లా "మామయ్యా, మామయ్యా-ఒసాకా చూపించవూ" అని అడిగేది. అట్లా ఒసాకా టొటొచాన్‌కు కలల నగరం అయిపోయింది. మరి ఇప్పుడు టాకాహాషి అక్కడ్నించి వచ్చాడట. భలే !

"ఒసాకా ఎట్లా ఉంటుందో చెప్పవా!" అని టాకాహాషిని అడిగింది టొటొచాన్.

సంతోషంగా చిరునవ్వునవ్వుతూ "ఒసాకా గురించి చెప్పాలా!" అన్నాడు టాకాహాషి. ఆ అబ్బాయి గొంతు స్పష్టంగా, నిండుగా ఉంది. అప్పుడే మొదటి తరగతి గంట మోగింది.

"అబ్బ" అని నిట్టూర్పింది టొటొచాన్. టాకాహాషి చిన్న శరీరం మొత్తం పుస్తకాల సంచి వెనుక దాగి పోతుండగా సంతోషంగా ఊగుతూ లోపలికి వెళ్ళి మొదటి వరుసలో కూచున్నాడు.



టొటొచాన్ గబగబా వెళ్ళి టాకాహాషి పక్కన కూచుంది. ఎక్కడ కూచోవాలనుకుంటే అక్కడ కూచునే వీలున్నందుకు టొటొచాన్‌కు ఆనందం కలిగింది. టొటొచాన్‌కు టాకాహాషిని వదలాలనిపించలేదు. అలా టాకాహాషి కూడ టొటొచాన్‌కు స్నేహితుడై పోయాడు.

## "దూకే ముందు చూసుకో!"

టొటొచాన్ బడినుంచి ఇంటికి తిరిగి వస్తుండగా, దాదాపు ఇంటికి చేరబోయే సమయానికి రోడ్డు ప్రక్కన చాలా ఆసక్తికరమైనది కనిపించింది. అదేమిటో తెలుసా? అది ఒక పెద్ద ఇసుక కుప్ప. సముద్రానికి ఇంతదూరాన, ఇక్కడ అంత ఇసుక కుప్ప కనబడడం ఎంత బాగుంటుంది! ఇది కలా. నిజమేనా? టొటొచాన్‌లో ఉద్వేగం వెల్లువలా పొంగింది. అక్కడే ఆనందంతో ఓ చిన్న గంతువేసి ఇసుక కుప్పవేపు ఒక్క ఊపున పరుగు అందుకుంది. ఆ కుప్ప మీదికి కుప్పించి ఎగిరి దూకింది. కాని అది ఇసుక కానేకాదు! ఆ కుప్పలోపల గోడలకు పూతగా వెయ్యడానికి తయారుచేసిన బూడిదరంగు సున్నపు ముద్ద ఉంది. టొటొచాన్ ధడేల్‌మని దాంట్లో మునిగిపోయింది. జిగటగా అతుక్కుంటూ ఉన్న ఆ ముద్దలో ఛాతీదాకా మునిగిపోయింది టొటొచాన్. పుస్తకాల సంచీ, జోళ్ళ సంచీతో సహా మునిగిపోయి విగ్రహం లాగయిపోయింది. పైకి రావడానికి ఎంత ప్రయత్నిస్తే అంతగా కాళ్ళు లోపలికే జారిపోయాయి. చెప్పలు కాళ్ళనుంచి వదిలిపోతున్నట్టు అనిపించాయి. ఆ ముద్దలో అలా పూర్తిగా మునిగిపోకుండా ఉండడానికి టొటొచాన్ చాలా జాగ్రత్తపడాల్సివచ్చింది. అక్కడట్లా నిశ్చలంగా ఉండిపోవడం తప్ప మరేమీ చేయలేకపోయింది. జోళ్ళ సంచీని పట్టుకున్న ఎడమచెయ్యి ఆ జిగటముద్దలో అతుక్కుపోయింది. ఒకరిద్దరు స్త్రీలు ఆ దారిమీద నడిచివెళ్ళిపోయారు. వాళ్ళెవరో టొటొచాన్‌కు తెలియదుగాని "ఏమండీ"... అని చిన్నగా పిలిచింది. టొటొచాన్‌వైపు చూసి వాళ్లు ఆ పాప ఏదో ఆట ఆడుకుంటున్నదేమో అనుకుని చిరునవ్వు నవ్వి వెళ్ళిపోయారు.

సాయంత్రం అయి, చీకటి పడుతూండగా అమ్మ టొటొచాన్ కోసం వెతుకుతూ వచ్చింది. టొటొచాన్ తల సున్నపు ముద్దలోంచి బైటికి తొంగి చూస్తుండడం చూసి అమ్మ ఆశ్చర్యపోయింది. ఒక దుడ్డుకర్ర సంపాదించి టొటొచాన్‌ను ఒక చివర పట్టు కొమ్మని, మరోచివర తాను పట్టుకుని లాగడం మొదలు పెట్టింది. అసలు మొదటయితే అమ్మ టొటొచాన్‌ను చెయ్యిపట్టి బైటికి లాగుదామనే అనుకుంది. కాని అమ్మ పాదం కూడా ఆ ముద్దలో కూరుకుపోవడం మొదలయింది.

టొటొచాన్‌కయితే ఒంటినిండా బూడిదరంగు సున్నపుముద్ద నిండిపోయింది.

"నేను నీకిదివరకోసారి చెప్పానుగదూ, ఏదయినా ఆసక్తికరంగా కనిపించగానే సరాసరిగా వెళ్ళి దూకేయవద్దని. ఎప్పుడయినా దూకేముందు చూసుకో!" అంది అమ్మ.

అమ్మ చెపుతున్న ఆ "ఇదివరకోసారి" బడిలో మధ్యాహ్న విరామం సమయంలో జరిగింది. అప్పుడు టొటొచాన్ అసెంబ్లీహాలు వెనుక ఉన్న సన్నని బాట మీద పచార్లుచేస్తోంది అక్కడ బాట మధ్యలో ఒక పత్రిక పరిచి ఉండడం చూసి టొటొచాన్ ఆశ్చర్యపోయింది. సరిగ్గా పత్రికమీద దూకగలిగితే సరదాగా ఉంటుంది గదూ అనుకుంటూ టొటొచాన్ నాలుగడుగులు వెనక్కి వేసింది. ఒక చిన్న ఎగురు ఎగిరి మంచి వేగంతో పత్రికవైపు పరుగెత్తి దానిమీద దూకేసింది. కాని అక్కడ మరుగుదొడ్ల గొయ్యిమీద మూతను ఎందుకో తీసేసి ఆ స్థలంలో పత్రిక పరిచాడు మాలి. ఏదో చెయ్యడానికి వెళ్ళిపోతూ ఆ వాసన బైటికి రాకుండా ఉండడానికి పత్రిక కప్పి వేశాడు.

ఆ గొయ్యి ఇదివరకు చెప్పినదే. టొటొచాన్ సరిగ్గా ఆ పత్రికలోంచి ఢడేల్‌మని చప్పుడు చేస్తూ ఆ గోతిలోకి పడిపోయింది. అదంతా ఎంత ఘోరంగా ఉండిందో! కాని అదృష్టవశాత్తూ వాళ్ళు టొటొచాన్‌ను మళ్ళీ ముద్దులు మూటగట్టే శుభ్రమైన చిన్నారి టొటొచాన్‌గా మార్చేశారు. ఇప్పుడు అమ్మ చెప్పేది ఆ సంగతే.

"ఇంక అలా దూకనమ్మా-దేనిమీదా దూకను" అంది టొటొచాన్ నెమ్మదిగా అమ్మ కుదుట పడింది. కాని ఆ తర్వాత టొటొచాన్ కలిపిన మాటచూస్తే కుదుట పడడానికి తొందర పడ్డానేమో అనుకుంది అమ్మ.

"పత్రికల మీద గానీ, ఇసుక కుప్పలమీద గానీ ఇంక అస్సలు దూకను"

వేరేవాటి మీద దూకడానికి టొటొచాన్‌కు ఆసక్తి పుడుతూనే ఉంటుందని అమ్మకు నమ్మకంగా అనిపించింది.

అది పొట్టిపగళ్ళ, పొడుగు రాత్రుల కాలం కాబట్టి వాళ్లు ఇంటికి చేరేసరికి బాగా చీకటి పడిపోయింది.

## "ఇక ఆ తర్వాత......అహ్"....

టోమోలో మధ్యాహ్న భోజనాల సమయం ఎప్పుడూ సరదానే. తర్వాత కాలంలో ఆసక్తి కలగడం కూడ మొదలయింది.

హెడ్ మాస్టర్ ఇంకా యాభై మంది పిల్లల డబ్బాల్లోకి చూసి "సముద్రం నుంచి కాస్త, కొండలనుంచి కాస్త తెచ్చుకున్నారా" అని అడుగుతూనే ఉన్నాడు. ఆయన భార్య రెండు గిన్నెలు పట్టుకుని పిల్లల డబ్బాల్లో ఏది కావలిస్తే అది వేస్తూనే ఉంది. భోజనానికి ముందు వాళ్ళు "నములు, నములు నములుబాగా" అని పాడుతూనే ఉన్నారు. దాని తర్వాత "ఇటాడానికి మాసు" అంటూనే ఉన్నారు. కాని ఇప్పుడు కొత్తగా, "ఇటాడాకి మాసు" తర్వాత ఎవరైనా లేచి చిన్న ఉపన్యాసం ఇవ్వాల్సి ఉండేది.

ఒకరోజు హెడ్‌మాస్టర్ "మనందరం బాగా మాట్లాడ్డం నేర్చుకోవాలి గదూ. ఏమంటారు? ఇక నుంచి, మనందరం భోంచేస్తుండగా రోజూ ఎవరో ఒకరు ఈ వలయం మధ్యలో నిలబడి, ఏదో ఒక విషయం మీద మాట్లాడితే ఎట్లా ఉంటుంది?" అని అడిగాడు.

తాము సరిగ్గా మాట్లాడలేమేమోనని, కాని వేరేవాళ్లు మాట్లాడుతుంటే వినడం సరదాగానే ఉంటుందని కొందరు పిల్లలు అనుకున్నారు. తమకు తెలిసిన విషయాల్ని అలా చెపుతూ ఉంటే 'సూపర్'గా ఉంటుందని కొందరు పిల్లలకు అనిపించింది. టొటొచాన్‌కు ఏ విషయంమీద మాట్లాడాలో తోచలేదు. కాని ఒకసారి ప్రయత్నించి చూస్తే బాగుంటుందనే అనిపించింది. మొత్తం మీద చాలమంది పిల్లలు ఈ ఆలోచనకు అనుకూలంగానే ఉన్నారు. కనుక మర్నాటి నుంచి ఈ ఉపన్యాసాలు మొదలు పెట్టాలని నిశ్చయించుకున్నారు.

జపనీస్ కుటుంబాలలో భోజనం చేసేటప్పుడు మాట్లాడకుండా ఉండాలని పిల్లలకు నేర్పుతారు. కాని విదేశాలలో ఎంతో అనుభవం గడించిన ఫలితంగా హెడ్ మాస్టర్ తన పిల్లలను మాత్రం భోంచేసేటప్పుడు నిదానంగా, సంతోషంగా మాట్లాడుకుంటూ ఉండేందుకు ప్రోత్సహించేవాడు.

అంతేగాక, వేరేవాళ్ళముందు నిలబడి మాట్లాడడం ఎలాగో, తమ భావాలను సిగ్గుపడకుండా స్పష్టంగా, స్వేచ్ఛగా చెప్పడం ఎలాగో పిల్లలకు నేర్పడం ముఖ్యమని ఆయన



అనుకున్నాడు. అందుకే ఆయన తన ఆలోచనను అమలులో పెట్టడానికి నిర్ణయించుకున్నాడు.

పిల్లలందరికీ ఈ ఆలోచన నచ్చిన తర్వాత ఆయన వాళ్ళకు కొన్ని సూచనలు చేశాడు. టొటొచాన్ శ్రద్ధగా వింది.



"మంచి ఉపన్యాసకులయి పోవాలనే ప్రయత్నంలో మీరు తబ్బిబ్బు పడనక్కరలేదు. మీరు మీ ఇష్టం వచ్చిన విషయంపైన మాట్లాడవచ్చును. లేదా మీరు చెయ్యాలనుకుంటున్న పనుల గురించి మాట్లాడవచ్చు. ఏదయినా సరే. ఏది ఏమయినా మనం ప్రయత్నం చేసి చూద్దాం" అన్నాడాయన.

ఏయే ఉపన్యాసకులు ఎన్నడు మాట్లాడాలో నిర్ణయమైపోయింది. ఆ రోజున ఎవరు మాట్లాడవలసి ఉంటే వాళ్ళు తొందరగా, పాట అయిపోగానే భోంచేసేయాలని కూడ నిర్ణయమై పోయింది.

మధ్యాహ్న విరామంలో ఇద్దరో, ముగ్గురో స్నేహితులతో మాట్లాడినట్టుగా కాకుండా మొత్తం బడి పిల్లలందరి మధ్యన నిలబడి మాట్లాడాలంటే చాల సాహసం ఉండాలని, అది చాల కష్టమైన విషయమేనని పిల్లలు త్వరలోనే గుర్తించారు. కొందరు పిల్లలు ఎంత సిగ్గుపడ్డారంటే మొదట ముసిముసి నవ్వులు నవ్వుతూ నిలబడ్డారు. ఒక అబ్బాయి చాల కష్టపడి ఓ ఉపన్యాసం తయారు చేసుకున్నాడు. కాని నిలబడ్డ మరుక్షణం ఆ ఉపన్యాసమంతా మరిచిపోయాడు. ఆ ఉపన్యాసానికి పెట్టిన బ్రహ్మాండమైన శీర్షికను మాత్రం పదేపదే పలికాడు. "కప్పలు పక్కలకే ఎందుకు దూకుతాయి?" అని శీర్షిక చెప్పి "వర్షం పడిన సమయంలో......" అంటాడు గాని ఇంకా బండి ముందుకు కదలదు. చివరికి "అంతే" అనేసి, ఒంగి అభివాదం చేసి తన స్థానానికి వెళ్ళిపోయాడు.

టొటొచాన్ వంతు ఇంకారాలేదు. కాని తన వంతు వచ్చినప్పుడు మాత్రం తనకు ఇష్టమైన కథ "రాజా రాణీ" చెప్దామని నిర్ణయించుకుంది టొటొచాన్. ప్రతిఒక్కరికీ ఆ కథ తెలుసు ఖాళీ దొరికినప్పుడల్లా ఆ కథ చెప్పడానికి టొటొచాన్ ప్రయత్నించేది. "అబ్బ. విసుగోయ్ అది మాకు తెలుసు" అని అందరూ తప్పించుకునేవాళ్ళూ. కాని ఏమైనాసరే, తాను చెప్పబోయేది ఆ కథనే అని టొటొచాన్ నిర్ణయించుకుంది.

ఈ కొత్త పద్ధతి బాగానే అమలు జరుగుతున్నట్టుండగానే ఒక రోజుమాట్లాడవలసిన వంతు వచ్చిన అబ్బాయి మాట్టాడనని అనేశాడు.

"నాకు మాట్లాడడానికేమి లేదు" అన్నాడా అబ్బాయి.

ఎవరికయినా మాట్లాడడానికేమీ లేకుండా ఎలా ఉంటుందా అని టొటొచాన్ ఆశ్చర్యపోయింది. కాని నిజంగానే ఆ అబ్బాయికేమీ లేవట. హెడ్‌మాస్టర్ ఆ అబ్బాయి కూచున్న బల్లదగ్గరికి వెళ్ళాడు. బల్లమీద మధ్యాహ్న భోజనం డబ్బా ఖాళీ అయిపోయి ఉంది.

"ఐతే నీకు చెప్పడానికేమీ లేవన్నమాట" అన్నాడు హెడ్‌మాస్టర్.

"ఉహు...... లేవు..."

ఆ అబ్బాయి తప్పించుకోవడానికి ప్రయత్నిస్తున్నట్టుగా కూడా లేదు. నిజంగానే ఆ అబ్బాయికి మాట్లాడదగిన విషయమేదీ కనిపించడం లేదు.

హెడ్‌మాస్టర్ తన వెనక్కి వంచి పగలబడి నవ్వాడు. అలా నవ్వుతుంటే ఆయన పళ్ళ మధ్య పెద్దపెద్ద ఖాళీలు కనబడ్డా ఆయన లెక్క చెయ్యలేదు. ప్రయత్నిద్దామా? నువు ఏమన్నా చెప్పగలవేమో చూద్దామా?"

"ఏంటీ, నాకు విషయాలు వెతికిపెడతారా?" అని ఆశ్చర్యపోయాడు ఆ అబ్బాయి.

హెడ్‌మాస్టర్ ఆ అబ్బాయిని వలయం మధ్యలో నిలబడమని పంపించి, తాను ఆ అబ్బాయి బల్లముందర కూచున్నాడు.

"గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నించు. ఇవాళ ఉదయం లేచాక, బడికిరావడానికి ముందు నువ్వేమేంశావో గుర్తుతెచ్చుకో. మొట్టమొదలు ఏం చేశావూ?"

"సరే" అని బుర్ర గోక్కున్నాడు ఆ ఆబ్బాయి.

"అమ్మయ్య.... బావుంది. సరే అన్నావు గదా. అంటే ఏదో చెప్పబోతున్నట్టే కదా. సరే అన్న తర్వాత ఏం చేశావో చెప్పు" అని హెడ్‌మాస్టర్ ప్రోత్సాహించాడు.

"సరే....అహ్....నేను లేచానూ...." మరికాస్త ఎక్కువగా బుర్ర గోక్కుంటూ చెప్పాడా అబ్బాయి.

టొటొచాన్, మిగతా పిల్లలు, వినోదం చూస్తున్నారు. సరదా పడుతూనే శ్రద్ధగా వింటున్నారు. ఇంక ఆ అబ్బాయేమో "అప్పుడూ...అప్పుడూ.....అహ్...." అంటూ మళ్ళీ ఓసారి బుర్ర గోక్కున్నాడు. హెడ్‌మాస్టర్ ఆ అబ్బాయివైపే చూస్తూ ఓపిగ్గా కూచున్నాడు. ఆయన ముఖం మీద చిరునవ్వు కదలాడుతోంది. ఆయన చేతులు బల్ల మీద పెట్టుకుని కూచున్నాడు. 'భలేగా ఉందిలే. అది చాలు. నువు ఇవాళ ఉదయం మేలుకున్నావన్నమాట. అది అందరికీ అర్థమయ్యేలా చెప్పేశావులే. నువ్వు మంచి ఉపన్యాసకుడివి కావాలంటే వినోదం కలిగించనక్కర్లా. నవ్వించనక్కర్లా. ముఖ్యమైన సంగతేమిటో చూశావా? మొదలేమో నీకసలు మాట్లాడడానికే విషయాలూ లేవన్నావు. కాని ఏదో ఒకటి ఉందని తెలసిపోయిందిగా" అన్నాడు.

కాని ఆ అబ్బాయి కూచోలేదు. మళ్ళీ బిగ్గరగా "ఇంక ఆ తర్వాత...అప్పుడూ... అహ్.." అన్నాడు.



పిల్లలందరూ ఆసక్తితో ముందుకు వంగారు. ఆ అబ్బాయి గట్టిగా ఊపిరిపీల్చి ఇంక ఆ తర్వాత...ఊఁ...అమ్మ...ఊఁ...ఏమందంటే...పళ్ళు...ఊఁ...తోముకో... అంది...... మరి..... నేను..... పళ్ళు తోముకున్నాను...." అన్నాడు.

హెడ్‌మాస్టర్ చప్పట్లు కొట్టాడు. అక్కడున్న ప్రతిఒక్కరూ చప్పట్లు కొట్టారు. అప్పుడింక ఆ అబ్బాయి గొంతు మరింతపెంచి మళ్ళీ "ఆ తర్వాతా....మరి...." అని నట్లు కొట్టాడు.

పిల్లలందరూ చప్పట్లు కొట్టడం మానేసి, ఊపిరి బిగబట్టి, ముందుకి వంగివింటున్నారు.

చిట్టచివరికి, ఆ అబ్బాయి కొండెక్కినంత ఆనందంతో "ఆ తర్వాతా....మరి....మరి...నేను బడికొచ్చేశానూ..." అని ముగించాడు.

పెద్ద పిల్లల్లో ఒక అబ్బాయి ఎంతగా ముందుకు వంగాడంటే పట్టుతప్పి ముఖం టిఫిన్ డబ్బాకు కొట్టుకున్నాడు. ఆ అబ్బాయికి మాట్లాడడానికి ఏదో ఒకటి దొరికింది అని అందరూ ఎంతో



సంతోషించారు.

హెడ్‌మాస్టర్ పెద్దగా చప్పట్లు కొట్టాడు. టొటొచాన్, మిగతా పిల్లలు కూడ ఆనందంగా చప్పట్లు కొట్టారు. చివరికి ఆ వలయం మధ్యలో నిలబడిఉన్న "ఆ తర్వాత...అహ్" కూడ చప్పట్లు కొట్టాడు. అసెంబ్లీహాలు చప్పట్లతో మార్మోగిపోయింది.

పెద్ద పెరిగిన తర్వాత ఆ అబ్బాయి ఆనాటి చప్పట్ల ప్రశంసను బహుశా మరిచిపోయి ఉండడు.

## "మేం ఆడుకుంటున్నాం. అంతే!"

టొటొచాన్ ఓ పెద్ద ప్రమాదం జరిగింది. టొటొచాన్ బడినుంచి వచ్చేసింతర్వాత భోంచేయబోయే ముందు రాకీతో కలిసి తనగదిలో తోడేలు ఆట ఆడుతుండగా అది జరిగింది.

ఆ ఆటేంటంటే గదిలో చెరో కొసనుంచి దొర్లుకుంటూ ఒకరివైపు మరొకరు రావాలి. ఇద్దరూ ఒకరినొకరు గుద్దుకోగానే చిన్న తగాదా వస్తుంది. అప్పుడింక ఆట అయిపోతుందన్నమాట. ఇలా చాలాసార్లు ఆడింతర్వాత ఇంతకంటె కొంచెం కష్టమైన ఆట ఏదయినా ప్రయత్నిద్దామని వాళ్ళు నిర్ణయించుకున్నారు. వాళ్ళు అంటే నిర్ణయించింది టొటొచాన్ ఒక్కతే అనుకోండి. కొత్త ఆలోచన ప్రకారం ఒకరివైపు ఒకరు దొర్లుకుంటూ వచ్చి గది మధ్యలో గుద్దుకున్న తర్వాత ఇద్దరిలో ఎవరు ఎక్కువ భీకరంగా, తోడేలులాగ చూస్తేవాళ్ళు గెలిచినట్టు. రాకీ జర్మన్‌జాతి కుక్కగనుక తోడేలులా ముఖం పెట్టడం దానికి ఏమంత కష్టంకాదు. అది చేయవలసిందల్లా చెవులు నిక్కబెట్టడం, నోరు తెరిచి పళ్ళన్నీ బయటపెట్టడం. దానికి కళ్ళతో కూడ భయం కలిగించేట్టు చూడడం వచ్చు. ఇదంతా టొటొచాన్‌కు కొంచెం కష్టమే. టొటొచాన్ చెవులలాగ కనిపించాలని రెండు చేతులూఎత్తి తలకు రెండుపక్కలా పట్టుకునేది. నోరూ, కళ్ళూ తెరవగలిగినంత పెద్దగా తెరిచేది. గురగుర లాడుతూ, రాకీని కరవబోతున్నట్టు నటించేది. మొదట రాకీ ఈ ఆట బాగానే ఆడింది. కాని అది కుక్కపిల్లగదా. కాసేపు గడవగానే అది ఆట ఆడుతున్నానని మరిచిపోయి, హఠాత్తుగా టొటొచాన్‌ను నిజంగానే కొరికేసింది.

ఇంకా కుక్క పిల్లే అయినా రాకీ టొటొచాన్‌కు రెండింతలుండేది. దానికి పదునైన, వాడి అయిన పళ్ళుండేవి. కనుక టొటొచాన్ ఏమి జరుగుతున్నదో గుర్తించే లోపలే కుడిచెవి తల నుంచి వేలాడింది. నెత్తురు వరదలు కట్టింది.

టొటొచాన్ ఏడుపువిని అమ్మ వంటింట్లోంచి పరుగెత్తు కొచ్చింది. అమ్మచూసే సరికి టొటొచాన్, రాకీ గదిలో మూలకు ఉన్నారు. టొటొచాన్, రెండు చేతులతో కుడిచెవి పట్టుకుని ఉంది. గౌనునిండా రక్తం మరకలున్నాయి. హాల్లో వయొలిన్ సాధన చేసుకుంటున్న నాన్న కూడ పరుగెత్తుకొచ్చాడు. తానేదో ఘోరమైన పని చేశానని రాకీ గుర్తించినట్టు అనిపించింది. తోకను రెండు కాళ్ళమధ్యా వేలాడదీసుకుని అది టొటొచాన్ వేపు జాలిగా చూసింది.

అప్పుడు టొటొచాన్ ఆలోచించిన సంగతి ఒకే ఒక్కటి. అమ్మకూ నాన్నకూ మరీ కోపంవచ్చి రాకీని తన్ని తగిలేస్తేనో, ఎవరికైనా ఇచ్చేస్తేనో ఎట్లా? టొటొచాన్‌కయితే అతి విషాదకరమైన, భయానకమైన విషయం అది. కనుక టొటొచాన్ రాకీ పక్కనే గొంతుక్కూచుని, కుడిచెవిని చేత్తో అదిమిపట్టుకుని "రాకీని ఏమీ అనకండి! రాకీని కోప్పడకండి!" అని పదేపదే అంటూ ఏడవడం మొదలు పెట్టింది.

అమ్మ నాన్ననేమో టొటొచాన్ చెవికేమయిందో చూడాలని ఆతృత పడుతున్నారు.

టొటొచాన్ చెయ్యి వదలకుండానే
అందుకే టొటొచాన్ చెయ్యి లాగేయాలని ప్రయత్నించారు. టొటొచాన్ చెయ్యి వదలకుండానే "ఏమంత పెద్దగాయంకాదు. రాకీని మాత్రం తిట్టొద్దేం! అబ్బతిట్టొద్దు" అని గోలచేసింది. టొటొచాన్‌కి ఆ క్షణాన నిజంగానే నొప్పి తెలియలేదు. అప్పుడు తన ఆలోచనంతా రాకీ గురించే.

కాసేపటికి నెత్తురు చుక్కలు కిందికి జారడం మొదలయింది. టొటొచాన్‌ను రాకీ కరిచి ఉంటుందని అమ్మానాన్నా చిట్టచివరికి అర్థం చేసుకున్నారు. రాకీని ఏమీ అనమని వాళ్ళు టొటొచాన్‌కు నచ్చ చెప్పారు. అప్పుడు గాని తను చెవిమీదినుంచి చెయ్యి తీయలేదు. టొటొచాన్ చెవి తెగిపోయి వేలాడుతుండడం చూసి అమ్మ పెద్దగా ఏడ్చేసింది. నాన్న టొటొచాన్‌ను ఎత్తుకుని డాక్టర్ దగ్గరికి బయల్దేరాడు. అమ్మ అదుర్దాతో ముందే పరుగెత్తింది. అదృష్టం కొద్దీ సమయానికి డాక్టరు దగ్గరికి చేరారు గనుక, ఆయన ఆ చెవిని దాని స్థానంలోపెట్టి, ఎట్లా ఉన్నది అట్లా కట్టేశాడు. అమ్మ, నాన్న తేరుకుని ఊపిరి పీల్చారు. కాని ఇంత జరిగినా టొటొచాన్‌కు పట్టినదొకటే సంగతి. అమ్మా నాన్న ఇచ్చినమాట నిలబెట్టుకుంటారాలేదా, రాకీని కోప్పడకుండా ఉంటారాలేదా?

తలమీదినుంచి గడ్డందాకా కట్లతో టొటొచాన్ తెల్ల కుందేలులా కనబడుతూ ఇంటికి తిరిగివచ్చింది. రాకీని కోప్పడనని హామీ ఇచ్చినప్పటికీ నాన్నకు మాత్రం ఆ కుక్క పిల్లను ఏదో ఒక రకంగా మందలించక తప్పదని అనిపించింది. కాని అమ్మ ఆయన వైపు ఎలా చూసిందంటే "దయచేసి వాగ్దానం నిలబెట్టుకోండి" అని కళ్ళతోనే చెప్పేసింది. నాన్న అయిష్టంగానైనా అలా చేయక తప్పలేదు.

డాక్టర్ దగ్గరినుంచి వస్తూనే టొటొచాన్ గబగబా లోపలికి పరుగెత్తింది. అంతా సర్దుకుందనీ, ఎవరికీ రాకీ మీద కోపంలేదని వీలయినంత తొందరగా రాకీకి చెప్పాలనేది టొటొచాన్ తొందర. కాని ఎక్కడ చూసినా రాకీ కనబడలేదు. అప్పుడు టొటొచాన్‌కు నిజంగా ఏడుపొచ్చింది. తను డాక్టర్ దగ్గరకూడ ఏడవలేదు. అక్కడ ఏడిస్తే గనుక రాకీమీద అమ్మకూ నాన్నకూ కోపం ఎక్కువవుతుందని టొటొచాన్ అనుకుంది. కాని ఇప్పుడు మాత్రం కన్నీళ్ళు ధారలా వచ్చేశాయి. ఏడుస్తూనే "రాకీ, రాకీ, ఎక్కడున్నావే, రావా, అబ్బరావా!" అని పిలవడం మొదలెట్టింది.

అలా పిలవగా పిలవగా ఆ కన్నీళ్ళ మరకలతో నిండిపోయిన ముఖం మీద సన్నని చిరునవ్వు వెలిగింది. సోఫా వెనుక నుంచి పరిచితమైన గోధుమరంగు కుక్కపిల్ల వీపు కనబడింది. రాకీ మెల్లగాలేచి టొటొచాన్ దగ్గరికి చేరి కట్ల మధ్యనుంచి కొంచెం కనబడుతున్న కుడిచెవిని మృదువుగా నాకింది. టొటొచాన్ రాకీ మెడచుట్టూ రెండు చేతులూవేసి, దాని చెవుల వాసన పీల్చింది. ఆ చెవులు కంపుకొడుతుంటాయని అమ్మా నాన్న అంటుండేవారు గాని టొటొచాన్‌కు ఆ సుపరిచితమైన వాసన ఎంత ప్రియమైనదిగా ఉండేదో.

రాకీ, టొటొచాన్ ఆరోజు ఎంతగా అలసిపోయారంటే, ఇద్దరికీ నిద్రతో కళ్ళు మూరుకుపోతున్నాయి.

ఎండాకాలపు చివరిరోజుల్లోని చంద్రుడు తోటమీది నుంచి ఆ ముఖంనిండా కట్లు కట్టుకున్న పాపవైపు, కుక్కపిల్లవైపు చూపులు సారించాడు. వాళ్ళు ఇంకెన్నడూ "తోడేలు" ఆట ఆడదలచుకోలేదు. వాళ్ళిద్దరూ ఇప్పుడు ఇదివరకటికన్నా ఎక్కువ స్నేహితులయిపోయారు.

## ఆటల రోజు

టోమోలో ప్రతి సంవత్సరం నవంబర్ మూడోతేదీన క్రీడా దినోత్సవం జరుగుతుంది. హెడ్‌మాస్టర్ చాల పరిశోధన చేసి ఈ రోజును ఆటల రోజుగా నిర్ణయించాడు. వర్షాకాలంలో అతి



తక్కువసార్లు వర్షం పడినట్టు నమోదయినరోజు నవంబర్ మూడో తేదీనే. వాతావరణ సమాచారం సేకరించడంలో ఆయనకున్న నైపుణ్యం వల్లనో, ఆయన కోర్కెను సూర్యుడు, మేఘాలు అంగీకరించడం వల్లనో గాని ఆటల రోజును వర్షం చెడగొట్టకూడదు. బడి ఆవరణను ముందురోజే అలంకరించి, అన్ని రకాల ఏర్పాట్లు చేసిన పిల్లలు తమ ఆటలరోజు చెడిపోగూడదని కోరుకునేవారు. కారణమేమైనా గానీ, ఆ రోజున ఎప్పుడూ వర్షం కురవకపోవడం విచిత్రంగానే ఉండేది.

టోమోలో అన్ని సంగతులూ వేరుగా ఉన్నట్టుగానే, ఆటల రోజు కూడ విశిష్టంగా ఉండేది. మిగిలిన ప్రాథమిక పాఠశాలలకూ టోమోకు పోలిక కేవలం టగ్-అఫ్-వార్, కాళ్ళు కలిపి కట్టే పరుగు పందెం మాత్రమే. మిగిలిన ఆటలన్నీ హెడ్‌మాస్టర్ స్వయంగా కనిపెట్టినవే. వాటికి ప్రత్యేకమైన సాధనాలేమీ అవసరం లేదు. విస్తృతమైన ఏర్పాట్లూ అవసరం లేదు. బడిలో ప్రతిరోజూ వాడే పరిచితమైన వస్తువులతోనే ఆ ఆటలుండేవి.

ఉదాహరణకు చేపల పందెం ఉండేది. పొడవాటి, గొట్టాల్లాగ తయారు చేసి గుడ్డరిబ్బన్లను చేపల ఆకారంలోకి మార్చి, రంగులు వేసే వాళ్లు. బాలల దినోత్సవానికి ధృవప్రాంతం నుంచి తీసుకొస్తారు చూడండి, అట్లాంటి చేపలన్న మాట. ఆ చేపలను బడి ఆవరణలో మధ్యలో పెట్టేవాళ్ళు. సూచన ఇవ్వగానే పిల్లలు ఆ చేపల వైపు పరుగెత్తాలి. వాటి దాకా పరుగెత్తి వాటి నోట్లోంచి లోపలికి దూరి పాకుతూ తోకల లోంచి బైటికొచ్చి బయలు దేరిన చోటికి పరుగెత్తుకుంటూ రావాలి. అక్కడ మొత్తం మూడు చేపలుండేవి. ఒకటి ఎర్రచేప. రెండు నీలం చేపలు. కనుక తడవకు ముగ్గురు పిల్లలకే పందెం ఉండేది. ఈ పరుగు పందెం చూడటానికి చాల సులభంగా ఉండేదిగాని నిజానికి చాలా కష్టం. చేపల కడుపుల్లో చీకటిగా ఉండేది. చేపలేమో పొడుగ్గా ఉండేవి. గనుక ఆ లోపల ఎటువైపు పాకుతున్నామో ఏమీ తెలిసేదికాదు. టొటొచాన్‌తో సహా కొందరు పిల్లలు చేపనోట్లోంచే వెనక్కి తిరిగి వస్తుండేవారు. బైటికి తలపెట్టాక వాళ్ళకు తమ తప్పు తెలిసి గబగబా మళ్ళీ లోపలికి పాకేవాళ్ళు. ఆ ఆట చూడడం భలే సరదాగా ఉండేది ఎందుకంటే కడుపులో పిల్లలు ముందుకీ వెనక్కీ కదులుతుంటే చేపలు కూడ కదులుతూ బతికి ఉన్నట్లే అనిపిస్తుండేవి.

"అమ్మను కనిపెట్టు" అని మరో ఆట ఉండేది. సూచన ఇవ్వగానే పిల్లలు అడ్డంగా నిలబెట్టిన నిచ్చెన దగ్గరికి పరుగెత్తవలసి ఉండేది. దాని మెట్ల మధ్యనుంచి పాకి అవతల ఉన్న బుట్టలోని కవర్లు తీసుకోవాలి. ఆ కవర్ తెరిస్తే లోపల ఓ కాగితం ఉంటుంది. ఆ కాగితం మీద ఉదాహరణకు "సాకోచాన్ వాళ్ళమ్మ" అని రాసి ఉంటే అక్కడ కూచున్న ప్రేక్షకులలోంచి ఆమెను వెతికి పట్టుకోవాలి. ఆమె చెయ్యిపట్టుకుని చివరికి చేరవలసిన గీత దగ్గరికి రావాలి. నిచ్చెన మధ్య నుంచి పాకేటప్పుడు పిల్లలు పిల్లిలాగ నేర్పు చూపవలసి ఉండేది. లేకపోతే నడుముల దగ్గర నిచ్చెనలో ఇరుక్కుపోయేది. అంతేగాక ప్రతి చిన్నారికీ ఎవరెవరి అమ్మలు ఎవరో తెలిసి ఉండవలసి వచ్చేది. కాని కాగితంలో "మిస్ ఒకు వాళ్ళ అక్కయ్య" అనో "మిస్టర్ ట్సుయె వాళ్ళ అమ్మ" అనో, "శ్రీమతి కునినోరి కొడుకు" అనో ఉంటే పిల్లలకు కష్టమయ్యేది. వాళ్ళెవరో పిల్లలకు తెలిసేదికాదు. అప్పుడు వాళ్ల ప్రేక్షకుల ముందుకు వెళ్ళిపోయి "మిస్ ఒకువాళ్ళ అక్కయ్య" అని గట్టిగా పిలవవలసి వచ్చేది. కొత్తవాళ్ల ముందర నిలబడి అట్లా పిలవడానికి ధైర్యం కావాలి గదా. వాళ్ళ అమ్మలనే కనిపెట్టాలని కాగితం వచ్చిన పిల్లలు ఎగిరిగంతేసి "అమ్మా అమ్మా. రావే" అని కేకలేసే వాళ్ళు ఈ ఆటకు ప్రేక్షకులు కూడ జాగ్రత్తగా ఉండవలసి వచ్చేది. ఎవరి పేరు ఎప్పుడు పిలుస్తారో ఎవరికీ తెలియదు గదా. కూచున్న చోటునుంచి, బల్లమీది నుంచో, చాపమీది నుంచో

లేచి, ఆ గుంపులో నుంచి దారి చేసుకుంటూ పిల్లలు నిలబడి ఉన్న చోటుకు చేరి వాళ్ళ చెయ్యి అందుకుని పరుగెత్తడానికి సిద్ధంగా ఉండాలి. కనుక ఒక పాపో, బాబో వచ్చి ప్రేక్షకుల ముందు నిలబడగానే ఎవరిని పిలుస్తారో అని తండ్రులు కూడ ఊపిరి బిగబట్టి చూస్తుండేవారు. అక్కడ సోమరిగా బాతాఖాని కొట్టుకునేందుకు, చిరుతిండితినేందుకు సమయం ఉండదు. ఆ ఆటలో చిన్నారి పిల్లలు ఎంతగా పాల్గొంటారో పెద్దలూ అంతే పాల్గొన వలసి ఉండేది.

టగ్ ఆఫ్ వార్‌లో హెడ్‌మాస్టర్, టీచర్లందరూ కూడ రెండు బృందాలయి పిల్లలతో కలిశారు. 'ఓయ్ ఓయ్' అని కేకలేస్తూ తాడులాగారు. యాసువాకిచాన్ లాంటి అంగవికలులయిన పిల్లలు ఈ టగ్ ఆఫ్ వార్‌లో పాల్గొలేకపోయేవాళ్ళు. కనుక వాళ్ళు తాడు మధ్యలో కట్టిన చేరుమాలు వేపే దీక్షగా చూస్తూ ఎవరు గెల్చారో తేల్చేవాళ్ళు.

చిట్టచివరికి జరిగేవంతుల వారీ పరుగుపందెంలో బడిలో ఉన్న వాళ్ళందరూ పాల్గొనే వాళ్ళు. టోమోలో అది కూడ వేరుగానే ఉండేది. ఎవరూ చాలా దూరం పరుగెత్తాల్సిన అవసరం ఉండేదికాదు. అసెంబ్లీ హాలుకు చేరే అర్థ వృత్తాకారపు సిమెంటు మెట్లమీద ప్రతి ఒక్కరూ పైకీ కిందికీ పరుగెత్తవలసి ఉండేది. చూడటానికి ఇది చాలా సులభమైన పనిలాగానే ఉండేది. కానీ ఆ మెట్లుకూడా వేరేచోట్ల మెట్లకంటే భిన్నమైనవి. అవి ఎక్కువ ఎత్తుగా ఉండేవి కావు. ఒక దాని కొకటి చాలా దగ్గరగా ఉండేవి. ఎవరయినా ఒక్క మెట్టును కూడ దాటి దూకడానికి వీల్లేదు. ప్రతిమెట్టు ఎక్కవలసిందే. ఏ మాత్రం పొడవుగా ఉన్నా, వెడల్పయిన పాదం ఉన్నా ఆ మెట్లెక్కడానికి చాల ఇబ్బందయ్యేది. ప్రతి రోజూ మధ్యాహ్నం భోజనం సమయంలో ఎక్కి దిగుతూ ఉండే ఆ సుపరిచితమైన మెట్లు ఆట రోజునాడు తాజాగా, సరదాగా మారిపోయేవన్నమాట. పిల్లలందరూ సంతోషంగా కేరింతలు కొడుతూ ఆ మెట్ల మీద పైకీ కిందికీ తిరిగేవాళ్ళు. దూరం నుంచే చూసే వాళ్ళెవరికయినా అందమైన కలైడోస్కోప్‌లోని దృశ్యంలా కనబడుతుందది. పైమెట్టును కూడ కలుపుకుని అక్కడ మొత్తం ఎనిమిది మెట్లుండేవి.

టొటొచాన్‌కు, ఒకటో తరగతిలోని వేరే పిల్లలకూ అది మొట్టమొదటి ఆటల రోజు. అది వాళ్ళకు హెడ్‌మాస్టర్ ఆశించినంత సంతోషకరమైన రోజే అయింది. ముందు రోజు పిల్లలు తయారుచేసిన కాగితపు గొలుసులు, బంగారు నక్షత్రాల అలంకారాలు, ఉత్తేజకరమైన కవాతు ధ్వనుల రికార్డులు అక్కడేదో ఉత్సవం జరుగుతున్న వాతావరణాన్ని కల్పించాయి.

టొటొచాన్ ముదురు నీలం రంగు నిక్కరు, తెల్ల జాకెట్టు వేసుకుంది. నిజానికి టొటొచాన్‌కయితే వ్యాయామం చేసేవాళ్ళ దుస్తులు వేసుకోవాలని కోరిక కలిగింది. అవంటేనే తనకు ఇష్టం. ఒక రోజు బడి అయిపోయిన తర్వాత హెడ్‌మాస్టర్ కొందరు కిండర్‌గార్డెన్ టీచర్లకు యురిథమిక్స్ పాఠాలు చెపుతున్నాడు. అక్కడ కొందరు స్త్రీలు వేసుకున్న వ్యాయామ దుస్తులు చూసి టొటొచాన్ ముచ్చటపడింది. సరిగ్గా టొటొచాన్‌కు ఆ దుస్తులు ఎప్పుడు నచ్చాయంటే, ఆ స్త్రీలు కదం తొక్కుతున్నప్పుడు. ఆ దుస్తుల కింద వాళ్ళతొడలు చాల ఆకర్షణీయంగా కదిలాయి. ఆ కదలిక టొటొచాన్‌కు చాల నచ్చింది. వెంటనే టొటొచాన్ ఇంటికి పరుగెత్తి నిక్కరు తీసి తొడుక్కుని కదం తొక్కడం మొదలెట్టింది. కాని ఆ సన్నని, చిన్నారి తొడలు అసలు కదలనే లేదు. చాల సేపు కదం తొక్కి, తొడలు అటూ ఇటూ ఊగుతాయేమోనని ప్రయత్నించి విఫలమైంది టొటొచాన్. అప్పుడిక ఆ స్త్రీలు తొడుకున్న దుస్తుల వల్లనే తొడలట్లా కదులుతున్నాయని నిర్ణయానికొచ్చింది. ఆ దుస్తులేమిటి అని అమ్మను అడిగితే అవి వ్యాయామదుస్తులని అమ్మ చెప్పింది. ఆటల రోజునాడు తప్పకుండా తాను ఆ దుస్తులే వేసుకుంటానని టొటొచాన్ చెప్పింది



గాని తనకు సరిపోయేంత చిన్నవి ఎక్కడా దొరకలేదు. అందుకే టొటొచాన్ ఇక నిక్కరుతో సంతృప్తి పడవలసి వచ్చింది. కాని దానితో తొడలేమో ఊగుతూ ఉండవు పాపం !

ఆటల రోజు నాడు ఆశ్చర్యకరమైన విషయం ఒకటి జరిగింది. బడిలో అందరికన్నా పొట్టి చేతులూ, కాళ్ళూ ఉన్న టాకాహాషి అన్ని ఆటల్లోనూ గెలిచాడు. మొదటి బహుమతులన్నీ టాకాహాషివే. అది అందరికీ నమ్మశక్యం కానిదిగా కనిపించింది. మిగిలిన వాళ్ళందరూ చేపలోపల అటూ ఇటూ తడుముకుంటుండగా, టాకాహాషి మాత్రం మెరుపులాగ బైటపడ్డాడు. మిగిలిన వాళ్ళందరూ నిచ్చెనలో తలలు దూర్చిన సమయానికి, టాకాహాషి నిచ్చెనలోంచి అవతలికి దూరాడు. అప్పటికే నాలుగైదు గజాలు అవతల పరుగెడుతున్నాడు. ఇక అసెంబ్లీహాలు మెట్లమీద వంతులు వారీ పరుగుపందెం విషయానికొస్తే మిగిలిన వాళ్ళందరూ గజిబిజిగా ఒక్కొక్క అడుగూ ఒక్కొక్క మెట్టూ చూసుకుంటుండగా, టాకాహాషి ఒక్క ఊపున మెట్లన్నీ ఎక్కేశాడు. గబగబా సాగిపోయే చలనచిత్రం లాగ కిందికి దిగిపోయాడు. ఆ చిన్నారి పాదాలు పిస్టన్లలాగ కదిలి పోయాయి.

"మనం టాకాహాషిని ఓడించేందుకు ప్రయత్నించాలి" అని మిగతా పిల్లలందరూ అనుకున్నారు.

టాకాహాషిని ఓడించాలనే నిర్ణయంతో పిల్లలందరూ సర్వశక్తులూ ఉపయోగించి ఆడారు. కాని వాళ్ళు ఎంతగా ప్రయత్నించినా ప్రతిసారీ టాకాహాషినే నెగ్గుతూ వచ్చాడు. టొటొచాన్ కూడ ఎంతో కష్టపడింది గాని టాకాహాషిని ఓడించలేకపోయింది. తిన్నగా ఉండే దారి మీద పరుగులోనయితే వాళ్లు టాకాహాషిని ఓడించగలిగారు. గాని కష్టంగా ఉన్న పందెం దేంట్లో నయినా గెలుపు టాకాహాషిదే.

టాకాహాషి బహుమతులు తీసుకోవడానికి వేదిక మీదికి వెళ్ళాడు. అప్పుడు తను ఎంతో ఆనందంగా, పంచ్‌లాగ గర్వంగా కనిపించాడు. ప్రతి దాంట్లోనూ మొదటి బహుమతి తనదే గనుక ఒక దాని తర్వాత ఒకటి తీసుకోవడానికి టాకాహాషి వేదిక ఎక్కాడు. ప్రతిఒక్కరూ అసూయతో చూస్తుండిపోయారు.

"వచ్చే సంవత్సరం చూసుకో. టాకాహాషిని ఓడగొట్టేస్తాను" అని ప్రతి ఒక్కరూ వాళ్ళలో వాళ్ళు అనుకున్నారు. కాని ప్రతి సంవత్సరమూ టాకాహాషినే అత్యధిక బహుమతులు అందుకునే వాడుగా గెలుస్తూవచ్చాడు.

ఇక అక్కడి బహుమతులు కూడ హెడ్‌మాస్టర్‌కు తగినట్టుగానే విచిత్రంగా ఉండేవి. మొదటి బహుమతి ఒక పెద్ద ముల్లంగి దుంప. రెండో బహుమతి రెండు బీట్‌రూట్‌లు. మూడో బహుమతి ఆకుకూరల కట్ట. బహుమతులన్నీ అటువంటివే ఉండేవి. అన్ని బళ్ళలోనూ ఆటల రోజుకు బహుమతులుగా కూరగాయలే ఇస్తూంటారేమోనని టొటొచాన్ పెద్ద పెరిగే వరకూ అనుకుంటూ ఉండేది.

ఆ రోజుల్లో చాల బళ్ళలో బహుమతులుగా నోటుపుస్తకాలు, పెన్సిళ్ళు, రబ్బర్లు ఇస్తుండేవాళ్ళు. టోమో పిల్లలకు ఆ సంగతి తెలియదు. కాని వాళ్ళకు ఈ కూరగాయల బహుమతులు మాత్రం నచ్చలేదు. ఉదాహరణకు టొటొచాన్‌కు కాసిన్ని బీట్‌రూట్‌లు, కొన్ని ఉల్లిపాయలు బహుమతిగా వచ్చాయి. రైల్లో వాటిని పట్టుకెళ్ళాలంటే టొటొచాన్‌కు సిగ్గేసింది. ఎన్నెన్నో కారణాల మీద అదనపు బహుమతులు కూడి ఇచ్చారు గనుక ఆ రోజు చివర చూసేసరికి టోమో పిల్లలందరి దగ్గర ఏదో ఒక కూరగాయల బహుమతి ఉంది. మరి, బడి నుండి ఇంటికి

కూరగాయలతో వెళ్ళడానికి పిల్లలు ఎందుకు సిగ్గుపడాలి? అమ్మ కూరగాయలు కొనుక్కు రమ్మని పంపించి ఉంటే వాళ్ళెవరికీ అభ్యంతరం ఉండేదికాదు. కాని బడి నుంచి ఇంటికి కూరగాయలు తీసుకెళ్ళాలనేసరికే వాళ్ళందరికీ విచిత్రంగా కనబడినట్టు అనిపించింది.

ఒక క్యాబేజి గెలుచుకున్న లావాటి అబ్బాయికి దాన్ని ఏం చేసుకోవాలో తెలియలేదు.

"నాకు ఇది మోసుకు పోవడం ఏమీ బాగులేదు. దీన్ని ఎక్కడో పారేసిపోతాను" అన్నాడా అబ్బాయి.

పిల్లలందరి సణుగుళ్ళు హెడ్‌మాస్టర్ విన్నట్టే ఉన్నాడు. చేతుల్లో క్యారట్లు, ముల్లంగులు, అలాంటివన్నీ పట్టుకుని ఉన్న పిల్లల దగ్గరికి ఆయన నడిచాడు.

"ఏమిటి సంగతి? మీకవి వద్దా?" అని అడిగాడు. మళ్ళీ ఆయనే మొదలుపెట్టి "ఇవాళ రాత్రి భోజనంలోకి ఇవే వండిపెట్టమని అమ్మను అడగండి. ఇవి మీరు స్వయంగా సంపాదించుకున్న కూరగాయలు, అంటే ఇవాళ మీరు మీ కృషితో మీ కుటుంబాలకు కూరలు సంపాదించారన్నమాట. ఎంత బావుంది గదూ? ఈ కూరలు చాల రుచిగా ఉంటాయని నేను పందెం కడతాను" అన్నాడు.

ఔను, ఆయన చెప్పిన మాట నిజమే. ఉదాహరణకు టొటొచాన్ విషయమే చూస్తే, ఆ పాప తన జీవితంలో మొదటిసారిగా రాత్రి భోజనానికి తనంతట తానే ఏదో ఒకటి సమకూర్చింది.

"నేను అమ్మకు చెప్పి ఈ బీట్‌రూట్లతో మసాలాకూర చేయించుకుంటాను! కాని ఈ ఉల్లిపాయలతో ఏం చెయ్యమనాలా అనేది తోచట్లేదు" అని హెడ్‌మాస్టర్‌తో చెప్పింది టొటొచాన్.

ఇక అక్కడ్నించి మిగిలిన వాళ్ళందరూ కూడ తాము ఏయే తినుబండారాలు చేయించుకుంటారో హెడ్‌మాస్టర్‌కు చెప్పడం మొదలు పెట్టారు.

"అమ్మయ్య. మీకిప్పటికి అసలు సంగతి అర్థమయిందన్నమాట" అన్నాడు హెడ్‌మాస్టర్. ఎంత సంతోషంగా నవ్వాడంటే ఆయన చెక్కిళ్ళు ఎర్రబడి పోయాయి. ఆ కూరగాయలు తింటూ, ఆటలరోజునాటి విశేషాలు మాట్లాడుకుంటూ ఆ పిల్లలు, వారి కుంటుబాలు గుడుపుతున్న ఆనందమయ దృశ్యం ఆయన కళ్ళకు కట్టినట్టుంది.

ఆయన టాకాహాషి గురించే ప్రత్యేకంగా ఆలోచిస్తూ ఉన్నాడనడానికి సందేహం అక్కర్లేదు. టాకాహాషి రాత్రిభోజనపు బల్లనిండా ఆ మొదటి బహుమతులు కిక్కిరిసి పోతుంటాయి. తన పొట్టితనం గురించి, తానింక పెరగనే పెరగననే వాస్తవం గురించి ఆలోచించి ఆత్మ న్యూనత పొందేబదులు ఆ అబ్బాయి అన్ని మొదటి బహుమతులు గెలుచుకున్న గర్వాన్నీ, ఆనందాన్నీ ఎట్టా పొందుతాడో హెడ్‌మాస్టర్ తలచుకున్నాడు. ఐనా, బహుశా టాకాహాషి మొదటి బహుమతులు గెలుచుకునేందుకు వీలుగానే ఆ ప్రత్యేకమైన ఆటల్ని ఆ హెడ్‌మాస్టర్ కనిపెట్టాడేమో, ఎవరికి తెలుసు?!

## కవి ఇస్సా

పిల్లలందరికీ హెడ్‌మాస్టర్ "ఇస్సా కొబయాషి" అని పిలవడం ఇష్టంగా ఉండేది. వాళ్ళు ఆయన గురించి ఆప్యాయంగా గీతాలు కూడా తయారు చేశారు. వాటిల్లో ఒకటేమిటంటే.

ఇస్సా కొబయాషి!
ఇస్సా మా పెద్దమనిషి
బట్టతల మనిషి!



ఇలా ఎందుకంటే, హెడ్‌మాస్టర్ వాళ్ళ ఇంటిపేరు కొబయాషి. పందొమ్మిదో శతాబ్దంలోని ప్రముఖ కవి ఇస్సాఇంటిపేరు కూడా అదే. ఆయన రాసిన గీతాలు హెడ్‌మాస్టర్‌కు చాలా ఇష్టం. హెడ్‌మాస్టర్ ఇస్సా గీతాల్ని ఎంత ఎక్కువగా చెపుతూ ఉండేవాడో! విని విని తమ హెడ్‌మాస్టర్ సొసాకు కొబయాషి ఎంత సన్నిహితుడో, ఇస్సాకూడా అంత సన్నిహితుడేనని పిల్లలు అనుకునేవాళ్ళు.

హెడ్‌మాస్టర్‌కు ఇస్సా గీతాలు ఎందుకు నచ్చేవంటే అవి చాలా వాస్తవికంగా ఉండేవి. జీవితంలోని అతి సాధారణ సంఘటనలతో ముడిబడి ఉండేవి. వేలాది మంది కవులు ఉండి ఉన్న సమయంలో ఇస్సా తనదంటూ ఒక ప్రపంచాన్ని సృష్టించాడు. దాన్ని అనుకరించడం మరెవరికయినా అసాధ్యం. ఆ గీతాలకు శిశువులకున్నటువంటి సాదాతనం ఉండేది. హెడ్‌మాస్టర్‌కు అవి నచ్చినందుకే. కనుక అవకాశం దొరికినప్పుడల్లా ఆయన తన విద్యార్థులకు ఇస్సాగీతాల్ని వినిపిస్తుండేవాడు. వాటిని కంఠతా పట్టమనేవాడు. వాటిలో ఒకటి ఎలా ఉండేదంటే :

సన్న కప్పా సన్న కప్పా
లొంగి పోకు,
ఇస్సా ఉన్నాడు నీపక్క
రెక్కలొచ్చిన ఊరపిచుక
దారి విడువవా
మా మంచి గుర్రానికి
దారి వదలవా!
చేతులు కాళ్ళు పిసుక్కునే
ఈగ నొదలరా!
మీ దయ కోరుతున్న దాన్ని
వదిలి పెట్టరా!

ఒకసారి హెడ్‌మాస్టర్ ఒక గీతానికి సంగీత స్వరాలు సరిచేశాడు. అప్పుడు పిల్లలందరూ ఆ గీతాన్ని గొంతెత్తి పాడారు.

హెడ్‌మాస్టర్ చాలా తరుచుగా ఈ గీతాలు నేర్పే తరగతులు ఏర్పాటు చేసేవాడు, ఐతే ఇవి మామూలు పాఠ్య క్రమంలో భాగం కావు.

టొటొచాన్ కూడా ఒక గీతం అల్లడానికి ప్రయత్నించింది. టొటొచాన్‌కు ఇష్టమైన బొమమల కథలో దారితప్పిన నల్లకుక్క నొరాకురో మీద ఆ గీతం రాసింది. ఆ నల్లకుక్క సైన్యంలో సిపాయిగా చేరి, క్రమక్రమంగా పై పదవులు పొందుతూ ఉంటుంది. అయితే ఆ కుక్క ఎదుగుదలలో కూడా ఒడిదుడుకులు ఉంటాయి. ఈ బొమ్మల కథ ఒక విశేషప్రచారంగల మగ పిల్లల పత్రికలలో అచ్చయింది.

దారితప్పిన నల్లకుక్క కదిలింది
యూరప్ ఖండానికేమో చేరనుంది
ఎందుకంటె సైన్యం పని అయిపోయింది.

"నీ ఆలోచనల్లో ఉండే ఏదయినా విషయం గురించి సూటిగా, నిజాయితిగా గీతం రాసేందుకు ప్రయత్నించు" అన్నాడు హెడ్‌మాస్టర్.

టొటొచాన్ రాసిన దాన్ని అసలు గీతం అనడానికి వీల్లేదు. కాని దాన్ని బట్టి ఆ రోజుల్లో టొటొచాన్‌కు ఆసక్తి కలిగించిన వేమిటో గుర్తించవచ్చు. అసలు గీతమంటే ఒక్కొక్క పాదాన్ని 5-

7-5 శబ్దాలతో వరుసగా మూడు పాదాలు రాయాలి. కాని టొటొచాన్ రాసినదాంట్లోనేమో 5-7-7 శబ్దాలున్నాయి. మరి జపనీస్‌భాషలో ఇస్సా ఎగిరే ఊరపిచుకలు గురించి రాసిన గీతంలో కూడా 5-8-7 శబ్దాలున్నాయి. కనుక తన గీతానికి కూడా ఫర్వాలేదని టొటొచాన్ అనుకుంది.

కుహోంబుట్సు ఆలయానికి నడిచి వెళుతున్నప్పుడో, బైటవర్షం కురుస్తూ ఆవరణలో ఆడుకోలేక అందరూ అసెంబ్లీ హాలులో చేరినప్పుడో టోమో లోని ఇస్సా వొబయాషి పిల్లలకు గీతాల గురించి, కవితారచన గురించి చెప్పేవాడు జీవితం గురించి, ప్రకృతి గురించి తన భావాలను చెప్పడానికి కూడా ఆయన కవిత్వాన్నే ఎంచుకునే వాడు.

ఇస్సా రాసిన కొన్ని గీతాలయితే ప్రత్యేకంగా టోమోకోసం రాసినవా అన్నట్టుండేవి.

మంచు కరుగుతున్నదీ
హఠాత్తుగా గ్రామమేమో
పిల్లలతో నిండుకున్నదీ!

## అతి రహస్యం

టొటొచాన్‌కు తన జీవితంలో మొదటి సారిగా డబ్బుదొరికింది. బడినుంచి ఇంటికి రైల్లో వెళుతుండగా ఆ సంఘటన జరిగింది. టొటొచాన్ జియుగౌకాలో ఒయిమాచి రైలు ఎక్కింది. మిడోరిగౌకా అనే తర్వాతి స్టేషన్‌కు చేరకముందు ఒక మలుపు ఉంటుంది. అక్కడ ప్రతిసారీ రైలు పెద్దగా చప్పుడు చేస్తూ ఒక పక్కకు ఒరిగి నడుస్తుంది. టొటొచాన్ పాదాల్ని నేలకు బిగబట్టి పక్కకు ఒరిగిపోకుండా తనను తాను కాపాడుకుంటుంది. టొటొచాన్ ఎప్పుడూ రైలు వెనుక భాగంలో కుడిచేతివేపు తలుపు దగ్గర నిలబడుతుంది. రైలు ఎటు వెళ్తుందో అటు ముఖం చేసి నిలబడుతుంది. టొటొచాన్ అక్కడెందుకు నిలబడేదంటే, తాను దిగవలసిన స్టేషన్‌లో ప్లాటుఫారం కుడివేపుకే వస్తుంది. ఆ తలుపు అతి దగ్గరి తలుపన్నమాట.

ఆ రోజు మామూలుగానే రైలు ఒక పక్కకి ఒరిగి కీచుమని శబ్దంచేస్తూ ఆ మలుపు తిరుగుతుండగా టొటొచాన్ కాళ్ళదగ్గర డబ్బు లాంటిదేదో పడిఉన్నట్టు గుర్తించింది. ఇదివరకు ఒకసారి కూడా ఇలాగే అనిపించి తీసుకుంటే అది గుండీ అయింది. అందుకని టొటొచాన్ ఈసారి చాలా జాగ్రత్తగా చూడాలని నిర్ణయించుకుంది. రైలు మళ్ళీ తిన్నగా అయిపోయాక తలవంచి దానివైపు జాగ్రత్తగా చూసింది. అది కచ్చితంగా డబ్బే. ఐదు సెన్ల బిళ్ళ అది. దగ్గర్లో ఉన్నవాళ్ళెవరయినా పారేసుకున్నారేమో అని అటూఇటూ చూసింది. అలా పారేసుకుంటే రైలు ఒరిగిపోయినప్పుడు తనవైపు జారి ఉంటుందని అనుకుంది. కాని టొటొచాన్‌కు దగ్గర్లో ఎవరూ నిలబడిలేరు.

ఇప్పుడేం చేయాలి అని సందేహం పట్టుకుంది. డబ్బులు దొరికితే పోలీసులకు ఇచ్చేయాలని ఎవరో ఎప్పుడో చెప్పిన మాట టొటొచాన్‌కు గుర్తువచ్చింది. కాని రైల్లో పోలీసులు లేరుగదా, మరెలా? ఎక్కడైనా ఉండి ఉంటారా?

సరిగ్గా అప్పుడే కండక్టర్ పెట్టె తెరచుకుంది. కండక్టర్ టొటొచాన్ ఉన్న పెట్టెలోకి వచ్చాడు. టొటొచాన్ ఎందుకో తెలియకుండానే ఆ నాణెంమీద కుడిపాదాన్ని కప్పేసింది. కండక్టర్ టొటొచాన్‌ను ఎప్పుడూ చూస్తూ ఉంటాడు గనుక చిరునవ్వు నవ్వాడు కానీ టొటొచాన్ జవాబుగా నవ్వలేకపోయింది. టొటొచాన్ ఎందుకు హృదయపూర్వకంగా నవ్వలేక పోయిందంటే, అప్పుడు తన కుడికాలికింద దాచిపెట్టి ఉన్న నాణెంతో తనేదోతప్పుచేస్తున్నానే భావించింది. చివరికి అతికష్టం మీద ముఖం మీదికి బలహీనంగా ఒక నవ్వుతెచ్చుకుంది. అప్పుడే రైలు ఊకాయామాలో



ఆగింది. అది టొటొచాన్ దిగవలసిన స్టేషన్‌కన్న ముందు స్టేషన్. ఎడమ చేతివైపు తలుపులు తెరుచుకున్నాయి. అనుకోకుండా అక్కడ చాలామంది రైల్లోకి ఎక్కారు. టొటొచాన్ అటూఇటూ తోశారు. జరగమన్నారు. టొటొచాన్ మాత్రం తన కుడికాలు కదపదలచుకోలేదు. పట్టుదలగా ఉన్నచోటనే నిలబడిపోయింది. అలా నిలబడడానికి ప్రయత్నిస్తూనే టొటొచాన్ ఆలోచించింది ప్రణాళిక సిద్ధం చేసుకుంది. రైల్లోంచి దిగుతూ ఆ నాణెం తీసేసుకుని, దిగగానే కనబడ్డ పోలీసులకు ఇచ్చేస్తుంది. అప్పుడే టొటొచాన్‌కు మరొక ఆలోచన తట్టింది. కాలికిందనుంచి నాణెం తీయడం ఎవరయినా పెద్దవాళ్ళు చూస్తే, వాళ్ళు తనను దొంగ అనుకోరూ! ఆ రోజుల్లో ఐదుసెన్ లంటే ఎక్కువే. చిన్న పొట్లంలో పిప్పరమెంట్లు వచ్చేవి. ఒక చాకొలెట్ బార్ వచ్చేది. పెద్దవాళ్ళకయితే ఐదుసెన్‌లు అంటే ఏమంత పెద్ద మొత్తం అనిపించక పోయినా, టొటొచాన్‌కయితే అదే ఎంతో పెద్దనిధి. అందుకే దాని విషయంలో టొటొచాన్ అంత ఆందోళన పడింది.

"అమ్మయ్య. మెల్లగా అయ్యో నా డబ్బు పడిపోయిందే, ఏదీ, అంటూ ఆ బిళ్ళ తీసేసుకుంటాను. అప్పుడు అందరూ అది నాదే అనుకుంటారు" అనుకుని కుదుటపడింది.

కాని వెంటనే టొటొచాన్‌కు ఇంకో సమస్యవచ్చి పడింది. "నేను ఆ మాట అని, అందరూ నావైపు చూస్తున్నప్పుడే, మరెవరయినా వచ్చి 'అదినాదే' అంటే ఏం చెయ్యడం?"

బుర్రలో ఎన్నెన్నో ఆలోచనలు కలబోసి, రైలు స్టేషన్‌కు చేరబోతుండగా కూచోవాలని, బూటులేసు కట్టుకుంటున్నట్టుచేసి ఆ బిళ్ళను రహస్యంగా తీసుకోవాలని, అదే మంచిపని అని నిర్ణయించుకుంది. ఆ ఆలోచన పనిచేసింది. ప్లాట్‌ఫారం మీదికి దిగేసరికి టొటొచాన్ చెమటతో తడిసి ముద్దయిపోయింది. ఐదుసెన్‌ల బిళ్ళతో టొటొచాన్‌కు చాలా అలసటగా అనిపించింది. పోలీస్‌స్టేషనేమో చాలాదూరం. ఇప్పుడు అంతదూరం వెళ్ళి ఆ డబ్బు ఇచ్చి వెనక్కి ఇంటికి వెళ్ళాలంటే, చాలా ఆలస్యమయిపోతుంది. అమ్మ గాభరా పడుతుంది. స్టేషన్లో మెట్లు దిగుతూ ఏం చెయ్యాలా అని టొటొచాన్ తీవ్రంగా ఆలోచించింది. చివరికి ఒక ఆలోచన తనకు నచ్చింది.

"నేనిప్పుడు దీన్ని రహస్యంగా దాచిపెడతాను. రేపు బడికి దీన్ని తీసుకుని వెళ్ళి అందరినీ సలహా అడుగుతాను. ఎలాగైనా వాళ్ళకు దీన్ని చూపెడితేనే బావుంటుంది. ఎందుకంటే ఇప్పటిదాకా ఎవరికీ డబ్బులు దొరకలేదుగా" అనుకుంది.

కాని ఈ డబ్బులు ఎక్కడ దాచడమనేది మళ్ళీ సమస్య అయింది. దీన్ని ఇంటికి తీసుకెళితే అమ్మ దాని గురించి అడగవచ్చు. అందుకే ఇంకెక్కడయినా దాచెయ్యాలి.

స్టేషన్ దగ్గర్లోని ఒక చెట్ల గుబురులోకి వెళ్ళింది టొటొచాన్. అక్కడ టొటొచాన్‌ను ఎవరూ గమనించలేదు. అక్కడికి ఎవరూ రారు కూడా. కనుక అక్కడ డబ్బు సురక్షితంగా ఉంటుంది. అక్కడ ఒక కర్రతో చిన్న గుంట తవ్వింది. ఆ విలువైన ఐదు సెన్‌ల నాణేన్ని ఆ గుంటలో వేసింది. దాని మీద మట్టి కప్పింది. అక్కడ ఒక విచిత్రంగా ఉన్న రాయిని తీసుకొచ్చి ఆ గుంట మీద గుర్తుగా పెట్టింది. అప్పుడిక విపరీతమైన వేగంతో ఇంటకి పరుగెత్తింది.

చాలాసార్లు రాత్రి పూట టొటొచాన్ బడి గురించి కబుర్లు చెపుతూనే ఉంటుంది. చివరికి అమ్మ "పడుకునే సమయం అయిందిరా పడుకో కన్నా" అనే దాకా కబుర్లు సాగుతూనే ఉంటాయి. కాని ఆ రాత్రి మాత్రం టొటొచాన్ ఎక్కువ సేపు మాట్లాడలేదు. తొందరగానే మంచం ఎక్కేసింది.

మర్నాటి ఉదయం తాను చాలా ముఖ్యమైన పని ఏదో చేయాల్సి ఉందన్న ఆలోచనతోనే మేలుకుంది టొటొచాన్. హఠాత్తుగా తన రహస్య నిధి గుర్తుకొచ్చి టొటొచాన్ సంతోషించింది.

మామూలు కంటె తొందరగా ఇంట్లోంచి బయల్దేరింది. రాకీతో కలిసి ఆ చెట్ల గుబురు దగ్గరికి పరుగెత్తింది టొటొచాన్. అక్కడ అటూ ఇటూ వెతకడం మొదలు పెట్టింది.

"ఇదిగో ఇక్కడ ఇక్కడే!"

గుర్తుగా పెట్టిన రాయి సరిగ్గా ఎలా పెట్టిందో అలాగే ఉంది.

"ఇప్పుడు నేను నీకు ఒక భలేది చూపెడతాను చూడు" అంది టొటొచాన్ రాకీతో. ఆ రాయి తీసేసి అక్కడ జాగ్రత్తగా మట్టి కెలికింది. కాని విచిత్రంగా ఆ ఐదుసెన్‌ల నాణెం మాత్రం అదృశ్యమైపోయింది! టొటొచాన్‌కు అంత ఆశ్చర్యం ఎప్పుడూ కలగలేదు. తాను దాచి పెడుతుండగా ఎవరైనా చూసి ఉంటారా. లేక రాయి కదిలి ఉంటుందా అని టొటొచాన్ ఆశ్చర్యపోయింది. చుట్టూ కూడా తవ్వి చూసింది గాని ఆ ఐదుసెన్‌ల నాణెం మాత్రం ఎక్కడా కనబడ లేదు. అయ్యో, ఇప్పుడు బడిలో స్నేహితులందరికీ ఆ నాణెం చూపెట్టాలనుకున్న కోరిక నెరవేరదే అని టొటొచాన్ నిరుత్సాహపడింది. అంతకంటె ముఖ్యంగా టొటొచాన్‌కు ఇదంతా పెద్ద విచిత్రం లాగా కనిపించింది.

ఆ తర్వాత నుంచి అటువైపు నడిచినప్పుడల్లా టొటొచాన్ ఆ గుబురులోకి వెళ్ళి, అక్కడ తవ్వుతుండేది. కాని ఆ నాణెం మాత్రం దొరకనే లేదు.

'బహుళా ఓ చిట్టెలుక తీసుకుపోయి ఉంటుందేమో?" అనుకునేది. లేదా "అదంతా నా కలనా, నిజమేనా?" అనుకునేది. లేదా "నేను దాచిపెడుతుండగా దేవుడు చూశాడేమో?" అనుకునేది. కాని ఎంత ఆలోచించినా అదంతా విచిత్రంగానే ఉండేది. టొటొచాన్ ఎప్పటికీ మరిచిపోలేని నిగూఢ రహస్యం అది.

## చేతులతో మాట్లాడడం

ఒకరోజు మధ్యాహ్నం జియుగౌకా స్టేషన్‌లో టికెట్ల గేటు దగ్గర టొటొచాన్ ముగ్గురు పిల్లల్ని చూసింది. వాళ్ళు ఇద్దరు మగపిల్లలు, ఒక అడపిల్ల. టొటొచాన్ కంటె కాస్త పెద్దవాళ్ళు వాళ్ళు ముగ్గురూ "రాయి, కాగితం, కత్తెర" ఆట ఆడుకుంటున్నట్టుగా దగ్గరగా నిలబడి ఉన్నారు. కాని వాళ్ల మామూలు కంటె ఎక్కువగా చేతులతో సైగలు చేసుకుంటున్నారని టొటొచాన్ గుర్తించింది. అదంతా భలే విచిత్రంగా కనబడింది. సరిగ్గా చూసేందుకని టొటొచాన్ వాళ్ళ దగ్గరికి నడిచింది. వాళ్ల చడీచప్పుడు లేకుండా మాట్లాడుకుంటున్నారనిపించింది. వాళ్ళలో ఒకరు చేతులతో చాలా సైగలు చేయగానే, అప్పటిదాకా చూస్తున్న వాళ్ళు మళ్ళీ వేరేరకంగా చాలా సైగలు చేస్తున్నారు. అప్పుడు మూడోవాళ్ళు మరికొన్ని సైగలు చేస్తున్నారు. అప్పుడు ముగ్గురూ పెద్దగా నవ్వుకుంటున్నారు. అప్పుడుకూడా పెద్దగా చప్పుడు కావడం లేదు. వాళ్ళు చాలా సరదాగా నవ్వుకుంటున్నారు. అప్పుడుకూడా పెద్దగా చప్పుడు కావడం లేదు. వాళ్ళు చాలా సరదాగా ఉన్నట్టు కూడా కనిపించారు. కొద్దిసేపు వాళ్ళను చూసిన తర్వాత, వాళ్ళు చేతులతోనే మాట్లాడు కుంటున్నారని టొటొచాన్ అనుకుంది.

"అబ్బ నేను కూడా చేతులతో మాట్లాడ గలిగితే ఎంత బాగుండు" అని ఈర్ష్యగా అనుకుంది టొటొచాన్. వాళ్ళ దగ్గరికి వెళ్ళి వాళ్ళలో కలిసిపోదామా అనికూడా ఆలోచించింది. కాని ఆ సంగతి వాళ్ళను అడగాలంటే చేతుల్తో ఎలా సైగలు చేయాలో టొటొచాన్‌కు తెలియలేదు. అంతేగాక వాళ్ళు టోమో విద్యార్థులు కాదు గనుక అట్లా అడగడం మొరటుగా ఉంటుందేమో అని కూడా అనుకుంది. కనుక వాళ్ళు టొయోకో రైలు కోసం ప్లాట్ ఫారం మీదికి వెళ్ళిపోయేదాక టొటొచాన్ వాళ్ళనే చూస్తూ నిలబడి పోయింది.



"ఏదో ఒకరోజు చేతులతో మాట్లాడడం నేర్చుకుంటాను" అనుకుంది టొటొచాన్.

కాని టొటొచాన్‌కు అప్పటికి చెవిటివాళ్ళ గురించి తెలియదు. ఒయిమాచిలోని మునిసిపల్ చెవిటి, మూగ పాఠశాలకు వెళ్ళే పిల్లలగురించి కూడా టొటొచాన్‌కు తెలియదు. వాళ్ళు ప్రతిరోజూ టొటొచాన్ ఎక్కివెళ్ళే రైలు చేరే చివరి స్టేషన్ దగ్గరే ఆ బడి ఉంది.

మెరుస్తున్న కళ్ళతో ఆ పిల్లలు దీక్షగా ఒకరి చేతివేళ్ళ వేపు ఒకరు అలా చూసుకుంటూ ఉండడమే టొటొచాన్‌కు చాలా అందంగా ఉన్నట్టనిపించింది. వాళ్ళతో ఏదో ఒకరోజు స్నేహం చేసుకోవలసిందే అనుకుంది.

## నలభై ఏడురుగు రోనిన్‌లు

కొబయాషి బోధనా పద్ధతులు విశిష్టమైనవి. ఆయన చాలావరకు యూరప్‌నుంచీ, ఇతర విదేశాల నుంచీ భావాలతో ప్రభావితమయ్యాడు. టోమోలో యురిథమిక్స్ పాఠాలు, మధ్యాహ్న భోజనపు అలవాట్లు, పాఠశాలలో షికార్లు, 'రో, రో, రో, యువర్ బోట్' బాణీలో ఉండే మధ్యాహ్న భోజనం పాట అన్నీకూడా ఈ ప్రభావం నుంచి వచ్చినవే.

హెడ్‌మాస్టర్‌కు కుడిభుజంగా మరుయామా అని ఒకాయన ఉండేవాడు. మామూలు బళ్ళలోనైతే ఆయనను వైస్ ప్రిన్సిపాల్ అంటారన్నమాట. ఈ మరుయామా మాత్రం సరిగ్గా కొబయాషికి వ్యతిరేకంగా ఉండేవాడు. మరుయామా అంటే 'గుండ్రని కొండ' అని అర్థం. సరిగ్గా అలాగే ఆయన తల పూర్తిగా గుండ్రంగా ఉండేది. పైన ఒక్క వెంట్రుక కూడా ఉండేదికాదు. కాని వెనుకవైపున మాత్రం చెవులకు సూటిగా కాసిన్ని తెల్ల వెంట్రుకలుండేవి. ఆయన గుండ్రని అద్దాలున్న కళ్ళజోడు పెట్టుకునేవాడు. ఆయన చెంపలు ఎరుపు రంగులో మెరిసిపోతుండేవి. ఆయన కొబయాషి కంటె చూపులకు మాత్రమే గాక వేరేరకంగా కూడా వేరుగా ఉండేవాడు. చైనీయశైలిలో ఉన్న సాంప్రదాయ కవితలను గంభీరమైన స్వరంతో చదువుతూ ఉండేవాడు.

డిసెంబర్ 14 ఉదయం పిల్లలందరూ బడికి చేరగానే మరుయామా ఒక ప్రకటన చేశాడు.

"దాదాపు రెండున్న శతాబ్దాల కింద నలభై ఏడుగురు రోనిన్‌లు తమ సుప్రసిద్ధ ప్రతీకారాన్ని తీర్చుకున్న రోజు ఇది. కనుక ఇప్పుడు మనమందరం సెంగాకుజి ఆలయం దగ్గరికి వెళ్ళి రోనిన్‌ల సమాధులదగ్గర శ్రద్ధాంజలి ఘటిద్దాం. మీ అమ్మానాన్నలకు ఈ విషయం కబురుచేశాం" అన్నాడాయన.

యరుయామా ఆలోచనను హెడ్‌మాస్టర్ వ్యతిరేకించలేరు. అసలు ఆ ఆలోచన గురించి హెడ్‌మాస్టర్ ఏమనుకున్నాడో తల్లిదండ్రులకు తెలియదు. కాని ఆయన గనుక వ్యతిరేకించి ఉండకపోతే, ఒప్పుకునే ఉంటాడని అందరూ అనుకున్నారు. టోమోపిల్లలు నలభైఏడుగురు రోనిన్‌ల సమాధులు సందర్శించడమనేది నిజంగా ఉద్విగ్న పూరితమైన సంగతే.

బయలు దేరేముందు సరుయామా పిల్లలకు ఆ నలభై ఏడగురు సుప్రసిద్ధ రోనిన్ల గురించి చెప్పాడు. మహా ప్రభువు అసనోకు చెందిన ఈ నలభై ఏడుగురు సాహసులూ, విధేయులూ అయిన వీరులు మరణించిన తమ ప్రభువుకు గౌరవ సూచకంగా ప్రతీకారం తీర్చుకునేందుకు రెండు సంవత్సరాల పాటు ఎలా పథకాలు వేశారో ఆయన వివరించాడు. ఆ ప్రభువుకు ఎంత దారుణమైన అన్యాయం జరిగిందో చెప్పాడు. ఈ నలభై ఏడుమంది యోధులతోపాటు రిహెయి అమనోయా అనే ధైర్యస్తుడయిన వ్యాపారి కూడా ఉన్నాడని ఆయన

చెప్పాడు. రోనిన్‌లకు ఆయుధాలు సరఫరా చేసింది ఆయనే. జపాన్ సైన్యాధిపతి ఆ వ్యాపారస్తుణ్ణి నిర్బంధించినప్పుడు ఆయన "రిహెయి అమనోయా అనే నేను మనిషిని" అంటూ పశ్చాత్తాపం ప్రకటించడానికి నిరాకరించాడు. ఒక్క రహస్యం కూడా చెప్పలేదు. పిల్లలకు ఈ కథలో చాలా భాగం అర్థం కాలేదు. కాని వాళ్ళందరికీ ఉత్సాహం కలిగిందెందుకంటే ఆ రోజు తరగతులు మానేసి, కుహోంబట్సు దేవాలయం కన్న ఇంకా దూరంగా ఉన్న చోటికి షికారుగా వెళుతున్నామని, మధ్యాహ్న భోజనం వనభోజనం కానున్నదని.

హెడ్‌మాస్టర్‌కు, మిగిలిన టీచర్లందరికీ చెప్పేసి, పిల్లలందరూ మరుయామా వెనుక నడిచారు. ఆ వరుసల్లోంచి అక్కడా అక్కడా "రిహెయి అమనోయా అనే నేను మనిషిని" అని పిల్లల గొంతులు వినిపించడం దారినపోతున్న వాళ్ళు తలలు తిప్పి చూసి నవ్వారు. సెంగాకుజి అక్కడి నుంచి ఏడుమైళ్ళ దూరం. కాని ఎక్కువ వాహనాలు లేవు. ఆ డిసెంబర్ ఆకాశం నిర్మలంగా నీలంగా ఉంది "రిహెయి అమనోయా అనే నేను మనిషిని" అని తడవ తడవకూ కేకలు వేస్తూ నడుస్తున్న ఆ చిన్నారి పిల్లలకు ఆ దూరం తెలియనేలేదు.



సెంగాకుజి చేరగానే మరుయామా ప్రతి ఒక్కరికి ఒక్కొక్క ఊదు కడ్డీ, కొన్ని పూలు ఇచ్చాడు. ఆ ఆలయం కుహోంబుట్సు ఆలయం కన్న చిన్నదిగా ఉంది. కాని ఇక్కడ వరుసగా చాలా సమాధులున్నాయి. ఈ స్థలం నలభైఏడుమంది రోనిన్ స్మృతిచిహ్నం అని తలచుకోగానే, ఊదు, పూలు సమర్పిస్తూ టొటొచాన్ గంభీరంగా మారిపోయింది. మరుయామా లాగనే నిశ్శబ్దంగా ఒంగి అభివాదం చేసింది. పిల్లలందరూ మౌనం వహించారు. టోమో పిల్లలు అంత నిశ్శబ్దంగా ఉండడం అసాధారణమైన సంగతి. ప్రతి సమాధిదగ్గరా వెలిగించి ఉంచిన ఊదు కడ్డీల పొగ పైకి ఎగసి గాలిలో చాలా సేపటి వరకూ చిత్రాలు గీసింది.

ఆ తర్వాత ఎక్కడ సాంబ్రాణి వాసన వచ్చినా ఆ పిల్లలకు మరుయామా గురించి, రిహెయి అమనోయా గురించి ఆలోచనలు వచ్చేవి. అంతేగాక ఆ పరిమళం వాళ్ళకు నిశ్శబ్ద పరిమళం కూడా అయింది.

పిల్లలు నలభైఏడుగురు రోనిన్‌ల గురించి పూర్తిగా అర్థం చేసుకుని ఉండక పోవచ్చు. కాని వాళ్ళగురించి అంత ఉద్వేగ పూరితంగా మాట్లాడిన మరుయామాను మాత్రం పిల్లలు దాదాపు కొబయాషిని చూసినంత గౌరవంతో, అభిమానంతో చూశారు. ఐతే ఈ గౌరవాభిమానాలు వేరే రకమైనవి. ఆయన కళ్ళజోడుకు ఉన్న దళసరి అద్దాల వెనుక నుంచి చూసే ఆయన చిన్న చిన్న కళ్ళను టొటొచాన్ ఇష్టపడింది. ఆయన మృదువైన స్వరమంటే కూడా టొటొచాన్‌కు ఇష్టం కలిగింది. అయితే ఆయన లావుపాటి రూపానికీ, ఆ గొంతు సరిపోదనిపించింది.

## "మాసా చాన్"

స్టేషన్‌వెళ్ళే దారిలో టొటొచాన్ ఒక ఇంటిని దాటవలసి ఉండేది. అక్కడ కొందరు కొరియన్లు ఉంటుండేవారు. ఐతే వాళ్ళు కొరియన్‌లని టొటొచాన్‌కు అప్పటికి తెలియదు. వాళ్ళ గురించి టొటొచాన్‌కు తెలిసినది ఒకే ఒక్క సంగతి. అక్కడ ఒకావిడ ఉండేది. ఆవిడ జుట్టుని



రెండు పాయలుగా మధ్యలోకి విడదీసుకునేది. మళ్ళీ వెనక కలిపి ముడివేసుకునేది. ఆవిడ కాస్త బొద్దుగా ఉండేది. తెల్లని రబ్బర్ జోళ్ళు వేసుకునేది. ఆ జోళ్ళు చిన్న పడవల లాగ ముందుకు పొడుచుకొచ్చినట్టుండేవి. ఆవిడ పొడవాటిలంగా వేసుకునేది. పొట్టి రవిక తొడుక్కుని ఆ రవిక ముందుకు లంగా బొందులు కట్టుకుని ఉండేది. ఎప్పుడూ కొడుకు కోసం ఎదురుచూస్తున్నట్లుండేది. "మాసా చాన్!" అని కేకేస్తూ ఉండేది. ఎప్పుడూ ఆ పేరే పిలుస్తుండేది. ఐతే "మాసావ్‌చాన్" అని మామూలుగా అందరూ అనేలా కాక రెండో మాటను ఒత్తి పలుకుతూ గొంతు పెంచి "చాన్" అని కేకేసేది. ఆ గొంతులో విషాదం ఉన్నట్టు టొటొచాన్‌కు అనిపించేది.

ఆ ఇల్లు ఒయిమాచి రైలు పట్టాల పక్కనే ఒక చిన్న కట్టమీద ఉండేది. టొటొచాన్‌కు మాసావ్‌చాన్ ఎవరో తెలుసు. ఆ అబ్బాయి టొటొచాన్ కన్న కొంచెం పెద్దవాడు. బహుశా రెండో తరగతి చదువుతూ ఉండి ఉంటాడు. కాని ఏ బడిలో చదువుతున్నాడో టొటొచాన్‌కు తెలియదు. ఆ అబ్బాయి చింపిరి జుత్తుతో, ఎప్పుడూ ఒక కుక్కను వెంటబెట్టుకుని తిరుగుతూ ఉండేవాడు. ఒకరోజు టొటొచాన్ ఆ కట్ట పక్కనుంచి ఇంటికి వెళుతుండగా మాసావ్‌చాన్ ఆ కట్టపైన నిలబడి కనిపించాడు. కాళ్ళు రెండు ఎడంగా పెట్టి, నడుముల మీద చేతులు పెట్టుకుని మొండిగా నిలబడి ఉన్నాడు.

"కొరియన్!" అని ఆ అబ్బాయి టొటొచాన్ వైపు చూసి అరిచాడు.

ఆ గొంతులో కోపం, ద్వేషం నిండి ఉన్నాయి. టొటొచాన్‌కు భయం వేసింది. తానెప్పుడూ ఆ అబ్బాయితో తప్పుగా వ్యవహరించలేదు. ఆ మాట కొస్తే అసలు మాట్లాడనే లేదు. అందుకే ఆ అబ్బాయి అట్లా పైనెక్కడి నుంచో అంత కోపం నిండిన స్వరంతో కేక వేయడం విని టొటొచాన్ ఆశ్చర్యపోయింది.

టొటొచాన్ ఇంటికి రాగానే అమ్మతో చెప్పేసింది. "అమ్మా అమ్మా - మాసావ్‌చాన్ నన్ను కొరియన్ అని పిలిచాడమ్మా" అంది. అమ్మ టొటొచాన్ నోటిని చేత్తో మూసేసింది. అమ్మ కళ్ళనిండా నీళ్ళు నిండాయి. టొటొచాన్ గందరగోళ పడింది. ఇదేదో చాలా చెడ్డ విషయమని అనుకుంది. అమ్మ కన్నీళ్ళు తుడుచుకోవడానికి ఆగలేదు. ఆమె ముక్కుకొన ఎర్రబడిపోయింది. "పిచ్చితండ్రి! అందరూ వాడ్ని ఎన్నిసార్లు "కొరియన్", "కొరియన్" అని వెక్కిరించారో. వాడు అదే తిట్టు అనుకుంటున్నాడు. ఇంకా చిన్న పిల్లవాడు గనుక ఆ మాటకు అర్థం తెలిసి ఉండదు. అది కూడా 'బాకా లాంటి తిట్టే అనుకుని ఉంటాడు. 'మూర్ఖుడా' అనడానికి బాకా అంటారు చూడు అలా గన్నమాట. కొరియన్, అనే వెక్కిరింపును ఎన్నిసార్లు భరించాడో ఎవరినైనా వెక్కిరించ దలచుకున్నప్పుడు ఆ మాటే అనదలచుకుని ఉంటాడు. అందుకనే నిన్ను కొరియన్ అని ఉంటాడు. చిన్నారిపిల్లలతో అందరూ ఎందుకింత క్రూరంగా ఉంటారు?" అంది అమ్మ. కళ్ళు తుడుచుకుంటూ అమ్మ టొటొచాన్‌కు వివరించడం మొదలు పెట్టింది. "నువ్వూ, నేనూ జపాన్ వాళ్ళం గదా. మాసావ్‌చాన్ ఏమో కొరియా అనే దేశం నుంచి వచ్చాడు. కాని వాడు కూడా అచ్చం నీలాగనే చిన్న పిల్లాడు గదా. కనుక కన్నా, మనుషులు వేరువేరని ఎప్పుడూ అనుకోకురా, ఆ మనిషి జపాన్ వాడు, ఈ మనిషి కొరియా వాడు, అని ఎప్పుడూ తేడాలు చూడొద్దు తల్లీ. మాసావ్‌చాన్‌తో ప్రేమగా ఉండు. కొరియన్లయినంత మాత్రాన వాళ్ళు బాగుండరని కొందరు అనుకుంటారు. అది మంచిది కాదు.

టొటొచాన్‌కు అదంతా అర్థం చేసుకోవడం కష్టమే కాని టొటొచాన్‌కు అర్థమైనదేమంటే. మాసావ్ చాన్ చిన్నారి పిల్లవాడు. తన తప్పేమీ లేకుండానే అందరూ ఆ అబ్బాయి గురించి చెడుగా

మాట్లాడుతున్నారు. అందుకనేనేమో వాళ్ళ అమ్మ ఎప్పుడూ ఆ అబ్బాయి గురించి ఆందోళనతో వెతుకుతుండేది. కనుక మర్నాడు ఉదయం, టొటొచాన్ ఆ కట్టను దాటుతున్నప్పుడు వాళ్ళఅమ్మ వణుకుతున్న గొంతుతో 'మాసావ్‌చాన్' అని పిలుస్తుండడం వినగానే, ఆ అబ్బాయి వెళ్ళి ఉంటాడా అని టొటొచాన్ ఆశ్చర్యపోయింది. ఈసారి గనుక ఆ అబ్బాయి తనను "కొరియన్' అని పిలిస్తే తాను కొరియన్ కాకపోయినా జవాబివ్వాలని, మనందరం పిల్లలమేగా. మనందరం ఒకటే" అనాలని నిర్ణయించుకుంది.

చిరాకు, ఆదుర్దా కలగలిసినట్టుండే మాసావ్‌చాన్ వాళ్ళమ్మ గొంతులో ఒక ప్రత్యేక లక్షణముండేది. ఆ గొంతు గాలిలో చాలా సేపు తేలియాడుతున్నట్టుండేది. చిట్టచివరికి ఆ దారిమీద వెళ్ళే ఏరైలో ఆ శబ్దాన్ని మింగేసేది.

"మాసా చాన్"

ఆ విషాదం నిండిన, కన్నీళ్ళు నిండిన స్వరాన్ని ఒక్కసారి విన్నా సరే ఎప్పటికీ మరిచిపోలేరు.

## పిలక జడలు

ఆ రోజుల్లో టొటొచాన్‌కు రెండు పెద్ద కోరికలుండేవి. ఒకటేమో వ్యాయామ క్రీడాకారుల దుస్తులు వేసుకోవాలనేది. రెండోది జుట్టును జడలు కట్టుకోవాలనేది. రైల్లో తనకంటే పెద్ద అమ్మాయి పొడవాటి జడలతో కనిపించడం చూసి తన జుట్టును కూడా అలాగే అల్లుకోవాలని టొటొచాన్ అనుకుంది. టొటొచాన్ తరగతిలోని చిన్నారి పిల్లలందరూ జుట్టును కురచగా కత్తిరించుకునేవారు. నుదుటికడ్డంగా పడేలా చేసుకునే వారు. టొటొచాన్ జుట్టుమాత్రం పొడుగ్గా ఉండేది. పక్కలకు తీసి రిబ్బన్‌తో కట్టుకునేది. అట్లా కట్టడమే అమ్మకు ఇష్టంగా ఉండేది. అంతేగాక వెంట్రుకలు పెరిగితే పిలక జడలు వేసుకోవాలని టొటొచాన్‌కు కోరికగా ఉండేది.

చిట్టచివరికి తన జుట్టును రెండు చిన్న పిలక జడలుగా అల్లమని టొటొచాన్ అమ్మను అడిగింది. చివరల్లో రబ్బర్ బ్యాండ్లు పెట్టి సన్నని రిబ్బన్లతో జడలు కడితే. టొటొచాన్ కాస్త పెద్దదయి పోయినట్టు అనిపించింది. టొటొచాన్ అద్దంలో చూసుకుంది. కాని రైళ్ళలో చూసిన అమ్మాయిల జడల్లాగ తన జడలు లేవని, తనవి సన్నగా, పొట్టిగా, సరిగ్గా పిలక జడల్లాగే ఉన్నాయని టొటొచాన్‌కు అనిపించింది. రాకీ దగ్గరికి పరుగెత్తి గర్వంగా దానికి చూపించింది. రాకీ ఒక్కసారో రెండుసార్లో కళ్ళు మిటకరించి చూసింది.

"అబ్బ నీకు కూడా జడలు కట్టేలా జుట్టుంటే ఎంత బాగుండేదో" అంది టొటొచాన్.

రైలు ఎక్కింతర్వాత టొటొచాన్ తలను నిటారుగా పెట్టి అలాగే ఉండి పోయింది. కదిలితే జడలు ఎక్కడ విడిపోతాయోనని భయపడింది. 'రైల్లో ఎవరయినా ఈ జడల్ని గుర్తించి 'ఆహా ఎంత అందమైన జడలు' అంటే ఎంత బాగుండును!" అనుకుంది టొటొచాన్. కాని ఎవరూ ఏమీ అనలేదు. కాని టొటొచాన్ బడికి చేరగానే క్లాసులో ఉన్నవాళ్ళందరూ మియోచాన్, సాకోచాన్, కీకోజాకి ఒక్క గొంతుతో "ఓహోయ్ - పిలకజడలోయ్" అని కేకలేశారు. టొటొచాన్‌కు చాలా ఆనందం వేసింది. ఆ అమ్మాయిలందర్నీ వచ్చి తన జడలు ముట్టుకుని చూడనిచ్చింది.

అబ్బాయిల్లో ఎవరికీ ఈ పిలక జడలు నచ్చినట్టు అనిపించలేదు. కాని మధ్యాహ్న భోజనాలయిపోయాక హఠాత్తుగా ఒక అబ్బాయి బిగ్గరగా "వారెవ్వా మరే - టొటొచాన్ తలకట్టు మార్పించుకుందోచ్" అన్నాడు. ఆ అబ్బాపేరు ఒయి.



అబ్బాయిల్లో ఒకరయినా గుర్తించినందుకు టొటొచాన్‌కు చాలా సంతోషం కలిగింది. గర్వంగా "ఇవి పిలకజడలు" అని చెప్పింది.

ఆ మాట మీద ఆ అబ్బాయి టొటొచాన్ దగ్గరికి వచ్చాడు. రెండు చేతుల్తో పిలకల్ని పట్టుకున్నాడు. "నాకు అలసటగా ఉంది, కాసేపు వీటిని పట్టుకుని ఊగవచ్చుననుకుంటాను. ఊగనా? అరె. ఇవి రైల్లో పట్టుకునే వాటికన్న మెత్తగా ఉన్నాయే!" అన్నాడు. టొటొచాన్ కష్టాలు అక్కడితో అయిపోలేదు.

టొటొచానేమో సన్నగా రివటలా ఉంటుంది. ఒయి టొటొచాన్‌కు రెండింతలుంటాడు. నిజానికి తరగతి మొత్తం మీద ఒయి పెద్దవాడు, లావుపాటి వాడు. కనుక టొటొచాన్ పిలకలు పట్టుకుని ఒయి లాగగానే టొటొచాన్ తూలిపోయి వెల్లికిలా పడిపోయింది. పిలక జడల్ని రైల్లో పట్టుకునే వాటితో పోల్చడమే బాధాకరమంటే, ఇంక నేలమీద లాగడం కూడా చేశాడు. టొటొచాన్ పిలకలు పట్టుకుని టగ్ ఆఫ్ వార్‌లో లాగ 'హైలేసో హైసేస' అని ఒయి లాగడానికి ప్రయత్నిస్తుంటే టొటొచాన్ కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

టొటొచాన్ దృష్టిలో పిలక జడలంటే పెద్ద అమ్మాయికి చిహ్నం. అవి కట్టుకున్నందుకు తనను ప్రతి ఒక్కరూ చాలా మర్యాదగా చూడాలని టొటొచాన్ అనుకుంది. ఏడుస్తూ హెడ్‌మాస్టర్ గది దగ్గరికి పరుగెత్తింది. వెక్కుతూ గదితలుపు తట్టగానే ఆయన తలుపు తెరిచాడు. వెంటనే వంగి తన ముఖాన్ని ఆ పాప ముఖం దగ్గరికి చేర్చాడు.

"ఏమయింది?" అని అడిగాడు.

తన పిలక జడలు సరిగా ఉన్నాయా లేవా అని తడిమి చూసుకుంటూ "ఒయి వీటిని పట్టుకుని లాగాడు. హైలేసో హైలేస అంటూ... " అని చెప్పింది.

హెడ్‌మాస్టర్ టొటొచాన్ జుట్టు వేపు చూశాడు. కళ్లనిండా నీళ్లు తిరుగుతున్న ముఖానికి భిన్నంగా నెత్తిమీద రెండు పిలకలు మాత్రం సంతోషంగా నాట్యం చేస్తున్నట్టున్నాయి. ఆయన కూచున్నాడు. టొటొచాన్‌ను తన ఎదురుగా కూచోబెట్టుకున్నాడు. మామూలుగానే తన బోసినోరు తెరిచి నవ్వాడు.

"ఏడవకు తల్లీ, నీ జుట్టు భలే ఉందిలే" అన్నాడు.

కన్నీళ్ల మరకలతో నిండిన ముఖం ఎత్తికాస్త సిగ్గుగానే "మీకిది నచ్చిందా?" అని అడిగింది టొటొచాన్.

"ఓ బ్రహ్మాండం!" అన్నాడాయన.

టొటొచాన్ ఏడుపు ఆపేసి కుర్చీలోంచి దిగింది.

"ఒయి హైలేసో అన్నా సరే నేనింక ఏడవను" అంది.

హెడ్‌మాస్టర్ మళ్ళీ ఒక చిరునవ్వుతో సరే అన్నట్టు తల ఊపాడు. టొటొచాన్ కూడా చిరునవ్వు నవ్వింది. ఆ చిరునవ్వు నవ్వే ముఖానికి పిలకజడలు సరిగ్గా నప్పాయి. ఒంగి హెడ్‌మాస్టర్‌కు అభివాదం చేసి, టొటొచాన్ బైటికి పరుగెత్తింది. మిగలిన పిల్లలతో కలిసి మళ్ళీ ఆటల్లో పడింది.

ఒయి బుర్రగోక్కుంటూ తన ముందుకొచ్చి నిలబడే సరికి, తాను అంతకు ముందు ఏడ్చాననే విషయమే మరిచి పోయింది టొటొచాన్.

"నీ జడలు లాగినందుకు నన్ను క్షమించవా? నన్ను హెడ్‌మాస్టర్ కోప్పడ్డారు. అమ్మాయిలతో బాగుండమని ఆయన చెప్పారు. అమ్మాయిలతో మర్యాదగా ఉండాలని, వాళ్లకు

కావలసినవి చూడాలని ఆయన చెప్పారు" అన్నాడు ఒయి ఖచ్చితంగానూ, ఉద్వేగ రహితంగానూ.

టొటొచాన్‌కు ఆశ్చర్యం కలిగింది. అమ్మాయిలతో బాగుండాలని అంతకుముందు ఎవరూ అనగా వినలేదు. ఎప్పుడూ మగపిల్లలే ముఖ్యమైన వాళ్లుగా ఉండేవాడు. చాలా మంది పిల్లలున్న కుటుంబాలలో భోజనాల దగ్గర, ఫలహారాల దగ్గరా మగ పిల్లలకే ముందు వడ్డించడం టొటొచాన్‌కు తెలుసు. అమ్మాయిలు ఎప్పుడన్నా మాట్లాడ్డానికి ప్రయత్నించినా "చిన్నారి పాపలు కనబడాలి. వాళ్ల గొంతు వినిపించగూడదు" అని అమ్మలు అనేవాళ్ళు.

ఐనప్పటికీ, అమ్మాయిలను గౌరవించాలని హెడ్‌మాస్టర్ ఒయితో చెప్పాడు. టొటొచాన్‌కు ఇదంతా వింతగా తోచింది. తర్వాత ఇది ఎంత బాగుందో తట్టింది. ఎవరైనా గౌరవంగా చూస్తే ఎంత భలేగా ఉంటుంది!

ఒయికయితే అంతుపట్టలేదు. అమ్మాయిలతో మర్యాదగా, బాగా ఉండాలట! విచిత్రం! అంతేగాక టోమోలో ఒయిని హెడ్‌మాస్టర్ కోప్పడడం అదే మొదటిసారి, అదే చివరి సారి కూడా. ఒయి ఆ రోజును ఎన్నటికీ మరిచిపోలేదు.

## "కృతజ్ఞతలు"

నూతన సంవత్సర సెలవులు అయిపోవచ్చాయి. వేసవి సెలవుల్లో లాగ ఈసారి పిల్లలు బడిలో మధ్యలో కలుసుకోలేదు. మొత్తం సెలవులన్నీ ఇళ్లలో కుటుంబాలతోనే గడిపారు.

"నేనీసారి నూతన సంవత్సర దినాన క్యుషులో మా తాతగారింట్లో ఉంటాను" అని మిజటా ప్రతి ఒక్కరితో చెప్పాడు. ఎప్పుడూ శాస్త్ర ప్రయోగాలు చేస్తూ ఉండే తాయిచాన్ "నేను మా అన్నయ్యతో కలిసి భౌతికశాస్త్ర ప్రయోగశాల చూసేందుకు వెళ్తున్నాను" అన్నాడు. తాయిచాన్ దానికోసం ఎంతగా ఎదురు చూస్తున్నాడో.. అలా విడిపోయేటప్పుడు ఒక్కొక్కరూ తాము ఏమేం చేయబోతున్నారో చెప్పుకుని వీడ్కోలు తీసుకున్నారు.

టొటొచాన్ అమ్మ నాన్నలతో కలిసి స్కైయింగ్ చేయడానికి వెళ్ళింది. హిడియోసైటో అని నాన్న స్నేహితుడు ఒకాయన ఉన్నారు. ఆయన సెల్ వాయిస్తారు. నాన్న ఉన్న సంగీత బృందంలోనే ఆయన కండక్టర్. ఆయనకు షిగా పీఠభూమి మీద ఓ మంచి అందమైన ఇల్లు ఉంది. ప్రతి సారీ చలికాలంలో అమ్మా నాన్న, టొటొచాన్ ఆయనతో పాటు అక్కడే ఉండేవారు. కిండర్ గార్టెన్‌లో ఉన్న రోజుల నుంచే టొటొచాన్ మంచు మీద జారడం ఎలాగో నేర్చుకుంది.

స్టేషన్‌నుంచి స్కైయింగ్ చేసే ప్రాంతానికి వెళ్ళాలంటే గుర్రాలు లాగే మంచుబండి మీద వెళ్ళాల్సి ఉండేది. ఆ ప్రాంతమంతా చాలా తెల్లగా మంచుపరచుకుని ఉండేది. అక్కడ మంచులో జారేవాళ్లను కొండల మీదికి తీసుకుపోయే ఉయ్యాల బాటలు కూడా ఆ పరచుకున్న మంచును అడ్డుకోగలిగేవికావు. అక్కడోటీ ఇక్కడోటీ చెట్ల కాండాలు తప్ప మరేమీ కనబడేవికావు. సైటోలాగ అక్కడ స్వంత ఇళ్లు హోటల్ ఉన్నాయని అమ్మ చెప్పింది. కాని అక్కడికి విదేశీయులు మాత్రం చాలా మంది వస్తుండేవారు.

టొటొచాన్‌కు ఈ సంవత్సరం పోయిన సంవత్సరం కన్న వేరుగా అనిపించింది. ఇప్పుడు తను ప్రాథమిక పాఠశాలలో ఒకటో తరగతి చదువుతోంది. కాస్త ఇంగ్లీషు కూడా వచ్చు. "థాంక్యు" అని ఎలా అనాలో కూడా నాన్న నేర్పాడు.

స్కైలలో కాళ్లు పెట్టి మంచు మీద నిలబడి ఉన్న టొటొచాన్ చూసి ఆ వైపు వెళుతున్న విదేశీయులు ఏదో ఒకటి అంటుండేవారు. బహుశా వాళ్లు "భలే ముద్దొస్తోంది గదూ" అనో,



అలాంటిదే మరో మాటో అంటుండేవారు. టొటొచాన్‌కు మాత్రం అర్థం అయ్యేది కాదు. ఈ సంవత్సరం వరకు వాళ్లకు జవాబు ఏమని చెప్పాలో కూడా టొటొచాన్‌కు తెలిసేది కాదు. ఇక నుంచి మాత్రం తల ఊపుతూ 'థాంక్యూ' అనాలని నిర్ణయించుకుంది.

ఆ మాటతో విదేశీయులు ఇంకా నవ్వేవారు. ఒకరితో ఒకరు ఏదో అనుకునే వారు. కొన్ని సార్లయితే ఆ విదేశీయుల్లో స్త్రీలు ముందుకు వంగి టొటొచాన్ చెంపకు చెంప అనించేవారు. లేదా పురుషులు టొటొచాన్‌ను దగ్గరికి తీసుకునేవారు. 'థాంక్యూ' అని ఒక్కమాట అనేసి అంత మంచి స్నేహితులను సంపాదించుకోగలగడమంటే చాలా వింతయిన విషయమని టొటొచాన్‌కు అనిపించేది.

ఒకరోజు ఒక యువకుడు టొటొచాన్ దగ్గరికి వచ్చి 'నా స్కైల మీద నా ముందు నిలబడి జారడం నీకు ఇష్టమేనా? అన్నట్టు సైగలు చేశాడు. ఆయన మంచి వాడిలాగే కనబడ్డాడు. ఆయన అడిగినట్టు చేయొచ్చునని నాన్న అన్నాడు.

టొటొచాన్ "థాంక్యూ" అని జవాబిచ్చింది. ఆయన టొటొచాన్‌ను ఎత్తుకుని తన స్కైలలో తన కాళ్ళ దగ్గర కాళ్లు ముడుచుకుని కూచోమన్నాడు. అప్పుడు స్కైలు రెండినీ కలిపి పట్టుకుని టొటొచాన్‌తో సహా ఆ షిగా పీఠభూమిలోని ఏమంత ఏటవాలుగా లేని, పాడవాటి మంచుమీద జారడం మొదలుపెట్టాడు. వాళ్ళు గాలిలాగ సర్రున జారిపోయారు టొటొచాన్ చెవుల్లో నుంచి గాలి వేగంగా పరుగెత్తుతుంటే ఈలలు వేస్తున్నట్టనిపించింది. టొటొచాన్ తన మోకాళ్ళు గట్టిగా పట్టుకుని ముందుకు పడిపోకుండా జాగ్రత్తపడింది. అదికాస్త భయం కలిగించేది గానే ఉంది గాని దాంట్లో గొప్ప సరదా ఉంది. చిట్టచివరికి జారడం ఆగిపోగానే వాళ్ళను అప్పటిదాకా చూస్తూ నిలబడిన వాళ్ళు చప్పట్లు కొట్టారు. ఆ స్కైల లోంచి, టొటొచాన్ ప్రేక్షకులవైపు తిరిగి ఒంగి అభివాదం చేసింది. "థాంక్యూ" అంది. వాళ్ళు ఇంకా ఎక్కువగా చప్పట్లు కొట్టారు.

చాలా కాలం తర్వాత టొటొచాన్‌కు ఆ యువకుడు ఎవరో తెలిసింది. ఆయన పేరు ష్నీడర్. ప్రపంచ ప్రఖ్యాతి పొందిన స్కైయింగ్ విజేత. ఆయన ఎప్పుడు వెండిస్కైల జతను ఉపయోగించేవాడు. కాని ఆరోజు టొటొచాన్‌కు చాలా ఇష్టమైన సంగతి ఒకటుంది. ఆ ఏటవాలు మీద జారిన తర్వాత, అందరూ చప్పట్లు కొట్టేసింతర్వాత ఆయన టొటొచాన్ పక్కన వంగి కూచుని, టొటొచాన్ ఏదో పెద్ద ముఖ్యమైన వ్యక్తి అన్నట్టుగా చెయ్యిపట్టుకుని "థాంక్యూ" అన్నాడు. ఆయన తనను చిన్న పిల్లలాగ లెక్కించలేదు. నిజంగా చాలా వయసు ఉన్న స్త్రీతో లాగ ప్రవర్తించాడు. ఆయన తన ముందు అలా వంగగానే టొటొచాన్‌కు స్వభావ సిద్ధంగానే, ఈయన చాలా మంచి మనిషి అని హృదయంలో తెలిసిపోయింది. ఆయన వెనుక తెల్లని మంచు మైదానం నిరంతరం పెరుగుతున్నట్టు అనిపించింది.

## లైబ్రరీ పెట్టె

చలికాలం సెలవులయిపోయి బడికి రాగనే పిల్లలు ఒక అద్భుతాన్ని గుర్తించారు. అది ఒక కొత్త విషయం. తాము కనిపెట్టినదాన్ని గురించి పిల్లలు ఆనందంతో కేరింతలు కొట్టారు. తరగతి గదుల పెట్టెల వరుసకు ఎదురుగా, అసెంబ్లీహాలు పక్కన పూల తివాచి పక్కన కొత్త రైలుపెట్టె ఉంది. వాళ్ళు లేప్పుడు ఆ పెట్టె లైబ్రరీపెట్టె అయిపోయింది! కాపలాదారు ర్యోచాన్ చాలా కష్టపడి పనిచేసి నట్టున్నాడు. ఆయనంటే ప్రతి ఒక్కరికీ గౌరవమే. ఆయన అన్ని పనులూ

చేయగలిగేవాడు. ఆయన ఆ పెట్టెలో చాలా అలమరలు సర్దేశాడు. ఆ అలమరల నిండా అన్ని రకాల్లో, అన్ని రంగుల్లో ఉన్న పుస్తకాల వరసలు నిండిపోయాయి. ఆ పెట్టెలో బల్లలు, కుర్చీలు కూడా ఉన్నాయి. అక్కడ కూచుని చదువుకోవడం, రాసుకోవడం చేసుకోవచ్చు.

"ఇది మీ లైబ్రరీ, ఈ పుస్తకాలలో దేన్నయినా, మీరెవరయినా చదవచ్చు. వీట్లో కొన్ని పుస్తకాలు కొన్ని తరగతుల పిల్లలే చదవాలని నియమం లేదు. మీకు ఆ భయం అక్కర్లేదు. మీరు ఇక్కడికి ఏ సమయంలోనైనా రావచ్చు. మీకు ఏదన్నా పుస్తకాన్ని ఇంటికి తీసుకుపోవాలనిపిస్తే తీసుకుపోవచ్చు. కాని మీరు అది చదివేసేయగానే తప్పని సరిగా వెనక్కి తీసుకొచ్చేయాలి! వేరేవాళ్లు చదవాలని మీరు అనుకునే పుస్తకాలు ఏవయినా మీ ఇళ్ళలో ఉంటే ఇక్కడికి తీసుకొచ్చి పెడితే సంతోషం. ఏది ఏమయినా మీరు వీలయినంత ఎక్కువగా పుస్తకాలు చదవాలని నా కోరిక" అన్నాడు హెడ్‌మాస్టర్.

"ఇవాళ మొదటి తరగతిని లైబ్రరీ తరగతే అనుకుందాం!" అని పిల్లలందరూ ముక్త కంఠంతో అన్నారు.

వాళ్ళకు అంత ఉత్సాహం కలగడం చూసి సంతోషంగా చిరునవ్వు నవ్వుతూ "మీకది ఇష్టమేనా సరే, ఐతే, వద్దనే వాళ్ళెవరు?" అన్నాడాయన.

వెంటనే టోమో విద్యార్థి బృందమంతా - యాభైమంది పిల్లలూ - లైబ్రరీ పెట్టెలోకి ఎక్కారు. అత్యుత్సాహంతో తమకు కావలసిన పుస్తకాలు ఏరుకుని కూచుని చదవడానికి ప్రయత్నిస్తున్నారు. కాని వాళ్ళలో సగం మందికి మాత్రమే సరిపోయేటన్ని కుర్చీలున్నాయక్కడ. మిగిలినవాళ్ళు నిలబడవలసి వచ్చింది. సరిగ్గా క్రిక్కిరిసి జనం ఉన్నరైలు పెట్టెలా అనిపించిందది. పిల్లలు నిలబడే పుస్తకాలు చదువుకుంటుంటే సరిగ్గా అట్లాగే ఉందా దృశ్యం. అదంతా భలే వింతగా కనబడింది.

పిల్లలు సంతోషంగా తల మునకలయ్యారు. టొటొచాన్‌కు అప్పటికింకా సరిగ్గా చదవటం రాదు. కనుక తనకు చాలా మోజు కలిగించిన బొమ్మ ఉన్న పుస్తకం ఒకటి ఏరుకుంది. ప్రతి ఒక్కరూ ఒక్కో పుస్తకం తీసుకుని పేజీలు తిరగేస్తుండగా ఆ రైలు పెట్టెలో హఠాత్తుగా నిశ్శబ్దం వ్యాపించింది. కాని ఆ నిశ్శబ్దం ఎక్కువసేపు నిలవలేదు. ఆ మౌనాన్ని బద్దలు గొడుతూ అల్లరి అల్లరిగా మాటలు వినిపించాయి. కొందరేమో తమకు నచ్చిన వాక్యాలు బిగ్గరగా చదివేస్తున్నారు. కొందరు తమకు తెలియని పదాల అర్థమేమిటని వేరేవాళ్ళను అడుగుతున్నారు. కొందరేమో ఒకళ్ళ పుస్తకం ఒకళ్లు మార్చుకుంటున్నారు. రైలుపెట్టె నిండా నవ్వులు వెదజల్లి నట్టయింది. ఒక చిన్నారి సింగింగ్ పిక్చర్స్ అనే పుస్తకం తీసుకుని దాంట్లో ఉన్న ఒక పొడుపు కథను బిగ్గరగా పాడుతూ, దానికి తగినట్టు బొమ్మ గీయడం మొదలెట్టింది.

సున్న నడుమ చుక్క; సున్న నడుమ చుక్క;
గజిబిజేమొ ముక్కు; మళ్ళీ సున్న చుక్క;
పక్కన, పైన, పక్కన - మూడు మూడు వెంట్రుకలు
అబ్బో! చూడు, కన్ను మూసి తెరిస్తే లావుపాటి పిన్ని!

'అబ్బో' అనే సమయానికి ముఖం చుట్టూ గుండ్రంగా గీసేయాలన్న మాట. 'కన్నుమూసి తెరిస్తే' అనే సమయానికి మూడువైపులా వెంట్రుకలు మీద అర్ధవృత్తాలు గీయాలన్నమాట. ఇవన్నీ సరిగ్గా గీయగలిగితే చివరికి పాత పద్ధతిలో కొప్పులు చుట్టుకున్న లావుపాటి జపాన్ మహిళ ముఖం తయారవుతుంది.





పిల్లల ఇష్టం వచ్చినట్టుగా ఏ విషయమైనా చదువుకునే వీలు ఉన్న టోమోలో ఒకరిపని మరొకరికి అడ్డంకిగా ఉంటే చాలా కష్టమైపోయేది. అందుకే చుట్టూ ఏం జరుగుతున్నా పట్టించుకోకుండా తమ పని మీద కేంద్రీకరించడంలో వాళ్ళకు శిక్షణ ఇచ్చారు. కనుక లావుపాటి పిన్నిగారి బొమ్మ గీస్తూ ఆ పాప ఎంత బిగ్గరగా పాడినా ఎవరూ పట్టించుకోలేదు. ఒకరో ఇద్దరో అటు చూశారు. గాని మిగతా వాళ్లందరూ తమ తమ పుస్తకాలలో మునిగిపోయారు.

టొటొచాన్ తీసుకున్న పుస్తకం ఏదో జానపద గాథలాగుంది. అది ఒక ధనవంతుడి కూతురి కథ. ఆ అమ్మాయికి ఎంత కాలానికీ పెళ్ళికాదు. ఎందుకంటే ఆ అమ్మాయి ఎప్పుడూ పిత్తుతూ ఉంటుంది. చిట్టచివరికి ఎట్లాగో ఆ తల్లిదండ్రులు ఆ అమ్మాయికి ఓ భర్తను పట్టుకొస్తారు. కాని ఆ అమ్మాయి ఎంత ఉత్సాహపడుతుందంటే పెళ్ళినాటి రాత్రి అంతకు ముందుకంటె పెద్దగా పిత్తుతుంది. ఆ వచ్చిన గాలిలో ఆ భర్త మంచం మీదినుంచి గాలిలో కొట్టుకుపోతాడు. ఆ పడకగది చుట్టూ ఏడున్నరసార్లు ఆ గాలిలో తిరిగి స్పృహ తప్పి పడిపోతాడు. టొటొచాన్ మోజు పడిన బొమ్మ ఆ భర్త గది చుట్టూ గాలిలో తేలిపోతున్నట్టున్నది. ఆ తర్వాత ఈ పుస్తకం కావాలని ఎంతోమంది అడిగారు.

ఆ బడి పిల్లలందరూ చేప పిల్లలాగ ఆ రైలు పెట్టెలో కిక్కిరిసి పుస్తకాల్ని శ్రద్ధగా, ఆతృతతో చదవడం మొదలెట్టారు. కిటికీల్లోంచి ఉదయసూర్యకాంతి లోపలికి ప్రసరిస్తోంది. ఆ దృశ్యమంతా హెడ్‌మాస్టర్ హృదయాన్ని పరమానంద భరితం చేసి ఉంటుంది.

పిల్లలు ఆ రోజు మొత్తం ఆ లైబ్రరీ పెట్టెలోనే గడిపారు.

ఆ తర్వాత వర్షంపడి బైటికి వెళ్ళకుండా ఉన్న సమయాల్లో వేరేసార్లు ఖాళీగా ఉన్నప్పుడల్లా లైబ్రరీ వాళ్ళకు చాలా ఇష్టమైన స్థలం అయిపోయింది.

"లైబ్రరీ పక్కనే ఒక బాత్‌రూం కట్టిస్తే బాగుంటుందనుకుంటాను కదూ!" అన్నాడు హెడ్‌మాస్టర్ ఒక రోజున.

ఎందుకంటే పిల్లలు పుస్తకాల్లో ఎంతగా లీనమై పోయే వాళ్ళంటే, మూత్రానికో, దొడ్డికో పోవాల్సి వచ్చినా చివరి నిమిషం దాకా లేవకుండా చదువుతూ కూచునేవాళ్లు. చివరికి ఒళ్ళంతా మెలికలు తిరిగి పోతుండగా అ సెంబ్లీహాలు పక్కనున్న టాయిలెట్ దగ్గరికి పరుగే పరుగు అందుకునే వాళ్ళు.

## తోకలు

ఒకరోజు సాయంత్రం బడి అయిపోయింది. టొటొచాన్, ఇంటికి వెళ్ళిపోవడానికి సర్దుకుంటోంది. ఒయి పరుగెత్తుకుంటూవచ్చి "హెడ్‌మాస్టర్ పిచ్చికోపంలో ఉన్నాడు తెలుసా? అగ్గిరాముడై పోయాడు. ఎవరిమీదో; అని గుసగుసలాడాడు.

"ఎక్కడ?" అని అడిగింది టొటొచాన్.

హెడ్‌మాస్టర్ కోపంగా ఉండడం టొటొచాన్ ఎప్పుడూ వినలేదు. అందుకే ఆశ్చర్యపోయింది. ఒయికూడా ఆశ్చర్యపోయినట్టే ఉన్నాడు. అందుకే టొటొచాన్‌కు చెప్పడానికి అంత ఉరుకులు పరుగులు మీద వచ్చాడు.

"వంట గదిలో ఉన్నారు" అన్నాడు ఒయి. మెత్తగా నవ్వుతున్నట్టుండే ఒయి కళ్లు విప్పారి ఉన్నాయి. ముక్కు పుటాలు ఉబ్బిపోయాయి.

"పద!"

టొటొచాన్ ఒయి చెయ్యిపట్టుకుంది. ఇద్దరూ హెడ్‌మాస్టర్ ఇంటివైపు పరుగెత్తారు. అది అసెంబ్లీహాలు పక్కనే ఉంటుంది. వంటగదేమో బడి ఆవరణలోకి వెనుక వైపు దారి పక్కనే ఉంది. టొటొచాన్ మురికి గుంటలో పడిపోయిన రోజున ఈ వంటగది లోంచే బాత్‌రూం లోకి తీసుకువెళ్ళి శుభ్రం చేశారు. ఈ హెడ్‌మాస్టర్ వాళ్ళ వంటగదిలోనే "సముద్రం నుంచి కాస్త, కొండల నుంచి కాస్త" రోజూ తయారు చేసి మధ్యాహ్న భోజనాల సమయంలో కావలసిన వాళ్ళకు పెడతారు.

ఆ పిల్లలిద్దరూ వంటగదివైపు మునికాళ్ళ మీద చప్పుడు కాకుండా నడుస్తుండగా, మూసిన తలుపు వెనుక నుంచి హెడ్‌మాస్టర్ కోపంగా అరుస్తున్నట్టు వినబడింది.

"టాకాహాషికి తోక ఉందని అంత మెదడులేకుండా ఎందుకు చెప్పావు?" అంటున్నాడు హెడ్‌మాస్టర్.

ఆయన కోప్పడుతున్నది వాళ్ళ క్లాస్ టీచర్‌ను.

"నేనంత ఆలోచించలేదు. ఆ సమయంలో నేను ఆ బాబును చూశాను. ఎంతో ముద్దొచ్చాడు" అని ఆమె జవాబు వినవచ్చింది.

"కాని నువు అన్న మాట ఎంత ఘోరమైనదో నీకు అర్థం కావట్లేదా? టాకాహాషి విషయంలో నేను ఎంత శ్రద్ధ తీసుకుంటున్నానో నీకేమన్నా తెలుస్తోందా?"

ఆ ఉదయం తరగతిలో జరిగిన సంగతి టొటొచాన్‌కు గుర్తుకువచ్చింది. క్లాస్ టీచర్ మనుషులకు మొట్టమొదట్లో తోకలుండేవని చెపుతోంది. పిల్లలందరికీ అది చాలా వింతగా అనిపించింది. పెద్ద పెరిగిన వాళ్ళయితే ఆమె చెప్పే విషయాన్ని పరిణామ వాద సిద్ధాంత పరిచయం అంటారేమో. పిల్లలందరికీ అది చాలా నచ్చింది. ప్రతి ఒక్కళ్ళకీ తోక అవశేషంగా వెన్నెముక చివర చిన్న ఎముక ఉంటుందని టీచర్ చెప్పినపుడు ప్రతి ఒక్కరూ తనకది ఎక్కడ ఉందా అని ఆలోచించడం మొదలెట్టారు. తరగతి గదంతా నవ్వుల్లో మునిగిపోయింది. చిట్టచివరికి టీచర్ పరిహాసంగానే "ఇక్కడ కూడా ఎవరికయినా ఇంకా తోక ఉందేమో! టాకాహాషి, నీకేమన్నా ఉందా?" అని అడిగింది.

టాకాహాషి వెంటనే లేచి నిలబడ్డాడు. గట్టిగా తల అడ్డంగా ఊపుతూ, చాలా గంభీరంగా "నాకేమీ లేదు" అన్నాడు.

హెడ్‌మాస్టర్ మాట్లాడుతున్నది దాని గురించే అని టొటొచాన్‌కు అర్థమైంది. అప్పటికి ఆయన గొంతులో కోపంకన్న విచారం ఎక్కువగా ధ్వనించడం మొదలయింది.

"తోక ఉందా అని అడిగితే టాకాహాషి ఎంతనొచ్చుకుంటాడో నీకేమీ తట్టలేదా?"

టీచర్ ఏమని జవాబిచ్చిందో పిల్లలకి వినబడలేదు. ఆ తోక గురించి హెడ్‌మాస్టర్ అంత కోపంగా ఎందుకున్నాడో టొటొచాన్‌కు అర్థం కాలేదు. తనకు తోక ఉందా అని హెడ్‌మాస్టర్ అడిగితే తనకు ఇష్టంగానే ఉండేదనుకుంది.

ఐతే టొటొచాన్ శరీరంలో ఏ లోపంలేదు గనుక అటువంటి ప్రశ్న టొటొచాన్‌కు ఇబ్బందికరంగా ఉండేదికాదు. కాని టాకాహాషిలో ఎదుగుదల ఆగిపోయింది. అది ఆ అబ్బాయికి తెలుసు. అందుకే, టాకాహాషి పాల్గొని బాగా ఆడగలిగిన ఆటల్నే హెడ్‌మాస్టర్ ఆటల రోజున నిర్ణయించాడు. ఈతదుస్తులు లేకుండా కొలనులో ఈదితే, టాకాహాషి వంటి పిల్లలకు తమ శరీరాల గురించి న్యూనతా భావం పోతుందని ఆ పద్ధతి పెట్టాడు. టాకాహాషి, యాసువాకిచాన్



లాంటి శారీరక లోపాలున్న పిల్లలకు సహాయం చేసేందుకు హెడ్‌మాస్టర్ చెయ్యదగిన పనులన్నీ చేశాడు. వాళ్ళలో వచ్చే న్యూనతా భావాల్ని, మిగిలిన పిల్లలకంటే తాము తక్కువనే భావాల్ని పోగొట్టడానికి వీలయిన పనులన్నీ చేశాడు. కేవలం ముద్దొచ్చేలా కనబడ్డాడని, టాకాహాషిని తోకుందా అని అడగడం లాంటి అర్థరహితమైన పని ఎవరయినా ఎట్లా చేస్తారా అనేది హెడ్‌మాస్టర్‌కు నిజంగా అర్థం కాలేదు.

హెడ్‌మాస్టర్ ఆ సమయానికి అటువెళుతూ, తరగతి గది వెనుక నిలబడి టీచర్ అన్నమాట విన్నాడు.

క్లాస్ టీచర్ ఏడుస్తోంది. టొటొచాన్‌కు వినిపించింది. "నిజంగా ఇది నేను చేసిన ఘోరమైన తప్పిదమే. టాకాహాషికి క్షమాపణలు చెప్పుకునేందుకు నేనేంచెయ్యను?" అని వెక్కుతూనే అడిగింది ఆమె.

హెడ్‌మాస్టర్ ఏమీ మాట్లాడలేదు. అక్కడి గ్లాస్ తలుపులోంచి చూస్తే టొటొచాన్‌కు హెడ్‌మాస్టర్ కనిపించలేదు. కాని ఆ క్షణాన ఆయన పక్కన ఉంటే బాగుండునని టొటొచాన్‌కు గాఢంగా అనిపించింది. ఈ గొడవంతా దేనికో టొటొచాన్‌కు స్పష్టంగానయితే అర్థం కాలేదు గాని హెడ్‌మాస్టర్ తమ స్నేహితుడనే విషయం ఇది వరకంటే ఎక్కువగా తెలిసినట్టనిపించింది. ఒయి కూడా అట్లాగే అనుకుని ఉంటాడు.

తమ క్లాస్ టీచర్‌ను హెడ్‌మాస్టర్ మిగిలిన టీచర్లందరూ ఉండే టీచర్ల గదిలో కాక వంటగదిలో ప్రత్యేకంగా మందలించిన సంఘటనను టొటొచాన్ ఎప్పటికీ మరవలేదు. టొటొచాన్‌కు అప్పటికి ఆ విషయం అర్థం కానప్పటికీ ఈ సంఘటనే ప్రతి అర్థంలోనూ ఆయనెంత మంచి బోధకుడో వివరిస్తుంది. ఆయన గొంతు, ఆయన మాటలు, ఆ ధ్వని టొటొచాన్ హృదయంలో ఎల్లకాలానికీ నిలిచిపోయాయి.

అప్పటికి వసంతకాలం దాదాపు వచ్చేసింది. అది టొటొచాన్‌కు టోమోలో రెండో వసంతకాలం. పాఠశాల కొత్త సంవత్సరం ప్రారంభం కానున్నది.

## టోమోలో రెండో సంవత్సరం

బడి ఆవరణలో చెట్లన్నీ ఆకుపచ్చని లేత చిగుళ్ళు తొడగడం మొదలెట్టాయి. నేల మీది పూల తివాచీల్లో పూలు విస్తారంగా వికసించడం మొదలెట్టాయి. కుంకుమపూలు, డఫోడిల్, పాన్సీపూలు టోమో విద్యార్థుల్ని "బాగున్నారా?" అని పలకరించడానికన్నట్టు తలలు నిక్కబెట్టాయి. రంగు రంగుల పూలు నిక్కి నిక్కి చూస్తున్నట్టుగా కాడల్ని సాగదీసుకున్నాయి. చెర్రీ మొగ్గలు ఆ సన్నని గాలి తెరల్లో తొణికిసలాడుతూ పూలుగా వికసించడానికి ఆదేశం కోసం ఎదురు చూస్తున్నట్టుగా సిద్ధంగా ఉన్నాయి.

ఈత కొలను పక్కనే కాళ్ళు కడుక్కోవడానికి ఓ చిన్నపాటి చదరపు నీళ్ళ తొట్టి ఉండేది. దాంట్లో ఉండే చిన్న చిన్న చేపలు, తోక పురుగులు తమను తాము కదుల్చుకుంటూ సంతోషంగా ఈదులాడడం మొదలుపెట్టాయి.

"వసంతకాలం వచ్చేసింది!" అని ఎవరూ చెప్పనవసరం లేకపోయింది. ఎందుకంటే ప్రతిదీ మెరిసిపోతూ, సజీవంగా ఉండి ఏ ప్రకటన లేకుండానే తెలిసిపోతూ వచ్చాయి. ప్రతి ఒక్కరికీ వసంతం వచ్చేసిందని తెలిసిపోయింది.

అమ్మతో కలిసి టోమో గాకుయెన్‌కు టొటొచాన్ మొట్ట మొదటిసారిగా వచ్చిసరిగ్గా

సంవత్సరం గడిచింది. ఆ రోజు తను నేలలోంచి మొలుచుకొచ్చి పెరుగుతున్న బోర్డును చూసి ఆశ్చర్యపోయింది. తరగతి గదులు రైలు పెట్టెల్లో ఉండడం చూసి ఉద్వేగానికి లోనయింది. ఎగిరి గంతులు వేసింది. హెడ్‌మాస్టర్ సొసాకు కొబయాషి తన స్నేహితుడవుతాడనుకుంది. ఇప్పుడు టొటొచాన్, తన తరగతిలోని వేరే పిల్లలు రెండో తరగతి విద్యార్థులుగా తమ స్థాయి పెరగడం చూసి సంతోషించారు. సంవత్సరం కింద టొటొచాన్, వేరే పిల్లలు వచ్చినట్టుగానే వింతగా, ఉద్వేగంతో చూస్తూ మొదటి తరగతి పిల్లలు మరికొందరు వచ్చారు.

ఈ సంవత్సరం టొటొచాన్‌కు ఎంత మరపురాని సంఘటనలతో నిండిపోయిందో... ఈ సంవత్సరంలో ప్రతిరోజూ ఉదయం కోసం టొటొచాన్ ఎంతగానో ఎదురు చూసింది. ఇంకా తనకు వీధి బాజావాళ్ళంటే ఇష్టమే. కాని ఇంకా తన చుట్టూఉన్న ఎన్నెన్నో సంగతుల్ని ఇష్టపడడం నేర్చుకుంది. బెడదగా ఉన్నదని చెప్పి ఒక బడి నుంచి పంపించివేసిన ఆ చిన్నారి పాప ఇప్పుడు టోమోకు విలువైన విద్యార్థి అయిపోయింది.

కొందరు తల్లి దండ్రులకు టోమోలోని విద్యావిధానం పట్ల అపోహలుండేవి. టొటొచాన్ అమ్మా నాన్నా కూడా తాము చేసిన పని సరైనదా కాదా అని సందేహించిన సందర్భాలున్నాయి. కొబయాషి విద్యావిధానం లోపపూరితమైనదని పైపైన చూసి అంచనా వేసిన తల్లి తండ్రులలో కొందరు తమ పిల్లల్ని ఆయన పాఠశాలలో ఉంచగూడదని, మరో పాఠశాలకు మార్చాలని చాలా ఆందోళనపడ్డారు. కాని పిల్లలకు టోమో వదలడం ఎంత మాత్రం ఇష్టం లేదు. టోమో వదలాలంటే వాళ్ళు ఏడవడం మొదలెట్టారు. అదృష్టవశాత్తూ టొటొచాన్ తరగతిలో ఒక్కరు కూడా వెళ్ళిపోలేదు. కాని ఒక తరగతిపైన చదివే ఒక పిల్లవాడు మాత్రం చెంప మీద కన్నీళ్ళు ధారలు కట్టగా తన నిరాశను వెలిబుచ్చడానికి హెడ్‌మాస్టర్ వీపుమీద పిడికిళ్ళతో గుద్దడం మొదలెట్టాడు. అలా గుద్దుతోంటే ఆయన చెక్కుకు పోయిన మోకాటి చిప్ప మీద పక్కు కదిలిపోవడం మొదలయింది. హెడ్‌మాస్టర్ కళ్ళు కూడా ఏడవడం వల్ల ఎర్రబడిపోయాయి. ఆ పిల్లవాణ్ణి చివరికి వాళ్ళ అమ్మా నాన్నా బడిలోంచి తీసుకుపోయారు. వెళ్ళిపోతూ ఆ పిల్లవాడు వెనక్కి తిరిగి చేతులూపుతూనే ఉన్నాడు.

ఇటువంటి విచారకరమైన సన్నివేశాలు ఎక్కువగ జరగలేదు. టొటొచాన్ ఇప్పుడు రెండో తరగతి విద్యార్థి అయిపోయింది, రోజూ రోజూ ఇంకా ఎక్కువ ఆశ్చర్యాలకోసం, ఆనందం కోసం ఎదురుచూస్తోంది.

ఈ సమయానికల్లా టొటొచాన్ పుస్తకాలసంచి వీపుమీద సరిగ్గానే కుదురుకుంది.

## హంసల సరస్సు

టొటొచాన్‌కు హంసల సరస్సు అనే నృత్య సంగీత రూపకం చూపెట్టడానికి హిబియాహాల్‌కు తీసుకుపోయారు, నాన్న అక్కడ ఒక్కడే వయొలిన్ వాయిస్తున్నాడు. మంచి బృందం ఆ రూపకాన్ని ప్రదర్శిస్తోంది. నృత్యరూపకానికి రావడం టొటొచాన్‌కు అదే మొదటిసారి. హంసల రాణి తలమీద ఒక చిన్న కిరీటం పెట్టుకుంది. అది జిగేల్ జిగేల్‌మని మెరుస్తోంది. నిజం హంసలాగనే ఆమె చాలా సులభంగా గాలిలో ఎగిరింది. లేదా కనీసం టొటొచాన్‌కు అట్లా అనిపించింది. రాకుమారుడు హంసలరాణిని ప్రేమించాడు. మిగిలినవాళ్ళందరినీ దూరం కొట్టాడు. చిట్టచివరికి వాళ్ళిద్దరూ కలిసి అద్భుతంగా నాట్యం చేశారు. అక్కడి సంగీతం కూడా టొటొచాన్ మనసుమీద గాఢమైన ముద్ర వేసింది. ఇంటికి చేరింతర్వాత కూడా దానిగురించి ఆలోచించకుండా



ఉండలేకపోయింది తను. మర్నాడు ఉదయం నిద్రలేవగానే తిన్నగా వంట గదిలోకి అమ్మ దగ్గరికి వెళ్ళిపోయింది. చెదిరిపోయిన జుట్టును సరిచేసుకోనుకూడా సరిచేసుకోలేదు. "అమ్మా, అమ్మా మరే నేనింక గూఢచారిగానో, బాజాలవాళ్ళలానో, టికెట్ కలెక్టర్ లాగనో పనిచెయ్యనే! నేను నాట్యం నేర్చుకుని హంసల సరస్సులో నాట్యం చేస్తానే!" అని అడిగింది.

"ఆహాఁ" అంది అమ్మ. అమ్మకు ఏమీ ఆశ్చర్యం కలిగినట్టులేదు.

టొటొచాన్ ఒక నృత్యరూపకం చూడడం ఇదే మొదటి సారిగాని ఇంతకు ముందు హెడ్‌మాస్టర్ నుంచి ఇసడోరా డంకన్ గురించి ఎంతగానో విని ఉంది. ఆ అమెరికన్ స్త్రీ అద్భుతంగా నాట్యం చేస్తుందట. కొబయాషి లాగనే ఇసడోరాడంకన్ కూడా డాల్‌క్రోజ్ ఆలోచనలతో ప్రభావితమైంది. తాను అంతగా అభిమానించే హెడ్‌మాస్టర్ ఇసడోరాడంకన్‌ను అంతగా ఇష్టపడతాడంటే టొటొచాన్‌కు అది చాలు. ఆమె నాట్యం చేస్తుండగా టొటొచాన్ ఎన్నడూ చూడకపోయినా, ఆమె తనకు పరిచయం ఉన్నట్టే భావించుకునేది. కనుక నాట్యకత్తె కావడంలో అసాధారణమైనదేమీ లేదని టొటొచాన్‌కు అనిపించింది.

కొబయాషి స్నేహితుడొకాయన టోమోకువచ్చి పిల్లలకు యురిథమిక్స్ పాఠాలు చెపుతుండేవాడు. ఆయనకు ఆ దగ్గర్లోనే ఒక నృత్య శిక్షణాలయం ఉండేది. టొటొచాన్ బడి అయిపోయిన తర్వాత అక్కడ నృత్యం నేర్చుకునే ఏర్పాట్లు అమ్మచేసింది. అమ్మ ఎప్పుడూ టొటొచాన్‌ను ఇది చెయ్యి, అది చెయ్యి అని శాసించలేదు. కాని టొటొచాన్ తనంతట తాను ఏదయినా చెయ్యదలచుకున్నప్పుడు వెంటనే ఒప్పుకునేది. ఏమీ ప్రశ్నలడగకుండా కావలసిన ఏర్పాట్లన్నీ చేసేసేది.

టొటొచాన్ నృత్య పాఠశాలలో నేర్చుకోవడం మొదలు పెట్టింది. తాను హంసల సరస్సులో లాగ ఎప్పుడు నాట్యం చేయగలుగుతానా అని ఎదురు చూడడం మొదలెట్టింది. కాని ఆ పాఠశాలలో శిక్షణ ఇచ్చే ఆయనకు ఒక ప్రత్యేక పద్ధతి ఉంది. టోమోలో చేసే యురిథమిక్స్‌తో పాటుగా, ఇక్కడ విద్యార్థులతో పియానో సంగీతానికో, లేదా ఫోనో గ్రాఫ్ సంగీతానికో అనుగుణంగా కదం తొక్కించేవాడు. అప్పుడు "కొండమీద వెలుగు" లాంటి మాటలు పదే పదే అనవలసి ఉండేది. ఈ మాటను ఫ్యూజికొండ మీదికి ఎక్కుతున్నప్పుడు భక్తులు చేసే ప్రార్థనాగీతం "పాపాల్ని పొగొట్టు, కొండమీది వెలుగా" లోంచి తీసుకున్నారు. ఇలా కదం తొక్కుతుండగానే హఠాత్తుగా "పోజ్" అనేవాడు ఆ టీచర్. వెంటనే విద్యార్థులందరూ తమ ఇష్టం వచ్చిన భంగిమలో నిశ్చలంగా నిలబడవలసి ఉండేది. టీచర్ కూడా ఏదో ఒక పోజ్‌లో నిలబడేవాడు. "అచ్" లాంటి ఏదో ఉలిక్కిపడే కేకతో "స్వర్గంవైపు చూడడం" భంగిమనో, లేదా కొన్నిసార్లు "విచారంలో ఉన్న మనిషి" భంగిమనో ధరించి కింద కూచోవడం, తలను రెండు చేతుల్లో పట్టుకోవడం చేసేవాడు.

టొటొచాన్ మనసులో మెదులుతుండే ఇష్టమైన చిహ్నాం మాత్రం హంసదే. ఆ హంస జిగేల్ మని మెరిసిపోయే కిరీటం పెట్టుకునేది. తెల్లని కుచ్చుల దుస్తులు తొడక్కునేది. టొటొచాన్ మనసులో "అచ్" ఉండేదీ కాదు, "కొండమీది వెలుగు" ఉండేదీ కాదు.

ఒకరోజు టొటొచాన్ ధైర్యం కూడదీసుకుని టీచర్ దగ్గరికి వెళ్ళింది. ఆయన గమ్మత్తుగా జుత్తును రింగులు రింగులుగా చేసుకుని కుట్టుకున్నాడు. ఆయన ముందు నిలబడి టొటొచాన్ రెండు చేతులూ పక్కలకు వెడల్పుగా చాపి హంస రెక్కలలాగ ఆడించింది.

"మనం ఇటువంటి దెప్పుడూ చెయ్యమా?" అని అడింది.

ఆ టీచర్ దృఢంగా ఉన్నాడు. ఆయనవి విశాలమైన గుండ్రనికళ్ళు. ఆయన ముక్కు

గద్దముక్కులా ఉంది.

"మనం అటువంటి నృత్యాలు ఇక్కడ చెయ్యం" అన్నాడాయన.

ఆ తర్వాత టొటొచాన్ ఆయన నృత్య శిక్షణాలయానికి వెళ్ళం మానేసింది.

నృత్యరూపకాల్లో ఉపయోగించే ఆ ప్రేత్యకమైన జోళ్ళు వేసుకోకుండా, బరిగాళ్ళతో దూకడం టొటొచాన్‌కు కూడా ఇష్టమే. కదంతొక్కుతూ టొటొచాన్ కూడా ఆ మాట అనుకుంది. కాని ఏదేమైనాసరే తాను ఆ చిన్నారి, మెరిసిపోయే కిరీటం తొడుక్కోవాలని ఎంతగా తపన పడుతోంది!

"హంసల సరస్సు బాగానే ఉంటుంది. కాని ఇష్టపూర్వకంగా నృత్యం చెయ్యడం నీకు నేర్పాలని నా కోరిక" అన్నాడు టీచర్.

ఆయన పేరు బాకు ఇషి అని టొటొచాన్‌కు ఎన్నో ఏళ్ళ తర్వాత గాని తెలిసింది కాదు. జపాన్‌లో స్వేచ్ఛాయుతమైన ఆధునిక నృత్యరూపకానికి నాంది పలికిన వాడాయనే. ఆ ప్రాంతానికి జియుగౌకా (స్వేచ్ఛా పర్వతం) అనే పేరు పెట్టినవాడు కూడా ఆయనే. వీటన్నితోపాటు టొటొచాన్‌కు స్వేచ్ఛగా నాట్యం చెయ్యడం నేర్పడానికి కూడా ఆయన ప్రయత్నించాడు. అప్పటికి ఆయన వయసు యాభైసంవత్సరాలు.

## వ్యవసాయం టీచర్

"ఇవాళ మీ టీచర్ ఈయన. మీకీయన చాలా విషయాలు నేర్పుతారు" అంటూ హెడ్‌మాస్టర్ ఒక కొత్త టీచర్‌ను పరిచయం చేశాడు. టొటొచాన్ ఆ కొత్త టీచర్‌వైపు దీక్షగా చూసింది. అసలు ఆయన టీచర్‌లాగా లేనేలేడు. ఆయన బట్టలు వేరేరకంగా ఉన్నాయి. లోపలి బనీను మీద చిన్నచారల చొక్కా - పని చేసేవాళ్ళు తొడుక్కునే లాంటిది తొడుక్కున్నాడు. అందరిలాగ మెడలో టై కట్టుకోలేదు. మెడలో ఒక తువాలు వేలాడేసుకున్నాడు. ఇక ప్యాంటు చూద్దామా అంటే అది నీలిరంగు అద్దిన చేనేత ప్యాంటు. రెండు కాళ్ళకు అది బిగుతుగా పట్టుకుని ఉంది. దానికి ఎన్నో అతుకులు కనబడుతున్నాయి. ఆయన బూట్లు తొడుక్కోలేదు. పని చేసేవాళ్ళు తొడుక్కునేలాంటి మందమైన రబ్బర్ మడమల జోళ్ళు తొడుక్కున్నాడు. ఆయన తల మీదనేమో చిరిగి పోతున్న గడ్డిటోపీ ఉంది.

పిల్లలందరినీ ఆ రోజు తీసుకువెళ్ళి కుహోంబుట్సు ఆలయం దగ్గర సరసు పక్కన కూచోబెట్టారు.

ఆ టీచర్‌ను చూస్తుంటే, టొటొచాన్‌కు ఆయను అంతకు ముందెప్పుడో చూసినట్టు అనిపించింది. "ఎక్కడ చూసి ఉంటాను?" అని ఆలోచించింది. దయ తొణికిసలాడుతున్న ఆయన ముఖం ఎండలో కమిలిపోయినట్టుంది. ముఖంమీద ముడతలు పరచుకున్నాయి. ఆయన నడుముకి కట్టుకున్న నల్లటి తాడుకు ఒక సన్నటి పైపు వేలాడుతోంది. అదికూడా ఇదివరకు చూసినట్టే అనిపించింది. హఠాత్తుగా టొటొచాన్‌కు గుర్తొచ్చింది!

"కాలువ పక్కన పొలంలో పనిచేస్తూ ఉండేరైతు మీరేకదూ?" అని ఆనందంగా అడిగింది.

"ఔనౌను" అన్నాడా టీచర్ పళ్ళన్నీ కనబడేలా నవ్వుతూ, అలా నవ్వుతూనే ఆయన ముఖంనిండా ముడతలు పడ్డాయి. "మీరు కుహోంబుట్సు దేవాలయానికి వెళ్ళేటప్పుడల్లా నా పొలం ప్కనుంచే వెళ్తుంటారు గదూ. అక్కడ నిండా పూలు పూసిన ఆవాల పొలం ఉంటుందే, అదే!" అన్నాడాయన.



"వారెవ్వా! ఐతే ఇవాళ మా టీచర్ మీరన్నమాట!" అని పిల్లలందరూ ఉత్సాహంగా కేకలు వేశారు.

"కాదు కాదు" అంటూ ముఖం ముందర అడ్డంగా చెయ్యితిప్పాడు. "నేను టీచర్‌ను కాదు. రైతును మాత్రమే. మీ హెడ్‌మాస్టర్ నన్నివాళ మీకేదో చెప్పమన్నారు అంతే" అన్నాడు.

"అయ్యయ్యో - ఈయన మీకు ఉపాధ్యాయుడే. మీకు వ్యవసాయం నేర్పేటీచర్. పొలంలో మొక్కలు ఎట్లా నాటుతారో మీకు నేర్పడానికి ఆయన ఒప్పుకున్నారు. బ్రెడ్లు తయారు చేసే వాళ్ళు వచ్చి మీరు తమపని నేర్పితే ఎలా ఉంటుందో ఇదీ అంతే" అన్నాడు హెడ్‌మాస్టర్ ఆ కొత్తటీచర్ పక్కన నిలబడి తర్వాత ఆయన వైపు తిరిగి "ఇప్పుడింక పిల్లలకు ఏం చేయాలో నేర్పండి. మొదలు పెడదాం" అన్నాడు.

ఏదయినా మామూలు ప్రాథమిక పాఠశాలలోనయితే పిల్లలకు ఏమి నేర్పాలన్నా ఏవో కొన్ని విద్యార్హతలుండాలంటారు. కాని కొబయాషికి అటువంటి పట్టింపులేమీ లేవు. పిల్లలు ఏ విషయమైనా వాస్తవంగా జరుగుతుండగా చూసి నేర్చుకోవడం ముఖ్యమని ఆయన అనుకునేవాడు.

"సరే, అయితే మొదలెడదాం" అన్నాడు ఆ వ్యవసాయం టీచర్.

అప్పటికి వాళ్ళందరూ కుహోంబుట్సు ఆలయంలోని సరస్సు పక్కన గుమిగూడారు. అక్కడ ఎప్పుడూ ప్రశాంతంగా ఉంటుంది. అక్కడ సరస్సుమీద చెట్లనీడలు కదలాడుతూ చాలా ఆహ్లాదంగా ఉంటుంది. అక్కడ అప్పటికే హెడ్‌మాస్టర్ ఒక రైలు పెట్టె భాగాన్ని నిలిపించాడు. పారలు, పలుగులు లాంటి విద్యార్థుల సాయ పరికరాల్ని పెట్టుకోవడానికి ఆయన ఆ రైలు పెట్టెను కేటాయించాడు. ఆ రైలుపెట్టె ముక్క కూడా ప్రశాంతంగా కనబడింది. ఆ పిల్లలు వ్యవసాయం చేయనున్న పొలంలో మధ్యలో దాన్ని జాగ్రత్తగా పెట్టారు.

పెట్టెలోంచి పారలు, పలుగులు తెచ్చుకొమ్మని వ్యవసాయం టీచర్ పిల్లలకు చెప్పాడు. పిల్లలు రాగానే వాళ్ళకు కలుపు తీయడం ఎట్లాగో నేర్పడం మొదలు పెట్టాడు. ఆయన పిల్లలకు కలుపు మొక్కల గురించి ఎన్నో విషయాలు చెప్పాడు. అవి ఎంత బలంగా ఉంటాయో. వాటిలో కొన్ని ఎట్లా పంట మొక్కల కన్నా తొందరగా పెరిగి మొక్కలకు ఎండపొడ తగలకుండా అడ్డుకుంటాయో ఆయన చెప్పాడు. పంటలను చెడగొట్టే కీటకాలకు కలుపు మొక్కలు మంచి రక్షణ స్థలాలట. నేలనుంచి ఆ కలుపుమొక్కలు సారాన్నంతా లాగేసి పంటకు కీడు చేస్తాయట. ఆయన అలా ఒక్కొక్క విషయమూ చెప్తూ పోయాడు.

అలా మాట్లాడుతూ ఉన్నప్పుడు కూడా ఆయన చేతులు కలుపుమొక్కల్ని ఏరి వేయడం మానలేదు. పిల్లలందరూ కూడా ఆయనలాగే చేసారు. తరువాత ఆయన పిల్లలకు పలుగుతో తవ్వడమెలాగో నేర్పాడు. వాళ్ల తవ్వడం ఎలాగో నేర్పాడు. ఎరువు ఎట్లా వెదజల్లాలో చూపాడు. ఒక్కొక్క పనీ చేసి చూపెడుతూ, వివరిస్తూ, పొలంలో పంట పండించడానికి ఏమేం చేయాలో అన్నీ నేర్పాడు.

ఓ పాముపిల్ల రంధ్రంలోంచి తల బైటికిపెట్టి చూసింది. టాచాన్ చేతిని దాదాపు కాటు వేయబోయింది. టాచ్చాన్ కాస్త పద్దెపిల్లవాడే. వ్యవసాయం టీచర్ ఆ అబ్బాయి దగ్గరకొచ్చి "ఇక్కడి పాములకు విషం వుండదు. నీవు వాటినేమీ అనకపోతే అవి నిన్నేమీ అనవు", అన్నాడు.

పిల్లలకు పొలంలో పంట ఎట్లా వేయాలో నేర్పటంతోపాటు ఆ వ్యవసాయం టీచర్ కీటకాల గురించీ పక్షుల గురించీ సీతాకోక చిలుకల గురించీ వాతావరణం గురించీ అటువంటి సవాలక్ష సంగతుల గురించి చాలా ఆసక్తికరమైన విషయాలు చెప్పాడు. బలంగా మొరటుగా

ఉన్న ఆయన చేతులు, ఆయన చెప్పిన ప్రతి విషయాన్ని బలపరుస్తున్నట్లున్నాయి. అవన్నీ ఆయన తన అనుభవం నుంచి కనిపెట్టాడని ఆ బలిష్టమైన చేతులు చెబుతున్నాయి.

టీచర్ సాయంతో పొలమంతా మొక్కలు నాటడం ముగించేసరికి, పిల్లలందరూ చెమటలు కక్కడం మొదలెట్టారు. సక్రమంగా లేని ఒకటి రెండు చాళ్ళు మినహాయిస్తే ఆ పొలం మచ్చలేని తోటలా వుంది. ఎటువైపునుంచి చూసినాసరే "అదిగో, మా వ్యవసాయం టీచర్" అని కేకలేసేవారు. ఆయన తన దగ్గర ఎరువు మిగిలపోయినపుడల్లా దాన్ని తీసుకువచ్చి పిల్లల పొలంలో చల్లుతుండేవాడు. పిల్లల పొలంలో మొక్కలు ఏపుగా పెరుగుతుండేవి. ప్రతిరోజూ ఎవరో ఒకరు పొలం దగ్గరకెళ్ళి చేసివచ్చి హెడ్‌మాస్టర్ తోనూ మిగతా పిల్లలతోనూ మొక్కలు ఎట్టా పెరుగుతున్నాయో  చెబుతుండేవారు. తాము వేసిన విత్తనాలు మొలకెత్తి చిగుళ్ళు తొడిగి ఎదుగుతూ వుంటే చూడడంలో ఎంత ఆశ్చర్యమూ, ఆనందమూ దాగివున్నాయో పిల్లలు గుర్తించారు. ఇద్దరు ముగ్గురు పిల్లలు ఒక్కచోట కూడారంటే చాలు. వాళ్ళ సంభాషణ మొక్కల పెరుగుదల వైపే మళ్ళేది.

ఆ సమయానికి ప్రపంచంలో అనేక చోట్ల ఎన్నెన్నో భయానకమైన విషయాలు జరగడం మొదలైంది. కాని, ఆ చిన్నారి శిశువుల తమ బుల్లి పొలంలో ఎదుగుతున్న మొక్కల గురించి మాట్లాడుకుంటూంటే వాళ్ళు ప్రశాంత సామ్రాజ్య హృదయాధినేత లయ్యారు.

## వన భోజనం

ఒకరోజు బడి అయిపోయాక టొటొచాన్ ఎవ్వరితోనూ ఒక్కమాట కూడా మాట్లాడకుండా వీడ్కోలు కూడా చెప్పకుండా గేట్లోంచి వెళ్ళిపోయింది. గబగబా జియుగౌకా స్టేషన్‌కు పరుగెత్తింది. దారి పొడుగునా టొటొచాన్ ఒకేమాట పదే పదే అనుకుంది. 'గర్జించే లోయలో వనభోజనం, గర్జించే లోయలో వనభోజనం'...

అంత చిన్నారి పాపకు అంత పెద్దమాట కష్టమయిందే. కాని రకూగో హాస్య కథలోని మనిషి పేరుకన్నా ఇది కష్టమయిందేమీకాదు. ఎందుకంటే ఆయనను రక్షించే వాళ్ళు ఆయన పూర్తిపేరు తెల్సుకుందామనుకునేసరికి పేరు మధ్యలోనే ఆయన బావిలో మునిగి పోతాడు. ఆ పేరు అంత పొడవైంది అన్నమాట. టొటొచాన్ 'గర్జించే లోయలో వనభోజనం' అనేమాట గుర్తుంచు కోవటానికి ఎంత గట్టిగా ప్రయత్నించిందంటే ఇంకే ఉత్సాహమూ తన దగ్గరకు చేరకుండా కాపాడుకుంది. ఎవరైనా టొటొచాన్ దగ్గరకొచ్చి "జుగేమూ జుగేమూ"తో మొదలయ్యే ఆ ప్రసిద్ధమైన పేరు వినిపస్తే టొటొచాన్ తన నోట్లోనిమాట మర్చి పోయేది. లేదా తనకుతానే ఉత్సాహంగా నీళ్ళ మడుగు మీదనుంచి 'ఛల్ ఛల్‌రే బేటా' అంటూదూకేసినా నోట్లోనిమాట జారిపోయేదే! అందుకే ఆ మాటనే పదే పదే ఉచ్చరంచడం తప్ప ఇంకో వైపు మనసుని పోనీయలేదు. అదృష్టంకొద్దీ రైల్లో కూడా టొటొచాన్‌ను మాట్లాడించడానికి ఎవరూ ప్రయత్నించలేదు. అట్లాగే టొటొచాన్ కూడా తనకు ఆసక్తి కలిగించే వానిని చూడకుండా జాగ్రత్త పడింది. మొత్తం మీద "అబ్బా! అది భలేవుందే. ఏమిటో అది!" అని ఒక్కసారి కూడా అనుకోకుండానే టొటొచాన్ తన స్టేషన్‌కి చేరింది. కాని స్టేషన్నుంచి బయటి కొస్తూ వుండగా అక్కడ పని చేసే ఒకాయన టొటొచాన్‌ని " ఒహో! అప్పుడే బడి అయిపోయిందా తల్లీ!" అని పలకరించాడు. టొటొచాన్ బదులు చెబుదామా అనుకుంది కానీ, బదులు చెప్పేసానంటే మాటలు కలగలిసిపోతాయి.



గందరగోళం అయిపోతుంది, అనుకుని జవాబివ్వడం మానేసింది. ఊరికే చెయ్యి ఊపేసి ఇంటికి పరుగు లంకించుకుంది.

ఇంటి వాకిట్లో అడుగు పెట్టిందో లేదో, టొటొచాన్ గొంతెత్తి కేక వేసింది.

"అమ్మా! మరే గర్జించే లోయలో వనభోజనం" అనే కేక వినగానే అమ్మ ఆశ్చర్యపోయింది. ఇదేమిటి? ముష్టి యుద్ధంలో వేసే కేకనా? నలభై ఏడుగురు రోనిన్‌లు పూరించిన శంఖారావమా. ఏమైవుంటుంది? అమ్మకు హఠాత్తుగా తట్టింది. జియుగైకా తరువాత మూడు స్టేషన్‌లు దాటితే టొడోరోకి స్టేషన్ వస్తుంది. ఆ స్టేషన్ దగ్గర ఒక అందమైన ప్రదేశం వుంది. దాన్ని టోడోరోకి కికోకు అంటారు. అంటే గర్జించే లోయ అని. అది చాలా ప్రసిద్ధమైన స్థలం పాత టోక్యో నగరంలో చాలా గౌరవనీయమైన ప్రదేశాల్లో అది ఒకటి. అక్కడ ఓ జలపాతం వుంది. సెలయేరు వుంది. ఆహ్లాదకరమైన చిట్టడివి వుంది. ఇహ వనభోజనం అంటే బహుశా పిల్లలందరినీ అక్కడికి వనభోజనానికి తీసుకెళ్తున్నారేమో, పిల్లలకు ఎంత కష్టమైన మాటను ఎంత సులభంగా నేర్పేశారు! అని అమ్మ అబ్బుర పడింది. పిల్లల్లో ఆసక్తిని కలిగించడం ముఖ్యం. ఆసక్తి కలిగిందంటే వాళ్ళెంత సులభంగా నేర్చుకుంటారో ఇప్పుడు రుజువయిపోయింది.



అంత కష్టమైన మాటను అప్పటి దాకా నోట్లో దాచి పెట్టుకుని అది అమ్మకు చెప్పేయడంతో టొటొచాన్ విడుదలైనట్లుగావుంది. ఆ ఆనందంతో అమ్మతో వివరంగా ఒక్కొక్క సంగతీ చెప్పడం మొదలు పెట్టింది. వచ్చే శుక్రవారం ఉదయం పిల్లలందరూ బడి దగ్గరకు చేరాలట, ఒక చారుగిన్నె, ఒక అన్నం గిన్నె, చాప్‌స్టిక్స్ (జపాన్, చైనాలలో భోజనం చేసేందుకు ఉపయోగంచే పుల్లలు) ఒక కప్పుడు బియ్యం తీసుకెళ్ళాలట. ఒక కప్పుడు బియ్యం వండితే రెండు కప్పుల అన్నం అవుతుందటమ్మా! మా హెడ్‌మాస్టర్ చెప్పారు." అని గుర్తు తెచ్చుకుంది టొటొచాన్. అలా చేసేవాళ్లు సీమపంది పులుసుకూడా చేయబోతున్నారు. కనుక సీమపంది ముక్కలు, కూరగాయలు కూడా కావాలి. మధ్యాహ్నానికి ఏమన్నా ఫలహారం తినదల్చుకుంటే అదీ తెచ్చుకోవాలి.

తరువాత కొద్ది రోజులపాటు టొటొచాన్ వంటగదిలో అమ్మకు అంటిపెట్టుకునే వుంది. అమ్మ కత్తినెలా ఉపయోగిస్తుందో, పాత్రల నెలా పట్టుకుంటుందో, అన్నం ఎలా వడ్డిస్తుందో జాగ్రత్తగా గమనించింది. అమ్మ అలా వంటగదిలో పని చేస్తుండగా చూస్తుంటే ఎంత బాగుందో. కాని టొటొచాన్‌కు ఇంకా బాగా నచ్చినదేమిటంటే, అమ్మ ఏ వేడిగా ఉన్న మూతనో పట్టుకుని "అబ్బ, కాలిపోతోంది!" అంటూ బొటనవేలు, చూపుడువేలు కలిపి చెవి పట్టుకునేది.

"అలా ఎందుకు చేయాలంటే చెవులు చల్లగా ఉంటాయి గనుక" అంది అమ్మ.

అమ్మ హావభావాలు టొటొచాన్ మనసుకు హత్తుకున్నాం. అమ్మ టొటొచాన్‌కు చాలా పెద్దమనిషిలాగానూ, వంటలో నిపుణురాలి లాగానూ కనబడింది. "మేం గర్జించే లోయలో వనభోజనం చేసేటప్పుడు నేను-కూడా అలాగే చేస్తాను. చూసుకో" అని టొటొచాన్ తనకుతానే చెప్పుకుంది.

చిట్టచివరికి శుక్రవారం రానేవచ్చింది. రైల్లోంచి అందరూ గర్జించే లోయ దగ్గరికి చేరగానే చిట్టడవిలో గుమి గూడిన పిల్లలందరినీ హెడ్‌మాస్టర్ తేరిపారజూశాడు. ఎత్తయిన చెట్ల ఆకుల్లోనుంచి సూర్యకాంతి జల్లెడలోంచి జారినట్టు జారుతోంది. చిన్నారి పిల్లల అందమైన ముఖాలు ఆ కాంతిలో వెలిగి పోతున్నాయి. నిండుగా సామాన్లు ఉన్న సంచులు వేసుకుని పిల్లలందరూ హెడ్‌మాస్టర్ ఏం చెపుతాడా అన్నట్టు వేచిచూస్తూ నిలబడ్డారు. వాళ్ళ వెనుక సుప్రసిద్ధ జలపాతం గర్జించే ప్రవాహాలతో దూకుతోంది. ఆ గర్జనలు మధురమైన లయతో ఉన్నాయి.

“సరే, ఇక మొట్టమొదలు మనందరం బృందాలుగా విడిపోదాం. టీచర్లు తీసుకొచ్చిన ఇటుకలతో పొయ్యిలు తయారు చేసుకుందాం. అప్పుడిక మీలోకొందరు వెళ్ళి ఏటి నీటితో బియ్యం కడుక్కురండి. కడిగిన బియ్యం పొయ్యి మీదికి ఎక్కించండి. తర్వాత సీమ పంది పులుసు తయారుచేసుకుందాం. మరి ఇంక మొదలు పెడదామా?” అన్నాడు హెడ్‌మాస్టర్.

“రాయి, కాగితం, కత్తెర” అని ఆటాడుకుంటున్నట్టుగా పిల్లలందరూ గుంపులు గుంపులుగా విడిపోయారు. పిల్లలంతా కలిసి దాదాపు యాభై మందే ఉన్నారు గనుక వాళ్ళందరూ ఆరు బృందాలు కావడానికి ఎక్కువసేపు పట్టలేదు. అక్కడికక్కడే గోతులు తవ్వేసి చుట్టూ ఇటుకలు పేర్చి పొయ్యిలు తయరు చేశారు. అప్పుడు ఆ ఇటుకల మీద పాత్రల్ని పెట్టడానికి వీలుగా అడ్డంగా సన్నని ఇనుపకడ్డీలు పెట్టారు. కొందరు ఈ పనులు చేస్తుండగానే మరి కొందరు చిట్టడవి లోంచి వంట చెరకు ఏరుకొచ్చారు. మరి కొందరు ఏటి నీటిలో బియ్యం కడగడానికి వెళ్ళారు. పిల్లలు తమకుతామే వేర్వేరు పనులు కేటాయించుకున్నారు. టొటొచాన్ కూరగాయలు కోసిపెడతానంది. సీమ పంది పులుసు కూడా తానే తయారు చేస్తానంది. టొటొచాన్‌కన్న రెండు తరగతులు పైన చదివే ఒక పిల్లవాడికి కూడా కూరగాయలు కోసే పని అప్పగించారు. కాని ఆ అబ్బాయి కూరగాయల్ని పెద్ద పెద్ద ముక్కలు గానో, మరీ చిన్న ముక్కలుగానో తరగేశాడు. మొత్తం మీద పనంతా గందరగోళం చేసేశాడు. ఐతే, ఆ మాత్రం పని చేయడానికి ఆ అబ్బాయి చాలా కష్టపడి దీక్షగా పనిచేశాడు. ఆ అబ్బాయి ముక్కుమీద చెమట ముత్యాలు మెరసి పోయాయి. టొటొచాన్ సరిగ్గా అమ్మలాగే కూరగాయలు కోయడం మొదలు పెట్టింది. పిల్లలు తీసికొచ్చిన వంకాల్ని, బంగాళాదుంపల్ని, ఉల్లిపాయల్ని, బర్డోక్ దుంపల్ని మిగతా కూరగాయల్ని నేర్పుగా సరిగ్గా తినడానికి వీలయినట్టుగా తరిగింది. వంకాల్ని, దోసకాయల్ని సన్న సన్న ముక్కలుగా తరిగి వాటికి ఉప్పు అద్ది పెట్టింది. కొందరు పెద్ద పిల్లలు తనకు అప్పగించిన పనులు చేయడానికి ఇబ్బంది పడుతుంటే వాళ్ళకు సలహాలు కూడా ఇచ్చింది. టొటొచాన్‌కు నిజంగా తాను అమ్మనై పోయాననే అనిపించింది. టొటొచాన్ తయారు చేసిన ఉప్పు అద్దిన ముక్కలు అందరికీ నచ్చాయి.

“మరే, నేను ఊరికే ప్రయత్నించి చూద్దామనుకున్నాను. నాకు చేయొస్తుందో లేదోనని.” అని టొటొచాన్ వినయంగా జవాబిచ్చింది.

సీమ పంది పులుసు వాసన రావడం మొదలయ్యాక అది బాగుందా లేదా అని ఒక్కొక్కరినీ అడిగారు. ఒక్కొక్క బృందంలో నుంచీ “వారెవ్వా” “భలేభలే” అని కేకలు ప్రతిధ్వనించాయి. నవ్వులు చెలరేగాయి. ఆ సందోహంలో భాగం పంచుకున్నట్లు చిట్టడవి లోని పక్షులు కూడా కిచకిచ లాడాయి. ఈ లోగా ప్రతి పాత్ర లోంచీ నోరురించే వాసనలు వెలువడి వ్యాపించాయి. అప్పటి వరకూ అక్కడి పిల్లల్లో ఎవరూ ఎదైన వండుతుండగా చూడలేదు. వంట పాత్ర కింద వేడిని మారుస్తూ ఉండాలని వాళ్ళెవరికీ తెలియదు. వాళ్ళకు తెలిసిందల్లా బల్లమీద ఏది పెడితే అది తినెయ్యడమే. తమంతట తమే ఏదో ఒకటి వండుకోవడంలో ఉన్న ఆనందం,



దానిలోనే ఉండే కష్టాలు, వంటలో ఒక్కొక్క పదార్థమూ పొందే వేరు వేరు మార్పుల్ని గమనించడం వాళ్ళందరికీ ఒక వినూత్న అద్భుత అనుభవమై పోయింది.

చిట్టచివరికి ప్రతి బృందానికి కేటాయించిన పొయ్యి దగ్గరా పని అయిపోయింది. హెడ్‌మాస్టర్ పిల్లలతో గడ్డిమీద గుండ్రంగా కూచోడానకి వీలుగా నేల శుభ్రం చేయించాడు. ప్రతి బృందం ముందర ఒక పులుసు గిన్నె, ఒక అన్నం గిన్నె పెట్టారు. టొటొచాన్ మాత్రం తన పులుసు గిన్నెను పొయ్యి మీద నుంచి దింపనివ్వలేదు. తన మనసంతా నిండి ఉన్న ఒక పనిచేస్తేనే గాని గిన్నె దించగూడదని టొటొచాన్ ఎప్పటి నుంచో అనుకుంటోంది. వేడి మూతను చేతులతో తీసేసి, చాలా జాగ్రత్తగా “అబ్బవేడి!” అంటూ రెండు చేతులూ ఎత్తి చెవులు పట్టుకుంది. అప్పుడిక “ఊఁ, ఇంక గిన్నె తీసుకెళ్ళండి!” అంది. ఆ తర్వాతే ఆ పాత్రను పొయ్యి మీది నుంచి తీసుకెళ్ళి పిల్లలు కూచున్న చోట పెట్టారు. కాని అందరికందరూ “ఈ పిల్లకేమొచ్చిందా” అనుకున్నారు. అట్లా ఆపెయ్యడం ఏ ఒక్కరికీ నచ్చినట్టు లేదు. కాని టొటొచాన్‌కు మాత్రం చెప్పలేనంత సంతృప్తి కలిగింది.

ప్రతి ఒక్కరి దృష్టీ వాళ్ళ ముందర ఉన్న అన్నం-గిన్నెల మీద, పొగలు గక్కుతున్న చారుగిన్నెల మీద కేంద్రీకృతమైంది. పిల్లలకు ఆకలి దంచేస్తోంది. మరి అన్నిటికంటె ముఖ్యంగా అది వాళ్ళు పూర్తిగా తమంతట తాము తయారు చేసుకున్న భోజనం!

పిల్లలందరూ “నములు, నములు, నములు, ప్రతిదీ బాగానములు” అని పాడాక “ఇటాడాకి మాసు” అన్నారు. ఆ తర్వాత ఆ చిట్టడవిలో పూర్తి ప్రశాంతత వ్యాపించింది. జలపాత ధ్వని తప్ప అక్కడ మరే శబ్దమూ వినబడ లేదు.

## “నువు నిజంగా మంచి పిల్లవు”

“నువ్వు నిజంగా మంచి పిల్లవు తెలుసా”

టొటొచాన్‌ను చూసినప్పుడల్లా హెడ్‌మాస్టర్ ఆ మాటే అనేవాడు. ఆయన ఆ మాట అన్నప్పుడల్లా టొటొచాన్ చిరునవ్వు నవ్వేది. ఒక చిన్న గంతు వేసేది. “మరే నేను మంచి పిల్లనే” అనేది. టొటొచాన్ ఆ మాటను నమ్మేసేది కూడా.

నిజంగానే టొటొచాన్ చాలా విషయాలలో మంచి పిల్లే. తను ప్రతి ఒక్కరితోనూ దయతో ప్రవర్తించేది. ముఖ్యంగా అంగవికలురయిన తోటి పిల్లల పట్ల కరుణ ప్రదర్శించేది. వాళ్ళను రక్షిస్తూ ఉండేది. వేరే బళ్ళకు చెందిన పిల్లలెవరన్నా వాళ్ళతో క్రూరంగా ప్రవరిస్తే టొటొచాన్ ఎదురు తిరిగి పోట్లాడేది. ఒక్కోసారి చిట్టచివరికి టొటొచాన్ ఏడ్వడంతో అది ముగిసేదనుకోండి. అయినా సరే. ఎక్కడన్నా ఏ జంతువైన గాయపడి కనిపిస్తే టొటొచాన్ దాన్ని కాపాడడానికి చేతనయిన ప్రయత్నమంతా చేసేది. ఐతే ఈ పనులన్నీ చేస్తున్నప్పుడు కూడా టీచర్లు టొటొచాన్ విషయంలో ఎప్పటికప్పుడు ఆశ్చర్యపోయే సంగతి ఒకటుంది. టొటొచాన్‌కు ఏదన్నా అసాధారణ మైనది కనబడిందంటే చాలు. తన కుతూహలాన్ని తీర్చుకునే ప్రయత్నంలో ఎంతెంత పెద్ద ప్రమాదాలలో పడిపోతూ ఉండేదో!

టొటొఛాన్‌కు ఉదయం పూట అసెంబ్లీకి వెళ్ళేటప్పుడు తన రెండు పిలక జడలను వెనుక నుంచి చంకల్లో ఇరికించుకోవడం సరదాగా ఉండేది. ఒకసారి తరగతి గది ఊడ్చేపని టొటొచాన్ వంతుకు వచ్చింది. ఆ గదిలో ఉన్న రహస్యమైన తలుపొకటి టొటొచాన్ తీక్షణమైన కళ్ళకు కనబడింది. టొటొచాన్ వెంటనే ఆ తలుపు తెరిచి ఊడ్చిన చెత్తంతా ఆ రంధ్రంలో

పడేసింది. ఆ పెట్టె నిజంగా రైలుగా ఉన్నప్పుడు యంత్రాల్ని పరీక్షంచడానికి ఆ తలుపును ఉపయోగించేవారు. టొటొచాన్ ఆ తలుపును తెరవనైతే తెరిచింది గాని మూయలేక పోయింది. దాంతో ప్రతి ఒక్కరూ ఎంత ఇబ్బంది పడ్డారు. మరోసారేమో ఎవరో టొటొచాన్‌తో మాంసాన్ని ఎలా వేలాడదీస్తారో చెప్పారు. ఇక వెంటనే టొటొచాన్ బడిలో ఉన్న ఎత్తయిన ఎక్సర్‌సైజ్‌బార్‌కు ఒక చేత్తో వేలాడింది. టొటొచాన్ అక్కడ యుగాల తరబడి వేలాడింది. చిట్టచివరికి ఒక టీచరు టొటొచాన్‌ను చూసి ఏం చేస్తున్నావని అడిగితే "ఇవాళ నేను మాంసం ముక్కనట!" అని కేకేసింది. సరిగ్గా ఆ సమయానికే చేతిపట్టు వుదులయి దభేలుమని కింద పడింది ఆ దెబ్బ ఎంత బలంగా తగిలిందంటే ఊపిరితిత్తులకు గట్టి దెబ్బతగిలి, టొటొచాన్ ఆ రోజంతా మాట్లాడలేకపోయింది. సరే, ఇక టొటొచాన్ మురికిగుంటలోకి దూకిన సంగతి అందరికీ తెలిసిందే.

టొటొచాన్ ఎప్పుడూ అటువంటి పనులే చేస్తూ ఉండేది. ఎప్పటికప్పుడు దెబ్బలు తగలించుకుంటూ ఉండేది. కాని ఈ విషయాలను గురించి హెడ్‌మాస్టర్, అమ్మకు గాని నాన్నకుగాని ఎప్పుడూ కబురు చేయలేదు. వేరే పిల్లల విషయంలో కూడ అంతే, ఎప్పుడయినా ఆ సంగతేదో హెడ్‌మాస్టర్‌కూ ఆ పని చేసినచిన్నారికీ మధ్య·పరిష్కారమయి పోయేది. బడికి మొట్టమొదటి రోజు వచ్చినపుడు టొటొచాన్ మాటల్ని నాలుగు గంటలపాటు విన్నట్టే, జరిగిన సంగతి గురించి పిల్లవాళ్ళు చెప్పేదాన్ని హెడ్‌మాస్టర్ శ్రద్ధగా వినేవాడు. వాళ్ళు చెప్పే సాకుల్ని కూడ ఆయన జాగ్రత్తగా వినేవాడు. పిల్లవాళ్ళు గనుక నిజంగా తప్పు చేస్తే, అది తప్పని చిట్టచివరికి గుర్తిస్తే హెడ్‌మాస్టర్ ఒకే ఒక్క మాట అనేవాడు. "అయితే క్షమాపణలు కోరుకో" అని.

టొటొచాన్ విషయంలో నైతే వేరే పిల్లల తల్లిదండ్రులు, టీచర్లు చేసే ఫిర్యాదులు, ప్రకటించే భయాలు నిస్సందేహంగా హెడ్‌మాస్టర్ చెవిన పడేవి. అందుకనే, ఆయనకు అవకాశం ఉన్నప్పుడల్లా టొటొచాన్‌తో "నువు నిజంగా మంచి పిల్లవు తల్లీ, తెలుసా?" అనేవాడు. ఆయన ఆమాట అంటూ ఉండగా విన్న పెద్దవాళ్ళవరికయినా 'నిజంగా' అని ఒత్తిపలికేటప్పుడు ఆయన దాన్ని ఎంత నొక్కి చెపుతున్నాడో తెలిలిపోయేది.

టొటొచాన్ ఏం అర్థం చేసుకోవాలని హెడ్‌మాస్టర్ అనుకుని ఉంటాడంటే, "చాల విషయాలలో నువు మంచి పిల్లవు కావని కొందరు అనుకోవచ్చు. కాని నిజంగా నీ స్వభావం చెడ్డది కాదు. నీ స్వభావంలో చాలా భాగం మంచి ఉంది. నేను దాన్ని పూర్తిగా గుర్తించాను" అని. కాని దురదృష్టవశాత్తూ, టొటొచాన్ ఆ విషయం గుర్తించే సరికి ఎన్నో ఏండ్లు గడిచి పోయాయి. అయితే ఆ సమయంలో సరిగ్గా ఆయన ఏం ఉద్దేశిస్తున్నాడో అర్థం చేసుకోలేక పోయినా టొటొచాన్ హృదయంలో హెడ్‌మాస్టర్ లోతుగా ఒక భావాన్ని నెలకొల్పగలిగాడు. టొటొచాన్‌కు తాను "మంచి పిల్లననే" దృఢ విశ్వాసం కలిగింది. ఏదో ఒక సాహసం చేస్తున్నప్పుడు కూడా టొటొచాన్ హృదయంలో ఆయన మాటలు ప్రతిధ్వనిస్తుండేవి. తాను చేసిన పని గురించి టొటొచాన్ తానే స్వయంగా చాలసార్లు "అమ్మయ్య" అని నిట్టూర్చేది.

టొటొచాన్ టోమోలో ఉన్నంతకాలమూ కొబయాషి ఆ మాటలే పదేపదే అంటూ పోయాడు. టొటొచాన్ జీవిత మార్గాన్ని నిర్ణయించిన ముఖ్యమైన మాటలివి.

"టొటొచాన్, నువు నిజంగా మంచి పిల్లవు. తెలుసా తల్లీ!"

## పెళ్ళికూతురు

టొటొచాన్ చాలా విచారంగా ఉంది.



ఇప్పుడు టొటొచాన్ మూడో తరగతి. టొటొచాన్‌కు కుటాయిచాన్ అంటే చాల ఇష్టం. టాయిచాన్ తెలివైనవాడు. భౌతికశాస్త్రంలో దిట్ట. ఇంగ్లీషు కూడ చదివాడు. ఇంగ్లీషులో నక్కను ఫాక్స్ అంటారని టొటొచాన్‌కు చెప్పినవాడు టాయిచానే.

"టొటొచాన్! నక్కను ఇంగ్లీషులో ఏమంటారో తెలుసా? ఫాక్స్ అంటారు" అన్నాడు.

"ఫాక్స్"

ఆ పదం భలే విచిత్రంగా ధ్వనిస్తోందని టొటొచాన్ ఆ రోజంతా ఆ పదం మోజులోనే ఉండిపోయింది. ఆ తర్వాత నుంచి టొటొచాన్ ప్రతి రోజూ బడికి వెళ్ళగానే చేసే మొట్టమెదటి పని టాయిచాన్ పెన్సిళ్ళ డబ్బాలోని పెన్సిళ్ళను తన దగ్గరి చిన్న చాకుతో అందంగా చెక్కిపెట్టడం. అయితే టొటొచాన్‌కు తన పెన్సిల్ గురించి మాత్రం ఆ శ్రద్ధ ఉండేది కాదు. పళ్ళతో కొరికి రాయడానికి వీలుగా తయారుచేసుకునేది.

ఇంత చేసినా టాయిచాన్ మాత్రం టొటొచాన్‌తో దురుసుగా మాట్లాడాడు. ఓ రోజు మధ్యాహ్న భోజనాల సమయంలో అది జరిగింది. ఆ సమయానికి అసెంబ్లీ హాలు వెనుక, ఆ పేరుపొందిన మురికి దగ్గర టొటొచాన్ పచార్లు చేస్తోంది.

"టొటొచాన్"

టాయిచాన్ గొంతు మొరటుగా ప్రతిధ్వనించింది. టొటొచాన్ ఉలిక్కిపడుతూ ఆగిపోయింది. టాయిచాన్ ఒక్క క్షణం ఊపిరి పీల్చుకోవడానికి ఆగి మళ్ళీ మెదలెట్టాడు. "టొటొచాన్-చూస్కో-నేను పెద్ద పెరిగాక నిన్ను మాత్రం పెళ్ళి చేసుకోను. నువ్వెంత బతిమిలాడినా సరే" అన్నాడు. ఆ మాటలనేసి నేలపై చూస్తూ అక్కడి నుండి వెళ్ళిపోయాడు.

టొటొచాన్ దిగ్భ్రాంతిలో అలా నిలబడిపోయింది. టాయిచాన్, ఆ పెద్దతల కనుచూపు మేరలోంచి వెళ్ళిపోయే వరకూ అలానే చూస్తూ ఉండిపోయింది. నిండా పుట్టెడు బుద్ధులున్న ఆ బుర్రంటే టొటొచాన్‌కు చాల ఇష్టం. టాయిచాన్ శరీరం కంటె తల పెద్దదిగా ఉండేది అందుకే మిగతా పిల్లలు టాయిచాన్‌ను "అపసవ్యపు నిష్పత్తి" అని పిలుస్తుండేవాళ్ళు.

టొటొచాన్ జేబుల్లో చేతులు పెట్టుకుని తీవ్రంగా ఆలోచించింది. టాయిచాన్‌ను నొప్పించే పని ఏం చేశానా అని ఆలోచించింది. బాగా నిరాశపడి, ఆ నిరాశలోనే ఈ సంగతి మియోచాన్‌తో మాట్లాడింది. టొటొచాన్ చెప్పిందంతా విన్నాక మియోచాన్ ఆరిందలా మాట్లాడుతూ "'ఏమయి ఉంటుందో చెప్పనా? ఇవాళ సుమో కుస్తీ పోటీల్లో నువు టాయిచాన్‌ను రింగ్‌లోంచి తోసేశావు గదూ. అయితే తను రింగులోంచి బయటికి పోయాడంటే ఆ తల పెద్దగా ఉండడమే కారణమనుకో. అయినా నీ మీద కోపం ఉంటుంది. గదా....' అంది.



టొటొచాన్ చాల బాధపడింది. కాని ఇంక చేయగలిగిందేమీ లేదు. ప్రతిరోజూ పెన్సిళ్ల చెక్కిపెట్టేంత ఇష్టమైన అబ్బాయిని అంత గట్టిగా ఎందుకు తోసేయవలసి వచ్చింది? కాని ఇప్పటికే చాల ఆలస్యమయిపోయింది. ఇంక తాను టాయిచాన్‌కు పెళ్ళికూతురయ్యే అవకాశం లేదు.

"'ఏమైనా సరే, నేను టాయిచాన్ పెన్సిళ్ళు చెక్కి పెడుతూనే ఉంటాను. నేను ఆ అబ్బాయిని ప్రేమిస్తున్నానుగా" అనుకుంది టొటొచాన్.

## "పాతబడి వెలసిపోయిన బడి"

ప్రాథమిక పాఠశాల విద్యార్థుల్లో అందరికి తెలిసిన గమ్మత్తయిన పాట ఒకటి ఉండేది. అది ఒక రకమైన పల్లవి లాగ ఉండేది. టొటొచాన్ పాత బడిలో ఆ పాట పదే పదే పాడుతుండేవాళ్ళు. బడి అయిపోయి ఇంటికి వెళ్ళేటప్పుడు గేట్లోంచి బయటికి వెళుతూ భుజాల మీదినుంచి బడిచూస్తూ ఆ పాటే పాడేవాళ్ళు.

"అకమట్సు బడి వెలసిపోయింది. పాతబడింది;
లోపల చూస్తే అదేగొప్పది మా మంచిది!

వేరే బళ్ళ పిల్లలు గనుక ఈ బడి ముందునుంచి వెళ్తున్నట్టయితే వాళ్ళు ఆ బడి వేపు వేలెత్తి చూపుతూ

"అకమట్సు బడి గొప్పదంటారు. మంచిదంటారు. లోపల చూస్తే వెలసిపోయింది. పాతబడింది!" అని పాడేవాళ్ళు. పాట ముగించగానే "ఓ" అని గోల పెట్టేవాళ్ళు.

అసలు మొట్టమొదట ఒక బడి పాతబడిందా, గొప్పగా ఉందా అనేదాన్ని ఆ బడి భవనాలు పాతవా కొత్తవా అనేదాన్ని బట్టి నిర్ణయించేవాళ్ళు ఈ పాటలో రెండో పాదమే చాలా ముఖ్యమైనది. ఆ పాదంలో ఆ బడి లోపల ఎట్లా ఉన్నదో చెప్పేవాళ్లు. కనుక మొదటిపాదంలో బడి వెలసిపోయి పాతబడిందన్నా ఫర్వాలేదన్నట్టుండేది. బడి లోపల ఎట్లా ఉందన్నదే ముఖ్యంగా ఉండేది. ఆ పాటను ఎప్పుడూ ఐదారుగురు పిల్లలు కలసి పాడేవాళ్ళు.

ఓరోజు సాయంత్రం బడి అయిపోయాక టోమో పిల్లలందరూ మామూలుగా ఆడుకుంటున్నారు.చిట్టచివరి గంట మోగేదాకా పిల్లలు వాళ్ళిష్టం వచ్చినట్టు ఆడుకోవచ్చు. చివరి గంట మోగాక మాత్రం బడి ఆవరణ వదిలేసి పోవాలి. పిల్లలు తమ ఇష్టం వచ్చిన పనులు చేసుకోవడానికి బడిలోనే కొంత సమయం కేటాయించడం అవసరమని హెడ్‌మాస్టర్ భావించాడు. కనుక తరగతులన్నీ అయిపోయాక ఉండే ఈ చివరి పీరియడ్ మిగతా ప్రాథమికపాఠశాలల్లోకన్న ఎక్కవ సేపుఉండేది, ఆ రోజు కొందరు బంతి ఆట ఆడుకుంటున్నారు. మరికొందరు ఇనుప కడ్డీలతోనూ, ఇసుక కుప్పలోనూ ఒళ్ళంతా మురికి చేసుకుంటూ ఆడుకుంటూన్నారు. కొందరు పూల తివాచీని సవరిస్తున్నారు. కొందరు పెద్ద అమ్మాయిలు మెట్ల మీద కూచుని కబుర్లు చెప్పుకుంటున్నారు. మరికొందరు చెట్లు ఎక్కుతున్నారు. అందరి కందరూ కడా తమ తమ ఇష్టంవచ్చిన పనులు చేస్తున్నారు. టాయిచాన్ లాగ తరగతి గదుల్లోనే ఉండిపోయిన వాళ్లూ కొందరున్నారు. టాయిచాన్ గదిలోనే ఉండిపోయి ఏదో భౌతికశాస్త్ర ప్రయోగం చేస్తున్నాడు. అలా ఉండిపోయిన వాళ్లు గాజు కుప్పెల్లో ఏదో మరగబెడుతున్నారు. పరీక్ష నాళికల్లో ప్రయోగాలుచేస్తున్నారు. కొందరు పిల్లలేమో లైబ్రరీలో చదువుకుంటున్నారు. జంతువులంటే మక్కువ ఉన్న అమడెరా ఎక్కడి నుంచో వచ్చిన ఒక పిల్లిని పరీక్షిస్తున్నాడు. ఆ పిల్లిని వెనక్కి తిప్పి దాని చెవుల లోపలికి తొంగి చూస్తున్నాడు. అందరూ కూడ తమకు ఇష్టమైన పద్ధతుల్లో సరదాగా గడుపుతున్నారు.

హఠాత్తుగా బడి బైటినుంచి బిగ్గరగా పాట వినబడింది.

"టోమో పాఠశాల వెలిసిపోయింది, పాతబడింది;
లోపల కూడ అది వెలిసిపోయింది, పాతబడింది!

"ఏం దారుణం" అనుకుంది టొటొచాన్. సరిగ్గా ఆ సమయానికి టొటొచాన్ గేటుదగ్గరే ఉంది. గేటంటే అది గేటు కాదనుకోండి, గేటుకు రెండు వైపుల ఉన్న స్తంభాలూ చిగుళ్లు వేసి,



నిండా ఆకులతో ఉన్నాయి. సరే, ఏమైతేనేం టొటొచాన్‌కు ఆ పాట మాత్రం స్పష్టంగా వినిపించింది. 'ఇది చాల ఘోరంగా ఉంది' అనుకుంది టొటొచాన్. తమ బడిని లోపలా, బైటా కూడ పాతబడి వెలసిపోయి ఉందంటే ఏమనాలి! టొటొచాన్ కు కోపం రగిలిపోయింది, మిగిలిన వాళ్ళందరికీ కూడ కోపం వచ్చింది. అందరూ గేటు వైపు పరుగెత్తుకొచ్చారు. ఆ వేరే బడి పిల్లలుగోలగోలగా అరుస్తూ పరుగెత్తుతూ "పాతబడి వెలసిపోయిన బడి" అని మళ్ళీ అరిచారు.

టొటొచాన్ ఎంత ఉద్రేక పడిందంటే ఆ పిల్లల్ని తరుముతూ వాళ్ళ వెనుక పరుగెత్తింది. వెనుకాముందూ చూసుకోకుండా ఒక్కతే అలా పరుగుతీసింది. కాని వాళ్ళు మాయమైపోయారు. టొటొచాన్ అసంతృప్తిగా వెనక్కుతిరిగి బడికొచ్చింది. అలా నడుస్తు నడుస్తూనే టొటొచాన్ ఒక పాటకట్టింది.

"టోమో బడంటే మా బంగారుబడి" అని మళ్ళీ కొన్ని అడుగులు వేశాక
"లోపలైనా, బైటైనా బంగారపుబడే" అని పూర్తి చేసింది.

టొటొచాన్‌కుఆ పాట చాల నచ్చింది. ఆపాట పూర్తయ్యాక టొటొచాన్‌కు కాస్త సంతృప్తి కలిగింది. కనుక ఆ ఆనందంలో బడి ముందుకురాగానే తాను మరో బడినుంచి వచ్చినట్టు నటిస్తూ కంచెలోంచి బిగ్గరగా అందరికీ వినబడేటట్టు పాట మొదలు పెట్టింది.

"టోమో బడంటే మా బంగారుబడి
లోపలైనా బంగారపు బడే"!

ఆవరణలో ఆడుకుంటున్న పిల్లలు పాట పాడుతున్నదెవరో మొదట తేల్చుకోలేక పోయారు. అలా పాడినది టొటొచాన్ అని తెలియగానే వాళ్ళందరూ రోడ్డుమీదికి వెళ్ళి టొటొచాన్‌తో గొంతు కలిపారు. చిట్టచివరికి అందరూ భుజం భుజం కలిపి ఆ చుట్టుపట్ల రోడ్లన్నిటి మీద ఆ పాట పాడుతూ ప్రదర్శన జరిపారు. వాళ్ళ గొంతులకన్నా ముఖ్యంగా వాళ్ళ హృదయాలే కలగలిసి ఒకేఒక్క గొంతుగా పాట పైకి ఎగిసింది. అయితే అప్పుడు వాళ్ళు ఆ విషయం గుర్తించలేదు. బడిచుట్టూ అలా తిరుగుతూ వాళ్ళ ఉత్సాహం ఇంకా పెరిగింది.

"టోమో బడంటే మా బంగారుబడి
లోపలైనా బైటైనా బంగారుపుబడే!"

తన గదిలో కూచుని ఆ పాట వింటున్న హెడ్‌మాస్టర్‌కు ఆ పాట ఎంతటి అమితానందాన్ని కలగజేసిందీ ఆ చిన్నారి శిశువులకు తెలియదు.

ఏ ఉపాధ్యాయుడికైనా అటువంటి ఆనందమే కలుగుతూ ఉండవచ్చు. కాని మరీ ముఖ్యంగా పిల్లల గురించి శ్రద్ధగా ఆలోచించే వాళ్ళకు ఒక బడి నడపడమంటే రోజు రోజూ ఆందోళనలు కొనితెచ్చుకోవడమే. టోమోలాంటి బడిలో ఆ ఆందోళనలు ఇంకా ఎక్కువ ఉంటాయి. ఎందుకంటే టోమోలో ప్రతిదీ అసాధారణంగానే ఉంటుంది గద. సాంప్రదాయక విద్యాపద్ధతులకు అలవాటు పడిన వాళ్ళనుంచి టోమో మీద చాల విమర్శలే వచ్చాయి.

అటువంటి సమయంలో చిన్నారి శిశువులు పాడిన ఆ పాట హెడ్‌మాస్టర్‌కు ఇవ్వగలిగిన అద్భుతమైన కానుక.

"టోమో బడంటే మా బంగారు బడి
లోపలైనా బైటైనా బంగారపు బడే!"

ఆ రోజు చివరిగంట మామూలు కన్న ఆలస్యంగా మోగింది.

## రిబ్బన్

ఒక రోజు మధ్యాహ్న భోజనాల సమయం. పిల్లలందరూ తినడం అయిపోయింది. టొటొచాన్ అసెంబ్లీహాలులో గెంతుతోంది. అప్పుడే టొటొచాన్‌కుహెడ్ మాస్టర్ ఎదురుపడ్డాడు. టొటొచానే హెడ్‌మాస్టర్‌ను కలుసుకుందంటే తప్పవుతుంది. ఎందుకంటే భోజనాల సమయమంతా అయన వాళ్ళతోనే ఉన్నాడు. కాని ఇప్పుడు ఆయనటొటొచాన్‌కు ఎదురుగా వస్తున్నాడు. గనుక వాళ్ళిద్దరూ ఒకరినొకరుకలుసుకున్నారు.

"ఒహో! ఇక్కడున్నవా? నేను నీ కోసమే చూస్తున్నాను. నిన్నొకటి అడగాలి" అన్నాడు హెడ్‌మాస్టర్.

హెడ్‌మాస్టర్ తననుంచి తెలుసుకోవలసిన విషయం ఏదో ఉన్నదని తెలిసి ఆనందంతో "ఏమిటది?" అని టొటొచాన్.

టొటొచాన్ తలలో ఉన్న రిబ్బన్‌ను చూస్తూ "నీకా రిబ్బన్ ఎక్కడ దొరికింది?" అని అడిగాడు హెడ్‌మాస్టర్.

ఆ ప్రశ్న వినగానే టొటొచాన్ ముఖంలో రంగులు మారాయి. కొత్తగా కదలాడిన భావం సంతోషకరమైనది మాత్రం కాదు. తను ఆ రిబ్బన్‌ను ముందురోజు నుంచి కట్టుకుంటోంది. దాన్ని తనంతటతానే సంపాదించుకుంది. టొటొచాన్ హెడ్‌మాస్టర్ దగ్గరిదాకా వెళ్ళి ఆయన ఆ రిబ్బన్‌ను సరిగ్గా చూసేలా నిలబడింది.

"మా అత్త పాత స్కూలు యూనిఫారం మీద ఈ రిబ్బన్ కనబడింది. ఆమె ఆ యూనిఫారాన్ని ఓ సొరుగులో పెట్టేస్తుండగా నేను ఈ రిబ్బన్ చూశాను. అత్త నాకు అది ఇచ్చేసింది. అత్త ఇంకా ఏమందోతెలుసా? నేను అన్నీ చాల శ్రద్ధగా చూస్తానట" అని గర్వంగా చెప్పింది టొటొచాన్.

"అట్లాగా" అన్నాడు హెడ్‌మాస్టర్, ఏదో తీవ్రాలోచనలో మునిగి.

టొటొచాన్ ఆ రిబ్బన్‌ను చూసుకుని ఎంతో మురిసి పోయింది. తాను అత్త వాళ్ళింటికి ఎట్లా వెళ్ళిందో ఆ సమయానికే ఆమె ఎట్లా బట్టలు ఆరేస్తున్నదో టొటొచాన్ హెడ్‌మాస్టర్‌తో చెప్పింది. అప్పుడు అత్త చూస్తున్న బట్టల్లో ఒక పాతకాలపు గౌను కనబడింది. అది పొడవాటి కుచ్చులగౌను. అత్త బడిలో చదువుకునేటప్పుడే అది మూసిపోయి, వెలసిపోయింది. అత్త దాన్ని మళ్ళీలోపల పెట్టేస్తుండగా టొటొచాన్ దానిమీద అందమైనదేదో ఉన్నదని గమనించింది.

"ఏమిటది?"

టొటొచాన్ ప్రశ్నతో అత్త ఒక్కక్షణం ఆగింది. ఆ అందమైనదేదో ఈ రిబ్బనే అని తేలింది. ఆ గౌనుకు వీపుమీద నడుంకట్టులాగ ఈ రిబ్బన్ ఉంది.

"ఇది ఎందుకంటే వెనుకవైపు నుంచి చూసేవాళ్ళెవరికయినా అందంగా కనబడడానికి. అ రోజుల్లో ప్రతివాళ్ళూ ఏదో ఒక చేత్తో తయారు చేసిన లేసు ముక్కనో, వెడల్పాటి రిబ్బన్‌నో అలా పెద్దముడిలాగ కట్టుకునే వాళ్ళు" అని చెప్పింది అత్త.

అత్తమాటలు వింటూనే కట్టుకునే ఆ రిబ్బన్ వేపు ఎంత ఆశగా చూస్తోందో అత్త గమనించింది. అంతసేపూ టొటొచాన్ ఆ రిబ్బన్‌ను స్పృశిస్తూనే ఉంది. తడుముతూనే ఉంది. ఇదంతా చూసి "ఈ రిబ్బన్ తీసేసుకోరా! ఇవ్వనా? ఎట్లాగూ నేనింక ఈ గౌను తొడుక్కోను గదా" అంది అత్త.

అత్త ఓ కత్తెర పట్టుకొచ్చింది. రిబ్బన్‌ను, గౌనును కలిపి కుట్టిన దారం కత్తిరించేసి



రిబ్బనును టొటొచాన్‌కు ఇచ్చింది. టొటొచాన్‌కు ఆ రిబ్బన్ వచ్చిన గాథ ఇది. నిజంగా అది చాల అందమైన రిబ్బన్. అది వెడల్పుగా ఉంది. నాణ్యమయిన సిల్కుతో తయారయింది. దానిమీద గులాబులు, మరెన్నో లతలు, అలంకారాలు అల్లి ఉన్నాయి. వెడల్పుగా, గట్టిగా ఉన్న ఆ రిబ్బన్‌ను బిగించి కడితే, టొటొచాన్ తలంత పెద్దముడి తయారయింది. ఆ రిబ్బన్ విదేశాలనుంచి వచ్చిందని అత్త చెప్పింది.

మాట్లాడుతూ మాట్లాడుతూ టొటొచాన్ చాలసార్లు తల ఎగరేసింది. రిబ్బన్ గరగరలాడే చప్పుడు హెడ్‌మాస్టర్ వినాలని చాన్ కోరిక. టొటొచాన్ చెప్పిన కథంతా విన్నాక హెడ్‌మాస్టర్ కొంచెం నిరాశపడ్డట్టు కనిపించాడు.

ఇదన్న మాట సంగతి. నిన్న మియోచాన్ సరిగ్గా నీకున్నలాంటి రిబ్బనే తనకూ కావాలని పేచీ పెట్టింది. నేను జియుగౌకాలో ఉన్న రిబ్బన్ల దుకాణాలన్నిటికీ వెళ్ళాను. ఎక్కడా ఇటువంటి రిబ్బన్ దొరకలేదు. అసలు సంగతి అదీ! ఇది విదేశాల నుంచి వచ్చిందన్నమాట. అట్లాగా?" అన్నాడాయన.

అప్పుడాయన ముఖం హెడ్‌మాస్టర్ ముఖంలా లేదు కూతురి పేచీని ఎదుర్కొంటున్న తండ్రి ముఖంలా ఉంది.

"టొటొచాన్, బడికి నువు ఆ రిబ్బన్ కట్టుకుని రాకపోతే నాకుబాగుంటుంది నీకుతెలుసుగా, దాని గురించి మియోచాన్ నన్ను విసిగిస్తూనే ఉంటుంది. ఆ రిబ్బన్ లేకుండా రావడం నీకేమన్నా ఇబ్బందా?"

టొటొచాన్ చేతులు కట్టుకుని కాసేపు ఆలోచించింది. తర్వాత గబగబా "సరే, సరే ఇంక ఇక్కడికి ఎప్పుడూ కట్టుకురాను" అని జవాబిచ్చింది.

"థాంక్‌యూ" అన్నాడు హెడ్‌మాస్టర్.

టొటొచాన్‌కు విచారంగానే ఉంది. కాని మరి హెడ్‌మాస్టర్ ఇబ్బందిలో ఉన్నాడు గదా. అందుకే ఒప్పేసుకుంది. ఇంకో కారణమేమిటంటే అంత పెద్దమనిషి అందులోనూ తనకుఅతి ప్రియమైన హెడ్‌మాస్టర్ - అన్ని రిబ్బన్ దుకాణాల్లోనూ ఇటువంటి రిబ్బన్ కోసం గాలించాడంటే టొటొచాన్‌కు ఆయన పట్ల జాలి కలిగింది. టోమోలో పద్ధతి ఇది. స్పష్టంగా తెలియకుండానే ప్రతిఒక్కరు ఇతరుల సమస్యల్ని అర్థం చేసుకునేవాళ్లు. సహాయం చేయడానికి ప్రయత్నించే వాళ్ళు. వయసులో తేడాలకు అక్కడ తావు లేదు. అది అక్కడ అందరికీ సహజమైన విషయం అయిపోయింది.

మార్నాటి ఉదయం టొటొచాన్ బడికి వెళ్ళిపోయాక అమ్మ టొటొచాన్ గది శుభ్రం చేయడానికి వచ్చింది. అక్కడ టొటొచాన్‌కు ఇష్టమైన ఎలుగుబంటి బొమ్మ మెడలో ఆ రిబ్బన్ కట్టి ఉంది. టొటొచాన్ అంతగా మురిసిపోయిన రిబ్బన్‌ను అంత తొందరగా ఎందుకు వదిలేసిందో అమ్మకు అర్థం కాలేదు. హఠాత్తుగా అంత బ్రహ్మాండమైన అలంకరణ వచ్చినందుకు ఈ గోధుమ రంగు ఎలుగుబంటి బొమ్మ కూడ సిగ్గుపడుతున్నట్టే కనబడింది.

## గాయపడిన వాళ్ళ పరామర్శ

టొటొచాన్ తన జీవితంలో మొదటిసారిగా ఒక ఆస్పత్రికి వెళ్ళింది. అక్కడ గాయపడిన సైనికులున్నారు. వేరువేరు పాఠశాలలనుంచి వచ్చిన ముప్పై మంది ప్రాథమిక పాఠశాల విద్యార్థులతో కలిసి టొటొచాన్ అక్కడికి వెళ్ళింది . ఆ పిల్లలెవరూ టొటొచాన్‌కు తెలియదు. ఈ

మధ్యనే దేశవ్యాపితంగా మొదలయిన ఒక పథకంలో భాగంగా ఈ పిల్లల్ని ఆస్పత్రికి పంపారు. ప్రతి పాఠశాల నుంచీ సాధారణంగా ఇద్దరు, ముగ్గురు విద్యార్థులు వచ్చారు గాని టోమో లాంటిచిన్న పాఠశాలలు ఒక్కరినే పంపాయి . ఈ పిల్లలందర్నీ ఈ పాఠశాలల్లో ఏదో ఒక దానిలోంచి ఒక టీచర్ పర్యవేక్షిస్తుంటారు. ఇప్పుడు ఈ బృందంలోకి టొటొచాన్ టోమో తరపున వచ్చింది.

ఈ బృందాన్ని పర్యవేక్షిస్తున్న టీచర్ ఒక స్త్రీ. ఆమె బక్కపల్చగా ఉంది. కళ్ళజోడుపెట్టుకుంది. ఆమె పిల్లలను ఒక వార్డులోకి తీసుకు వెళ్ళింది. ఆ వార్డులో పదిహేను మంది సైనికులు కొందరు మంచాల మీద పడుకుని, కొందరు అటూ ఇటూ పచార్లు చేస్తూ ఉన్నారు. అందరూ తెల్ల పైజామాలు వేసుకున్నారు. గాయపడిన సైనికులంటే ఎట్లా ఉంటారోనని టొటొచాన్ కొంచెం ఆందోళన పడింది గాని చూస్తే వాళ్ళందరూ చిర్నవ్వులు నవ్వుతూ చేతులు ఊపారు. ఆనందంగా ఉన్నట్టు కనబడ్డారు. కొందరి తలలకు ఇంకా కట్లు ఉన్నప్పటికీ టొటొచాన్ మనసు కుదుటపడింది.

టీచర్ పిల్లలందరినీ వార్డు మధ్యలోసమావేశ పరిచింది. అప్పుడు సైనికుల వేపు తిరిగి మాట్లాడింది.

"మేం మిమ్మల్ని చూడడానికి వచ్చాం" అని టీచర్ అంది. పిల్లలందరూ ఒంగి అభివాదం చేశారు. "ఇవాళ మే 5వ తేదీ. బాలల దినం కనుక మేం మీ కోసం 'కార్ప్ స్ట్రీమర్స్' పాట పాడి వినిపిస్తాం" అంది.

సంగీత స్వరకర్తలాగ చేతులెత్తి పిల్లలవైపు తిరిగి "సిద్ధంగా ఉన్నారా? మూడు, నాలుగు" అంటూ తాళం వెయ్యడం మొదలు పెట్టింది. ఆ పిల్లలకు ఒకరి కొకరయితే తెలియదుగాని, అందరి కందరూ హృదయపూర్వకంగా, ముక్తకంఠంతో పాడడం మొదలెట్టారు.

"ఇళ్లకప్పుల సంద్రం పైనా
నల్ల మబ్బుల సంద్రం పైనా.......

టొటొచాన్‌కు ఈ పాట తెలియదు. టోమోలో ఇటువంటి పాటలు నేర్పరు. అందుకని టొటొచాన్ ఒక సైనికుని మంచం అంచున కూచుని మిగతా వాళ్ళు పాడేపాట వినడం మొదలెట్టింది. ఆ సైనికుడు చాలా ఆర్ద్రంగా ఉన్నాడు. పక్క మీద కూచుని ఉన్నాడు. అలా పాడకుండా కూచోవాలంటే టొటొచాన్‌కు ఇబ్బందిగా అనిపించింది. ఆ పాట అయిపోగానే టీచర్ మళ్ళీ బిగ్గరగా "ఇప్పుడు 'మెమ్మల పండుగ' పాటపాడుదాం" అని ప్రకటించింది. వాళ్ళందరూ ఆ పాటను చాల మధురంగా పాడారు. అసలు పాడనిది టొటొచాన్ ఒక్కతే.

"రండి రండి దీపాలు వెలిగిద్దాము
ఒకటొకటిగా దీపాలు వెలిగిద్దాము............

మౌనంగా ఉండడం తప్ప టొటొచాన్ చెయ్యగలిగిందేమీ లేకపోయింది.

పిల్లలు పాట పాడడం ముగించగానే సైనికులందరూ చప్పట్లు కొట్టారు. టీచర్ సంతోషంగా చిరునవ్వు నవ్వుతూ "సరే, ఇక 'గుర్రంపిల్ల, వాళ్ళమ్మ" పాడుదామా? అందరూ గొంతు కలపడింది మూడు, నాలుగు..... " అంటూ మళ్ళీ తాళం వెయ్యడం మొదలెట్టింది.

టొటొచాన్‌కు ఈ పాట కూడ తెలియదు. మిగతా పిల్లలు ఆ పాట పాడడం ముగించగానే, టొటొచాన్ కూచున్న మంచం మీది సైనికుడు, టొటొచాన్ తల నిమురుతూ" నువ్వు పాడడం లేదేంటి తల్లీ? అని అడిగాడు.



టొటొచాన్ తప్పు చేసినట్టనిపించింది. తానేమో సైనికులను పరామర్శించడానికి వచ్చింది. కాని వాళ్ల కోసం ఒక్క పాట కూడ పాడలేకపోయింది. ఆ భావంతో లేచి మంచానికి కొంచెం దూరంలో నిలబడి ధైర్యంగా "సరే, ఇప్పుడు నేను నాకిచ్చిన పాట పాడుతాను" అంది.

"ఏ పాట పాడబోతున్నావు?" అని టీచర్ టొటొచాన్‌ను అడిగింది. కాని అప్పటికే టొటొచాన్ గొంతు సవరించుకుని, గట్టిగా గాలి పీల్చి పాట పాడడానికి సిద్ధమైపోతుంది కనుక టీచర్ ఆగి చూద్దామనుకుంది.

తను టోమో బడికి ప్రతినిధిగా వచ్చింది గనుక టోమోలోని ప్రసిద్ధ గీతాన్నే పాడితే బాగుంటుందనుకుంది. టొటొచాన్. గట్టిగా ఊపిరి పీల్చి వదలగానే ప్రారంభించింది.

నములు నములు, బాగా నమిలి తిను
అన్నం నములు, అన్నీ నములు.............

కొందరు పిల్లలు నవ్వేసారు. మరికొందరు పక్కవాళ్లతో "అదేం పాట? అదేం పాట?" అని అడిగారు. టీచర్ మొదలు తాళం వేయడం ప్రారంభించి, మధ్యలో ఏం చేయాలో తెలియక చేతులు గాలిలో వేలాడేసింది. టొటొచాన్‌కు సిగ్గేసింది. కాని ఏమైనా సరే అనుకుని తన కొచ్చిన పాటంతా పాడేసింది.

నములు, నములు బాగా నమిలి తిను
అన్నం నములు చేపలు నములు మాంసం నములు.....

పాటపాడడం అయిపోగానే టొటొచాన్ ఒంగి అభివాదం చేసింది. తల ఎత్తి చూసే సరికి సైనికుని ముఖం మీద కన్నీళ్ళు ధారకట్టి ఉండడం చూసి టొటొచాన్ ఆశ్చర్యపోయింది. తానేదో పెద్ద తప్పుపని చేసినట్టున్నానని టొటొచాన్‌కు అనిపించింది. ఆ సైనికుడు నాన్న కన్న కొంచెం పెద్దాడిలా ఉన్నాడు. ఆయన మళ్ళీ టొటొచాన్ తలమీద నిమిరి "థాంక్‌యూ, చిట్టి తల్లి, థాంక్‌యూ!" అన్నాడు.

ఆయన అలా టొటొచాన్ తల నిమురుతూ ఉండిపోయాడు. అంతసేపు ఆయన దుఃఖం ఆపుకోలేక పోయాడు. అప్పుడిక టీచర్ ఆ సైనికుణ్ణి కుదుటపరచడానికన్నట్టు "ఇక మనం సైనికుల కోసం రాసిన వ్యాసాలు చదవాల్సిన సమయం అయిందనుకుంటాను" అంది.

పిలల్లందరూ వరుసగా బిగ్గరగా వ్యాసాలుచదవడం మొదలుపెట్టారు. టొటొచాన్ ఆ సైనికుడి వైపు చూసింది. ఆయన ముక్కు, కళ్ళు ఎర్రబడిపోయాయి. కాని ఆయన ముఖం మీద మాత్రం చిరునవ్వు వెలుగుతోంది. టొటొచాన్ కూడ చిరునవ్వు నవ్వింది. "అమ్మయ్య ఆ సైనికుడు నవ్వాడంటే ఎంత ఆనందంగా ఉందో!" అని తనలో తనే అనుకుంది.

ఆ సైనికుడికీ ఎందుకంత దుఃఖం వచ్చిందో ఆ సైనికుడికి మాత్రమే తెలుసు. ఆయనకుటొటొచాన్ లాంటి చిన్నారి పాప ఉండవచ్చు. లేదా పాడగలిగినంత బాగా పాడుతూ టొటొచాన్ ఆయన కోసం ఆ తియ్యని పాటపాడినందుకు స్పందన కలిగి ఉండవచ్చు. లేదా యుద్ధరంగం మీది అనుభవం వల్ల ఎట్లా తామందరూ తిండికి కటకటలాడ వలసి వచ్చిందో తెలుసుగనుక, రాబోయే రోజుల్లో నమలడానికి ఏమీ ఉండని గతి దాపురించబోతుండగా ఈ చిన్నరి పాప"నములు, నములు" అని పాడడం ఆయనలో విచారాన్ని నింపి ఉండవచ్చు ఈ చిన్నారి పిల్లలు ఎంతెంత భయంకర ప్రమాదాలలో చిక్కుకోనున్నారో కూడ ఆ సైనికుడు గుర్తించి ఉంటాడు.

తమ వ్యాసాలు చదువుతున్న పిల్లలు అప్పటికింకా గుర్తించి ఉండకపోవచ్చు గాని అప్పటికే పసిఫిక్ యుద్ధం మొదలుకాబోతున్నది.

## ఆరోగ్యపు బెరడు

మెడలో తాడుకు వేలాడేసుకున్న పాసును గేటు దగ్గరి మనిషికి చూపెట్టి టొటొచాన్ జియుగౌకా స్టేషన్‌లోంచి బైటికి నడిచింది. ఆ గేటు దగ్గరి మనిషి ఇప్పుడు టొటొచాన్‌కు బాగా పరిచయం.

బైట చాల ఆసక్తికరమైనదేదో జరుగుతోంది. ఓ యువకుడు అక్కడ చాపమీద బాసిపట్టు వేసుకొని కూర్చున్నాడు. ఆయన ముందర చెట్ల బెరడు ముక్కల్లా కనిపించే పెద్ద పెద్ద కుప్పలున్నాయి. అక్కడ ఐదారుగురు నిలబడి ఆ యువకుని వైపే చూస్తున్నారు. టొటొచాన్ కూడ అదేమిటోచూద్దామనుకుంది. ఎందుకంటే "జాగ్రత్తగా చూడండి బాబులూ, చూస్కోండి బాబులూ" అని ఆ అబ్బాయి అరుస్తున్నాడు. టొటొచాన్ ఆగి తనవైపు చూస్తున్నదని గమనించగానే ఆయన మొదలెట్టాడు. "మీకు చాల ముఖ్యమైన విషయం ఆరోగ్యం. ఆరోగ్యమే మహాభాగ్యం". ఏ రోజయినా మీరు ఉదయాన్నే లేచి ఆరోగ్యంగా ఉన్నారా లేదా తెలుసుకోదలచుకుంటే ఈ బెరడు ముక్క మీకు తెలుపుతుంది. మీరు చేయవలసిందల్లా ప్రతి రోజూ పొద్దున్నే ఈ ముక్కను ఓ పిసరు నమలడం. అదే గనుక చేదుగా ఉంటే మీ ఆరోగ్యం సరిగా లేదన్నమాట. అది చేదుగా లేకపోతే మీరు పూర్తిగా ఆరోగ్యంగా ఉన్నారన్నమాట. మీకేమి జ్వరం లేదన్నమాట. మీరు ఆరోగ్యంగా ఉన్నారో లేరో రోజూ రోజూ మీకు తెలియజేసే ఈ బెరడు భలే చౌక! ఇరవై సెన్‌లు మాత్రమే. అక్కడ నిలబడి ఉన్న ఆ పెద్దబాబు ఒకటికొని పరీక్షిస్తారా?" అంటూ గణగణ మాట్లాడుతూ పోయాడు.

ఆయన ఆ బెరడు తీసుకెళ్ళి ఒక బక్క పలుచని మనిషి చేతికి ఇచ్చాడు. ఆ బక్క పలుచని మనిషి భయం భయంగా బెరడును ముని పళ్ళతో కొరికాడు. కొరికిన వెంటనే తల ఒంచి దాన్ని పరీక్షగా చూశాడు.

"ఇది ........ఇది...... కొంచెం........ చేదుగానే ఉందే!" అన్నాడు.

మందుల మనిషి ఒక్క ఉదుటున లేచి గట్టిగా "చెప్పానా లేదా? బాబూ! మీరేదో వ్యాధితో బాధపడుతున్నట్టున్నారు, మీరు జాగ్రత్తగా ఉండాలి. అయితే మీరేమి కంగారు పడనక్కరలేదు. మీ జబ్బు ఇంకా ముదిరినట్టులేదు. కొంచెం చేదుగానే ఉందనిపించిందన్నారు గదా, సరే, ఇప్పుడిక అక్కడ నిలబడ్డ ఆ అక్కయ్యగారు బెరడును పరీక్షిస్తారా? ఏ మమ్మా, కాస్త ఈ బెరడు రుచి చూస్తావా?" అంటూ అక్కడ ఒక స్త్రీకి బెరడు ఇచ్చాడు, చేతిలో సరుకుల బుట్ట పట్టుకున్న ఆ స్త్రీ పెద్ద బెరడు ముక్కనే తీసుకుని కసాపిసా నమిలేసింది. "అరె, ఇది ఏమాత్రం చేదుగా లేదే" అని సంతోషంగా ప్రకటించింది.

"మంచిదమ్మా - నిజంగా మీరు చాల ఆరోగ్యంగా ఉన్నారన్నమాట" అంటూ "ఇరవై సెన్‌లే! ఇరవై సెన్‌లు మాత్రమే! ప్రతిరోజూ పొద్దున్నే మీరు ఆరోగ్యంగా ఉన్నారో లేదో పరీక్షించుకోవడానికి ఇరవై సెన్‌లే ఖరీదు! భలే చౌక బేరం!" అని కేకలు వేశాడు.

ఆ గోధుమ రంగు బెరడును ఒక్కసారి కొరికి చూద్దామని టొటొచాన్‌కు అనిపించింది.



కాని అడగాలంటే సిగ్గేసింది. అందుకే, " మా బడి అయిపోయేటప్పటికి కూడ మీరు ఇక్కడ ఉంటారండీ? " అని అడిగింది.

ఈ చిన్నారి పాపవేపు పరీక్షగా చూస్తూ" తప్పకుండా ఉంటాను పాప?"అన్నాడు

టొటొచాన్ బడివేపు ఒక్క పరుగుతీసింది. అలా పరుగెత్తుతుంటే పుస్తకాల సంచీ వీపుమీద ఎగిరెగిరి పడింది. టొటొచాన్ ఇవాళ బడికి ఆలస్యంగా వెళ్ళదలచుకోలేదు. ఎందుకంటే ఇవాళ బడి మొదలు కాకముందే చెయ్యాల్సిన పని ఒకటి ఉంది. తరగతి గదిలోకి చేరిన మరుక్షణమే తోటి పిల్లల్ని టొటొచాన్ అడగడం మొదలు పెట్టింది.

"ఎవరి దగ్గరన్నా ఇరవై సెన్‌లు ఉన్నాయా! నాకిస్తారా?"

కాని ఎవరి దగ్గరా ఇరవై సెన్‌లు లేవు. ఆ పొడవాటి చాక్లెట్ల పాకెట్లు పది సెన్‌లకు దొరికేవి. కనుక ఇరవై సెన్‌లంటే ఎక్కువ డబ్బులేమీకాదు. కాని అవి కూడ ఎవరి దగ్గరా లేవు.

"మా అమ్మా వాళ్ళనడగనా?" అంది మియోచాన్.

మియోచాన్ హెడ్‌మాస్టర్ కూతురు కావడం ఇటువంటి కష్టకాలాల్లో చాల మేలుగా ఉండేది. మియోచాన్ వాళ్ళ ఇల్లు అసెంబ్లీ హాలుకు అనుకునే ఉండేది గనుక వాళ్ళమ్మ కూడ బడిలోనే ఉన్నట్టుండేది.

"మా నాన్న నీకు ఇరవై సెన్‌లు ఇస్తానన్నారు. కాని ఎందుకు కావాలట అని అడిగారు" అంది మియోచాన్ మధ్యాహ్న భోజనాల సమయంలో.

టొటొచాన్ హెడ్‌మాస్టర్‌ను కలవడానికి ఆయన గదిలోకి వెళ్ళింది.

ఆయన టొటొచాన్‌ను చూడగానే "ఊహుఁ అయితే నీకు ఇరవై సెన్‌లు కావాలన్నమాట, ఎందుకు?" అని కళ్ళజోడు తీస్తూ అడిగాడు.

"నేనే ఒక చెట్టు బెరడు ముక్క కొనుక్కోవాలి. అది ప్రతిరోజూ మనం ఆరోగ్యంగా ఉన్నామో లేమో చెపుతుంది" అని టొటొచాన్ వెంటనే జవాబిచ్చింది. హెడ్‌మాస్టర్ కుతూహలం పెరిగిపోయింది.

"ఎక్కడ అమ్ముతున్నారని?" అని ఆయన అడిగాడు.

"స్టేషన్ దగ్గర" అని ఇంకా తొందరగా జవాబిచ్చింది టొటొచాన్.

"సరే, నీకు కావలిస్తే ఒకటి కొనుక్కో, కాని నన్ను కూడ ఒక్కసారి కొరిక నిస్తావా? కొరకనిస్తావు గదూ!" అన్నాడాయన.

ఆయన తన చొక్కాజేబులోంచి ఒకపర్సు బైటికి తీసి టొటొచాన్ అరచేతిలో ఇరవై సెన్‌లు పెట్టాడు.

"అబ్బ - భలే, భలే మీరెంత మంచి వారండీ! నేనే అమ్మను అడిగి మీ డబ్బు మీకు ఇచ్చేస్తాను. అమ్మ నేను ఎప్పుడడిగినా పుస్తకాలకు డబ్బులిస్తుంది. ఇంకేమన్నా కొనుక్కోవాలంటే మాత్రం నేను ముందే చెపాల్సి ఉంటుంది. మరి ఈ ఆరోగ్యపు బెరడు అందరికీ కావలసిందే గద. కొనేసినా అమ్మ ఏమీ అనదు. నాకు తెలుసు" అంది టొటొచాన్.

బడి అయిపోగానే టొటొచాన్ ఇరవై సెన్‌లు గుప్పిట్లో గట్టిగా పట్టుకుని స్టేషన్ వైపు పరుగు తీసింది. ఆ మందుల మనిషి ఇంకా అక్కడే ఉన్నాడు. తన మందుల ఘనత గురించి గొంతెత్తి చెపుతున్నాడు. టొటొచాన్ చేతిలో ఇరవై సెన్‌లు చూడగానే ఆయన ముఖం వెలిగిపోయింది.

"బంగారు తల్లీ! మీ అమ్మా నాన్నా చాల సంతోషిస్తారు" అన్నాడు.



"రాకీ కూడా" అంది టొటొచాన్.

టొటొచాన్ కోసం ఓ బెరడు ముక్క తీస్తూ "రాకీ ఎవరు? అని అడిగాడాయన.

"రాకీ అంటే మా కుక్కపిల్ల. జర్మన్ షెఫర్డ్ జాతిదట తెలుసా?"

ఆయన ఒక్క క్షణం ఆగాడు. ఆలోచించి "కుక్క పిల్లా....... సరే, నా బెరడు కుక్కపిల్లకు కూడా వనిచేస్తుందనుకుంటాను. చేదుగా ఉన్నట్టనిపిస్తే అది తినదుగదా. తినలేదంటే అనారోగ్యంగా ఉందన్నమాట"

ఒక అంగుళం వెడల్పు , అరంగుళాల పొడవు ఉన్న బెరడుముక్కను బైటికి తీశాడు.

"ఇదిగో రోజూ పొద్దున్నే ఇది కొరికి చూడు. చేదుగా ఉంటే నీకు జ్వరం ఉందన్నమాట. చేదుగా లేకపోతే నువు బ్రహ్మాండంగా ఉన్నావన్నమాట.

ఆ విలువైన బెరడును పత్రికలో చుట్ట బెట్టుకుని జాగ్రత్తగా ఇంటికి తీసికెళ్ళింది. టొటొచాన్. ఇంటికి చేరగానే టొటొచాన్ చేసిన మొట్టమొదటి పని ఆ బెరడును కొరికి చూడడం. అది ఎండిపోయినట్టుగా ఉంది. గరుకుగా ఉంది. అంతేగాని చేదుగా మాత్రం లేదు. నిజానికి ఆ బెరడు రుచీ పచీ లేదు.

"వారెవ్వా! నా ఆరోగ్యం బ్రహ్మాండంగా ఉంది!

"ఔను తల్లీ- నీది మంచి ఆరోగ్యమే. కాని ఇప్పుడేమొచ్చింది?" అని అడిగింది అమ్మ చిరునవ్వుతో టొటొచాన్ కథంతా చెప్పింది. అమ్మకూడ ఆ బెరడు ముక్కను కొరికి చూసింది.

"ఇదేమీ చేదుగా లేదే"

"అయితే, మరి నువు కూడా ఆరోగ్యంగానే ఉన్నావమ్మా"

ఆ తర్వాత టొటొచాన్ రాకీ దగ్గరికి వెళ్ళి దాని మూతి ముందర బెరడు పట్టుకుంది. రాకీ మొదలు దాన్ని వాసన చూసింది. తర్వాత నాకింది.

"నువ్వు దాన్ని కొరకాలి. కొరికితే నువు ఆరోగ్యంగా ఉన్నావో లేదో తెలిసి పోతుంది" అంది టొటొచాన్.

కాని రాకీ మాత్రం దాన్ని కొరకడానికి ఏ ప్రయత్నమూ చెయ్యలేదు. ఓ కాలు లేపి వెనుక దీక్షగా గోక్కుంది. టొటొచాన్ బెరడు ముక్కను రాకీ మూతిలో కుక్కింది.

"ఊఁ కానీరా, కొరకు. నీకు ఒంట్లో బాగోకపోతే తెలిసిపోతుందిరా" అని బతిమిలాడింది.

రాకీ అయిష్టంగానే అంచు నుంచి ఒక చిన్న పిసరు కొరికింది. దాన్ని మళ్ళీ వాసన చూసింది. అయితే నచ్చనట్టు మాత్రం ముఖం పెట్టలేదు. పెద్దగా ఆవులించింది. అంతే.

"వారెవ్వా- రాకీకి కూడా ఒంట్లో బావుందోచ్"!.

మర్నాడు ఉదయం అమ్మ టొటొచాన్‌కు ఇరవై సెన్‌లు ఇచ్చింది. టొటొచాన్ నేరుగా హెడ్‌మాస్టర్ గదిలోకి వెళ్ళి చెట్టు బెరడు ముక్కను బైటికి తీసి చూపెట్టింది.

హెడ్‌మాస్టర్ ఆ కట్టెపేడు వైపు ఒక్క క్షణం చూశాడు. "ఏమిటిది?" అని అడుగుదామనుకున్నట్టున్నాడు. అప్పుడే టొటొచాన్ పిడికిట్లో జాగ్రత్తగా పట్టుకున్న ఇరవై సెన్‌లు



చూసే సరికి ఆయనకు అంతా గుర్తుకొచ్చింది.

"కొరికి చూడండి, చేదుగా ఉంటే మీ ఒంట్లో బాలేదన్నమాట" అంది టొటొచాన్.

హెడ్‌మాస్టర్ చిన్న ముక్క కొరికాడు. అప్పుడు ఆ బెరడును అటూ ఇటూ తిప్పి జాగ్రత్తగా పరిశీలించాడు.

"చేదుగా ఉందా ఏం?" అని అందోళనగా అడిగింది. టొటొచాన్ హెడ్‌మాస్టర్ ముఖంలోకి చూస్తూ.

"అది ఏరుచీ లేదు"

టొటొచాన్‌కు ఆ బెరడు తిరిగి ఇచ్చేస్తూ " నాఒంట్లో బాగానే ఉంది. థాంక్ యూ" అన్నాడు హెడ్‌మాస్టర్.

"ఓహోయ్!హెడ్‌మాస్టర్ ఆరోగ్యంగా ఉన్నారు! భలేభలే"

ఆ రోజు  టొటొచాన్ బడిలో ప్రతి ఒక్కరితోటి ఆ బెరడును కొరికించింది. ఒక్కరికి కూడా అది చేదనిపించలేదు. అంటే బడిలో పిల్లలందరూ ఆరోగ్యంగా ఉన్నారన్నమాట. టొటొచాన్‌కు చెప్పరానంత ఆనందం కలిగింది.

పిల్లలందరూ కట్టగట్టుకుని వెళ్ళి తామందరమూ ఆరోగ్యంగా ఉన్నామని హెడ్ మాస్టర్‌తో చెప్పారు. హెడ్‌మాస్టర్ ఒక్కొక్క శిశువుతోను "సంతోషం" అని ప్రత్యేకంగా చెప్పాడు.

హెడ్‌మాస్టర్‌కు మొదటినుండే తెలిసి ఉంటుంది. ఆయన పుట్టిందీ, పెరిగిందీ గుమ్మా ప్రాంతంలోని పల్లెసీమల నడిబొడ్డున. వాళ్ళ ఊరు ఒకనది పక్కన ఉండేది. అక్కడి నుంచి హరునా పర్వతం కనబడుతుండేది. ఆ బెరడు ఎంత మాత్రమూ చేదుగా ఉండదని ఆయనకు ముందే తెలిసి ఉంటుంది. ఎవరు కొరికి చూసిన అంతేగదా.

కాని ప్రతి ఒక్కరూ ఆరోగ్యంగా ఉన్నారని చూసి టొటొచాన్ పొందిన ఆనందాన్ని గమనిస్తే ఆయనకు ముచ్చటేసింది. ఎవరయినా బెరడు చేదుగా ఉందంటారేమోనని ఇతరులకోసం అందోళన పడే స్వభావాన్ని టొటొచాన్ సంతరించుకున్నందుకు ఆయనకు సంతోషం కలిగింది.

చివరకు టొటొచాన్ బడిదగ్గర వీధిలో పోతున్న ఓ ఊరకుక్కనుపట్టుకుని దాని నోట్లో కూడా ఆ బెరడు పెట్టడానికి ప్రయత్నించింది. ఆ కుక్క టొటొచాన్‌ను దాదాపు కరవబోయింది. ఐనా టొటొచాన్ తనపట్టు వదలలేదు.

"నీ ఓంట్లో బావుందో లేదో తెలిసిపోతుంది. రా ! ఇది కొరకు. నీ ఆరోగ్యం సరిగ్గానే ఉంటే బావుంటుంది గద" అని టొటొచాన్  ఆ కుక్కకు కేకేసి చెప్పింది.

తనకు తెలియని ఆ కుక్కతో కూడ బెరడు తినిపించడంలో టొటొచాన్ విజయం సాధించింది. ఆ కుక్కచుట్టూ గంతులువేస్తూ "వారెవ్వా- నీ ఆరోగ్యం కూడ బానేఉంది" అని అరిచింది.

ఆకుక్క కృతజ్ఞతలు చెపుతున్నట్టుగా తలవంచి, పరుగుతీసింది.

హెడ్‌మాస్టర్ ఊహించినట్టుగానే ఆ మందులమ్మే మనిషి మళ్ళీ జియుగొకా ప్రాంతాల్లో కనబడలేదు.

ప్రతిరోజూ ఉదయం బడికి బయల్దేరే ముందు టొటొచాన్ తన సొరుగులోంచి ఆ బెరడు ముక్క బైటికి తీసేది. అది ఇప్పుడు ఎవరో చురుకైన వాళ్ళుదానిమీదనే పని చేస్తున్నట్టుగా తయారయింది. దాన్ని తీసి, కొంచెం నమిలి. "నేను బావున్నానోచ్"! అంటూ బైటికి నడిచేది.

అదృష్టవశాత్తూ, టొటొచాన్ నిజంగానే ఆరోగ్యంగా ఉంది.

## ఇంగ్లీషు మాట్లాడే అబ్బాయి

టోమోలోకి ఒక కొత్త విద్యార్థి వచ్చాడు. ఆ అబ్బాయి మామూలు ప్రాథమిక పాఠశాల విద్యార్థులకన్న ఎత్తుగా, లావుగా ఉన్నాడు. ఆ అబ్బాయి ఏడో తరగతి అబ్బాయిలా ఉన్నాడనుకుంది. టొటొచాన్. అ అబ్బాయి తొడుక్కున్న బట్టలుకూడా పెద్దాళ్ళ బట్టల్లా వేరేగా ఉన్నాయి.

ఆ రోజు ఉదయం బడి ఆవరణలో హెడ్‌మాస్టర్ ఆ అబ్బాయిని అందరికీ పరిచయం చేశాడు.

" ఈ అబ్బాయి పేరు మియాజాకి. తను అమెరికాలో పుట్టి పెరిగాడు. అందుకే జపనీస్ భాష సరిగ్గా మాట్లాడలేడు. మనబడిలోనైతే సులభంగా ఎవరితోనైనా స్నేహం చేయుచ్చునని, చదువుకుందుకు కూడా కావలసినంత వ్యవధి దొరుకుతుందని ఇక్కడికొచ్చాడు. ఇక నుంచి మియాజాకి మీలో ఒకడు. తనను ఏ తరగతిలో చేర్చుకుందాం? టా-చాన్ వాళ్ళతోపాటు ఐదో తరగతిలో చేర్చుకుంటే ఎలా ఉంటుంది?"

"చాలాబాగుంటుంది" అన్నాడు టాచాన్ పెద్దమనిషిలాగ. టా-చాన్ బొమ్మలు వేయడంలో దిట్ట.

హెడ్‌మాస్టర్ చిరునవ్వు నవ్వి మళ్ళీ తను చెప్పేది కొనసాగించాడు. "మియాజాకికి జపపనీస్ భాష సరిగ్గారాదని చెప్పానే. కాని తనకు ఇంగ్లీషు చాలా బాగ వచ్చు. తన దగ్గరకు మీరు ఇంగ్లీషు నేర్చుకోవచ్చు. తనకుజపాన్ జీవితం పరిచయం లేదంతే. కనుక మీరు తనకు సాయపడొచ్చు. సాయపడతారుగదూ? అమెరికాలో జీవితం ఎలా ఉంటుందో మీరు తనను అడిగి తెలసుకోండి. తను మీకు చాలా ఆసక్తికరమైన విషయాలు చెపుతాడు. సరే, ఇక మియా జాకిని మీతో జట్టు కలిపి పోతున్నాను"

మియాజాకి తన తరగతి పిల్లలకు ఒంగి అభివాదం చేశాడు. వాళ్ళందరూ మియాజాకి కన్న చిన్నవాళ్ళే. టాచాన్ వాళ్ళ తరగతి పిల్లలేగాక మొత్తం ఉన్న పిల్లలందరూ ఒంగి మియాజాకికి ప్రత్యభివాదం చేశారు.

మధ్యాహ్న భోజనాల సమయంలో మియాజాకి హెడ్‌మాస్టర్ ఇంటికి వెళ్ళాడు. మిగిలిన పిల్లలందరూ తనను అనుసరించారు. మియాజాకి హెడ్‌మాస్టర్ ఇంట్లోకి కాలి జోళ్ళు విడిచెయ్యి" అని కేకలు వేశారు.

మియాజాకి ఉలిక్కిపడ్డాడు.జోళ్ళువిడుస్తూ "మరిచి పోయాను. తప్పయి పోయింది." అన్నాడు.

పిల్లలందరూ ఒక్కసారే మాట్లాడుతూ ఏం చేయాలో, ఏం చేయగూడదో మియాజాకికీ సలహాలివ్వడం మొదలుపెట్టారు.

"తివాచీ ఉన్న గదుల్లోనూ, అసెంబ్లీహాల్లోనూ జోళ్ళతో నడవగూడదు. తరగతి గదుల్లోనూ, లైబ్రరీలోనూ జోళ్ళు ఉంచుకోవచ్చు.

"కుహోంబుట్సు ఆలయానికి వెళ్ళినప్పుడు ఆవరణలో జోళ్ళు ఉంచుకోవచ్చు గాని గుడిలోకి వెళ్ళేటప్పుడు మాత్రం జోళ్ళు వదిలెయ్యాలి"

జపాన్‌లోని జీవితానికి, విదేశాలలో జీవితానికి మధ్యన తేడాలు గుర్తిస్తూ ఉంటే సరదాగా ఉండింది.

మర్నాడు మియాజాకి బడికి ఒక పెద్ద ఇంగ్లీషు బొమ్మల పుస్తకం పట్టుకొచ్చాడు. మధ్యాహ్న భోజనాల సమయంలో ఆ పుస్తకం చూడడానికి పిల్లలందరూ మియాజాకి చుట్టూ



గుమిగూడారు. ఆ బొమ్మలు చూసి పిల్లలందరూ ఆశ్చర్యపోయారు. అంత అందమైన బొమ్మల పుస్తకాన్ని వాళ్ళు అంతవరకు చూడలేదు. వాళ్ళకు అంత వరకూ తెలిసిన బొమ్మల పుస్తకాలు మెరిసే ఎరుపు, ఆకుపచ్చ పసుపు పచ్చ రంగుల్లో అచ్చయి ఉండేవి. కాని ఈ పుస్తకంలో లేతరంగుల్లో, చర్మపు రంగుల్లో, నీరుకావి రంగుల్లో అచ్చయిన బొమ్మలున్నాయి. ఒక నీలం రంగు బొమ్మల విషయానికొస్తే ఎంతెంత అందమైన సన్న సన్నని ఛాయలున్నాయో! నీలం రంగులో తెలుపు కలిసి ఉంది . గోధుమ రంగు కలిసి ఉంది. కొంటే దొరికే రంగు పెన్సిళ్ళలో, సుద్దముక్కల్లో ఈ రంగులు దొరికేవే కావు. మియాజాకి దగ్గర రంగుపెన్సిళ్ళ డబ్బాల్లో మామూలుగా రంగు డబ్బాల్లో ఉండే ఇరవై నాలుగు రంగులతో మరెన్నో ఉన్నాయి. టాచాన్ దగ్గర నలభై ఎనిమిది రంగుల ప్రత్యేకమైన డబ్బా ఉంది గాని దాంట్లో కూడా లేనివి మియాజాకి దగ్గర ఉన్నాయి. ఆ రంగులు అందరికీ విపరీతంగా నచ్చాయి. ఇక బొమ్మలు ఇంకెంత బావున్నాయో. మొట్టమొదటి బొమ్మలో ఒక కుక్క పొత్తిళ్ళలో పసిపాపను లాగుతోంది. ఆ బొమ్మలో పసిపాప రంగులతో వేసిన బొమ్మలాగ అనిపించడంలేదు. ఆ లేత గులాబిరంగు చర్మం చూస్తుంటేనిజంగా పసిపాపే అక్కడున్నట్టు అనిపిస్తోంది. పసిపాప అలా కనిపించడం వాళ్లందరికీ ఎంతగానో నచ్చింది. వాళ్ళు అంత వరకూ అంత పెద్ద బొమ్మల పుస్తకాన్ని కూడ చూడలేదు. అంత అందమైన మందపాటి, మెరిసే కాగితం మీద అచ్చయిన పుస్తకాన్ని కూడ చూడలేదు. టొటొచాన్ తన మామూలు చొరవతోనే మియాజాకికీ, బొమ్మల పుస్తకానికి దగ్గరయింది.

మియాజాకి అక్కడ ఇంగ్లీషు బాషలో రాసి ఉన్నదాన్ని వాళ్ళకు చదివి వినిపించాడు. ఆ ఇంగ్లీషు బాష ఎంత మృదువుగా వినిపించిందంటే వాళ్ళందరూ దానిలో మునిగిపోయారు. ఆ తర్వాత మియాజాకి జపనీస్ నేర్చుకోవడం మొదలుపెట్టాడు.

మియాజాకి ఆ బడిలోకి కచ్చితంగా ఏదో వినూత్నమైన దాన్ని, విభిన్నమైనదాన్ని ప్రవేశపెట్టాడు.

"ఆకచాన్ అంటే పాప" అంటూ మియాజాకి మొదలెట్టాడు.

పిల్లలందరూ కూడ "అకచాన్ అంటే పాప" అని మళ్ళీ అన్నారు.

"ఉట్సుకుషి అంటే అందమైనది" అన్నాడు మియాజాకి కు ను వత్తిపలుకుతూ, షి అనవలసిన దగ్గర ష్ అంటూ.

"ఉట్సుకుషీ అంటే అందమైనది" అని షిని ఒత్తి పలికారు. మిగతావాళ్ళు.

తాను పలికిన జపనీస్ ఉచ్చారణ తప్పని మియాజాకి గుర్తించాడు. ఉట్సుకుషీ అనాలిగదూ? అంతేనా" అని అడిగాడు.

మియాజాకికి త్వరలోనే మిగతా పిల్లలందరితో మంచి స్నేహం కలిసింది. ప్రతిరోజూ మియాజాకి టోమెకు వేరువేరు పుస్తకాలు పట్టుకొచ్చేవాడు. మధ్యాహ్న భోజనాల సమయంలో అవి అందరికీ చదివి వినిస్తుండేవాడు.

అదంతా చూస్తే మియాజాకి వాళ్ళందరికీ ఇంగ్లీషు ఉపాధ్యాయుడా అన్నట్టుండేది. అదే సమయంలో మియాజాకీ చాలా త్వరలోనే జపనీస్ బాగా నేర్చుకున్నాడు. పటాలు వేలాడేసేందుకు, ఆభరణాలు దాచేందుకు ఉపమోగించే పిఠం మీద కూచోవడం వంటి ఘోరమైన తప్పిదాలను మియాజాకి ఆ తర్వాత చెయ్యలేదు.

టొటొచాన్, తన స్నేహితులు అమెరికా గురించి బోలెడన్ని సంగతులు తెలుసుకున్నారు. టోమోలో జపాన్, అమెరికాలు దోస్తీ కట్టడం మొదలెట్టాయి. కాని టోమోలో కాక వేరే పాఠశాలల్లో

పాఠ్యాంశాల నుంచి ఇంగ్లీషును తొలగించారు. అమెరికా జపాన్‌కు శత్రువై పోయింది. ఇంగ్లీషు శత్రువులభాష అయిపోయింది.

"అమెరికన్లు దయ్యాలు" అని ప్రభుత్వం ప్రకటించింది. కాని టోమోలో మాత్రం పిల్లలందరూ కలసినట్టుగా "ఉట్సుకుషీ అంటే అందమైనది" అని జపనీస్‌ను, ఇంగ్లీషును కలిపి పాడుతూనే ఉన్నారు. టోమోపైన వీస్తున్న గాలి తెమ్మెరలు అప్పటి కింకా మృదువుగా, వెచ్చగానే ఉన్నాయి. అక్కడి చిన్నారి శిశువులు అందంగా ఉన్నారు.

## ఔత్సాహిక నాటకం

"మనం నాటకం వెయ్యబోతున్నాం".

టోమో చరిత్రలో అది మొట్టమొదటి నాటకం. మధ్యాహ్న భోజనాల సమయంలో ఎవరో ఒకరు మాట్లాడే అలవాటు ఇంకా కొనసాగుతోంది. కాని అక్కడి చిన్న రంగస్థలం మీద నాటకం వెయ్యడం అంటే ఎలా ఉంటుందో ఊహించండి. యురిథమిక్స్ పాఠాలు చెప్పేటప్పుడు హెడ్‌మాస్టర్ వాయిస్తూ ఉండే పెద్దపియానోనే నాటకానికి ఉపయోగిస్తారట. నాటకం కూడ చూడలేదు. చివరికి టొటొచాన్ కూడ.హంసల సరస్సు రూపకానికి మినహాయిస్తే, టొటొచాన్ రంగస్థలానికి ఎప్పుడూ వెళ్ళలేదు. ఐనప్పటికీ సంవత్సరం చివర్లో ఉత్సవానికి ఏ కార్యక్రమం ప్రదర్శించాలా అని వాళ్ళు చర్చించుకున్నారు.

టొటొచాన్ వాళ్ళ తరగతి పిల్లలు కన్‌జిన్‌చో (విరాళాలు వసూలు శాసనం) నాటకం వెయ్యదలచుకున్నారు. అది సుప్రసిద్ధమైన పాత కబుకి నాటకం. అటువంటి నాటకాన్ని టోమోలో చూడడం విచిత్రంగానే ఉంటుంది. కాని వాళ్ళ పుస్తకాల్లో ఒకదాంట్లో అది ఉంది. పైగా మారుయామా ఆ నాటకాన్ని నేర్పుతారు కూడ. ఆ నాటకంలో యోధుడు బెన్‌కీ పాత్రకు ఐకోసైషో సరిగ్గా సరిపోతుందనుకున్నారు. ఎందుకంటే ఐకోసైషో ఎత్తుగా లావుగా ఉండేది. గంభీరమైన చూపులూ, పెద్దగొంతూ ఉండే అమడెరాతో సైన్యాధిపతి టొగాషి పాత్ర వేయించాలనుకున్నారు. వివరంగా చర్చించాక టొటొచాన్ యొషిట్సునె పాత్ర వేయాలనే నిర్ణయానికి వచ్చారు. నాటకంలో యొషిట్సునె ఉత్తముడు. కాని మాటలు మోసే మనిషిలా మారు వేషంలో ఉంటాడు. మిగిలిన పిల్లలందరూ దేశ సంచారులైన సన్యాసులుగా వేయాలనుకున్నారు.

రిహార్సల్ వేయడానికి ముందు పిల్లలందరూ వాళ్ళవాళ్ళ సంభాషణల్ని అప్పజెప్పవలసి ఉండేది టొటొచాన్‌కు, సన్యాసులకు నాటకంలో మాటలే లేవు గనుక వాళ్ళకు ఈ ఇబ్బంది తప్పిపోయింది. మొత్తం నాటకమంతా సన్యాసులు చేయవలసిన పని మౌనంగా నిలబడి ఉండడమే. ఇకయొషిట్సునెగా వేసే టొటొచాన్ మోకాళ్ళ మీద ఒంగి, పెద్ద గడ్డి టోపీతో ముఖాన్ని దాచుకోవాలి. బెన్‌కీ నిజానికి యొషిట్సునెకు సేవకుడు. కాన్ని వాళ్ళ బృందాన్ని అటాకా చెక్‌పాయింట్‌ను దాటించేందుకు ఒక ఎత్తు గడవేస్తాడు. ఆ ఎత్తుగడ ప్రకారం యొషిట్సునెను కొడతాడు, తిడతాడు. ఒక ఆలయాన్ని పునరుద్ధరించేందుకు విరాళాలు వసూలుచేస్తున్న సన్యాసుల బృందంగా వాళ్ళు నటిస్తారు. బెన్‌కీ పాత్ర వేస్తున్న ఐకోసైషో నటించవలసింది చాల ఉంటుంది. చెక్‌పాయింట్ దగ్గర సైనికాధికారి టొగాషితో సంభాషణ, చర్చ అంతా బెన్‌కీ వంతే. అంతకన్న మజా అయినది సైనికాధికారి అడిగినప్పుడు బెన్‌కీ విరాళాల సేకరణ శాసనం చదివినట్టు నటించే ఘట్టం. నిజానికి బెన్‌కీ చదివినట్టు నటించే పత్రం తెల్లకాగితమే. కాని అక్కడికక్కడే బ్రహ్మాండమైన దేవభాషలో విరాళాల సేకరణకు విజ్ఞప్తులు చదివేస్తాడు. "మొట్టమొదట, టోడాజి ఆలయంగా పేరొందిన ప్రముఖ ఆలయ పునరుద్ధరణ నిమిత్తమై......"



ఐకో సైషో ఈ "మొట్టమొదట" ఉపన్యాసాన్ని ప్రతిరోజూ సాధన చేసేది.

టొగాషి పాత్రకుకూడా చాలా మాటలే ఉండేవి. బెన్‌కీ వాదనల్ని తిప్పికొట్టడానికి టొగాషి ప్రయత్నించేవాడు. వాటినన్నిటినీ జ్ఞాపకం పెట్టుకోవడానికి అమడెరా కిందా మీదా పడేవాడు.

చిట్టచివరికి రిహార్సల్ వేసే సమయం వచ్చింది. టొగాషి బెన్‌కీ ఎదురెదురుగా నిలబడ్డారు. బెన్‌కీ వెనుక సన్యాసులందరూ నిలబడ్డారు. యొషిట్సునె పాత్ర వేస్తున్న టొటొచాన్ మోకాళ్ళమీద ఒంగి అందరికంటె ముందు ముడుచుకు కూచుంది. కాని టొటొచాన్‌కు ఇదంతా ఏమిటో ఏమీ అర్థంకాలేదు. కనుక బెన్‌కీ తన కర్రతో యొషిట్సునెను తోసేసి కొట్టబోయినప్పుడు టొటొచాన్ తిరగబడింది. ఐకోసైషోను కాళ్ళతో తన్నింది. రక్కింది. ఐకో ఏడుస్తుండగా మిగతా సన్యాసులందరూ ముసిముసి నవ్వులు నవ్వారు.

బెన్‌కీ ఎంతగా కొట్టినా, తన్నినా యొషిట్సునె నిశ్చలంగా ఉండాల్సి ఉంటుందసలు. లొంగిపోయినట్టుగా కనబడాలి. దాని ఉద్దేశ్యమేమంటే టొగాషి దీనిలోని వాస్తవాన్ని అనుమానించినా, బెన్‌కీ పొందే బాధను దృష్టిలో ఉంచుకుని వాళ్ళను చెక్‌పాయింటు దాటి వెళ్ళిపోవడానికి అనుమతిస్తాడు.

యొషిట్సునె దెబ్బలు తినకుండా అడ్డుకుంటే మొత్తం కథ చెడిపోతుంది. టొటొచాన్ కు ఈ సంగంతి అర్థం చేయించడానికి మారుయామా చాల ప్రయత్నించాడు. కాని టొటొచాన్ తన పట్టువదలలేదు. ఐకోసైషో తనను కొడితే తను తిరిగి కొడుతుంది. అంతే. ఎంతకూ ఒకరిమాట ఒకరి వినలేదు.

ఎన్నిసార్లు ఆ సన్నివేశం వేయడానికి ప్రయత్నించినా టొటొచాన్ ఎప్పుడూ తిరుగబడుతూనే వచ్చింది.

చిట్టచివరికి టొటొచాన్‌తో మరుయామా "నువు ఈ పాత్ర వెయ్యడం కష్టం. నాకందుకు విచారంగానే ఉందిగాని తప్పదు. యొషిట్సునె పాత్రను టాయిచాన్‌తో వేయిస్తే బావుంటుందనుకుంటాను" అన్నాడు.

టొటొచాన్‌కు బరువు దిగిపోయినట్టయింది. అంత నాటకంలో తానొక్కతే దెబ్బలు తినాలంటే టొటొచాన్ కు ఎంతమాత్రం నచ్చలేదు.

"టొటొచాన్. పోనీ నువు సన్యాసి వేషం వేస్తావా?" అని అడిగాడు మరుయామా. ఇక టొటొచాన్ మిగిలిన సన్యాసులతోపాటు అందరికంటె వెనుక నిలబడింది.

తర్వాత అంతా సవ్యంగా జరిగిపోతుందని మరుయామా, పిల్లలందరూ అనుకున్నారు. కాని పాపం వాళ్ళ ఆశలు అడియాసలయ్యాయి. సన్యాసుల దగ్గర ఉండే పొడవాటి కర్రను టొటొచాన్‌కు ఇవ్వకుండా ఉండాల్సింది. టొటొచాన్‌కు అట్లా నిశ్చలంగా నిలబడి నిలబడి విసుగెత్తింది. అందుకని తన పక్కన నిలబడ్డ సన్యాసి పాదాన్ని తన కర్రతో ఎత్తి సంగీత కర్తలాగ చంకల్లో చెయిపెట్టి గిలిగింతలు పెట్టింది. చివరికి ఆ కర్ర ఎత్తి సంగీత కర్తలాగ కర్ర ఆడించడానికి ప్రయత్నించబోయింది. అలా చేసి ఉంటే చుట్టూ ఉన్న వాళ్ళకు ప్రమాదాలు జరిగి పోయేవి. బెన్‌కీ, టొగాషిల మధ్య సన్నివేశం రసాభాస అయిపోయేది.

కనుక చిట్టచివరికి టొటొచాన్‌కు సన్యాసి పాత్ర కూడ దక్కలేదు.

యొషిట్సునె వేషంలో టొటొచాన్ తనను తోసేస్తుంటే, దెబ్బలు కొడుతుంటే పళ్ళు బిగబట్టి బాధలు సహించాడు. ప్రేక్షకులు కచ్చితంగా టాయిచాన్ పట్ల జాలిపడి ఉంటారు.

టొటొచాన్ లేకుండా రిహార్సల్స్ సక్రమంగా జరిగిపోయాయి.

అట్లా ఒంటరి అయిపోయిన టొటొచాన్ బడి ఆవరణలోకి వెళ్ళింది. అక్కడ తన కాలి జోళ్ళు తీసేసి, తనకు ఇష్టమైన సంగీనృత్య రూపకాన్ని మెరుగుపరచడం మొదలెట్టింది. తన ఇష్టప్రకారం నృత్యం చేయడం చాల అద్భుతంగా అనిపించింది. కాసేపు తనను తాను హంసననుకుంది. కాసేపు గాలిననుకుంది. కాసేపు విచిత్ర వ్యక్తిననుకుంది. కాసేపు చెట్టుననుకుంది. అల్లా ఆ నిర్జనమైన ఆట మైదానంలో టొటొచాన్ ఒక్కతే ఎంతో సేపు నృత్యం చేస్తూ ఉండిపోయింది.

ఐనా టొటొచాన్ హృదయపు లోలోతుల్లో ఒక చిన్న భావం అలాగే ఉండిపోయింది. తాను యొషిట్సునె పాత్ర వేస్తే బావుండుననే భావం. కాని వాళ్ళు అలా వేయనిస్తే, తాను తప్పనిసరిగా ఐకోసైషోను కొట్టి ఉండేది. రక్కి ఉండేది.

అలా టొటొచాన్ టోమోలోని మొట్టమొదటి, చిట్టచివరి ఔత్సాహిక నాటకంలో నటించలేకపోయింది.

## సుద్దముక్క

వేరే వాళ్ళ గోడల మీదగాని, రోడ్డుమీదగాని టోమో పిల్లలు ఎప్పుడూ రాసేవాళ్ళు కాదు. ఎందుకంటె వాళ్ళకు అలా రాసే అవకాశాలు బడిలోనే భోలెడన్ని ఉండేవి.

అసెంబ్లీ హాలులోసంగీత పాఠాల సమయంలో హెడ్‌మాస్టర్ ప్రతి ఒక్కరి చేతికీ ఒక్కో సుద్దముక్క ఇచ్చేవాడు. వాళ్ళు అక్కడ నేలమీద ఇష్టం వచ్చిన చోట పడుకోవచ్చు. లేదా కూచోవచ్చు. చేతుల్లో సుద్దముక్క పట్టుకుని అందరికందరూ ఎదురుచూస్తుండేవాళ్ళు. వాళ్ళందరూ సిద్ధంగా ఉన్నారని చూడగానే హెడ్‌మాస్టర్ పియానో వాయించడం మొదలుపెట్టేవాడు. ఆయన అలా పియానో వాయిస్తుండగా వాళ్లందరూ నేలమీద సంగీత చిహ్నాలలోఆ స్వరమాలికను రాస్తుండేవారు. కనుక విశాలమైన అసెంబ్లీ హాలు నేలమీద వాళ్ళకు ఒక్కొక్కరికి చాలా స్థలం ఉండేది. దానిమీద వాళ్ళు ఇష్టం వచ్చినంత పెద్దగా సంగీత చిహ్నాలు రాసుకోవచ్చు. మరొకరి స్థలంలోకి జారబడ కుండానే ఆ పని చెయ్యవచ్చు. మామూలుగా సంగీత స్వరమాలిక రాయడానికి అవసరమైన ఐదుఅడ్డుగీతలు కూడ వాళ్ళు గీయనక్కరలేదు. ఎందుకంటే వాళ్ళు రాసేవి కేవలం స్వరాలు మాత్రమే. టోమోలో సంగీత చిహ్నాలన్నిటికీ ప్రత్యేకమైన పేర్లుండేవి. ఆ పేర్లను పిల్లలు హెడ్‌మాస్టర్‌తో మాట్లాడి తమంతట తామే కనిపెట్టారు. ఆ పేర్లు ఏమిటంటే:

♫ ను గంతు అనేవాళ్లు. నిజంగానే ఈ స్వరం ఎగరడానికీ, గెంతడానికీ వీలుగా ఉండేది.

♪ ను జెండా అనేవాళ్ళు. అది జెండాలాగే కనబడేది.

♫ ను జెండా -జెండా అనేవాళ్ళు.

𝅘𝅥𝅯 ను రెండు జెండాలు అనేవాళ్ళు

♩ ను నలుపు అనేవాళ్ళు.

𝅗𝅥 ను తెలుపు అనేవాళ్ళు.

𝅗𝅥. నుపుట్టుమచ్చ తెలుపు అనో, తెలుపు చుక్క అనో అనేవాళ్ళు .

𝅝 ను వృత్తం అనేవాళ్ళు.



ఈ పద్ధతిలో వాళ్ళకు సంగీత స్వరాలన్నీ బాగా తెలిసి పోయాయి. పైగా అది సరదాగా కూడ ఉండేది. సంగీత పాఠాల తరగతి వాళ్ళకు చాలా ఇష్టంగా ఉండేది.

నేలమీద సుద్ద ముక్కతో రాయడం అనేది హెడ్‌మాస్టర్‌కుతట్టిన ఆలోచన. కాగితం మీద రాయిద్దామంటే అది తగినంత పెద్దదిగా ఉండేది కాదు. పోనీ నల్లబల్లలిద్దామంటే చాలినన్ని ఉండేవి కావు. కనుక అసెంబ్లీ హాలులోని నేలే మంచి పెద్ద నల్ల బల్ల అవుతుందని, సంగీతం ఎంత వేగంగా ఉన్నా పిల్లలు సులభంగా స్వరాలురాయగలుగుతారని, తమ ఇష్టం వచ్చినంత పెద్దగా రాయగలుగుతారని హెడ్‌మాస్టర్ ఆలోచించాడు. అన్నిటి కన్న ముఖ్యంగా వాళ్ళకు సంగీతాన్ని ఆస్వాదించే వీలు కూడ ఉంటుంది. అంతేగాక పాఠాలు అయిపోయాక ఇంకా వ్యవధి ఉంటే పిల్లలు విమానాలుగానీ, బొమ్మలుగానీ తమ ఇష్టం వచ్చినవే నైనా అక్కడ గీయవచ్చు. కొన్ని సార్లు పిల్లలు సరదాగా బొమ్మలన్నీ కలిపేసే వాళ్ళు. అప్పుడు ఆ నేల నేలంతా ఒక బ్రహ్మాండమైన చిత్రం లాగుండేది.

సంగీత పాఠాల తరగతి మధ్యలో హెడ్‌మాస్టర్ ఒక్కొక్క విద్యార్థి దగ్గరికి వచ్చి వాళ్ళ స్వరాలను పరిశీలిస్తుండేవాడు. " ఇది బావుంది." అనో, "అక్కడ జండా-జండా కాదు, గంతు వెయ్యాలి." అనో అంటూ ఉండేవాడు.

పిల్లలు రాసి స్వరాల్ని చూసి, సరిచేసిం తర్వాత హెడ్‌మాస్టర్ మళ్ళీ సంగీతం వినిపించేవాడు దానితో పిల్లలలకు రాసిన వాటిని సరిచూసుకునే వీలుండేది. ఆ స్వరాలు వాళ్ళకుసుపరిచితమైపోయేవి. హెడ్‌మాస్టర్ ఎన్ని పనుల్లో ఉన్నా సరే, సంగీతం తరగతికి మాత్రం తన బదులు మరెవరినీ వెళ్ళనిచ్చేవాడు కాదు. పిల్లల వైపు నుంచి చూస్తే, కొబయాషి లేకుండా ఆ తరగతిలో సరదా ఉండేదే కాదు.

సంగీత స్వరాలు రాయడం అయిపోయాక ఆ నేల శుభ్రం చేయడం పెద్దపని. మొట్టమొదలు నల్లబల్ల తుడిచేసే గుడ్డతో నేలంతా తుడిచేసేవాళ్ళు. తర్వాత ఆ నేలను శుభ్రంగా మెరిసేలా చేసేందుకు చీపుర్లు, పాతగుడ్డలు పట్టుకుని ప్రతి ఒక్కరూ తయారయ్యేవారు. అదంతా ఒక బ్రహ్మాండమైన పని.

పెద్దపెద్ద బొమ్మల్ని, అక్షరాల్ని చెరపడం ఎంత కష్టమైన పనో టోమో పిల్లలందరికీ ఈ పద్ధతిలో తెలిసిపోయింది. కనుక వాళ్ళు అసెంబ్లీ హాలు నేలమీద తప్పితే మరెక్కడా ఎప్పుడూ ఏమీ రాయలేదు. అంతేగాక ఈ తరగతి వారానికి రెండుసార్లు ఉండేది గనుక పిల్లలు సంతృప్తిగా రాయగలిగేవారు.

టోమో పిల్లలందరూ సుద్దముక్కలు వాడడంలో నిజంగా నిపుణులయిపోయారు. ఏ రకం సుద్ద ముక్క మంచిదో, దాన్ని ఎట్లా పట్టుకోవాలో, బాగా రాయడానికి దాన్ని ఎలా తిప్పాలో, అది విరిగి పోకుండా ఏ జాగ్రత్త తీసుకోవాలో వాళ్ళకు బాగా తెలిసిపోయింది. వాళ్ళలో ప్రతిఒక్కరూ సుద్దముక్కల విషయంలో ప్రవీణులయిపోయారు.

## యాసువాకిచాన్ చచ్చిపోయాడు

వసంతకాలపు సెలవులయిపోయి బడి తెరిచాక మొట్టమొదటి ఉదయం. బడి ఆవరణలోకూడిన పిల్లల కోబయాషి ఎప్పటి లాగే జేబుల్లో చేతులు పెట్టుకుని నిలబడ్డారు. కాని కాసేపటి వరకూ ఆయన అలా మౌనంగానే ఉండిపోయాడు. తర్వాత జేబులోంచి చేతులు తీసి పిల్లల వైపు చూశాడు. ఆయన ముఖం కేసి చూస్తే ఆయన ఏడుస్తున్నట్టనిపించింది.

అయన చాలా మెల్లగా "యాసువాకిచాన్ చచ్చిపోయాడు. ఇవాళ మనందరం తన అంత్యక్రియలకు వెళ్దాం" అన్నాడు. ఒక్క క్షణం ఆగి "మీ అందరికీ యాసువాకిచాన్ అంటే చాలా ఇష్టమని నాకుతెలుసు. యసువాకిచాన్ మననుంచి దూరం కావడం దారుణం. నాకు చాలా విచారంగా ఉంది" అన్నాడు. గద్గద స్వరంతో ఆయన అంతవరకు మాత్రమే మాట్లాడ గలిగాడు. అప్పటికే ఆయన ముఖం ఎర్రబడిపోయింది ఆయన కళ్ళనిండా నీళ్ళు తిరిగాయి. పిల్లలందరూ దిగ్భ్రాంతి చెందారు. ఏ ఒక్కరూ ఒక్క మాట కూడా మాట్లాడలేకపోయారు. వాళ్ళందరి ఆలోచనల్లోనూ యసువాకిచాన్ నిండిపోయాడు. టోమో ఆవరణలో అంతకుముందెప్పుడూ అంత విషాద నిశ్శబ్దం తాండవించలేదు.

"ఇంత తొందరగా చచ్చిపోవడం ఘోరం కదు. నేను అంకుల్ టామ్స్ కాబిన్ తప్పకుండా చదవాలని యాసువాకిచాన్ అన్నాడు. సెలవులకు ముందు నాకు ఆ పుస్తకం ఇచ్చాడు. నేనా పుస్తకం ఇంకా పూర్తి చెయ్యనేలేదు...." అనుకుంది. టొటొచాన్.

సెలవుల ముందు పుస్తకం ఇస్తూ వీడ్కోలు చెపుతున్నప్పుడు యాసువాకిచాన్ చేతివేళ్ళు ఎలా ఒంగిపోయి ఉన్నాయో టొటొచాన్ గుర్తు తెచ్చుకుంది. టొటొచాన్ కు యాసువాకిచాన్‌తో తన మొట్టమొదటి పరిచయం గుర్తుకొచ్చింది. "ఎందుకలా నడుస్తున్నావు? అని తానడిగితే, యాసువాకిచాన్ మృదువుగా "నాకుపోలియో" అని జవాబిచ్చాడు. టొటొచాన్‌కు యాసువాకి గొంతు, సన్నని చిరునవ్వు జ్ఞాపకం వచ్చాయి. వేసవిలోతామిద్దరే కలిసి చెట్టు ఎక్కడానికి చేసిన సాహసం మదిలో మెదిలింది. యాసువాకిచాన్ శరీరం ఎంత బరువుండిందో, పెద్దవాడయినా, ఎత్తరి అయినా తన మీద నమ్మకంతో ఎలా భారాన్నంతా తన మీద వేశాడో టొటొచాన్‌కు జ్ఞాపకం వచ్చింది. అమెరికాలో టెలివిజన్ అనే బొమ్మల పెట్టె ఉంటుందని తనకు చెప్పిన వాడు యాసువాకిచానే. టొటొచాన్‌కుయాసువాకిచాన్ అంటే చాలా ఇష్టం. వాళ్ళిద్దరూ మధ్యాహ్నం భోజనం కలిసే చేసేవారు. బడిలో విరామ సమయాలు ఇద్దరూ కలిసే గడిపేవారు. బడి అయిపోయాక స్టేషన్‌దాకా ఇద్దరూ కలిసే నడిచేవారు. యాసువాకిచాన్ లేడంటే భరించడం టొటొచాన్‌కు కష్టంగా ఉంది. చచ్చిపోవడమంటే ఇంక యాసువాకిచాన్ ఎన్నడూ బడికి రాకపోవడమన్నమాట అని టొటొచాన్ అర్థం చేసుకుంది. అప్పుడు చచ్చిపోయిన కోడిపిల్లల లాగే. అవి చచ్చిపోయినప్పుడు కూడ తానెంత పిలిచినా అవి కదలనే కదలలేదు.

యాసువాకిచాన్ అంత్యక్రియలు వాళ్ళు ఉండేచోటు నుంచి డెనెన్ చోపుకు అవతలి వైపున ఉండే చర్చి దగ్గర జరిగాయి.

పిల్లలందరూ జియుగౌకా నుంచి ఒకే వరుసలోమౌనంగా అక్కడికి నడిచారు. టొటొచాన్ మామూలుగా అటుఇటు చూడకుండా, నడిచేంతసేపూ నేలవైపే దీక్షగా చూస్తూ నడిచింది. ఈ విచారకరమైన వార్తను హెడ్‌మాస్టర్ చెప్పినప్పుడు విన్నప్పటికంటె ఇప్పుడు ఇంకా ఎక్కువ విచారం కలుగుతుందని టొటొచాన్‌కు అనిపించింది. తనకుకోరుకుంటున్నదల్లా యాసువాకిచాన్‌ను కనీసం ఒక్కసారి సజీవంగా చూడగలిగితే బావుండునని, యాసువాకిచాన్‌తో మాట్లాడవలసిన విషయాలెన్ని ఉన్నాయో గుర్తించి టొటొచాన్ భరించలేకపోయింది.

చర్చి అంతా తెల్లని లిల్లీపూలతోనిండిపోయింది యాసువాకిచాన్ వాళ్ళ అమ్మ, అక్క, బంధువులుచర్చిబైట నిలబడి ఉన్నారు. వాళ్ళందరూ నల్ల దుస్తులు వేసుకున్నారు. టొటొచాన్‌ను చూసి వాళ్ళు ఇంకా ఎక్కువుగా ఏడిచారు. వాళ్లందరి చేతుల్లోనూ తెల్లని జేబు రుమాళ్ళున్నాయి. టొటొచాన్ అంత్యక్రియల తతంగాన్నిచూడడం అదేమొదటిసారి. అదంతా ఎంత విచారకరంగా



ఉంటుందో టొటొచాన్‌కు అర్థమైంది. అక్కడ ఎవరూ మాట్లాడడంలేదు. సంగీత వాయిద్యాలతో మంద్రస్థాయిలో ప్రార్థనా గీతాల్ని వాయించారు. సూర్యుడునడినెత్తి మీదికి వస్తున్నాడు. చర్చి అంతా తెల్లని కాంతితో నిండిపోయింది. కాని ఆ వెలుగులో ఎక్కడా ఆనందపు ఛాయలు లేవు. చేతికి నల్లపట్టీ కట్టుకున్న ఒక వ్యక్తి టోమో పిల్లలందరికీ ఒక్కొక్కరికి ఒక్కొక్క తెల్లపువ్వు అందించాడు. వాళ్ళందరూ యాసువాకిచాన్ శవపేటిక దగ్గరికి వరుసగా వెళ్ళి ఒకరి తర్వాత ఒకరు అక్కడ పూలుంచాలని చెప్పాడు.

శవపేటికలో యాసువాకిచాన్ పడుకుని ఉన్నాడు. తన కళ్ళు మూసుకుని ఉన్నాయి. చుట్టూ పూలు గుట్టగా పడి ఉన్నాయి. చనిపోయినప్పటికీ యాసువాకిచాన్ ఎప్పటిలాగే దయగా, తెలివితో కనిపించాడు. టొటొచాన్ మోకాళ్ళ మీద ఒంగి యాసువాకిచాన్ చేతి పక్కన తన పువ్వు పెట్టింది. మృదువుగా ఆ చేతిని స్పృశించింది. తాను ఎన్నెన్నో సార్లు పట్టుకున్న ప్రియమైన చెయ్యి అది. తన మురికి చెయ్యికంటె ఆ చెయ్యి ఎంతో తెల్లగా కనిపించింది. ఆ చేతి వేళ్ళు ఎంతో పొడవుగా , పెద్దవాళ్ళ వేళ్ళలా ఉన్నట్టనిపించాయి.

"ఇక వీడ్కోలు. మనం ఇంకా పెద్దాళ్ళమయ్యాక ఎక్కడో ఒక చోట కలుసుకుంటామనుకుంటాను. అప్పటికి నీ పోలియో కూడా నయమైపోవచ్చు" గుసగుసలాడింది టొటొచాన్.

అప్పుడు లేచి నిలబడి మళ్ళీ ఓ సారి యాసువాకిచాన్ వేపు చూసింది. "అయ్యయ్యో- మరిచేపోయాను. అంకుల్ టామ్స్ కాబిన్. ఇప్పుడే అది నీకు ఇచ్చేసెయ్యలేను. ఇవ్వాలా? నీ కోసంజాగ్రత్తగా దాచి ఉంచుతాలే. మనం మళ్ళీ కలుసుకునేవరకూ....." అంది.

అక్కడి నుంచి వెళ్ళిపోతుంటే టొటొచాన్‌కు వెనుక నుంచి యాసువాకిచాన్ గొంతువినిపించినట్టు అనిపించింది. "టొటొచాన్, మనిద్దరం కలిసి భలే సరదాగా గడిపాం కదూ. నేను నిన్ను ఎప్పటికీ మర్చిపోను. ఎప్పటికీ మరిచిపోను"

ద్వారం దాకా వెళ్ళి టొటొచాన్ వెనక్కి తిరిగింది. "నేను కూడ నిన్ను మర్చిపోను"అంది.

రైలు పెట్టెలోని తరగతిలో మొట్టమొదటి సారి టొటొచాన్ యాసువాకి చాన్‌ను కలుసున్నప్పటికి లాగనే వసంతకాలపు సూర్యకాంతి మృదువుగా ప్రసరిస్తోంది. కాని ఆ రోజు కంటె భిన్నంగా ఇప్పుడుటొటొచాన్ చెక్కిళ్ళు కన్నీటితో తడిసిపోయి ఉన్నాయి.

## గూఢచారి

టోమో పిల్లలు యాసువాకి చాన్ గురించిన ఆలోచనలతో చాలాకాలం విచారంగా గడిపారు. మరీ ముఖ్యంగా ఆతరగతులు మొదలయ్యేటప్పుడు ఉదయం వేళ ఆ విచారం ఎక్కువుగా కనబడేది. యాసువాకి రావడం ఆలస్యం కాలేదని, ఆసలింక రాడనీ గుర్తించడానికి పిల్లలకు కొద్దికాలం పట్టింది. తరగతిలో తక్కువమంది పిల్లలుండడం బాగానే ఉంటుంది. కాని ఇటువంటి సమయాలలో అదే చాల విచారానికి కారణమైంది. యాసువాకి లేడనే విషయం కొట్టవచ్చినట్టు కనబడేది. ఒకే ఒక్క మేలే మంటే టోమోలో ఒక్కొక్క విద్యార్థికి ప్రత్యేకంగా ఒక్కొక్క చోటు లేకపోవడం. యాసువాకి చాన్‌కు ఒక ప్రత్యేకమైన కుర్చీ ఉండి ఉంటే అది ఖాళీగా ఉండడం చూస్తే ఇంకా ఘోరంగా ఉండేది.

పెద్దపెరిగిన తర్వాత తానేం చేస్తే బావుంటుందా అని టొటొచాన్ ఆలోచించడం మొదలుపెట్టింది. చిన్నతనంలో తాను వీధి బాజావాళ్ళలో చేరుదామనుకున్నది. రూపకంలో

నృత్యకారిణి అవుదామనుకుంది. టోమోకు వచ్చిన మొదటి రోజు స్టేషన్‌లో టికెట్ కలెక్టర్ అవుదామనుకుంది. కాని ఇప్పుడు మాత్రం తాను ఎవరూ చేయని అసాధారణమైన పని చేయాలని, అందులోనూ కొంచెం స్త్రీలాగ ఉండాలని అనుకుంది. నర్స్‌గా ఉంటే బాగానే ఉంటుందిగదూ అని ఆలోచించింది. కాని గాయపడిన సైనికులను చూసేందుకు అస్పత్రికి వెళ్ళినప్పుడు అక్కడ నర్సులు ఇంజక్షన్లు ఇవ్వడం లాంటి పనులు చేస్తూ కనిపించారని టొటొచాన్‌కు గుర్తొచ్చింది. ఆ పనులు కష్టం కదూ! మరింక ఏమిటి చెయ్యడం? హఠాత్తుగాఒక ఆలోచనలతట్టి టొటొచాన్ ఎగిరి గంతేసింది.

"అరెరె- ఎందుకింకా? నేనేం పని చేయాలో ఇదివరకే నిర్ణయించుకున్నాను గదూ!"

అప్పుడే సారాయి దీపం వెలిగించుకున్న టాయిచాన్ దగ్గరికి వెళ్ళింది టొటొచాన్.



"నేను గూఢచారి కావాలనుకుంటున్నాను" అని గర్వంగా అంది.

టాయిచాన్ మంట మీదినుంచి దృష్టి మళ్ళించి టొటొచాన్ ముఖంలోకి కాసేపు చూశాడు. తర్వాత కాసేపు కిటికిలోంచి బైటికి చూపులుసారించాడు. అంతసేపు టాయిచాన్ ఆ విషయం ఆలోచించినట్టనిపించింది. అప్పుడుటొటొచాన్ వేపు తిరిగి తన తెలివైన, గంభీరమైన గొంతుతో తన అభిప్రాయం చెప్పాడు. టొటొచాన్‌కు అర్థమయ్యేలా మెల్లగా, సాదాగా "గూఢచారి కావాలంటే చాల తెలివి ఉండాలి. అంతేగాక చాల బాషలు తెలిసి ఉండాలి" అన్నాడు.

టాయిచాన్ ఊపిరి పీల్చుకునేందుకు ఒక్క క్షణం ఆగాడు. తర్వాత టొటొచాన్ వేపు సూటిగా చూసి తీక్షణంగా "అన్నిటికంటె ముందు, ఆడవాళ్ళు గూఢచారి కావాలంటే అందంగా ఉండాలి" అన్నాడు. టొటొచాన్ మెల్లగా తల కిందికి వంచి టాయిచాన్ చూపుల్నితప్పించుకుంది. నేల చూపులు చూసింది. కాసేపాగి టాయిచాన్ సాలోచనలగా సన్నని గొంతుతో, టొటొచాన్ వేపు సాలోచనగా గొంతుతో, టొటొచాన్ వేపు చూడకుండానే "దానికి తోడు, వాగుడుకాయలు గూఢచారిగా పనికొస్తారనుకోను"అన్నాడు.

టొటొచాన్ పెదవి విప్పి లేకపోయింది. తాను గూడచారి కావడానికి టాయిచాన్ వ్యతిరేకంగా ఉన్నాడనికాదు. టాయిచాన్ చెప్పినవన్నీ నిజమే. అవన్నీ తాను అనుమానించినవే. ప్రతి విషయంలోనూ గూఢచారికి ఉండవలసిన ప్రతిభ తనకు లేదని టొటొచాన్ గుర్తించింది. టాయిచాన్ ఆ మాటలను కోపంతోనో, ద్వేషంతోనో అనలేదని తెలుసు. ఇంక గూఢచారి ఆలోచన వదులుకోవడం కాక చేయగలిగిందేమీ లేదు.

"అమ్మో-టాయిచాన్‌కు నా వయసే. కాని తనకు ఎన్ని విషయాలు తెలుసో!" అని టొటొచాన్ తనలో తనే అనుకుంది.

టాయిచాన్ భౌతిక శాస్త్రవేత్త కాదలచుకున్నానని తనతో చెప్పాడనుకో! తాను ఏం జవాబు చెప్పి ఉండేది?

"బావుంటుంది. నువ సారాయి దీపాల్ని అగ్గిపుల్లతో భలే వెలిగిస్తావుగదా;" అనొచ్చునేమో కాని అది మరీ చిన్న పిల్లలు అన్నట్టు ఉండదూ.

"సరే, ఇంగ్లీషులో నక్కను ఫాక్స్ అంటారని, జోళ్ళను షూస్ అంటారని నీకు తెలుసు



గదా. కనుక నువ్వు భౌతిక శాస్త్రవేత్తవు కావచ్చునేమో" అంటే? లాభం లేదు, అదీ పనికి రాదు.

ఏది ఏమైనా సరే, టాయిచాన్ ఏదో గొప్ప పని తప్పకుడా చేస్తాడని టొటొచాన్‌కు కచ్చితంగా నమ్మకం ఉంది. కనుక టొటొచాన్ "థాంక్‌యూ-సరే నేను గూఢచారిని కానులే, కాని నువు మాత్రం తప్పకుండా గొప్పవాడివవుతావు" అంది టాయిచాన్‌తో. అప్పుడు టాయిచాన్ గాజు కుప్పెలో వస్తున్న బుడగల్ని పరిశీలిస్తున్నాడు.

టాయిచాన్ ఏదో గొణిగాడు. తల గోక్కున్నాడు. తన ముందర తెరిచి ఉన్న పుస్తకంలో మునిగిపోయాడు.

తాను గూఢచారి కాలేకపోతే మరేం కాగలదు? అని ఆలోచించింది. టొటొచాన్. అంతసేపూ టాయిచాన్ పక్కన నిలబడి టొటొచాన్ దీపం జ్వాల వేపే చూసింది.

## నాన్న వయోలిన్

టొటొచాన్ కుటుంబ జీవితంలో వాళ్ళెవరికీ తెలియకుండానే యుద్ధం దాని సకల భీభత్సాలతోటీ ప్రభావం వెయ్యడం మొదలుపెట్టింది. ప్రతిరోజూ ఇరుగుపొరుగు ప్రాంతాల నుంచి మగవాళ్ళను, యువకులను జెండాలూ ఊపుతూ, "బాన్‌జాయి" అని కేకలు వేస్తూ సాగనంపుతున్నారు. దుకాణాలలో ఒకదాని తర్వాత ఒకటిగా ఆహార వస్తువులు మాయమై పోవడం మొదలయింది. టోమోలోని "సముద్రం నుంచి కొంత, కొండలనుంచి కొంత" అనే మద్యాహ్న భోజన నియమాన్ని పాటించడం అంతకంతకూ కష్టమై పోయింది. అమ్మ కొన్నాళ్లు సముద్రపు పాచిని, రేగుపళ్ళ పచ్చడిని ఉపయోగించి ప్రయత్నించింది గాని త్వరలోనే అవి దొరకడం కూడ కష్టమై పోయింది. దాదాపు ప్రతివస్తువుకూ రేషన్ అమలు మొదలయింది. ఎక్కడా తీపిపదార్థాలు కనబడకుండా పోయాయి. ఎంత ప్రయత్నించినా సరే మిఠాయిలు దొరకడం గగన కుసుమమే అయింది.

తన స్టేషన్‌కంటే ముందు ఊకయామా అనే స్టేషన్లో ఒక చాక్లెట్లమ్మే యంత్రం ఉందని టొటొచాన్‌కు తెలుసు. అక్కడ ఆ యంత్రంలో డబ్బులు వేస్తే దాంట్లోంచి చాక్లెట్ల పాకెట్లు బయటికి వచ్చేవి. ఆ యంత్రం మీద చూస్తేనే ఆకలి వేసేటటువంటి బొమ్మ ఒకటుండేది. ఐదుసెన్‌లు వేస్తే చిన్న పాకెట్ వచ్చేది. పది సెన్‌లువేస్తే పెద్ద పాకెట్ వచ్చేది. కాని ఆ యంత్రం చాల కాలంగా ఖాళీగా ఉండిపోయింది. ఎన్ని డబ్బులువేసినా, దాన్ని ఎన్నిసార్లు గుద్దినా ఒక్క చాక్లెట్టుకూడా బైటికి వచ్చేదికాదు. మిగిలిన వాళ్ళందరి కంటె ఎక్కువసేపు టొటొచాన్ ప్రయత్నిస్తూండేది.

"లోపల ఇంకా ఒక పాకెట్ ఉండి ఉండవచ్చు. లోపల అది ఎక్కడో తట్టుకుని ఉంటుంది గదా" అని టొటొచాన్ ఆలోచించేది.

కనుక ప్రతిరోజు టొటొచాన్ తన స్టేషన్ కంటె ముందు స్టేషన్‌లోనే దిగిపోయేది. ఆ యంత్రంలోకి ఐదు సెన్‌ల నాణాలు, పది సెన్‌ల నాణాలు వేస్తూనే ఉండేది. కాని టొటొచాన్‌కు ఎప్పుడూ తన డబ్బులే తిరిగి వచ్చేస్తుండేవి. ఆ డబ్బులు గల్లుమని పడిపోయేవి.

దాదాపు ఆ సమయానికే నాన్నకు ఎవరో ఒక కబురు చెప్పారు. చాల మందికి ఆ కబురు మంచి కబురుగానే ఉండేదేమో. యుద్ధానికి అవసరమైన ఆయుధాలు, మందుగుండు తయారు చేసే కార్ఖానాలోకి వెళ్ళి వయొలిన్ మీద ప్రముఖ యుద్ధ గీతాలు వాయిస్తే పంచదార ఇస్తారట, బియ్యం ఇస్తారట. ఇంకా ఎన్నెన్నో సౌకర్యాలు కలిగిస్తారట. నాన్నకు ఈ మధ్యనే ఒక ప్రతిష్ఠాత్మకమైన

సంగీత బహుమానం వచ్చింది. అందుకే వయొలిన్ విద్వాంసుడిగా ఆయన ఇప్పుడు ప్రముఖుడై పోయాడు. మరి ఆయన గనుక వెళ్ళి వయొలిన్ వాయిస్తానంటే తప్పకుండా అదనపు సౌకార్యలిస్తారని ఆ కబురు తెచ్చిన మిత్రుడు చెప్పాడు.

"ఏమనుకుంటున్నావు? ఈ పని చెయ్యదలచుకున్నావా ఏం?" అని అమ్మ, నాన్నను అడిగింది.

సంగీత ప్రదర్శనలేమో తగ్గిపోతున్నాయి. దానికన్న ముఖ్యంగా అంతకంతకూ ఎక్కువ మంది సంగీతకారులను యుద్ధంలోకి పిలిపిస్తున్నారు గనుక సంగీత బృందాలలో వాద్యకారులు తగ్గిపోతున్నారు. రేడియో ప్రసారాలలో యుద్ధానికి సంబంధించిన కార్యక్రమాలకే పూర్తి కాలాన్ని కేటాయిస్తున్నారు. అందుకని నాన్నకు, ఆయన సహచరులకు ఏమంత పెద్దపని లేకుండా పోయింది. కనుక ఆయన ఇప్పుడు వచ్చిన అవకాశాన్ని వాడుకోవలసిన పరిస్థితే ఉంది.

జవాబివ్వడానికి ముందు నాన్న కాసేపు ఆలోచించాడు. "నేను నా వయొలిన్ మీద అటువంటి సంగీతం వాయించదలచుకోలేదు" అన్నాడు.

"అమ్మయ్య సరైనమాట అన్నావు. నేనుకూడ ఈ అవకాశాన్ని తిరస్కరిస్తాను. ఏదోరకంగా మనకు తిండి దొరక్కపోదు" అంది అమ్మ.

టొటొచాన్‌కు కూడ చాలినంత తిండి ఉండడం లేదని, చాక్లెట్లమ్మే యంత్రం లోకి డబ్బులు వేస్తూ విఫల ప్రయత్నాలు చేస్తోందని నాన్నకు తెలుసు. ఏవోకొన్ని యుద్ధగీతాలకు సంగీతం వాయిస్తే తనకందే ఆహారపు కానుకలు తన కుంటుంబానికి చాల మేలు చేస్తాయని కూడ నాన్నకు తెలుసు. కాని నాన్న తన సంగీతానికి ఇంకా ఎక్కువ విలువ ఇచ్చేవాడు. అమ్మకు కూడ ఆ విషయం తెలుసు. అందుకే అమ్మకూడ ఆయనను ఆ పని చెయ్యమని అడగలేదు. "టాట్స్కీ-కన్నా-నీకేమీ చెయ్యలేక పోతున్నానురా! క్షమించరా నన్ను" అన్నాడు నాన్న విచారంగా.

టొటొచాన్‌కు అప్పటికి కళ గురించి, భావజాలం గురించి, పని గురించి తెలిసేంతటి వయసు లేదు. కాని టొటొచాన్‌కు ఒక విషయం తెలుసు. నాన్న వయొలిన్‌ను ఎంత ప్రేమించే వాడంటే, ఆయనను అందుకే వాళ్ళ కుటుంబంవాళ్ళు "వెలివేశారట". ఆయన కుటుంబంలోనూ, బంధువులలోనూ చాలమంది ఆయనతో మాట్లాడరు. ఆయన ఎన్నెన్నో కష్టాలను ఎదుర్కొన్నాడు. కాని వయొలిన్‌ను వదలు కోవడానికి మాత్రం సిద్ధపడలేదు. కనుక ఆయనకు ఇష్టం లేనిది వాయించకుండా ఉండడమే మంచిదని టొటొచాన్ అనుకుంది. ఇక టొటొచాన్ నాన్న చుట్టూ గంతులు వేస్తూ సంతోషంగా "ఫర్వాలేదు నాన్నా, నాకుకూడా నీ వయొలినంటె చాలా ఇష్టం" అంది.

మర్నాడు కూడ టొటొచాన్ ఊకయామాలోనే దిగిపోయింది. చాక్లెట్ల యంత్రం లోపలికి తొంగిచూసింది. దాంట్లోంచి చాక్లెట్లు బైటికి రావు. కాని టొటొచాన్ ఇంకా ఆశపడుతూనే ఉండిపోయింది.

## వాగ్దానం

మద్యాహ్న భోజనాల కోసం పిల్లలు కుర్చీలను, బల్లలను వలయాకారంలో సర్దేవారు. భోజనాలయిపోయాక అవన్నీ తీసేస్తే అసెంబ్లీహాలు చాలా విశాలంగా కనబడేది.

"ఇవాళ హెడ్‌మాస్టర్ వీపుమీదికి నేనే మొట్టమొదలు ఎక్కుతాను" అనుకుంది టొటొచాన్ ఒక రోజున.



టొటొచాన్‌కు ప్రతిరోజూ అట్లాగే అనిపించేది గాని ఒక్క క్షణం సంకోచించిందంటే, మరెవరో ఒకరు ఆయన ఒళ్లో కూచుని ఉండేవారు. అసెంబ్లీ హాలు మధ్యలో బాసింపట్టు వేసి కూచున్న ఆయన వీపుమీది నుంచి కనీసం ఇద్దరు వేలాడుతుండే వాళ్ళు అందరికందరూ ఆయన దృష్టిలో పడాలని ప్రయత్నిస్తుండేవాళ్ళు.

"అరెరె- ఆగండి! ఆగండి!" అని హెడ్‌మాస్టర్ కేకలు వేస్తుండేవాడు. అప్పటికే ఆయన ముఖం నవ్వుతో ఎర్రబడి ఉండేది. కాని ఒకసారి ఆయన వీపెక్కిన పిల్లలు ఇంక ఆ స్థలం వదలకుండా ఉండడానికే గట్టిగా నిశ్చయించుకునే వాళ్ళు. కనుక చిన్నయెత్తు ఆలస్యం జరిగినా హెడ్‌మాస్టర్ వీపు కిక్కిరిసిపోయి ఉండేది. ఈ సారి మాత్రం టొటొచాన్ మొట్టమొదట ఉండాలని నిర్ణయించుకుంది. హెడ్‌మాస్టర్ వచ్చేసరికి అసెంబ్లీ హాలు మధ్యలో ఎదురుచూస్తూ ఉంది. ఆయన అటువైపు వస్తుండగానే, "సార్-నేను మీకు చెప్పాల్సిన కబురోటి ఉందండీ" అని కేకవేసింది.

"ఏమిటేమిటి ? చెప్పు!" అని హెడ్‌మాస్టర్ సంతోషంగా అడుగుతూ నేల మీద కూచుని భాసింపట్టు వేసుకున్నాడు.

ఎన్నాళ్ళో ఆలోచించిన మీదట తాను తీసుకున్న నిర్ణయాన్ని ఆయనతో చెప్దామని టొటొచాన్ అనుకుంది. హెడ్‌మాస్టర్ సర్దుకుని కూచున్నాక, టొటొచాన్ హఠాత్తుగా ఆయన వీపు ఎక్కే ఆలోచన మానుకుంది. తాను చెప్పదలచుకున్న విషయం ఎదురు బొదురుగా చెప్పటమే మంచిది. కనుక ఆయనకు ఎదురుగా ఆయన ముందు కూచుంది. తల కొంచెం పక్కకు ఒంచిన టొటొచాన్ ముఖం చిరునవ్వు తొణికిసలాడుతోందప్పుడు. చిన్నప్పటినుంచి కూడ ముఖం అట్లాపెడితే అమ్మ "నా బంగారు కొండ ముద్దుల ముఖం" అనేది. ఆ ముఖమే టొటొచాన్‌కు ఎందరి నుంచో మెచ్చుకోళ్ళు సాధించిపెట్టింది. అలా చిరునవ్వు నవ్వుతున్నప్పుడు టొటొచాన్‌కు చాలా విశ్వాసం కలిగేది. టొటొచాన్ నోరు కొద్దిగా తెరచుకొని ఉన్న ఆ క్షణాల్లో తనకు తాను కూడ చాలా మంచి పిల్లనని నమ్ముతుండేది.

హెడ్‌మాస్టర్ టొటొచాన్ వైపు ఎదురు చూస్తున్నట్టు చుశాడు. "ఏంటి తల్లీ?" అని మళ్ళీ అడిగాడు ముందుకు వంగి.

టొటొచాన్ తియ్యగా, మెత్తగా ఒక్కొక్క మాటే చెపుతూ పోయింది. అలా చెపుతుంటే టొటొచాన్ గొంతు అక్కగొంతులాగో, అమ్మగొంతులాగో ధ్వనించింది. "నేను పెద్ద పెరిగాక ఇక్కడేపనిచేస్తాను. పాఠాలు చెపుతాను. నిజంగా....." అంది.

హెడ్‌మాస్టర్ చిరునవ్వు నవ్వేస్తాడని టొటొచాన్ అనుకుంది. కాని అందుకు బదులుగా ఆయన చాల గంభీరంగా "నిజంగానా? తప్పకుండా చేస్తావుగదూ?" అని హామీ అడిగాడు.

ఆయన నిజంగా టొటొచాన్ అక్కడ ఉపాధ్యాయురాలిగా పనిచేయాలని ఆశించినట్టే ఉన్నాడు.

టొటొచాన్ తల గబగబా ఊపుతూ "తప్పకుండా చేస్తాను" అంది. తప్పకుండా ఇక్కడ టీచర్ అయిపోవాలని హృదయంలో గట్టిగా నిర్ణయించుకుంది. ఆ క్షణాన టొటొచాన్ మనసులో ఆలోచించినది ఎప్పటిదో పాత సంగతి. టోమోలో తాను అడుగుపెట్టిన మొట్టమొదటి రోజు, ఒకటో తరగతిలో చేరడానికి వచ్చి హెడ్‌మాస్టర్‌తో గడిపిన ఉదయం. అది జరిగి ఎంతోకాలం గడిచినట్టు ఉంది. ఆయన తాను చెప్పినవన్నీ ఓపిగ్గా నాలుగు గంటలపాటు విన్నాడు. తాను మాట్లాడడం అయిపోగానే "ఇక నుంచి నువు ఈ పాఠశాల విద్యార్థివి" అన్నప్పుడూ ఆయన

గొంతులో ధ్వనించిన ఆత్మీయత టొటొచాన్‌కు గుర్తొచ్చింది. అప్పటికంటె ఎక్కువగా ఇప్పుడు టొటొచాన్‌కు కొబయాషి పట్ల ప్రేమ కలిగింది. ఆయన కోసం ఏ పనయినా చేయాలని, ఆయనకు ఎలాగైనా సాయం చేయాలని టొటొచాన్ నిశ్చయించుకుంది.

టొటొచాన్ హామీ ఇవ్వగానే ఆయన సంతోషంగా చిరునవ్వు నవ్వాడు. ఎప్పటిలాగానే ఆయన తనబోసిపళ్ళు బయటపెటట్టి నవ్వటానికి ఏమీ సిగ్గుపడలేదు. టొటొచాన్ వాగ్దానం చేస్తున్నట్టు తనచిటికెన వేలు చాపింది. హెడ్‌మాస్టర్ కూడ తన చిటికెన వేలుచాపాడు. ఆయనవేలు చాలా దృఢంగా కనబడింది. దానిలో నమ్మకం ఉంచవచ్చుననిపించేటట్టుందది. టొటొచాన్, హెడ్‌మాస్టర్ ఇద్దరూ ఆ తర్వాత తరతరాలుగా జపానీయులకు అలవాటయిన పద్ధతిలో చిటికెన వేళ్ళు కలిపి ఒప్పందం చేసుకున్నారు. హెడ్‌మాస్టర్ ముఖం మీద చిరునవ్వు వెలుగుతోంది. టొటొచాన్ కూడ సంతృప్తిగా చిరునవ్వు నవ్వింది. తాను టోమోలో టీచర్ కాబోతోంది! ఎంత అద్భుతమైన ఆలోచన!

"నేను టీచర్ నయినాక....." అని టొటొచాన్ ఊహలు చేసింది. టొటొచాన్ ఊహాసౌధాలలో కొన్నిఏమిటంటే పిల్లలకు మరీ ఎక్కువ పాఠ్యాంశాలు ఉండగూడదు. ఆటల దినాలు బోలెడన్ని ఉండాలి. వన భోజనాలు, విహారాలు , షికార్లు ఎక్కువగా ఉండాలి!

హెడ్‌మాస్టర్‌కు ఎంతో ఆనందం కలిగింది. టొటొచాన్ పెద్ద పెరిగితే ఎలా ఉంటుందో ఊహించడం కష్టమైంది. కాని తను టోమోలో టీచర్ కావడం తప్పని సరి అని ఆయన నమ్మాడు. టోమో విద్యార్థులందరూ కూడ మంచి టీచర్లు కాగలరని ఆయన ఉద్దేశ్యం. ఎందుకంటే చిన్నారి పిల్లల్లా ఉండడమంటే ఏమిటో వాళ్ళు ఎక్కువగా గుర్తు పెట్టుకోగలరు.

ఇక్కడ, టోమోలో, ఆ హెడ్‌మాస్టర్, ఆయన విద్యార్థుల్లో ఒకరు ఒక గంభీరమైన ఒప్పందం చేసుకుంటున్నారు. అది అమలులోకి రావడానికి పదేళ్ళో, ఇంకా ఎక్కువో భవిష్యత్తు గడవాలి. సరిగ్గా అప్పుడే బాంబులు నింపుకున్న అమెరికన్ విమానాలు జపాన్ గగన తలంలో ప్రత్యక్షం కావడానికి ఇంకా ఎక్కువ వ్యవధి లేదని ప్రతి ఒక్కరూ అనుకుంటున్నారు.

## రాకీ మాయమైంది

చాలామంది సైనికులు చనిపోయారు. ఆహార పదార్థాలన్నీ కరువై పోయాయి. ప్రతిఒక్కరూ భయంలోబతుకుతున్నారు. వేసవి కాలం మాత్రం యథావిధిగా వచ్చేసింది. సూర్యుడు ఎప్పటిలాగే గెలుస్తున్న దేశాల మీద, ఓడిపోతున్న దేశాల మీద ప్రకాశిస్తున్నాడు.

టొటొచాన్ కామాకురాలోని పెదనాన్న వాళ్ళింటినుంచి అప్పుడే టోక్యోకు వచ్చింది.

ఇప్పుడు టోమోలోవిహారాలు లేవు. వేడినీటిఊట దగ్గరికి షికార్లు లేవు. ఇదివరకటి వేసవి సెలవుల లాగ సరదాగా గడపగలిగిన సెలవులు మళ్ళీ వచ్చేటట్టేలేవు. టొటొచాన్ ఇదివరకెప్పుడూ వేసవి సెలవులు కామాకురాలో పెదనాన్న వాళ్ళ పిల్లలతో గడిపేది. కాని ఈ సంవత్సరం సెలవులు మరో రకంగా గడిచాయి. టొటొచాన్‌కు బంధువు,ఎప్పుడూ వాళ్ళకు భయపెట్టే దయ్యాల కథలు చెపుతూ ఉండే ఒక పెద్ద పిల్లవాణ్ణి యుద్ధంలోకి తీసుకున్నారు. కనుక ఇక దయ్యాల కథలు కూడ లేవు. అమెరికాలో తన జీవితం గురించి భలే ఆసక్తికరమైన కథలు చెపుతుంటే పెదనాన్న కూడ యుద్ధంలోకి వెళ్ళాడు . ఆ కథలునిజాలో, అబద్ధాలో వాళ్ళకు తెలిసేవి కాదు గాని అవి బాగుండేవి. ఆయన పేరు షుజిటాగుచి, ఆయన చాల పేరు పొందిన కెమెరామన్.

న్యూయార్క్‌లో నిహాన్ న్యూస్ బ్యూరో చీఫ్‌గా, అమెరికన్ మెట్రోన్యూస్‌కు దూరప్రాచ్య



ప్రతినిధిగా పనిచేసిన తర్వాత ఆయన షు టాగూచిగా చాలామందికి తెలిశాడు. ఆయన నాన్నకు అన్నయ్య, నాన్నేమో వాళ్ళమ్మవాళ్ళ ఇంటిపేరు కొనసాగించడానికి అది పెట్టుకున్నాడు. లేకపోతే నాన్న ఇంటిపేరు కూడ టాగుచి అనే ఉండి ఉండేది. పెదనాన్న తీసిన సినిమాలు, "రాబౌల్ యుద్ధం" లాంటివి సినిమా హాళ్ళలో చూపెడుతుండే వాళ్ళు. ఐతే ఆయన దగ్గరనుంచి ఈ సినిమాలు తప్ప మరేమీ వచ్చేవి కావు. కనుక టొటొచాన్ వాళ్ళ పెద్దమ్మ, తమ్ముళ్ళు, చెల్లెళ్ళు వాళ్ళ నాన్నగురించి కంగారు పడుతుండేవారు. యుద్ధంలో ఫొటో గ్రాపర్లు సైన్యాలు ఎంతెంత భయానకమైన స్థలాల్లో ఉన్నాయో చూపుతుండేవారు. కనుక వాళ్ళు సైనికులకన్న ముందుండి, సైనికులు ముందుకు సాగుతున్న ఫొటోలు తీయాల్సి ఉండేది. టొటొచాన్ బంధువులందరూ ఈ మాటలు చెప్పుకుంటూ ఉండేవారు.

కామకురాలో సముద్రతీరం కూడ ఆ వేసవిలో నిర్జనంగా కనబడింది. పరిస్థితి అంతా ఇలా ఉన్నా యాట్‌చాన్ మాత్రం సరదాగా ఉండేవాడు. యాట్‌చాన్ అంటే షుజి పెదనాన్నకు పెద్దకొడుకు. యాట్‌చాన్ టొటొచాన్ కన్నఒక సంవత్సరం చిన్న. పిల్లలందరూ ఒకే పెద్ద దోమతెర కిందపడుకునే వాళ్ళు. పడుకోబోయే ముందు యాట్ చాన్ పెద్దగా " చక్రవర్తి చిరంజీవుడవు గాక!" అని అరిచేవాడు. అరిచి తుపాకి కాల్పుల్లో ఇలా చేసినప్పుడల్లా నిద్రలో నడిచి అరుగుమీదినుంచి పడిపోయేడాడు. పెద్దగందరగోళమై పోయేది.

టొటొచాన్ వాళ్ళమ్మ నాన్నతోపాటే టోక్యోలో ఉండిపోయింది. నాన్నకు అక్కడ ఏదో పని ఉండింది. వేసవి సెలవులయి పోయాయి గనుక టొటొచాన్‌ను టోక్యోకు తీసుకొచ్చారు. దయ్యాల కథలు చెప్పే అబ్బాయి వాళ్ళ అక్కయ్య టొటొచాన్‌ను తీసుకొచ్చింది.

ఇంటికి చేరగానే, టొటొచాన్ మామూలుగానే మొట్టమొదట రాకీ కోసం చూసింది. కాని రాకీ ఎక్కడా కనబడలేదు. ఇంట్లోలేదు. తోటలోలేదు. నాన్న పూల చెట్లు పెంచుతున్న చోట కూడ లేదు. టొటొచాన్‌కు దఃఖం వచ్చింది. ఎప్పుడూ తాను ఇంటికి చేరకముందేరాకీ బైటకొచ్చి చూస్తూండేది. ఇప్పుడెక్కడా కనబడడం లేదు. టొటొచాన్ రాకీని పిలుస్తూ ఇంట్లోంచి బైటపడి, రోడ్డుమీద నడిచింది. కాని రాకీ ఎక్కడా జాడలేదు. ఆ ప్రియమైన కళ్ళు, చెవులు, తోక ఎక్కడా కనబడలేదు. తాను రాకీ కోసం బైట వెతుకుతున్న సమయంలో అది ఇంట్లోకి వెళ్ళిపోయిందేమో అని ఆనిపించి మళ్ళీ ఇంటి వైపు మళ్ళింది. ఇంటికి పరుగెత్తి చూస్తే అప్పటికీ రాకీ రాలేదు.

"అమ్మా అమ్మా, రాకీ కోసం వెతుకుతూనే అటూఇటూ తిరుగుతోందని అమ్మకు తెలిసే ఉంటుంది. కాని అమ్మ పెదవి విప్పి మాట్లాడలేదు.

అమ్మ జాకెట్‌పట్టి లాగుతూ "అమ్మా-రాకీ ఏమయిందే?" అని మళ్ళీ అడిగింది.

జవాబు చెప్పటం అమ్మకు చాలా కష్టమయింది. "రాకీ మాయమైపోయింది." అంది.

టొటొచాన్ ఆ మాట నమ్మలేకపోయింది. ఎట్లా మాయమైపోయి ఉంటుంది? "ఎప్పుడూ" అని అడిగింది అమ్మ ముఖంలోకే చూస్తూ.

ఏం చెప్పడానికీ అమ్మకు మాటలు దొరకలేదు. విచారంగా "నువు కామాకురా వెళ్ళగానే ...." అని అడిగింది. మళ్ళీ గబగబా "మేం రాకీ కోసం వెతికాం. ప్రతిచోటా వెతికాం. ప్రతి ఒక్కళ్ళనూ అడిగాం. కాని ఎక్కడా రాకీ జాడ దొరకలేదు. నీకీ సంగతి ఎట్లా చెప్పాలా అనేది నాకు తెగని సమస్య అయింది. ఇది ఘోరమే తల్లీ! కాని ఏం చేద్దాం!" అంది.

అప్పుడు టొటొచాన్‌కు నిజం తట్టింది. రాకీ బహుశా చచ్చిపోయి ఉంటుంది. "నేను విచారపడొద్దని అమ్మ చెప్పడం లేదు. కాని రాకీ చచ్చిపోయిందన్నమాట" అనుకుంది టొటొచాన్.

టొటొచాన్‌కు అదంతా స్పష్టమైపోయింది. ఇప్పటివరకూ, టొటొచాన్ ఎన్నాళ్ళు ఎటు వెళ్ళినా రాకీ ఇల్లు విడిచి చాల దూరం వెళ్ళలేదు. టొటొచాన్ తిరిగి వస్తుందని రాకీకి కచ్చితంగా తెలుసు. "నాకుచెప్పకుండా రాకీ ఎప్పుడూ ఇట్లా వెళ్ళదు" అని తనలో తనే అనుకుంది టొటొచాన్. టొటొచాన్ ది దృఢమైన విశ్వాసం.



కాని ఇదంతా అమ్మతో చర్చించలేదు. అమ్మ ఎలా ఆలోచిస్తూ ఉండి ఉంటుందో టొటొచాన్‌కు తెలిసింది. "అరె, ఎటు వెళ్ళిపోయిందో" అని మాత్రమే అమ్మతో అంది. ఆ మాటలు అనేటప్పుడు కళ్ళు నేలకేవాల్చింది.

ఆ మాటలనడమే టొటొచాన్‌కు గగనమైపోయింది. ఆ మాటలనేసి పై అంతస్తులో తన గదికి పరుగెత్తింది. రాకీ లేకుండా ఆ ఇల్లు తమ ఇల్లులాగా అనిపించనేలేదు. తన గదిలోకి చేరి ఏడవకుండా ఉండడానికి,దాన్ని గురించి మళ్ళీ ఓసారి ఆలోచించడానికి గట్టిగా ప్రయత్నించింది. రాకీ విషయంలో తానేమన్నా తప్పుగా ప్రవర్తించానా, అందుకే రాకీ ఇల్లొదిలి వెళ్ళిపోయిందా అని ఆలోచించింది.

టోమోలో పిల్లలతో కొబయాషి ఎప్పుడూ "జంతువుల్ని బాధించకండి" అని చెపుతుండే వాడు. "జంతువులు మిమ్మల్ని నమ్మినప్పుడు వాటిని మోసం చెయ్యడం క్రూరం. కుక్క మిమ్మల్ని ప్రాధేయపడేలా చేసి అప్పుడేమీ పెట్టకుండా ఉండకండి. అలా అయితే కుక్క మిమ్మల్నిక నమ్మదు. దాని స్వభావమే చెడిపోతుంది." అనేవాడు.

టొటొచాన్ ఈ సూచనల్ని పాటించేది. టొటొచాన్ రాకీని ఎప్పుడూ మోసం చెయ్యలేదు. తనకు తెలిసినంతవరకు టొటొచాన్ రాకీ విషయంలో ఏ తప్పూ చెయ్యలేదు.

టొటొచాన్ దృష్టి అప్పుడే ఒకదాని మీద పడింది. అది నేలమీది ఎలుగుబంటి బొమ్మకాలుకు తట్టుకుని ఉంది. టొటొచాన్ అప్పటి దాకా ఏడవకుండా ఉండడానికి ప్రయత్నించింది. కాని దాన్నిచూడగానే టొటొచాన్ ఏడుపు ఆగలేదు. అది రాకీ లేత గోధుమరంగు బొచ్చులోని వెంట్రుకల కుచ్చె. కామాకురా వెళ్ళే ముందురోజు ఉదయం రాకీ, తాను నేలమీద పొర్లుతూ ఆడుకున్నప్పుడు ఆ కుచ్చు విడిపోయి ఉంటుంది. ఆ జర్మనీ షెఫర్డ్ వెంట్రుకలు చేతిలో గట్టిగా పట్టుకుని టొటొచాన్ కుళ్ళికుళ్ళి ఏడ్చింది. టొటొచాన్ కన్నీళ్ళు ధారలు కట్టాయి. వెక్కిళ్ళు ఆగకుండా అలా వస్తూనే ఉన్నాయి.

మొదలు యాసువాకిచాన్, ఇప్పుడు రాకీ. టొటొచాన్ మరో నేస్తాన్ని పోగొట్టుకుంది.

## తేనేటి విందు

టోమోలో కాపలాదారు ర్యోచాన్. ఆయనంటే పిల్లలందరికీ చాల ఇష్టం. చిట్టచివరికి ఆయనను కూడ యుద్ధంలోకి పిలిచారు. ఆయన చాల పెద్దవాడే గాని, ఆయననందరూ చిన్నప్పటి ముద్దుపేరుతోటే పిలిచేవారు. ర్యోచాన్ ఒక రకంగా సంరక్షకదేవత. ఎవరైనా కష్టంలో ఉన్నారని తెలిస్తే వెంటనే వారిని కాపాడి ఏదయినా సాయం చేయడానికి సిద్ధపడేవాడు. ఆయన ఎప్పుడూ పెద్దగా మాట్లాడేవాడు కాదు. చిరునవ్వు మాత్రం నవ్వేవాడు. కాని సరిగ్గా ఏం చెయ్యాలో మాత్రం ఆయనకు తెలిసి వుండేది. టొటొచాన్ మురికి గుంటలో పడ్డప్పుడు తనను కాపాడడానికి



వచ్చింది. ర్యోచానే. ఏమీ గందరగోళం లేకుండా టొటొచాన్‌ను శుభ్రం చేసిందాయనే.

"మనం ర్యోచాన్‌కు ఓ మంచి వీడ్కోలు తేనీటి విందు ఇద్దాం" అన్నాడు హెడ్‌మాస్టర్.

"తేనీటి విందా?"

జపాన్‌లో రోజంతా ఆకుపచ్చని తేనీరు ఎన్నోసార్లు తాగుతారు. కాని దానికీ, విందుకీ సంబంధం లేదు. ఉత్సవాల్లో వాడే గుండ తేయాకు వేరు. కనుక టోమోలో "తేనీటి విందు" అంటే కొత్త విషయమే. కాని పిల్లలకు మాత్రం ఆ ఆలోచన నచ్చింది. వాళ్ళు తాము అంతవరకూ చేయని కొత్తవిషయాలు చేయడానికి ఉత్సాహపడేవాళ్ళు. పిల్లలకు ఇప్పుడు జరగబోయే దేమిటో తెలియదు. కాని హెడ్‌మాస్టర్ ఉద్దేశ్యపూర్వకంగానే ఇదివరకు అలవాటులో ఉన్న సోబెట్సుకాయి (వీడ్కోలువిందు) బదులు సవాకాయి(తేనీటి విందు) అనే కొత్తమాట కనిపెట్టాడు. వీడ్కోలు విందు అంటే చాల విచారం ధ్వనిస్తోంది. ర్యోచాన్ గనుక యుద్ధంలో చనిపోతే, తిరిగి రాక పోతే పెద్ద పిల్లలు ఇది నిజంగానే వీడ్కోలు అయిందనుకుంటారు. కాని ఇంతవరకు తేనీటి విందులు ఎవరు వినలేదు గనుక అందరికందరూ ఉత్సాహంగా ఉన్నారు.

బడి అయిపోయిన తర్వాత మధ్యాహ్న భోజనాల సమయంలో లాగానే అసెంబ్లీ హాలులో బల్లలన్నిటినీ పిల్లలతో వలయాకారంగా వేయించాడు కొబయాషి. అందరూ వలయంలో కూచున్న తర్వాత వాళ్ళు తమ తేనీటిలో నంచుకోవడానికి ఒక్కొక్కరికి ఒక్కొక్క చిన్న ఎండు చేపముక్క ఇచ్చాడు. ఆ యుద్ధపు రోజుల్లో ఈ మాత్రపు ఏర్పాట్లే గొప్ప విలాసంగా ఉండేవి. ఆ తర్వాత ఆయన ర్యోచాన్ పక్కన కూచుని, ర్యోచాన్ ముందు ఒక బియ్యపు సారాగ్లాసు పెట్టాడు. అది యుద్ధానికి వెళ్ళబోయే వాళ్ళకు మాత్రమే ఇచ్చే రేషన్.

"టోమోలో ఇదే మొట్టమొదటి తేనీటి విందు. మనందరం ఇప్పుడు కాసేపయినా సరదాగా గడుపుదాం. మీరు ర్యోచాన్‌తో ఏమైనా చెప్పదలచుకుంటే చెప్పవచ్చు. మీరు ర్యోచాన్‌కుమాత్రమే గాక మీలో మీరు ఏమన్న చెప్పుకోదలచుకున్నా చెప్పుకోవచ్చు. ఒక్కొక్కరు మాత్రమే మాట్లాడాలి. వలయం మధ్యలో నిలబడి మాట్లాడాలి" అన్నాడు హెడ్‌మాస్టర్.

వాళ్ళు టోమోలో ఎండు చేపముక్క తినడం అదే మొదటిసారి. అంతేకాదు, ర్యోచాన్ వాళ్ళతో కలిసి కూచోవడం కూడ అదే మొదటిసారి. ర్యోచాన్ సారా తాగుతుండగా చూడడం కూడ అదే మొదటిసారి.

పిల్లలు ఒకళ్ళ తర్వాత ఒకళ్ళు లేచి ర్యేచాన్‌కు ఎదురుగా నిలబడి ఆయన తోటే మాట్లాడారు. మొట్టమొదటి విద్యార్థి కేవలం జాగ్రత్తగా ఉండమని, జబ్బు పడకుండా చూసుకొమ్మని మాత్రం చెప్పాడు. తర్వాత మిజిటా మాట్లాడాడు. మిజిటా టొటొచాన్ తరగతే. "ఈ సారి నేను మా ఊరికి వెళ్ళినప్పుడు తిరిగివస్తూ నీ కోసం భక్ష్యాలుతెస్తాను. అంత్యక్రియలప్పుడు చేసే భక్ష్యాలు' ' అన్నాడు మిజిటా.

అందరూ నవ్వారు. ఓ ఏడాది కింద మిజిటా వాళ్ళకుమొట్టమొదట ఈ భక్ష్యాల గురించి చెప్పాడు. ఎక్కడో అంత్యక్రియల్లో తిన్నడట. భలే బాగున్నాయట. ఎప్పుడూ అవకాశం వచ్చినా సరే, అందరికీ అవి తెచ్చి పెడతానని అంటుండేవాడు. కాని ఎప్పుడూ తీసుకురాలేదు.

మిజిలా భక్ష్యాల సంగతి చెప్పగానే హెడ్‌మాస్టర్ కదిలిపోయారు. పైగా అవి అంత్య క్రియల భక్ష్యాలు. అటువంటి సమయంలో ఆ భక్ష్యాల గురించి మాట్లడడం అశుభమని ఎవరైనా అనుకునేవాళ్ళు. కాని మిజిటా ఎంత అమాయకంగా ఆ విషయం చెప్పాడంటే తనకు చాల రుచిగా

ఉన్న దాన్ని స్నేహితులందరితో పంచుకోవాలని తప్ప మరో ఆలోచన లేదు. హెడ్‌మాస్టర్ కూడ అందరితో పాటు కలిసి నవ్వేశాడు. ర్యోచాన్ కూడ హృదయపూర్వకంగా నవ్వాడు. తనకు భక్ష్యాలు తెచ్చి పెడతానని మిజిటా ఎన్నో రోజుల నుంచి చెపుతూనే ఉన్నాడు.

తర్వాత ఒయి లేచాడు. తాను జపాన్ మొత్తం మీద మంచి హార్టికల్చరిస్టు నవుతానని హామీ ఇచ్చాడు. ఒయి వాళ్ళ నాన్న టొడొరొకిలో పెద్ద తోట యజమాని. తర్వాత కికో జాకి లేచింది. కాని ఏమీ మాట్లాడలేదు. ఎప్పటిలాగే సిగ్గుగా ముసిముసి నవ్వులు నవ్వింది. ఒంగి అభివాదం చేసింది. మళ్ళీ తన సీటులోకి వెళ్ళిపోయింది. ఆతర్వాత టొటొచాన్ ముందుకు పరుగెత్తి కికో జాకి కోసం తానే మాట్లాడింది. "కీకీచాన్ దగ్గరున్న కోళ్ళు ఎగురుతాయి! నేను మొన్న చూశాను!!" అంది.

తర్వాత అమడెరా లేచాడు. "నీకు ఎక్కడన్నా పిల్లలు, కుక్కలు గాయపడి కనబడితే నాదగ్గరికి తీసుకురా.నేను వాటిని బాగు చేస్తాను." అన్నాడు.

టాకాహాషి పొట్టివాడు గదా. బల్ల కింది నుంచి దూరి వలయం మధ్యలోకి వచ్చాడు. కన్నుమూసి తెరిచే లోపలే తన కుర్చీలోంచి వలయం మధ్యలోకి వచ్చేశాడు. టాకాహాషి ఆనందంగా "థాంక్ యూ ర్యోచాన్. నువు మాకు ఎన్నో సాయాలు చేశావు. ఎన్నో పనులు చేశావు. థాంక్ యూ" అన్నాడు.

తర్వాత ఐకో సైషో నిలబడింది. "ర్యోచాన్ - అప్పుడు నేను పడిపోయినప్పుడు నాకు కట్టుకట్టావు గదూ. నేనది ఎప్పటికీ మరిచిపోను. థాంక్ యూ" అంది. ఐకో సైషో ముత్తాత చాల ప్రముఖుడు. ఆయన పేరు టోగో. ఆయన రష్యా - జపాన్ యుద్ధంలో అడ్మిరల్‌గా పని చేశాడు. ఐకో సైషో బంధువు అట్సుకో సైషో చాల పేరు పొందిన కవయిత్రి. మీజీ చక్రవర్తి ఆస్తానంలో ఉండేది. కాని ఐకో ఎప్పుడూ వాళ్ళ గురించి చెప్పుకునేది కాదు.

హెడ్‌మాస్టర్ కూతురు మియోచాన్‌కు ర్యోచాన్ బాగా తెలుసు. మియోచాన్ కళ్ళ నిండా నీళ్ళు నిండిపోయాయి. "జాగ్రత్తగా ఉండు. ర్యోచాన్, ఉంటావు గదూ. ఉత్తరాలు రాస్తుంటావు గదూ, మేమూ రాస్తాం" అంది.

టొటొచాన్ చెప్పదలచుకున్న విషయాలు ఎన్నో ఉన్నాయి. ఎక్కడ మొదలు పెట్టాలా అని తబ్బిబ్బు పడింది. కనుక చివరికి ఒకే మాటలో "ర్యోచాన్, నువు వెళ్ళి పోయినా మేం ప్రతిరోజూ తేనీటి విందు చేసుకుంటాం" అంది.

హెడ్‌మాస్టర్ నవ్వాడు. ర్యోచాన్ కూడ నవ్వాడు. పిల్లలందరూ కూడా నవ్వారు. చివరికి టొటొచాన్ కూడ నవ్వేసింది.

కాని టొటొచాన్ మాటలు నిజమని మర్నాటికే రుజువైపోయింది. సమయం దొరికిందంటే చాలు, పిల్లలు గుంపు కూడి " తేనిటి విందు" అడుకోవడం మొదలు పెట్టారు. ఎండు చేపముక్క బదులు వాళ్ళు తేనీటిలో చెట్టుబెరళ్ళ లాంటివి ముంచుకోవడం మొదలు పెట్టారు. తేనీటి బదులు వాళ్ళు గ్లాసుల్లో నీళ్ళు పోసుకొని అవే తాగేసే వాళ్ళు, కొన్నిసార్లు ఆ నీటినే సారా అని కూడ అనుకునేవాళ్ళు. ఎవరో ఒకరు లేచి "మీ అందరికి అంత్యక్రియల భక్ష్యాలు తెస్తాను" అనేవాళ్ళు. అందరూ గొల్లుమని నవ్వేవాళ్ళు. తర్వాత అందరూ మనసు విప్పి మాట్లాడేవాళ్ళు. ఒకరి ఆలోచనలు ఒకరికి చెప్పుకునేవాళ్ళు. తినడానికి ఏమీ లేకపోయినా ఈ "తేనీటి విందు"లు భలే సరదాగా గడిచిపోయేవి.

ర్యోచాన్ వెళ్ళిపోతూ వెళ్ళిపోతూ పిల్లలకు ఇచ్చిన చివరి కానుకగా మిగిలి పోయింది



తేనీటి విందు. అది ఒక అద్భుతమైన కానుక. అప్పటికెవ్వరూ లీలగానైనా ఊహించలేదు గాని నిజానికి ఆ పిల్లలు టోమోలో ఆడుకున్న చిట్టచివరి ఆట అదే అయింది. తర్వాత పిల్లలు విడిపోయారు. ఎవరికి వారే అయిపోయారు.

ర్యోచాన్ టొమొకో రైల్లో వెళ్ళిపోయాడు, ఆయన వెళ్ళిపోవడం, అమెరికన్ విమానాలు రావడం ఒకేసారి జరిగింది. అమెరికన్ విమానాలు చిట్టచివరికి టోక్యోపైన ఆకాశంలో కనిపించడం మొదలైంది. ప్రతిరోజూ అవి నగరం మీద బాంబులు కురిపించడం మొదలైంది.

## సాయొనారా, సాయొనారా !

టోమో తగలబడి పోయింది. ఒక రాత్రివే ళ టోమోను మంటలు మింగేశాయి. బడికి అనుకుని ఉన్న ఇంట్లోనే హెడ్‌మాస్టర్ కుటుంబం ఉండేది. ఆయన భార్య, కూతుళ్ళు మియోచాన్ మిసాచాన్ బైటికి పరుగెత్తారు. కుహోంబుట్సు ఆలయం సరస్సు పక్కన ఉన్న టోమో పొలానికి చేరి తేరుకున్నాడు.

బి 29, బాంబర్ విమానాల నుంచి పడిన మంటల బాంబుల తరగతి గదులుగా ఉపయోగపడిన రైలుపెట్టెలను తగలబెట్టేశాయి.

హెడ్‌మాస్టర్ కలల ప్రతిరూపమైన ఆ పాఠశాలను మంటల నాల్కలు చాచి చుట్టుముట్టాయి. ఆ బడిలో ఎప్పుడూ ఆయనకు ఇష్టమైన చిన్నారి శిశువుల మాటలు, నవ్వులు, పాటలు గలగలలాడుతుండేవి. ఆ మధుర ధ్వనుల స్థానంలో ఇప్పుడు భయానకమైన చప్పుళ్ళతో టోమో తగలబడిపోతోంది. ఆర్పడానికి వీలులేని ఆ మంటలు బడిని నేలమట్టం చేశాయి. బడి కుప్పకూలిపోయింది. మంటలు జియుగౌకా మొత్తాన్నీ కబళించాయి.

ఇంత బీభత్స దహనకాండ మధ్యలో హెడ్‌మాస్టర్ రోడ్డుమీద నిలబడి ఉన్నాడు. కళ్ళముందే టోమో కాలికూలిపోతుంటే చూస్తూ నిలుచున్నాడు. ఆయన ఎప్పటిలాగే కోటు జేబుల్లో చేతులు పెట్టుకుని నిలబడ్డాడు.

ఆయన పక్కనే ఆయన కొడుకు టోమో కూడ నిలబడి ఉన్నాడు. టోమో అప్పటికి విశ్వవిద్యాలయ విద్యార్థి. "బాబూ - మళ్ళీ ఎటువంటి బడి నిర్మిద్దాం నాన్నా?" అని అడిగాడు ఆ తండ్రి తన కొడుకుని. టోమో మాటా పలుకు లేకుండా చూస్తుండి పోయాడు.

ఇప్పుడు బండిని మింగేస్తున్న మంటలకంటే కొబయాషి హృదయంలో పిల్లల పట్ల ప్రేమ, బోధన పట్ల అభినివేశం దృఢమైనవి. అందుకే కొబయాషి నిరుత్సాహ పడలేదు. ఆయన దీక్ష చెదరలేదు.

జనాన్ని తరలిస్తున్న ఒక కిక్కిరిసి రైల్లో పడుకుని ఉంది. టొటొచాన్. పెద్దల మధ్య నలిగిపోతోంది. ఆ రైలు ఈశాన్య దిశగా పరుగెడుతోంది. చూట్టూ కటిక చీకటి. టొటొచాన్ కిటికీలోంచి ఆ చీకట్లోకి చూపులు సారించింది. ఆ క్షణాన టొటొచాన్‌కు హెడ్‌మాస్టర్ చివరి మాటలు గుర్తొచ్చాయి. "మళ్ళీ కలుద్దాం" అనే మాట ఆయన టొటొచాన్ ఎప్పుడూ అంటుండేవాడు. "నువు చాల మంచి పిల్లవు తెలుసా తల్లీ!" అనేది వాళ్ళిద్దరి మధ్యా చాలసార్లు వినిపించిన మాట. టొటొచాన్ ఈ మాటల్ని మరచి పోదలచుకోలేదు. త్వరలోనే మళ్ళీ కొబయాషిని చూడగలననే ఆలోచన ఇచ్చిన ఉత్సాహంతో టొటొచాన్ నిద్రకు పడింది.

ఎందరెందరో ఆందోళన పడుతున్న ప్రయాణీకుల్ని మోసుకుపోతోంది ఆ రైలు. అది ఆ

చీకట్లోంచి గరగరలాడుతూ ముందుకే సాగింది.

## చివరి మాట

### ర్యోచాన్

యుద్ధానికి వెళ్ళిన కాపలాదారు ర్యోచాన్ క్షేమంగా, ఆరోగ్యంగా తిరిగివచ్చాడు. ప్రతి సంవత్సరం నవంబర్ మూడున జరిగే టోమో సమేళ్ళనానికి తప్పకుండా హాజరువుతుంటాడు.

మరి నాతోపాటే ఆ రైలు తరగతి గదుల్లో ప్రయాణించిన మిత్రులందరూ ఇప్పుడేం చేస్తున్నారు?

### ఆకిరా టాకాహాషి

ఆటల దినంనాడు బహుమతులన్నీ గెలుచుకున్న టాకాహాషి ఉన్నాడు. తను ఇంకా పొడవైతే ఎదగలేదుగాని ఎన్నెన్నో సాధించాడు. జపాన్‌లో కెల్లా పుట్‌బాల్‌లో పేరుపొందిన ఉన్నత పాఠశాలలో చేరాడు. తర్వాత మీజీ విశ్వవిద్యాలయానికి వెళ్ళి ఎలక్ట్రానిక్స్ ఇంజనీరింగ్‌లో డిగ్రీ తీసుకున్నాడు.

ఇప్పుడు టాకాహాషి జపాన్ మధ్యభాగంలోని హమానా సరస్సు సమీపంలో ఉన్న ఓ పెద్ద ఎలక్ట్రానిక్స్ కంపెనీలో పర్సనల్ మేనేజర్‌గా పని చేస్తున్నాడు. కార్మికుల మధ్య సుహృద్భావం సాధించడం ఆయన బాధ్యత. ఫిర్యాదులు, సమస్యలు విని వివాదాలు పరిష్కరిస్తుంటాడు. ఎన్నెన్నో ఇబ్బందుల్ని భరించిన వాడిగా టాకాహాషి ఇతరుల ఇబ్బందుల్ని సులభంగా అర్థం చేసుకుంటాడు. సరదాగా ఉండే ఆయన స్వభావం, ఆకర్షణీయమైన వ్యక్తిత్వం ఆయనకు ఎంతో సహాయకారిగా ఉంటాయి. సాంకేతిక నిపుణుడిగా ఆయన ఇంటిగ్రేటెడ్ సర్క్యూట్లతో ఉండే పెద్ద యంత్రాలను ఎలా వాడాలో యువకులకు నేర్పుతుంటాడు.

టాకాహాషిని, ఆయన భార్యను చూసేందుకు నేను హమమట్సుకు వెళ్ళాను. ఆయన భార్య చాల మంచిది. ఆయనను పూర్తిగా అర్థం చేసుకుంది. టోమో గురించి ఎంతగా విని ఉందంటే, తానే అక్కడ చదివినట్టుగా మాట్లాడ గలుగుతుంది. తాను పొట్టిగా ఉండడం గురించి టాకాహాషికి మానసిక అందోళన లేవీ లేవనీ ఆమె నాకు చెప్పింది. ఆమె చెప్పింది నిజమేనని నాకు అనిపించింది. అటువంటి మానసిక  అందోళనలే ఉండి ఉంటేఆ ప్రతిష్టాత్మకమైన ఉన్నత పాఠశాలలోనూ, విశ్వవిద్యాలయంలోనూ టాకాహాషి జీవితం అనేక చిక్కుల్లో పడిఉండేది. ఉద్యోగుల వ్యవహారాలు చూసే శాఖలో పనిచేసే వీలుండేదే కాదు.

టోమోలో తన మొట్ట మొదటి రోజును టాకాహాషి వివరించాడు. ఆ రోజు అంగవైకల్యం ఉన్న వేరే పిల్లలు కూడ అక్కడ ఉండడం చూసి టాకాహాషి వెంటనే తేరుకున్నాడట. ఆ క్షణంనుంచీ కూడ టాకాహాషి బడిలో ఏ అవమానాన్నీ ఎదుర్కోలేదు. ప్రతి రోజూ ఎంత ఆనందంగా గడిపేవాడంటే ఏ ఒక్కరోజూ బడి ఎగగొట్టి ఇంట్లో ఉండాలనుకోలేదు. కొలనులో బరిబాతల ఈదాలంటే మొదట సిగ్గుపడ్డాడట కాని ఒంటిమీద నుంచి ఒక్కొక్క గుడ్డానిప్పేస్తుంటే సిగ్గూ, బిడియమూ అలా అలా వదిలిపోయాయట. టాకాహాషి బిడియం ఎంతగా వదిలిపోయిందంటే మధ్యాహ్న భోజనాల సమయంలో ఉపన్యాసాలు ఇవ్వడానికి, అందరిముందూ నిలబడడానికి సిద్ధపడ్డాడు.

తన కంటె ఎత్తుగా ఉన్న గుర్రాల మీద నుంచి యెగిరి దూకడానికి కొబయోషి తనను యెట్లా ప్రోత్సహించాడో టాకాహాషి చెప్పాడు. ఎప్పుడూ కొబయాషి తనకు ఎగరగలననే ధైర్యం



ఇచ్చేవాడట. బహుశా ప్రతిసారి కొబయాషికి తనకు సహాయం చేసేవాడేమోనని టాకాహాషి అనుమానం. అయితే ఆ సాయం కూడ చివరి క్షణం వరకూ చేసేవాడూ కాదు. తానే స్వయంగా దూకాననే ఆనందాన్ని టాకాహాషికి దక్కనిచ్చేవాడు. అట్లా టాకాహాషి మనసులో కొబయాషి ధైర్యసాహసాల్ని, ఆత్మవిశ్వాస్వాన్ని నింపాడు. విజయం సాధించినప్పుడు పొందే అనిర్వచనీయమైన ఆనందాన్ని కొబయాషి టాకాహాషి అనుభవంలోకి తెచ్చాడు. టాకాహాషి ఎప్పుడైనా వెనక ఎక్కడైనా దాక్కుని ఉంటే హెడ్‌మాస్టర్ తప్పకుండా తనను ముందుకు పిలిపించేవాడు. కనుక ఇష్టం ఉన్నాలేకపోయినా టాకాహాషి హృదయంలో జీవితంపట్ల అవసరమైన దృక్పథం అభివృద్ధి చెందింది. ఆటలలో అన్నిటికన్ని బహుమతులూ గెలుచుకున్నప్పుడు తానెంత పొంగిపోయాడో టాకాహాషికి ఇంకా గుర్తుంది. ఎప్పటిలాగే కళ్ళలో మెరుపులు తొణికిసలాడుతుండగా, తెలివిగా టోమో గురించి సంతోషంతో గుర్తుతెచ్చుకున్నాడు.

టాకాహాషి వ్యక్తిత్వం అంత ఉదాత్తంగా అభివృద్ధి చెందడంలో ఆయన ఇంటి వాతావరణం పాత్ర కూడా ఉండి ఉంటుంది. ఐనా కొబయాషి మా అందరితోనూ చాలా దూరదృష్టితో వ్యవహరించారనడంలో ఏ సందేహం లేదు. ఎప్పుడూ నాతో "నువు చాలా మంచి పిల్లవు తల్లీ-తెలుసా" అంటూ ఉన్నట్టుగానే టాకాహాషితో ప్రోత్సాహకంగా "నువు అది చెయ్యగలవు చూడు" అంటుండేవాడు. టాకాహాషి జీవితాన్ని రూపొందించడంలో ఆ మాట నిర్ణయాత్మక పాత్ర వహించింది.

నేను హమమట్సు నుంచి వచ్చేస్తుండగా టాకాహాషి ఓ సంగతి చెప్పాడు. నేనది పూర్తిగా మరచేపోయాను. వేరే బళ్ళ పిల్లలు టాకాహాషిని ఎప్పుడూ గేలి చేస్తుండేవారట, వేధిస్తుండేవారట. అందుకని టాకాహాషి ప్రతి రోజు టోమోకు నిరుత్సాహంగా, దిగాలుపడి చేరుతుండేవాడట. నేను తనను కలిసి పిల్లలు ఏమన్నారని అడిగి క్షణంలో బైటికి పరుగెత్తేదాన్నట. కాసేపయ్యాక తిరిగి వచ్చి, అంతా సరిచేశారని, మళ్ళీ ఎవరూ ఏమీ అనరని చెప్పేదాన్నట.

"అప్పుడు నువు నాకు ఎంత సంతోషం కలిగించేదానివో" అన్నాడు టాకాహాషి విడిపోతుండగా, నాకీ సంగతి గుర్తులేదు. గుర్తుంచుకున్నందుకు కృతజ్ఞతలు.

### మియోచాన్ (మియోకానెకో)

కొబయాషి మూడోకూతురు మియోచాన్ కునిటాచి సంగీత కళాశాల విద్యాశాఖ నుంచి పట్టం పొందింది. ఇప్పుడు ఆ కళాశాలనే అనుబంధంగా ఉన్న ప్రాథమిక పాఠశాలలో సంగీతం పాఠాలు చెపుతోంది. తండ్రి లాగనే మియోచాన్‌కు కూడ చిన్నారి పిల్లలకు నేర్పడమంటే చాల ఇష్టం. మియోచాన్‌కు మూడేళ్ళ వయసు ఉన్నప్పటి నుంచీ కొబయాషి తనను గమనిస్తూ వచ్చాడు. అప్పుడు తను సంగీత లయకు అనుగుణంగా అడుగులు వేస్తూ, శరీరాన్ని కదుపుతూండేదట. ఇప్పుడే మాట్లాడడం నేర్చుకుందట. ఇవన్నీ హెడ్‌మాస్టర్‌కు బిడ్డల శిక్షణలో ఎంతో తోడ్పడ్డాయట.

### సాక్కో మట్సుయామా (ఇప్పుడు శ్రీమతి సైటో)

సాక్చోచాన్ గుర్తుందా? పెద్ద పెద్ద కళ్ళ అమ్మాయి. నేనే టోమోకు వెళ్ళిన మొట్టమొదటి రోజు కుందేలు బొమ్మ ఉన్న గౌను వేసుకుంది. టోమో తర్వాత ఆడ పిల్లలు చేరడం కష్టమని

చెప్పకునే మిటా ఉన్నత పాఠశాలలో చేరింది. అక్కడ్నించి టోక్యోలో మహిళల క్రిస్టియన్ విశ్వవిద్యాలయం ఇంగ్లీషు శాఖకు వెళ్ళింది. వై డబ్ల్యు సి ఎ లో ఇంగ్లీషు అధ్యాపకురాలయింది. ఇంకా అక్కడే ఉంది. వాళ్ళ వేసవి శిబిరాల్లో టోమో అనుభవాలను ఉపయోగించుకుంటూనే ఉంటుంది.

జపాన్ ఆల్ప్స్ పర్వత శ్రేణిలోని హూటాకా పర్వతం ఎక్కుతున్నప్పుడు పరిచయమైన ఒక వ్యక్తిని సాక్కోచాన్ పెళ్ళి చేసుకుంది. వాళ్ళు వాళ్ళ అబ్బాయికి యాసుటాకా అనే పేరు పెట్టారు. తాము కలుసుకున్న పర్వతం పేరు గుర్తుగా ఆ అబ్బాయి పేరులో టాకా చేర్చారు.

## టాయిజి యమనోచి

నన్ను పెళ్ళిచేసుకోనని చెప్పిన టాయిచాన్ జపాన్‌లో ప్రముఖ భౌతిక శాస్త్ర వేత్త అయ్యాడు. ఆయన ఇప్పుడు అమెరికాలో ఉంటున్నాడు. "మేధోవలస"కు ఆయన ఒక ఉదాహరణ. టోక్యో విద్యా విశ్వవిద్యాలయం నుంచి భౌతిక శాస్త్రంలో పట్టా పొందాడు. ఎం.ఎస్.సి తర్వాత ఫుల్‌బ్రైట్ వినిమయ స్కాలర్‌షిప్ మీద అమెరికా వెళ్ళాడు. రోచేస్టర్ విశ్వవిద్యాలయం నుంచి ఐదేళ్ళ తర్వాత డాక్టరేట్ తీసుకున్నాడు. తర్వాత ప్రయోగాత్మక అధిక శక్తి భౌతిక శాస్త్రంలో పరిశోధన చేస్తూ అక్కడే ఉండి పోయాడు. ప్రస్తుతం ఆయన ఇల్లినాయ్‌లోని ఫెర్మినేషనల్ ఆక్సిలరేటర్ లాబరేటరీలో పనిచేస్తున్నాడు. అక్కడ ఆయన అసిస్టెంట్ డైరెక్టర్. అమిరికాలో యాభైమూడు విశ్వవిద్యాలయాల నుంచి ఏరుకున్న ప్రతిభావంతుల పరిశోధనా కేంద్రం అది. అక్కడ 145 మంది భౌతిక శాస్త్రవేత్తలు, 1400 సాంకేతిక సిబ్బంది పనిచేస్తున్నారు. అంత పెద్ద సంస్థ అది. కనుక టాయిచాన్ ఎంత మేధావో అర్థం చేసుకోవచ్చు. ఐదేళ్ళ కింద 500 బిలియన్ ఎలక్ట్రాన్ వోల్టుల శక్తితర కాంతిని ఉత్పత్తి చేయడంలో విజయం సాధించి ఈ సంస్థ ప్రపంచం దృష్టిని ఆకర్షించింది.

ఈ మధ్యనే కొలంబియా విశ్వవిద్యాలయానికి చెందిన మరొక ప్రొఫెసర్‌తో కలసి టాయిచాన్ అప్సిలాన్ అనే దాన్ని కనిపెట్టాడట. ఇందుకు టాయిచాన్‌కు ఏదో ఒకరోజు నోబెల్ బహుమతి వస్తుంది.

టాయిచాన్ ఒక ప్రతిభావంతురాల్ని పెళ్ళిచేసుకున్నాడు. ఆ అమ్మాయి రోచేస్టర్ విశ్వవిద్యాలయంలో గణిత శాస్త్రం చదివింది. ఇంత తెలివైన టొటొచాన్ ఏ ప్రాథమిక పాఠశాలలో చదివినా ఈ అభివృద్ధి సాధించి ఉండేవాడే. కాని టోమోలోని విద్యార్థుల ప్రతిభను కనిపెట్టి, ఆ రంగంలోనే కృషి చేయనిచ్చే పద్ధతి ఆయనకు సాయపడిందనుకుంటాను. తరగతిలో సారాయి దీపంతో, గాజు కుప్పెలతో, పరీక్షనాళికలతో ఏదో ఒకటి చేస్తూ ఉండడమో, విజ్ఞాన శాస్త్రం మీద, భౌతిక శాస్త్రం మీద కష్టమైన పుస్తకాలు చదువుతూ ఉండడమో తప్ప ఆయన మరొక పని చేస్తుండగా చూసిన వాళ్ళు లేరు.

## కునియో ఒయి

నా జడలు లాగిన ఒయి ఉన్నాడు. ఆయన ఇప్పుడు ప్రాచ్యదేశాల ఆర్కిడ్స్‌మీద జపాన్‌లో పేరుమోసిన నిపుణుడు. ఆ ఆర్కిడ్స్ దుంపలు వేలాది డాలర్ల విలువ చేస్తాయి. ఆయనది చాల ప్రత్యేక రంగం. అందుకే ఆయన అవసరం చాలచోట్ల ఉంటుంది. ఎప్పుడూ



జపాన్ అంతా తిరుగుతూనే ఉంటాడు. ఆయనను టెలిఫోన్ మీద పట్టుకోవడమే నాకు అతి కష్టమై పోయింది. అదీ రెండు ప్రయాణాల మధ్యన. ఆ ఫోన్ మీద మా సంభాషణ ఇదిగో :

"టోమో తర్వాత ఏ బడిలో చదివావు?"

"ఏ బడికి వెళ్ళలా"

"అరె - ఎక్కడికీ వెళ్ళలేదా? అంటే నువు మొత్తం టోమోలో మాత్రమే చదివావా?

"ఔను".

"అయ్యయ్యో. కనీసం ఉన్నత ప్రాథమిక పాఠశాలకైనా వెళ్ళలేదా?"

"ఆఁ ఆఁ వెళ్ళాను వెళ్ళాను. ఒయిటా పాఠశాలకు కొన్ని నెలలు వెళ్ళాను గాని మమ్మల్ని ఇంతలోనే క్యూషుకు తరలించారు."

"కాని ఉన్నత ప్రాథమిక పాఠశాల విద్య పూర్తి చేయడం తప్పనిసరి అనేవాళ్ళు గదా?'

"నిజమే కాని నేను పూర్తి చేయలేదు."

"అమ్మయ్యో - ఎంత బేఫర్వాగా ఉన్నాడీయన" అనుకున్నాను నేను. యుద్ధానికి ముందు ఒయి వాళ్ళ నాన్నకు టోక్యో నైరుతి భాగంలో టొడొరొకి అనే చోట విశాలమైన తోట ఒకటి ఉండేది. బాంబింగ్‌లో అది పూర్తిగా నాశనమై పోయింది. అక్కడ్నించి మా సంభాషణ విషయం మారిపోయింది. ఒయి స్వభావం ఈ సంభాషణలో వ్యక్తమయింది.

"చాల పరిమళ భరితమైన పువ్వేమిటో తెలుసా? నాకు తెలిసినంత వరకు చైనీస్ స్ప్రింగ్ ఆర్కిడ్ అనుకుంటాను. ఏ సువాసనలూ దానికి సాటిరావు" అన్నాడు.

" అవి చాలా ఖరీదా?"

"కొన్ని ఖరీదుంటాయి" కొన్ని అంత ఖరీదుండవు".

"అవి ఎట్లా ఉంటాయి?"

"అవి ఏమంత ఆకర్షణీయంగా ఉండవు, లొంగిపోయినట్టు ఉంటాయి. కాని వాటి అందం అదే".

ఆయన టోమోలో ఉన్నప్పటికీ ఇప్పటికీ ఏమీ మారలేదు. ఒయి చాల తీరిగ్గా మాట్లాడుతున్నట్టు ధ్వనిస్తున్న గొంతు వినబడుతోంది. "ఉన్నత ప్రాథమిక పాఠశాల విద్యను కూడ పూర్తిచేయలేదని ఒయి ఎప్పుడూ బాధపడడు! ఆయనకు తన స్వంత వృత్తి ఉంది." అనుకున్నాను. ఆయనను ప్రశంసించకుండా ఉండలేకపోయాను.

## కుజువో అమడెరా

జంతువుల పట్ల ప్రేమగా ఉండే అమడెరా పెద్దపెరిగాక పశువుల వైద్యుడై ఒక పశువుల క్షేత్రం తెరవాలనుకున్నాడు. దురదృష్టవశాత్తూ వాళ్లనాన్న హఠాత్తుగా చచ్చిపోయాడు. అమడెరా తన జీవిత మార్గాన్ని పూర్తిగా మార్చుకోవలసి వచ్చింది. నిహాన్ విశ్వవిద్యాలయంలో అప్పటికి చదువుతున్న పశువైద్యం వదిలేసి కియో అస్పత్రిలో ఉద్యోగంలో చేరాడు. ప్రస్తుతం ఆయన ఆత్మరక్షణ దళానికి చెందిన ప్రధాన అస్పత్రిలో వైద్య పరీక్షలకు సంబంధించిన బాధ్యతాయుతమైన పదవిలో ఉన్నాడు.

★ ★ ★

## రైలుబడి

ప్రపంచంలోని ప్రముఖ భాషలన్నింటికి అనువాదమయ్యింది. జపనీస్ భాషలో ప్రచురితమైన వెంటనే నలుబైఐదు లక్షల కాపీలు అమ్మకమయ్యింది.

## టెట్సుకో కురొయనాగి గురించి

టెట్సుకో కురొయనాగి జపాన్‌లోని టోక్యోలో జన్మించింది. జపాన్‌లో అందరికంటె ఎక్కువ ఆదరణ పొందిన టీవీ వ్యాఖ్యాతగా ఐదు సంవత్సరాల పాటు వరుసగా ఎన్నికయింది. టోక్యో సంగీత రూపకాల గానాన్ని అధ్యయనం చేసింది. చివరికి నటిగా స్థిరపడింది. రేడియో, టీవీల్లో తన కృషికి గాను ప్రతిష్ఠాత్మకమైన బహుమతులు గెలుచుకుంది. నటనను అధ్యయనం చేస్తూ, 'ఫ్రమ్ న్యూయార్క్ విత్ లవ్'ను రాస్తూ టెట్సుకో 1972లో న్యూయార్క్‌లో గడిపింది. 1975 నుంచి జపాన్‌లోని మొట్టమొదటి రోజువారీ టీవీ ప్రదర్శన అయిన 'టెట్సుకో గది'ని నిర్వహిస్తోంది. ఇందుకు గాను ఆమె అత్యున్నత బహుమతిని సంపాదించింది. ఇది, ఆమె నిర్వహించే ఇతర ప్రదర్శనలు అత్యధిక సంఖ్యాక ప్రేక్షకుల ఆదరాభిమానాల్ని చూరగొంటున్నాయి. ఆమె కృషి ప్రధానంగా సాంఘిక సంక్షేమానికి అంకితమైంది. అమెరికా జాతీయ బధిర నాటకరంగాన్ని ఆమె రెండుసార్లు జపాన్ తీసుకు వెళ్ళింది. వారితో కలిసి ఆమె సైగల భాషలో నటిస్తుంది. తన పుస్తకం పారితోషికాలతో స్థాపించిన టాటా ఫౌండేషన్ బధిర నటులకు శిక్షణ ఇస్తుంది. తరచుగా వారితో కలిసి ఆమె నటిస్తూ ఉంటుంది. జంతువుల పరిరక్షణలో కూడ ఆమెకు ఆసక్తి ఉంది. "పండాస్ అండ్ ఐ" అనే పుస్తకం రాసి జయంట్ పండా విషయంలోఆమె చాలా కాలంగా శ్రద్ధ చూపుతోంది. ప్రపంచ వన్యప్రాణి రక్షణ సంస్థ-జపాన్ విభాగానికి ఆమె ఒక డైరెక్టర్‌గా ఉంది.